# ఆంధ్రమహాభారతము - ఉపదేశము



ఆంధ్ర విశ్వవిద్యాలయము వారి
డాక్టరేట్ పట్టమును
పొందిన సిద్ధాంత నిబంధన

నందుల గోపాలకృష్ణమూర్తి
ఎమ్. ఏ., పిహెచ్. డి.
పీఠికాపురాధీశ్వర ప్రభుత్వకళాశాల
కాకినాడ-4




THIS BOOK IS

PUBLISHED WITH THE FINANCIAL ASSISTANCE OF

TIRUMALA TIRUPATI DEVASTHANAMS

UNDER THEIR SCHEME

"AID TO PUBLISH RELIGIOUS BOOKS".

కళాప్రపూర్ణ
డా॥ దివాకర్ల వేంకటావధాని,
ఎమ్. ఏ. పిహెచ్. డి.

18/4 RT. బర్కత్పుర,
హైదరాబాదు-27

చి॥ డా. నందుల గోపాలకృష్ణమూర్తిగారు ఉస్మానియా విశ్వవిద్యాలయములో ఎమ్. ఏ. చదివి తరువాత పెక్కేండ్లనుండి ప్రభుత్వ కళాశాలలలో నుపన్యాసకులుగ పనిచేయుచున్నారు. విద్యార్థిగా నున్నప్పుడే వారి వినయసంపదయు, జిజ్ఞాసయు, నిరంతరాధ్యయన తత్పరతయు, ఆచార్యుల నానందభరితాంతరంగుల నొనరించుచుండెడిది. వారు బహు పరిశ్రమచేసి "ఆంధ్రమహాభారతము - ఉపదేశము" అను విషయముపై సిద్ధాంతవ్యాసము వ్రాసి ఆంధ్ర విశ్వవిద్యాలయము వారిచే పిహెచ్. డి. పట్టమును బడసి యుండిరి. ఈవ్యాసమును రచించునప్పుడు వారప్పుడప్పుడు సందేహనివృత్తికొఱకు నాయొద్ద కరుదెంచుచుండిరి. నిజమునకవి సందేహములుకావు, నిజభావనివేదనములు. వారి రచనాప్రణాళికను, భావవ్యక్తీకరణమును, భాషాప్రయోగమును పరికించి నేనత్యంతానందము నందితిని. వినయవంతులైన శిష్యుల అభ్యుదయమును, ప్రతిభాపరిజ్ఞానములును గురువుల కానందకరములగుననుటలో నాశ్చర్యము లేదు. మఱియు వారు గ్రహించిన వస్తువు నాకెంతో మనోహరమైనట్టిది. దానియందు నాకుగల ప్రీతికూడ నాకీసిద్ధాంతవ్యాసము నందలి అభిమానమును ద్విగుణీకరించినది.

పూర్వలాక్షణికులు కావ్యప్రయోజనములను వివరించుచు 'కాంతాసమ్మితతయా ఉపదేశయుజే' అని ఉపదేశమునుకూడ పేర్కొని యుండిరి. ఆనందప్రధానమే కావ్యమునకు పార్యంతిక ప్రయోజనమైనను అది ఉపదేశముతో కూడియుండుట బంగారమునకు పరిమళ

మెచ్చినట్లు దానివిలువనెన్నో విధముల హెచ్చించును. ఉపదేశములేని కావ్యములుకూడ ఆనంద ప్రదాన దక్షములైనచో కావ్యములు కాక పోవు. ఆంధ్రవాఙ్మయమున దక్షిణాంధ్రయుగము నందిట్టి కావ్యములు కొన్ని వెలసినవి. పాశ్చాత్యులుకూడ కావ్యమునకు 'To teach and delight' అని ప్రయోజన ద్వితయమును సూచించియుండిరి. సోప దేశమైన కావ్యమైహికాముష్మిక శ్రేయములు రెంటను సమ కూర్చును. ఉపదేశములేని కావ్యము ఐహికానందమును మాత్రము చేకూర్చును. మొదటిదాని యందున్నంత ఉదాత్తతాపవిత్రత్వములు రెండవదానియందుండవు. అందుచే వ్యంగ్యముగనైన కావ్యము లుపదేశప్రదములగుట వాంఛనీయమే యగును.

కొందఱు లాక్షణికులు కావ్యభేదములలో శాస్త్రకావ్యము, కావ్యశాస్త్రము అనువానినికూడ చేర్చియుండిరి. కావ్యత్వ, శాస్త్రత్వ ప్రాధాన్యములనుబట్టి ఈభేదము లేర్పడినవి. శాస్త్ర ముపదేశాత్మకము. అట్టియుపదేశముతో కూడియున్న కావ్యము శాస్త్రకావ్యము. మహా భారతమట్టి శాస్త్రకావ్యములలో నగ్రగణ్యమైనది. అందులేని విష యములేదు. 'ధర్మేచార్థేచ కామేచ మోక్షేచ భరతర్షభ, యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్క్వచిత్' అని వ్యాసమహర్షియే చెప్పి యుండెను. 'కృష్ణద్వైపాయను డర్థిలోకహిత నిష్ఠంబూని కావించె ధర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయమున్' అని చెప్పి తిక్కన భారతమునకు ధర్మాద్వైత స్థితిని సూచించియుండెను. ధర్మమును అర్థమును అభిన్నములు. అది ధర్మప్రధానమైనది. వ్యాసుడు భారతేతిహాసమును రచించుచు వేద ప్రతిపాదితములైన నీతి ధర్మతత్త్వములను తద్ద్వారా లోకమున కుపదేశించుటకై యత్నిం చెను. ఇతని ప్రధానదృష్టి యదియే. ఇతడు లోకోత్తర ప్రతిభాసంపన్ను

డగుటచే నాతని రచనము దశ్రవ్యమంగ మహాకావ్యలక్షణములు కూడ సంపన్నములైనవి. దానికి పంచమవేదమనుపేరు సార్థకము. నన్నయభట్టు 'ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబ' ను సీసపద్యమున వ్యాస భారతముయొక్క సర్వలక్షణములను వివరించెను. అది ధర్మశాస్త్రము, వేదాంతము, నీతిశాస్త్రము, కావ్యము, లక్ష్యసంగ్రహము, ఇతిహాస వరేణ్యము, బహుపురాణసముచ్చయము - కాదికాని దేదియును లేదు. ఇట్టి మహాగ్రంథమున నుపదేశము సర్వతోముఖమై గోచరించుటలో నాశ్చర్యము లేదు. కథోపాఖ్యానములద్వారా నీతిధర్మతత్త్వముల నుప దేశించుటకే వ్యాసు డీమహాకావ్యమును రూపొందించెను.

చి॥ గోపాలకృష్ణమూర్తిగారు తమసిద్ధాంతవ్యాసమును పది భాగములుగ విభజించియుండిరి. మొదటిభాగమున వారు సాహిత్య మనగా నేమో తెలిపి అందుపదేశమునకుగల స్థానమును విశదీకరించిరి. ఇందు ప్రాచ్యపాశ్చాత్యలాక్షణికుల అభిప్రాయములనుకూడ వారు సమీక్షించియుండిరి. రెండవభాగములో వారు భారత మాంధ్రమున నవతరించిన పరిస్థితులను వ్యక్తముచేసి యున్నారు. ఎఱ్ఱాప్రెగ్గడ అరణ్యపర్వశేషమును భారతమును పూర్తిచేయవలెనను నుద్దేశము తోనే రచించినను తక్కిన యిరువురును మతపరిస్థితుల ప్రేరణముచేతనే భారత భాగములను రచించియుండిరి. మూడవభాగమున భారత మహిమ ముగ్గడింపబడినది. ఇందు గోపాలకృష్ణమూర్తిగారందు నన్నయ చెప్పిన లక్షణములన్నియు నెట్లు గోచరించుచున్నవో నిరూపించి దాని విశ్వజనీనత్వమును సర్వజ్ఞాన సమగ్రత్వమును వివరించియున్నారు. నాల్గవభాగము భారతముయొక్క ఆమ్నాయత్వమును స్థిరీకరించునట్టిది. సంస్కృతభారతమునకు వేదత్వము సిద్ధించినట్లే ఆంధ్రభారతమునకు కూడ కవిత్రయమువారిచేతులలో నామ్నాయత్వము సిద్ధించినది.

భారతోద్యానమను నైదవభాగము ఈ సిద్ధాంతవ్యాసమున మిక్కిలి ప్రధానమైనది. భారతము మహోక ప్రపంచమువంటిది. అందున్న పాత్రలసంఖ్య అపారము. అన్నిటిని సమీక్షించినచో గ్రంథము మఱియొక భారతమగును. అందుచే గోపాలకృష్ణమూర్తి గారు ప్రధానపాత్రలను మాత్రమే ఇందు గ్రహించి తద్ద్వారా వ్యాసుడును, కవిత్రయమువారును, లోకమునకొసంగిన ఉపదేశమును వివరించియున్నారు. వారు భారతమునందలను క్షుణ్ణముగా చదివి, ప్రతి పాత్రయొక్క స్వరూపస్వభావములను నిశితముగా పరిశీలించి యున్నారు. నిజమునకీ భాగమొక్కటియే పిహెచ్. డి. పట్టప్రదానమునకు వారి నర్హులనొనరించును. వ్యాసుడును, కవిత్రయము వారును ఆయాపాత్రలను తీర్చిదిద్దిన విధానమును వారెంతో సమర్థతతోడను పరిశోధన పాటవముతోడను నిరూపించి యున్నారు. ఈ నిరూపణము సోదాహరణమై వారి పరిశోధనకు మఱింతవిలువ చేకూర్చుచున్నది. భారతమునందలి పాత్రలుకొన్ని భాగవతమునందుకూడ కానవచ్చును. అట్టి సందర్భములందు వారు ఆరెండుగ్రంథములందలి పాత్రల చిత్రణమును, తారతమ్యదృష్టితో పరిశీలించియున్నారు. ద్రౌపదీపాత్ర మిందుకు తార్కాణము. భాగవతమున నామె మాతృహృదయము సుస్పష్టముగా గోచరించును. భారతమున నామె వీరపత్నిగను, వీరమాతగను, భారతీయమహిళా రత్నముగను చూపట్టును. ఈభారతోద్యానమున నిరుపదిమూడు లతాన్తములున్నవి. శ్రీ గోపాలకృష్ణమూర్తిగారు తల్లతాంతసుమసౌరభము చక్కగా ప్రదర్శించి తమ పరిశోధనకౌశలమును ప్రకటించి యున్నారు.

ఆఱవభాగ మువాఖ్యానములకు సంబంధించినది. అందు కొన్ని అధ్యాత్మిక తత్త్వమును, కొన్ని రాజనీతిని, కొన్ని లోకవ్యవహారము

బోధించునవి. శ్రీ గోపాలకృష్ణమూర్తిగారు విషయమును ప్రపంచించినతీరు ప్రశంసాపాత్రము. భారతము శాస్త్రకావ్యమగుటచే వారందలి యైహిక ధర్మములను, ఆముష్మిక ధర్మములను చక్కగా నుగ్గడించినారు. విదురనీతి గాంభీర్యమును సర్వజనశిరోధార్యత్వమును కవిగారు చక్కగా నిరూపించియున్నారు. సత్యాద్రౌపదీసంవాదము, ధౌమ్యప్రబోధము, భీష్ముని ఉపదేశములు ధర్మగర్భితములై యుండుటయే కాక లోకానుభవముతో నిండియున్నవి. అధునిక రాజనీతివేత్తలు భారతమును పాఠ్యగ్రంథమువలె పఠింపవలసిన ఆవశ్యకత ఎంతైన నున్నది. భగవద్గీత భారతమునకు హృదయమువంటిది. దానిని తిక్కన సంగ్రహించెను. వ్యాధగీతాదులుకూడ నాముష్మిక ధర్మమును చక్కగా బోధించును. వ్యాసకర్తతత్త్వపరిజ్ఞానమీభాగమున సర్వతోముఖముగా వ్యక్తమగుచున్నది.

తొమ్మిదవభాగము భారతము లోకమునకిచ్చు సందేశమును వివరించును. ఈవిషయము మఱొక సిద్ధాంతవ్యాసమునకు తగినంత ప్రాధాన్యముతో కూడినట్టిది. చివరిదైన పదవభాగము కావ్యన్యాయమునకు సంబంధించినది. మానవుడు తనవర్తనమునకు తగినఫలము పొంది తీరును. అది వెంటనే గోచరింపకపోవచ్చును. ధృతరాష్ట్రుడు, కర్ణుడు, దుర్యోధనుడు మున్నగుపాత్రలను పరిశీలించినచో నీవిషయము విదితమగును. ధృతరాష్ట్రుడు రాజైయుండియు అధర్మము జరుగుచుండగా నుపేక్షవహించెను. దానికి ఫలముగా నతడు దీర్ఘకాలము జీవించి ఇంతింతనరాని మానసికవ్యథ ననుభవించెను. "అనయవువుట్టి జూదమున యప్పుడ యెంతయుఁ జిచ్చువెట్టి కాల్చిన యది నీయుపేక్షయ" అని సంజయుడు రాయబారమునుండి తిరిగివచ్చిన పిమ్మట నిర్భయముగా వచించెను.

ఈసిద్ధాంతవ్యాసమునందలి శైలి సులభమై సర్వసుబోధమై మిక్కిలి విశదముగ నున్నది. నిర్దుష్టముగను, సర్వసుందరముగను, వచనమును రచించుటకు పద్యము వ్రాయుటకంటెకూడ నెక్కువ పాటవము కావలయును. అది మాగోపాలకృష్ణమూర్తిగారికి పూర్తిగా నబ్బినది. మాశిష్యుడింత పరిజ్ఞానమును సంపాదించి మహాభారత సముద్రమును మథించి, ఉపదేశామృతము నీసిద్ధాంత వ్యాసభాండ రూపమున నందీయ జాలినందులకెంతయో సంతోషించుచున్నాను. అతడింకను ఎన్నో సద్గ్రంథములు రచించి, విమర్శలు వెలయించి, ఆంధ్ర వాఙ్మయమునకును, ఆంధ్రదేశమునకును మేలుచేయుగాక యని ఆశీర్వదించుచున్నాను.

హైదరాబాదు - 27 దివాకర్ల వేంకటావధాని



**Prof. S. V. JOGARAO, M.A., Ph.D.,**
Senior Professor of Telugu
Principal, College of Arts
Andhra University
(Formerly Professor of Telugu
University of Leningrad, U.S.S.R.

WALTAIR

# సహృదయ భూమిక

సాహిత్యమునకు సాహిత్యశబ్ద వాచ్యత్వసార్థకతను చేకూర్చునది రసవత్త్వ. దాని మహత్త్వకు దోహదము చేయునది అది మన కందిచ్చు మహత్తర సందేశము. రసము - ఉపదేశము ఈ రెండే మానవుని వాఙ్మనఃప్రవృత్తులను బహిరంతరముల బంధుర మొనర్చును. ఈ రెండింటికిని మహాభారతమున నేర్పడిన ప్రతిపత్తి ప్రపంచ సారస్వతమున మఱే గ్రంథమునందును కానరాదు. భారతామ్నాయము వేదవ్యాసోపజ్ఞము. సర్వవేద సారభూతమైన సత్యమును ప్రతిపాదించు పంచమ వేదము. ఉపనిషదుప బృంహితమైన ధర్మసామస్త్యమునకు నిధియు, నిక్షేపమునునైన భగవద్గీతకు కాణయాచి. ప్రాచీన విజ్ఞాన సర్వస్వము. భారతీయ సంస్కృతీ భాండాగారము. సర్వ మానవ జాతికి సముపాదేయమైన, సార్వకాలికము, సార్వదేశికమునైన ఔపదేశిక ప్రతిపత్తికది యొక నిక్షేపము. ధర్మాధర్మముల అంశావతారములనదగిన అనేకసజీవపాత్రల విశ్వరూపమును ప్రదర్శించు జగన్నాటక రంగస్థలమది. పలుకథల మూలమునను, నానారుచిరార్థ సూక్తుల మూలమునను భావుకుడైన ప్రతిమానవుని భవ్యునిగా, దివ్యునిగా తీర్చిదిద్దగల మహోపదేశమునకు శ్రీనివాసమైన మహేతిహాసమది.

ఆ మహాభారతమున కనిపించిన సంస్కృత సరస్వతిని, వినిపించిన ఆర్ష వాణిని అంతర్వాణులు, ఋషికల్పులు నగు మన కవిత్రయము వారు నన్నయ, తిక్కన, ఎఱ్ఱయలు ప్రగాఢప్రతిపత్తితో కని, విని, పరిణతప్రౌఢితో నాంధ్రమున నావిష్కరించిరి. ఇంచుమించు మూల భారతమందలి సందేశ సౌరభమంతయు వీరి రచనలో గుబాళించినది.

తొలి నాళుల పద్యార్థము
తెలియనిచో పాఠకు నిది తెలియమి - యీనా
ళుల వ్రాసిన కవి దోషము
కలి ముదిరినకొలది చిత్రగతులను నడచున్.

అను విశ్వనాథవారి వక్కణను దిక్సూచిగా గ్రహించి ఆ భారత పరమార్థమును గ్రహించి అనగా అందలి ఔపదేశిక ప్రతిపత్తిని నిరూపించు గ్రంథ మొకటి అవతరించవలసిన ఆవశ్యకత కనిపించినది. ఒక హృదయ దఘ్నమైన జిజ్ఞాసతో పరిశోధనచికీర్షతో శ్రీ నందుల గోపాలకృష్ణమూర్తి కనిపించినాడు. అతని అభిరుచి, సంస్కారము, ఆదర్శము, అన్నియు తాదృశ పరిశోధన నిబంధ నిర్మాణమునకు తగి యున్నవని నా కనిపించినది. నందుల అప్పటికే పరిశోధనయందును, విమర్శనయందును కృతశ్రముడు. సమీక్షాదక్షమైన ప్రజ్ఞానుభవములు కలవాడు. ఏతత్పరిశోధన విషయము అతనిలో నొక సాత్త్వికావేశమును రేకెత్తించినది. ఒక గొప్ప సారస్వత వరివస్యను చేసికొను అవకాశము లభించినదని, తిక్కన మహాభారత రచనకు మంగళము పాడి "నా పుట్టుకృతార్థతం బొరసె" అని ఎట్లు నిండుతృప్తితో నిశ్వసించెనో అట్లే నందులకూడ ఆ మహాభారత పరమార్థమును క్షోదక్షమ పరిశ్రమతో విశదీకరించి తనజన్మ ధన్యమైనదని విశ్వసించుచున్నాడు. అంతటిది ఆ సంతృప్తి. ఈ గ్రంథ విషయ మట్టిది. పరి

శ్రమ అట్టిది. ఫల మట్టిది. గ్రంథప్రణాళిక చతురస్రమైనది. పరిశోధన సాంగోపాంగముగ సాగినది. భాష సమున్నత భావపూర్వమైన స్థాయికి చెందినది. విషయ వివరణము సముచిత వ్యాఖ్యాన సంభృత మైనది. ఉద్ధృత వాక్యములు, ఆకర సూచికలు, మున్నగునవన్నియు గ్రంథప్రామాణికతయొక్క గౌరవమునకు వన్నెపెట్టుచున్నవి. ఆంధ్రే తర విశ్వవిద్యాలయ పరిధికు చెందిన ముగ్గురు పరీక్షకులచేతను ఏక గ్రీవముగ డాక్టరుపట్ట పురస్కారసమర్హమైనదని ఈ గ్రంథము నిర్ణ యింపబడినది. అందుచే చివరగా నామాటగా నిట్లందును. నందులవారి గ్రంథము ఆంధ్రసరస్వతీ సమారాధనలో నొక అపూర్వమైన పుష్పము.

భవతు

– యస్వీ. జోగారావు



# వాక్పుష్పోపహారము

పరిశోధన చేయు సంకల్పము నాలో బీజావాపము చేసిన అమృత హృదయులు ఆచార్య శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు, స్వర్గీయ శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు. నాలోని పరిశోధన కళాపిపాస కూపిరిపోసి, దాని కుపాసనారూపమిచ్చిన సుగృహీత నామధేయులు ఆచార్య యస్వీ జోగారావుగారు.

కవిత్రయ భారతము నాకు నిత్యపారాయణమగుట, ఆగ్రంథము లోని భాగములను డిగ్రీవిద్యార్థులకు ఇరువది సంవత్సరములు పాఠము చెప్ప అవకాశము కలిగినది. అంతకంటె విశేషమేమనగా కవిత్రయ ప్రణీతమైన భారతమందలి ఉపదేశము ప్రపంచించుట మత్పురాకృత సుకృతమని భావింతును.

ఈ సిద్ధాంత వ్యాసమును పరీక్షించి పిహెచ్. డి. పురస్కార మున కర్హమైనదిగా నిర్ణయించిన న్యాయనిర్ణేతలు ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము (రిటైర్డు ప్రొఫెసర్), ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాద్; డాక్టరు శ్రీమతి జె. హేమలత, ప్రిన్సిపాల్, సాయి బాబా పోస్టుగ్రాడ్యుయేట్ కళాశాల, అనంతపురం; డాక్టరు ప్రసాద రాయ కులపతి హిందూకళాశాల, గుంటూరు గార్లకు నాకృతజ్ఞతా పూర్వక ప్రణామములు.

ఈ గ్రంథనిర్మాణమునకు వలయునట్లు నాలో సాహిత్యాభి రుచియు, లాక్షణికదృష్టియు పెంపొందించిన గురుపరంపర సర్వశ్రీ నండూరి రామకృష్ణమాచార్య, స్వర్గీయ దిగుమర్తి సీతారామస్వామి, స్వర్గీయ దర్భా సర్వేశ్వరశాస్త్రి, శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి, శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనము, శ్రీ పోలేటి సుబ్బరాయ శాస్త్రి, శ్రీ బులుసు వేంకటేశ్వర్లు. ఈ గ్రంథ రచనమున కుపయుక్త

మైన వెందఱో మహానుభావులైన సంస్కృతాంధ్ర ఆంగ్లరచయితలకు నీరాజనము సమర్పించుచున్నాను.

సహృదయభూమిక ననుగ్రహించిన ఆచార్య శ్రీ జోగారావు గారికి, ఆశీఃకుసుమము లభివర్షించిన ఆచార్య శ్రీ దివాకర్ల వేంకటావధాని గారికి నా ప్రణామములు.

ఈ మహాగ్రంథరచనము కనుకూలమైన వాతావరణము కల్పించిన కళాశాలాధ్యక్షులు, రసజ్ఞశేఖరులైన శ్రీ కె. పురుషోత్తము గారికి నా పుష్పాంజలి. ఈగ్రంథము ముద్రణమున కనువుగా తీర్చిన సన్మిత్రమణులు శ్రీ వి. రామకృష్ణరావు, శ్రీ టి. భాస్కరరావు, శ్రీ వి. సత్యనారాయణ, డా॥ చామర్తి కనకయ్య, శ్రీ పరిభంజన స్వామి, శ్రీ సాంబశివరావు, శ్రీ వేంకట్రావు ప్రభృతులు.

ఈ గ్రంథము ముద్రించుటకు రచయితలకు చేయు ఆర్థికసహాయ ప్రణాళికక్రింద శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము కార్యనిర్వాహణాధికారి మాన్య మహోదయులు శ్రీ P. V. R. K, ప్రసాద్ (I. A. S.) గారు నాకు 5000/- రూపాయలు ప్రసాదించిరి. ఇది శ్రీనివాసుని కృపాకటాక్షముగా భావింతును. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు గ్రంథముద్రణమునకు అరటన్ను కాగితము చౌకధరకు ఒసంగినందులకు ధన్యవాదములు. ఈ గ్రంథముద్రణమునకు చేయూతనిచ్చిన Y.B. రెడ్డిగారికి నా కృతజ్ఞతలు. 500 పుటలకు మించిన పరిశోధనా నిబంధనమును పట్టుమని రెండునెలలో పరమ రమణీయముగా ముద్రించిన శ్రీపతీప్రెస్ అధినేత శ్రీ గణేశ్వరరావుగారికి శుభాకాంక్షలు.

ముఖచిత్రము అందముగా మలచిన మిత్ర శ్రీ శీలా వీర్రాజు గారికి కృతజ్ఞతలు.

భవదీయుడు

నందుల గోపాలకృష్ణమూర్తి

దుందుభి శ్రీరామనవమి,

కాకినాడ

# గ్రంథ రచనా సముద్దేశము

నారాయణం నమస్కృత్య
నరంచైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాసం
తతో జయ ముదీరయేత్.

వ్యాసం వశిష్ఠ నప్తారం
శక్తేః పౌత్రి మకల్మషమ్
పరాశరాత్మజం వందే
శుకతాతం తపోనిధిమ్.

ధర్మమూలం జగత్సర్వం
ధర్మశ్చ శ్రుతి మూలకః
భారతం పంచమో వేదః
శ్రుతి సర్వస్వ విస్తరః.

వేదములు, ఉపనిషత్తులు, భగవద్గీత, రామాయణ భారత భాగవతాది కావ్యములు భారతీయ సంస్కృతికి మణిదర్పణములు. అందున రామాయణ, భారతములు భారతీయులకు రెండు కన్నుల వంటివి. ఉద్గ్రంథముల ప్రభావము భారతీయులపై ననన్య సామాన్యము. ఇహాముత్ర మహత్తరమగు మానవజీవితమును పరిపాలించు మౌలిక విషయములు చతుర్విధ పురుషార్థములు. అవి ధర్మ, అర్థ కామ మోక్షములు. పురుషార్థ మనగా స్త్రీకి చెందినదని అర్థము కాదు. చరిత్రను నిర్మించు వర్తనమును పరిపాలించునట్టి సర్వవిషయములు స్త్రీ పురుషులకు సమానము. ఆ వర్తనము నాదేశించి ఫలమును నిర్దేశించునట్టి, పురుషార్థములకు సంబంధించిన సర్వ పరిజ్ఞానమునకు, సమ్యగ్విజ్ఞానమునకును నిదానము నిధానము మహాభారతము.

"ధర్మేచార్థేచ కామేచ మోక్షేచ భరతర్షభ
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్క్వచిత్"

భారతగ్రంథమున బ్రతిపాదింపబడినదే ఇతరత్ర కలదు. దీన జెప్పబడనిది ఎందును లేదు. అని ఈ శ్లోకభావము. ఏవంగుణ విశిష్టమైన భారతమును లోకము సప్రియాశ్రియముగ సంభావించుచున్నది. మహాకావ్యమో, మహేతిహాసమో, దీనికిప్పటికి దీటైన గ్రంథము "ఇప్పటికి ఇల్లై - ఇక మీద హుళక్కి"

మానవులకు మధ్య ఆధ్యాత్మిక సామ్యవాదము నెలకొల్పుటకు అవతరించిన అఖిల తాత్త్విక దృక్పథ శిఖర శేఖరమైన అద్వైతభావమును ప్రసవించిన ఆదిగర్భేశ్వరి భారతము. భగవద్గీతకు పుట్టినిల్లై వేదము, వేదశిఖులైన ఉపనిషత్తులు తత్త్వాన్వేషణ పరాయణములైన దర్శనములు చేసిన ప్రవచన పరమార్థమునకు మెట్టినిల్లై, అతీత దేశకాలభేదముగ పరిణమించుచు, విశ్వమానవ సమాజైక తానమైన భారతీయ సంస్కృతిని సర్వాంగీణ పరిష్వంగము చేసికొని, తరతరాల భారతాత్మను పరిపాలించుచు వచ్చిన గ్రంథము మహాభారతము.

బహుకళ్యాణ గుణభరితమైన వ్యాస భారతమును ఆంధ్రీకరించు మహాభాగ్యము సాధారణులగు కవిశబ్దవాచ్యులగు కవులకుగాక, ఋషితుల్యులగు కవిత్రయమునకు లభించినది. ఇది తెలుంగుల పుణ్యఫలము. ఒక గ్రంథముయొక్క వైశిష్ట్యము రచనా విధానముపైనను, ప్రతిపాదించు ధర్మతత్త్వముపైనను ఆధారపడియున్నది. వ్యాసభగవానుడు గ్రంథారంభమున "ఇతిహాసోత్తమా దస్మాజ్జాయంతే కవిబుద్ధయః" అని పలికెను. ప్రాచీనార్యుల భౌతికాధ్యాత్మిక జీవిత సర్వస్వమును చిత్రించుటచే ప్రత్యక్షగము జరిగిన కథయగుటచే మహేతిహాసమనియు ప్రసిద్ధి బడసినది. భారతము శాస్త్రకావ్యము. మహాకావ్య

లక్షణములు, శాస్త్రలక్షణములు ఇంక గంగాయమునలవలె మధుర సమ్మేళనము పొందినవి.

మహాభారత ప్రశస్త్యమును నన్నయభట్టారకుడు

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని యధ్యాత్మవిదులు వేదాంత మనియు నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని కవివృషభులు మహాకావ్య మనియు లాక్షణికులు సర్వలక్షణసంగ్రహ మని యైతిహాసికు లితిహాస మనియుఁ బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చయం బని మహిం గొనియాడుచుండ" అని ప్రస్తుతించి యున్నాడు. (ఆది - ప్రథమ - 32)

ఈ లక్షణములు సంస్కృత భారతమునకే గాక ఆంధ్రభారతమునకును నన్వర్థము. అయినచో ఈయుగమున భారతము చదువవలెనా? అవశ్యము భారతము పఠింపవలెను. నేడు విజ్ఞానశాస్త్రము త్రివిక్రమాభ్యుదయము పొందుచున్నది. ఆధునిక మానవుడు ముందువెన్నడు కనివిని ఎఱుగని పరిశోధనలు చేసి, పంచభూతములను జయించి అష్టైశ్వర్యములతో తులతూగుచున్నాడు. ఆ విజ్ఞానశాస్త్రవేత్తయే అస్త్రాయుధములను హైడ్రోజనుబాంబులను ప్రయోగించి భూతలమునందున్న జీవకోటిని నాశము చేయఁ బ్రారంభించుట శోచనీయము. విజ్ఞానశాస్త్రవేత్త తన విజ్ఞానముతో దారిద్ర్యమును తొలగించుట, అన్నవస్త్రములు లేక అలమటించు అన్నార్తుల కష్టములను తీర్చుట కర్తవ్యముగా భావింపవలెను. విజ్ఞానశాస్త్రవేత్తలకు సహజము విశ్వజనీనమైన సామ్యవాదము బ్రహ్మభావన, విశ్వశాంతిని కలిగించు సాధనము సాహిత్యపఠనమే. ఎంత విజ్ఞానశాస్త్రము పెంపొందినను మానవాళి సాహిత్యపఠనమునకు దూరమగుట అభిలషణీయము కాదు. సాహిత్య సౌరభము లేని జీవితము నిర్గంధ కుసుమము. సాహిత్యమును జీవితములో

సర్వావస్థలందును పూజింపవలెను. అందున భారతీయ ధర్మవిజ్ఞాన సర్వస్వములైన రామాయణభారతము లవశ్యపఠనీయములు. విజ్ఞాన శాస్త్రములలో దినదినమునకు వచ్చు నూతన విషయములను గ్రహించుటకు సరిక్రొత్త పుస్తకములు పఠించుట ముఖ్యము. సాహిత్య విషయములలో ప్రాచీన గ్రంథములకొక ప్రతిపత్తి యున్నది. ఆ గ్రంథములలో సౌందర్యాధి దేవత నిత్యప్రత్యగ్ర సుందరముగ ప్రకాశించి మనలను ఆకర్షించును. జెబర్టు మహాశయుడు ప్రాచీన సాహిత్య వైశిష్ట్యమును ఇట్లు ప్రస్తుతించెను :

"In Science, read by preference the newest works, in Literature the oldest. The classic Literature is always modern."

నేడు మనము ఆర్థిక, సాంస్కృతిక, ఆధ్యాత్మిక రంగములలో ఎదుర్కొను సమస్యలను భారతము సర్వసులభముగ సార్వకాలికముగ పరిష్కరించినది. భారతము ధర్మ నిక్షేపము. వేదాంత రసాయనము. భారత పరమార్థము ధర్మాద్వైతము. అందుచేతనే ప్రప్రథమ గణ్యముగ నన్నయగారు భారతమును ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని ప్రస్తుతించుచున్నారని నుడివిరి. ధర్మమునకు నాయకుడైన ధర్మరాజునకు అభేదము.

"ధర్మో రక్షతి రక్షితః"
"యతో ధర్మస్తతో జయః"

ఇదియే భారతసందేశము. అందులకే భారతమునకు జయేతిహాసమను పేరువచ్చినది. సర్వమానవులకు సర్వకాలావస్థలలో ధర్మాచరణమే ఇహలోకసౌఖ్యము, పరలోక నిశ్శ్రేయసము కలిగించునని ధ్వని.

భారతము విశ్వశ్రేయము నొనగూర్చుటకు నుత్కృష్ట సాధనము.

"కనీయము ధర్మార్థ కామమోక్షములకు నత్యంత సాధనంబైన దాని" అని పొగడబడినది. తిక్కన సోమయాజియు భవబంధ విమోచనము చేయు సాధనముగ భారతమును స్వీకరించెను. ఆ మహామహితాత్మునకు హరిహరనాథుడు స్వప్నములో గోచరించి ఇట్లు పలికెను.

"జననమరణాదులైన సంసార దురిత
ములకు నగపడకుండంగ దొలగు తెరువు
గనుగెలుంగు నీ కిచ్చితి ననిన లేచి
నిలిచి సంతోష మెదనిండ నెలవుకొనగ."

(విరాట - ప్రథమ - 23)

భారతామృతము కర్ణపుటంబుల నారగ్రోలి ఆంధ్రావళి మోదముం బొరయున్నట్లుగ కవిత్రయము భారతమును విర్మించిరి.

భారతములో ప్రత్యంశము ధర్మపరిమళముతో గుబాళించుచున్నది. ఆంధ్రమహాభారతము చతుర్విధ పురుషార్థములు, సత్యాహింసలు, భూతదయ, విద్యాజ్ఞానశీలాదులతో కూడిన మానవుని బహిరంతర వ్యక్తిత్వమును పరిపాలించు బహువిషయము లుపదేశించుచున్నది.

ఆంధ్రమహాభారతములో ప్రధాన కథాముఖమున పాత్రలముఖమున ఉపాఖ్యానముఖమున సంవాదముఖమున చేయబడిన ఔపదేశిక ప్రతిపత్తిని ప్రపంచించుటయే ఈ సిద్ధాంత నిబంధనముయొక్క పరమ ధ్యేయము.

ఈ గ్రంథరచనకు మార్గదర్శకులైన అస్మద్గురుదేవులు ఆచార్య శ్రీ జోగారావుగారికి జీవితాంతము నేను ఋణగ్రస్తుడను.



# విషయసూచిక

# సాహిత్యము - ఉపదేశము

సాహిత్యము నిరంతరము ప్రవహించు స్రవంతి. అది విశ్వజనీన మైనది. మానవహృదయము ఏ శుభముహూర్తమున రసార్ద్రమయ్యెనో ఆ క్షణమున సాహితీలత చిగురించినది. ఆ సాహిత్యలత అనాది కాలము నుండియు, నవనవోన్మేషవికాసముతో వెలుగొందుచు, నిత్య నూతనపరిమళభరితమైన కావ్యపుష్పముల నొసంగుచు సహృదయు లకు సర్వేంద్రియ సంతర్పణ మాచరించుచున్నది. బ్రహ్మపదార్థము ఎట్లు అనిర్వచనీయమో అట్లే సాహిత్యముగూర్చి నిర్వచింపబూనుట అసాధ్యము. నిర్వచింపబూనినను, ససాకల్యముగ వివరింప నెవ్వరికిని తరముకాదు.

"సహితస్య భావః"=సాహిత్యము

ఈశబ్దముష్యఞంతము. కావున సాహితీ అనియు నగును.

"హి తేన సహితః"-

ఈ విధముగా సాహిత్యపదమును నిష్పన్నము చేయవచ్చును.

ప్రాచీనకాలమునుండియు సాహిత్యము కావ్యపర్యాయవాచక ముగ వాడబడుచున్నది. కావ్యలక్షణములనుగూర్చి తెలుపు శాస్త్రము నకు అలంకారశాస్త్రమనియు, సాహిత్యశాస్త్రమనియు సంస్కృతమున వ్యవహారము కలదు.

ప్రాచీన సంస్కృతాలంకారిక శేఖరులు సాహిత్యపదమును ఇట్లు నిర్వచించిరి.

భామహాదులు "శబ్దార్థౌసహితౌ కావ్యం" [సహితములగు శబ్దార్థములు కావ్యము] అని చెప్పిరి. వ్యక్తివివేక టీకాకారుడు "సాహిత్యం తుల్యకక్షత్వేన అన్యూనానతిరిక్తత్వం" [సాహిత్య మన

శబ్దార్థములకు సమానమగు వాక్కు-గలిగి ఒకటి హెచ్చుగా కాని, యొకటి తచ్చుగాగాని లేకుండుట] అని వ్యాఖ్యానించెను. సాహిత్య విద్యయన శబ్దార్థరూపమగు కావ్యవిద్య. నిరతిశయ ప్రేమాస్పదమైన రసముతో కూడినశబ్దార్థములు సాహిత్యమని స్థూలముగా చెప్పవచ్చును. (కావ్యాలంకార సంగ్రహము- సన్నిధానమువారి వ్యాఖ్య- పుట 81.)

పద్యకావ్యము, నాటకము, నవల, కథానిక, గేయము మున్నగునవి సాహిత్యములోని అంతర్భాగములే. ప్రాచీన భారతీయాలంకారికులు పద్యకావ్యమును దృష్టిలోనుంచుకొని కావ్యసామాన్య లక్షణములను నిర్దేశించియున్నారు. సాహిత్యమునకు శిఖరప్రాయమైనది పద్యకావ్యము. సాహిత్యపదమునకు సమానార్థకముగా ఆంగ్లమున 'లిటరేచరు'- (Literature) అను పదము ప్రయోగింపబడుచున్నది.

ఆంగ్లేయు లొక గ్రంథము కావ్యశబ్దార్హత పొందుటకు సర్వజనరంజకత్వము, సుందరమైన రచనాబంధము, రసానందజనకత్వము, ప్రధానముగా ఉండవలెనని, నిర్దేశించియున్నారు. హడ్సన్ మహాశయుడు సాహిత్యలక్షణములనిట్లు వింగడించెను.

"Literature is composed of those books, and of those books only, which, in the first place, by reason of their subject matter and their mode of treating it, are of general human interest; and in which, in the second place, the element of form and the pleasure which form gives are to be regarded as essential."

(An Introduction to study of Literature-Page 10)

మన ఆత్మ చిదానంద స్వరూపము. ప్రీతి, స్నేహము, దయ, భక్తి మున్నగునవి సాత్త్వికభావావస్థలు. ఈ భావములను వ్యక్తీకరించుటయందు కావ్యములు మనకు ఉపయుక్తమగుచున్నవి. మనము కావ్యానుశీలనము చేసి తద్గతభావములను హృద్గతము చేసికొని, కోశత్రయాత్మకమైన సూక్ష్మశరీరమునందు సద్భావముల సంగ్రహింతుము.

కావ్యములు లోకోత్తరానంద ప్రదములు. ఈ కావ్యానందము బ్రహ్మానంద సహోదరము, విగళిత వేద్యాంతరము, వాచామగోచరము, అనుభవైకవేద్యమని ఆలంకారికులు ఎల్లరు ప్రస్తుతించి యున్నారు. ఆనందమే జ్ఞానసారము. ఆనందమయకోశము విజ్ఞానమయ కోశముపై యున్నది. ఈ ఆనందమునకు మూలకారణము భావము. భావవ్యంజకములగుటచేతనే కావ్యముల కగ్రస్థానము లభించినది. వేదములు, శాస్త్రములు మానవులకు కర్తవ్యము శాసనరూపమున ప్రబోధించుచున్నవి. పురాణములు మిత్రులవలె ప్రబోధించుచున్నవి. కావ్యము కాంతవలె మనోరంజనము చేయుచు, వ్యంగ్యముగ ధర్మోపదేశము చేయుచున్నది. ఉదాత్తభావములే మన సూక్ష్మశరీరములను పోషింపగలవు. భావముల మూలమున జ్ఞాన ముత్పన్నమగును. పరిణత మగును. భావప్రాప్తికి భావన ఆవశ్యకము.

"యాదృశీ భావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ"

శ్రేష్ఠభావములే మనలను వెన్నంటియుండి శ్రేయోదాయక మగును. సుందరభావము లెందు సంగ్రహింపబడునో అట్టిదే ఉత్తమ కావ్యము. కావ్యగతభావములు హితకరములు. సుకవుల గ్రంథములు సద్భావ రత్నగ్రథితములు. తనుపాదేయములగు ఆధ్యాత్మిక భావములను గ్రహించి మన సూక్ష్మశరీరములను పోషించును. కావున అట్టి గ్రంథములే సాహిత్యము.

ఏ యేభావములు సంగ్రహించి ఉత్తమ పథానువర్తులమై ఉన్నతపదవిని సాధించగలమో, దేనిని పూనుకొని యుండుటవలన మనుష్యధర్మములు మన కలవడునో అట్టి ఉదాత్తభావములు మన చిత్తమున నైర్మల్యము ఆనందము చేకూర్చి క్రమముగా నుత్కృష్ట

లాభము నొందజేయును. వేదశాస్త్ర సర్వకళాసారము సాహిత్యములో నిక్షేపించబడినది.

వేదశాస్త్రపురాణ కావ్యములు ఉత్తరోత్తర రమణీయములై సహృదయ సమాహ్లాద సంధాయకము లగుచున్నవి. అభినవగుప్త పాదులు కావ్యముల మహత్త్వమును బహుధా ప్రస్తుతించెను. వేదము ప్రభుసమ్మితము. పురాణము మిత్రసమ్మితము. కావ్యము కాంతా సమ్మితము. వేదము "సత్యం వద" "ధర్మం చర" ఇత్యాది కర్తవ్యములను శాసనరూపమున నిర్దేశించును. ఇట హేతు వాద మునకు తావులేదు. సైన్యాధికారి ఆజ్ఞ ననుసరించి, సైనికుడు పురోగమింపవలసినదే. ప్రశ్న అను దానికి అవకాశమే లేదు. వేద ములు శబ్దప్రధానములు. శబ్దమును మార్చుటకు మనకు అధికారము లేదు. పురాణ వాఙ్మయము మిత్రసమ్మితము. అనగా మిత్రునివలె ఉపదేశించునది. అయినచో మిత్రుడనగా నెవరు? భర్తృహరిమహా కవి సన్మిత్ర లక్షణముల నిట్లు వివరించెను.

> "పాపా న్నివారయతి, యోజయతే హితాయ,
> గుహ్యం నిగూహతి, గుణాన్ ప్రకటీకరోతి,
> ఆపద్గతం చ న జహాతి, దదాతి కాలే;
> సన్మిత్ర లక్షణ మిదం ప్రవదన్తి సన్తః"
>
> (భర్తృహరి సుభాషితములు - నీతిశతకము-65)

చెడుపనులనుండి నివారించుట, మంచిపనులుచేయుటకు ప్రోత్సా హమిచ్చుట, రహస్య సంరక్షణముచేయుట, సద్గుణములను ప్రకటిం చుట, ఆపత్కాలమున మిత్రుని నీడవలె అనుసరించి యుండుట, సన్మిత్ర లక్షణము. ఇట్టి సన్మిత్రులు తల్లిదండ్రులు, మిత్రులు. మిత్రుని వంటి పురాణ వాఙ్మయము వేదప్రతిపాదితమైన "సత్యం వద" "ధర్మం చర" అను ధర్మములను సహేతుకముగా సోదాహరణముగా కథా

రూపమున నడుపుచు, తదాచరణమువలన నుత్పన్నమగు నష్టములను వెన్నుదట్టి ఉపదేశించును. అందుచేతనే పురాణవాఙ్మయము అర్థ ప్రధానము.

ఇక కావ్యవాఙ్మయము కాంతా సమ్మితమై యలరారు చున్నది. పతివ్రతయైనభార్య తన గుణశీలములచే మృదుమధుర వాగ్విన్యాసము చేయుచు భర్తను ధర్మమార్గమున నడపించును. ఆ ఉత్తమాంగన తన భర్తకు వాచ్యరూపమున ఉపదేశింపక తన గుణ ప్రవర్తనాదులచే వ్యంగ్యరూపమున ఉపదేశము చేయును. అందుచేతనే వేద పురాణ వాఙ్మయములకంటె కావ్యవాఙ్మయము వైలక్షణ్యముతో నలరారుచున్నది. వేదములు శాసించును. పురాణములు బోధించును. కావ్యములు రంజించును. మూడింటను ఉపదేశము సమానమే అయ్యును రంజనముతో కూడిన ఉపదేశము కావ్యములందలి విశేషము. ప్రాచీనకాలమునుండియు కావ్యవాఙ్మయము ఆనందోపదేశములతో కూడియుండి సర్వజన శిరోధార్య మగుచున్నది.

ఆర్యమహర్షులు మధుమయ ఫణితులతో రామాయణ భారతాది కావ్యములు రచించి భారతీయులకు తఱుగని పెన్నిధులుగా ప్రసాదించిరి.

కావ్య ప్రయోజనము పురస్కరించుకొని సంస్కృతాలంకారిక శేఖరులగు భరత, భామహాదులు సమగ్రముగ చర్చించియున్నారు.

భరతమహర్షి నాట్య శాస్త్రమున దృశ్యకావ్యావిర్భావమును వివరించెను. అతని సూత్రము లనేకము శ్రవ్యకావ్యమునకు కూడ అన్వయించును. ఇంద్రాది దేవతలు బ్రహ్మనుగూర్చి తపస్సుచేసి క్రీడనీయకము [మనస్సునకాకర్షక మగునది], చూచుటకు, వినుటకు, యోగ్యమైన వినోదవస్తువును సృజింపుమని ప్రార్థించిరి.

"క్రీడనీయక మిచ్ఛామో దృశ్యం శ్రావ్యంచ యద్భవేత్"
(నాట్యశాస్త్రము - ప్రథమ - 11)

బ్రహ్మ తత్త్వవిదుడై చతుర్వేదములను స్మరించి
"ధర్మ్యమర్థ్యం యశస్యం చ సోపదేశ్యం ససంగ్రహమ్
భవిష్యతశ్చ లోకస్య సర్వకర్మానుదర్శకమ్
సర్వశాస్త్రార్థ సంపన్నం సర్వశిల్ప ప్రవర్తకమ్
నాట్యాఖ్యం పంచమం వేదం సేతిహాసం కరోమ్యహమ్."
(నాట్యశాస్త్రము - ప్రథమ - 14, 15)

ధర్మప్రతిపాదకమును, చతుర్విధ పురుషార్థ సాధకమును, యశస్కరమును, ఉపదేశసహితమును, సమ్యగ్జ్ఞానప్రదమును, ముందు తరములవారికి సత్కర్మమార్గమును ప్రదర్శించునదియు, సర్వశాస్త్రార్థ సంపన్నమును, సర్వశిల్పప్రవర్తకమును, ఇతిహాస సహితమును అగునట్లుగా 'నాట్యము' అనెడి పంచమవేదమును బ్రహ్మ సృజించెను. దీనినిబట్టి నాట్యము ఆనందోపదేశాత్మకమై యుండవలెనని తేలుచున్నది. ఈ లక్షణము శ్రవ్యకావ్యమునకు సహితము సమానముగనే సమన్వయించును.

ఆరవ శతాబ్దిలో విలసిల్లిన భామహుడు సత్కావ్యము ధర్మార్థ కామమోక్షములందును, కళలయందును, నేర్పును, కీర్తిని, ప్రీతిని కలిగించునని తెలిపియున్నాడు.

"ధర్మార్థకామ మోక్షేషు వైచక్షణ్యం కలాసు చ
ప్రీతిం కరోతి కీర్తించ సాధుకావ్య నిషేవణమ్"
(భామహాలంకారము - ప్రథమ 2)

కావ్యవిద్య సమస్తవిద్యలకు నిలయము. అది సకల విద్యల సారము. ఈతని అభిప్రాయము ప్రకారము చతుర్వర్గ వ్యుత్పత్తియు, కళాపరిజ్ఞానమును, కీర్తియు, ఆనందమును కావ్యప్రయోజనములు,

దండి మహాశయుడు సాహిత్యమను దర్పణమున ఆదిరాజుల యశోబింబము ప్రతిఫలించుననియు, సాహిత్యములో సామాజిక జీవన చిత్రణముండవలెనని నుడివెను. కావ్యము మానవుల సర్వకామ్యముల అభివర్షించు కామధేనువని ప్రస్తుతించెను.

"ఆదిరాజ యశోబింబ మాదర్శం ప్రాప్య వాఙ్మయమ్
తేషా మసన్నిధానేఽపి న స్వయం పశ్య నశ్యతి.
గౌర్గౌః కామదుఘా సమ్యక్ ప్రయుక్తా స్మర్యతే బుధైః
దుష్ప్రయుక్తా పునర్గోత్వం ప్రయోక్తుః సైవ శంసతి"

(కావ్యాదర్శము - ప్రథమ - 5, 6)

ఆనందవర్ధనునికి ముందున్న ఆలంకారికులు కావ్యప్రయోజనములలో ప్రీతితోపాటు కీర్తిని హితోపదేశములను చేర్చిరి.

ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకములో కావ్యప్రయోజనములను ఆనందోపదేశములని స్పష్టముగా చెప్పెను. పామరజన హితార్థము నకై సదాచారోపదేశము చేయుటకొఱకే భరతాదులు నాటకములను నిర్ణయించిరి.

ఆనంద ఉపదేశములలో ఏది ప్రధానము? అని ప్రశ్నించుకొని అభినవగుప్తపాదులు తమ 'లోచన' వ్యాఖ్యానములో సర్వజనమాళీ భూతమైన సిద్ధాంతము చేసియున్నారు.

"తత్ర కవే స్తావత్ కీర్త్యాపి ప్రీతి రేవ సంపాద్యా.య దాహ-
'కీర్తిం స్వర్గఫల మాహుః' ఇత్యాద్య.... తథాపి ప్రీతి రేవ ప్రధానమ్.

అన్యథా ప్రభు సంమితేభ్యో వేదాదిభ్యో, మిత్ర సంమితేభ్య శ్చేతిహాసాదిదిభ్యో,
వ్యుత్పత్తి హేతుభ్యః కోఽస్య కావ్యరూపస్య వ్యుత్పత్తి హేతోః

"క్రీడనీయక మిచ్ఛామో దృశ్యం శ్రావ్యంచ యద్భవేత్"
(నాట్యశాస్త్రము - ప్రథమ - 11)

బ్రహ్మ తత్త్వ విదుడై చతుర్వేదములను స్మరించి
"ధర్మ్యమర్థ్యం యశస్యం చ సోపదేశ్యం ససంగ్రహమ్
భవిష్యతశ్చ లోకస్య సర్వకర్మానుదర్శకమ్
సర్వశాస్త్రార్థ సంపన్నం సర్వశిల్ప ప్రవర్తకమ్
నాట్యాఖ్యం పంచమం వేదం సేతిహాసం కరో మ్యహమ్."
(నాట్యశాస్త్రము - ప్రథమ - 14, 15)

ధర్మప్రతిపాదకమును, చతుర్విధ పురుషార్థ సాధకమును, యశస్కరమును, ఉపదేశసహితమును, సమ్యగ్జ్ఞానప్రదమును, ముందు తరములవారికి సత్కర్మమార్గమును ప్రదర్శించునదియు, సర్వశాస్త్రార్థ సంపన్నమును, సర్వశిల్పప్రవర్తకమును, ఇతిహాస సహితమును అగునట్లుగా 'నాట్యము' అనెడి పంచమవేదమును బ్రహ్మ సృజించెను. దీనినిబట్టి నాట్యము ఆనందోపదేశాత్మకమై యుండవలెనని తేలుచున్నది. ఈ లక్షణము శ్రవ్యకావ్యమునకు సహితము సమానముగనే సమన్వయించును.

ఆరవ శతాబ్దిలో విలసిల్లిన భామహుడు సత్కావ్యము ధర్మార్థ కామమోక్షములందును, కళలయందును, నేర్పును, కీర్తిని, ప్రీతిని కలిగించునని తెలిపియున్నాడు.

"ధర్మార్థకామ మోక్షేషు వైచక్షణ్యం కలాసు చ
ప్రీతిం కరోతి కీర్తించ సాధుకావ్య నిషేవణమ్"
(భామహాలంకారము - ప్రథమ 2)

కావ్యవిద్య సమస్తవిద్యలకు నిలయము. అది సకల విద్యల సారము. ఈతని అభిప్రాయము ప్రకారము చతుర్వర్గ వ్యుత్పత్తియు, కళాపరిజ్ఞానమును, కీర్తియు, ఆనందమును కావ్యప్రయోజనములు,

దండి మహాశయుడు సాహిత్యమను దర్పణమున ఆదిరాజుల యశోబింబము ప్రతిఫలించుననియు, సాహిత్యములో సామాజిక జీవన చిత్రణముండవలెనని నుడివెను. కావ్యము మానవుల సర్వకామ్యముల అభివర్షించు కామధేనువని ప్రస్తుతించెను.

"ఆదిరాజ యశోబింబ మాదర్శం ప్రాప్య వాఙ్మయమ్
తేషా మసన్నిధానేఽపి న స్వయం పశ్య నశ్యతి.
గౌర్గౌః కామదుఘా సమ్యక్ ప్రయుక్తా స్మర్యతే బుధైః
దుష్ప్రయుక్తా పునర్గోత్వం ప్రయోక్తుః సైవ శంసతి"
(కావ్యాదర్శము - ప్రథమ - 5, 6)

ఆనందవర్ధనునికి ముందున్న ఆలంకారికులు కావ్యప్రయోజనములలో ప్రీతితోపాటు కీర్తిని హితోపదేశములను చేర్చిరి.

ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకములో కావ్యప్రయోజనములను ఆనందోపదేశములని స్పష్టముగా చెప్పెను. పామరజన హితార్థము నకై సదాచారోపదేశము చేయుటకొఱకే భరతాదులు నాటకములను నిర్ణయించిరి.

ఆనంద ఉపదేశములలో ఏది ప్రధానము? అని ప్రశ్నించుకొని అభినవగుప్తపాదులు తమ 'లోచన' వ్యాఖ్యానములో సర్వజనమాళీ భూతమైన సిద్ధాంతము చేసియున్నారు.

"తత్ర కవే స్తావత్ కీర్త్యాపి ప్రీతి రేవ సంపాద్యా.య దాహ-
'కీర్తిం స్వర్గఫల మాహుః' ఇత్యాద్య.... తథాపి ప్రీతి రేవ
ప్రధానమ్.
అన్యథా ప్రభు సంమితేభ్యో వేదాదిభ్యో, మిత్ర సంమితేభ్య
శ్చేతిహాసాదిభ్యో,
వ్యుత్పత్తి హేతుభ్యః కోఽస్య కావ్యరూపస్య వ్యుత్పత్తి
హేతోః

జాయాసంమితత్వ లక్షణో విశేష ఇతి ప్రాధాన్యేన ఆనంద
ఏవోక్తః, చతు
ర్వర్గ వ్యుత్పత్తే రపి చానంద ఏవ పార్యంతికం ఫలమ్."
(లోచన వ్యాఖ్య - 40 - 41)

కావ్యానుశీలనము తఱచుగా చేయుటచే హృదయమను దర్ప ణము నిర్మలమై తన్మయత్వము పొందుటకు యోగ్యముగా నెవరికుం డునో వారే సహృదయులు. అట్టి సహృదయులే కావ్యరసాస్వాద యోగ్యులు. ఈసహృదయులకు కావ్యమున రసధ్వని ప్రతీతమగు చున్నది. దీని వలన కవి ప్రీతినే మిన్నగా కోరువాడని గ్రహింప వలెను. శ్రోతలకు కావ్యము ద్వారా వచ్చు తన్మయత్వమునే ప్రీతి అందురు. ఈ ప్రీతిని ఆశ్రయించుకొని యున్నది వ్యుత్పత్తి. ఈప్రీతి, వ్యుత్పత్తి అనునవి విభిన్నవిషయములు కావు. విభావాదుల ఔచి త్యమే ప్రీతికి హేతువు. రసోచితములగు విభావాదులద్వారా కలుగు స్వరూప సంవేదనమే వ్యుత్పత్తి. కావున కావ్యము తెచ్చు రసాస్వాద మున ప్రీతి, వ్యుత్పత్తి అనునవి సంవలితములై ఉన్నవి. వీనిలో ప్రధానమైనది ప్రీతి.

దశరూపకకర్తయైన ధనంజయుడును కావ్య ప్రయోజనము ఆనందమని స్పష్టపరచి పురుషార్థసారమనుట కెంత మాత్రము అంగీక రింపలేదు.

"ఆనంద నిష్యందిషు రూపకేషు వ్యుత్పత్తిమాత్రం ఫల
మల్పబుద్ధిః
యోఽపీతిహాసా దివ దాహసాధు స్తస్మైనమః స్వాదుపరాఙ్ము
ఖాయ"
(దశరూపకము- ప్రథమ- 6)

రూపకములు ఆనంద నిష్యందులు. వీనివలనగూడ ఇతిహాసా దులవలె వ్యుత్పత్తిమాత్రమే కలుగునని చెప్పినవాడు ఎంత నిపుణు డైనను అతడు స్వాదుపరాఙ్ముఖుడు. ఆ అల్పబుద్ధికొక నమస్కారము. ఇతనిదృష్టిలో కావ్యప్రయోజనము ఆనందమే. చతుర్వర్గవ్యుత్పత్తి అన్నందులకు ఇతనికి ఆగ్రహము కలిగినది.

తిక్కనమహాకవి ఆంధ్రమహాభారతములో "ఆత్మసమ్మోదము బొందగావ్యరసముం గొనియాడుచునుండు దెప్పుడున్" అని ఆనంద ప్రాధాన్యమే తెలిపియున్నాడు.

భారతీయాలంకారికులు కావ్యమును కాంతతో పోల్చుట మనో హరము. కాంతకు దేహగుణ భూషణాదులన్నియు సౌందర్యము కలి గించినను ఆత్మ ప్రధానమైయున్నది. కావ్యాంగములైన రసాలంకార గుణాదులలో ఆత్మయేది ? అను దాని విషయములో లాక్షణికులలో భిన్నాభిప్రాయములు కలవు. వారు చేసిన చర్చా మథనమువలన అమృతము ఉద్భవించినది.

భరతమహర్షి నాట్యశాస్త్రములో నాటకప్రయోగసమయమున సహృదయుడు అనుభవించు సాత్త్వికానందమే రసమనియు, రూపక సౌందర్యమునకు నిదియే ప్రధానమనియు చెప్పెను. ఈతని మతమున కావ్యమున కితివృత్తము శరీరమనియు, రసము సౌందర్య హేతువనియు తెలియుచున్నది.

భామహుడు మానవుల శరీరములకు అలంకారము లేవిధముగ వన్నెతెచ్చునో అట్లే వక్రోక్తి మూలకమయిన అలంకారములు కావ్య శరీరమునకు వన్నెచేకూర్చుచున్నవి. కావ్యసౌందర్యమునకు అలంకారి కులు ప్రధానమని చెప్పుచున్న రసమునుకూడ రసవదలంకారమను పేర ఒక అలంకార భేదముగా పరిగణించెను.

దండి శరీరముయొక్క బాహ్యసౌందర్యమును పెంచునది అలంకారములే అయినను అంతస్సౌందర్యమును పెంచి, సౌందర్యమును గూర్చునవి గుణములే అని చెప్పెను. ఇతడు గుణప్రాధాన్యవాది.

భామహుడు, దండియును కావ్యబహిరంత స్సౌందర్య హేతువు లేవని ప్రశ్నించిరి. కాని ఆత్మస్వరూపము పరిశీలించియుండలేదు.

వామనుడు కావ్యాత్మనుగూర్చి విచారణ సాగించుచు

''రీతిరాత్మా కావ్యస్య'' అని ఆత్మవిషయమును మొట్టమొదట పేర్కొనెను. మానవశరీరమునకు వలెనే కావ్యశరీరమునకు ఆత్మయుండు ననియు, అదిరీతి అనియు రీతిగుణములచే ఏర్పడుననియు, విశిష్టపదరచ నాత్మకమైనదే రీతి అనియు చెప్పి, అలంకారములు కావ్యసౌందర్యమును సమకూర్చునని సమన్వయించెను. దండి భామహుల గుణాలంకార వాదములను తన రీతిసిద్ధాంతముచే సమన్వయించెను. ఆనంద వర్ధనుడు కావ్యాత్మనుగూర్చి వచ్చిన పూర్వాలంకారికుల అభిప్రాయములన్నిటిని సమన్వయించి సర్వజనానందవర్ధనమైన ధ్వనిసిద్ధాంతమును ప్రతిపాదించెను. కావ్యశరీరమునకు ఆత్మధ్వనియనియు, ఇది రసాలంకార ధ్వన్యాత్మకమై యుండునని నిరూపించెను. అభినవగుప్తుడు ధ్వన్యాలోకమునకు లోచనమను వ్యాఖ్య వ్రాయుచు ఆనందవర్ధనుని ధ్వని సిద్ధాంతమును ఆమోదించెను. ఇతడు వస్త్వలంకారధ్వనుల కంటె రసధ్వనియే అత్యంత ప్రధానమని సిద్ధాంతము చేసెను.

''రసము చేతనే సర్వకావ్యములు జీవించును. రసములేని కావ్యముండదు. రసమే ఆత్మ. వస్త్వలంకారధ్వనులు కూడ రస పర్యవసాయులే''

''నహి రసాదృతే కశ్చిదర్థః ప్రవర్తతే''

— (అభినవగుప్తుని లోచనవ్యాఖ్య)

ప్రాచీనులు కథ- పాత్ర- రసము వీనిలో దేనికి ప్రాధాన్యము కలదు అని ప్రశ్నించుకొని సోపపత్తికముగ సమాధానము చెప్పి యున్నారు. ఉదాహరణమునకు పాండవుల కథ విశేషప్రఖ్యాతి పొందినది. అది భారత దేశములో ఆబాలగోపాలమునకు తెలియని కథ కాదు. కాని తిరుపతి వేంకటకవులు రచించిన పాండవోద్యోగ విజయములను నాటకము ప్రదర్శింపబడినచో దానిని చూచి ఆనందించుటకు ఎన్నియో వ్యయప్రయాసలోర్చి అధికసంఖ్యాకులు ఏ కారణముచే వచ్చుచున్నారు? వారికా కథ తెలియదా? తెలియును. సమర్థులైన నటులు నాటకము ప్రదర్శించినచో ఒకానొక అపూర్వరసానుభూతిని పొంది ఆనందించుట కొరకు వచ్చుచున్నారు. వారువచ్చునది కథ నెరుంగకకాదు. రసానుభూతి వారి ముఖ్యలక్ష్యము. పురాణములలో కథకుమాత్రమే ప్రాధాన్యము. కావ్యమునందు రసమునకే పట్టాభిషేకము. కథ పాతదే అయినను రసనిర్వహణమున కవి చూపు నేర్పునుబట్టి అది నిత్యనూతనమై, సహృదయ హృదయంగమ మగును. వాల్మీకిమహర్షి రామాయణ మహాకావ్యములో కథను సుధామధురముగ నడపి యున్నాడు. ఆ కథను తీసికొని భాసుడు, మురారి మొదలగు కవి మండలి నాటకములను రచించి సహృదయులకు ఆనందము చేకూర్చిన సంగతి విజ్ఞాతపూర్వమే కదా. కథ- పాత్ర- రసము వీనిలో రసమునకే అత్యంత ప్రాధాన్యమున్నదని కుంతకుడు తెలిపియున్నాడు.

నిరంతర రసోద్గార గర్భాః, సౌందర్య నిర్భరాః
గిరః కవీనాం జీవంతి న కథామాత్రమాశ్రితాః

(కుంతకుని వక్రోక్తి జీవితమ్)

కేవల కథను ఆశ్రయించుకొని కవివాక్కులు బ్రతుకలేవు. శృంగారాది రసములకు ఆటపట్టులు, వక్రోక్తి చారువులయిన కవి

వాక్కులే జీవించును. ఈ అభిప్రాయమునే ఆంధ్రసాహిత్య విశ్వనాథు లైన విశ్వనాథవారు "ప్రాగ్విపశ్చిన్మతమున రసము వేయి రెట్లు గొప్పది నవకథాద్భుతిని మించి" అని ప్రవచించిరి.

ఒక కావ్యము ఆనందోపదేశములలో దేని మూలముగ జీవించు చున్నది అనునది పరిశీలింపవలసియున్నది. కావ్యముయొక్క జీవితము అది సహృదయులకోసంగు ఆనందముపైననే ఉన్నదని స్పష్టముగా చెప్పవచ్చును. ఉదాహరణమునకు కవిత్రయ భారతములో ఆది సభా విరాటోద్యోగ పర్వములను చదివినంత ఉత్సాహముతో ఆనుశాస నిక శాంతి పర్వములు ఏల చదువ్రుట లేదు ? దీనికి కారణ మిదియే. పూర్వ పర్వములు కావ్యధర్మముతో నలరారుచున్నవి. ఉత్తరపర్వము లలో శాస్త్రధర్మము నిక్షేపింపబడినది.

ఆలంకారికులు కావ్యప్రయోజనములలో ప్రధానమైనది ఆనంద మనియు, ఆనుషంగిక ప్రయోజనము ఉపదేశమనియు చెప్పినారు. ఉప దేశ మక్కరలేదని ఎవ్వరును చెప్పలేదు. కావ్యమునకు కావ్యత్వ మొసంగు లక్షణము రసానంద జనకత్వ మనియు, ఉపదేశము దాని వైశిష్ట్యమును ఇనుమడింపచేయుననియు గ్రహింపవలసి యున్నది.

మమ్మటుడు కావ్యప్రకాశములో—

"కావ్యం యశసేఽర్థకృతే
వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే
కాంతా సమ్మితత యోపదేశయుజే"

(కావ్య ప్రకాశము - ప్రథమ-2)

అని కావ్యప్రయోజనములను మరికొన్ని అదనముగా చేర్చియున్నాడు. కావ్యమువలన యశస్సు, ధనము, వ్యవహార జ్ఞానము, అమంగళ ప్రశ

మనము, ఆనందము కలుగును. కావ్యము వలన ఆనందోపదేశములే కాక మానవులు సర్వకామ్యములను పొందవచ్చునని విశదమొనర్చెను. ఆనందవర్ధనుడు భరతాది మునులు పామరజనహితము కొఱకే, సదాచారోపదేశ నిబద్ధమైన, నాటకమును అవతరింపచేసినారని చెప్పి యున్నాడు.

నన్నయాది పూర్వాంధ్ర మహాకవీశ్వరులందరును కావ్యోపదేశ మహత్వమును బహుధా ప్రస్తుతించిరి. "నన్నయభట్టు తెనుంగునన్ మహాభారత సంహితా రచన బంధురుడయ్యె జగద్ధితంబుగన్" ఆంధ్ర శబ్ద చింతామణిలో "విశ్వశ్రేయః కావ్యమ్".

"ఈ బమ్మెర పోతరాజొకడు భాగవతంబు జగద్ధితంబుగన్" అనునవి ఉపదేశ ప్రాధాన్యమును సూచించుచున్నవి.

బహుజనాంగీకృతమైన సిద్ధాంత మేమనగా కావ్యములు ప్రధానముగ రసానందప్రదములు గావలెననియు, ఉపదేశము వ్యంగ్యముగా కాంతాసమ్మితముగా చేయవలెనని గమనింపవలెను. భారతీయులు ఉభయలోకములకు సమప్రాధాన్య మొసంగిరి. ధర్మమార్గావలంబమే మానవులకు శ్రీరామ రక్ష. దానిని ఉల్లంఘించుటకు ఎంత మాత్రము వీలులేదు. ఏమాత్రము అవకాశము ఇచ్చినను ప్రజలు అధర్మపరు లగుదురను భయముతో "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" అను స్మృతి వాక్యము కలిగినది. అనగా కావ్యములు చదువరాదు. దీనిలో పరమార్థము గుర్తించుట అత్యావసరము. భారతీయులు సనాతన కాలము నుండియు. ఏ వ్యాపారము చేసినను చతుర్వర్గ వ్యుత్పత్తి దృష్టిలో నుంచికొని చేయుట ఉత్తమ సంప్రదాయము.

సామాన్యముగ కావ్యములు శృంగార వర్ణనలతో నిండియుండి వానిని పఠించిన ప్రజలు, కాంతలకు దాసులై, మోక్షమునకు దూరస్థు

లగుదురను భయముతో ఈ విధి వాక్యము పుట్టియుండును. వేదశాస్త్ర పురాణములు అవశ్య పఠనీయములు. సద్నీతి బోధకములు, సంఘమును తప్పుదారి పట్టించునవి, కామోద్రేకము రెచ్చగొట్టు కావ్యములు చదువరాదని ఈ వాక్యమునకు అర్థము చెప్పనగును. ఈ కోవకు చెందినవి తారాశశాంక విజయము, అహల్యా సంక్రందనము వంటి కావ్యములు. ధర్మోపదేశ సమన్వితములు, భారతీయ విజ్ఞాన సర్వస్వములు. రసానంద నిష్యందములైన రామాయణ భారతాది కావ్యములు ప్రాతఃస్మరణీయములు అని భావము.

"కావ్యాలాపాంశ్చ వర్జయేత్" ఈ విధి వాక్యమును మనసులో ఉంచుకొని విద్యానాథ మహాకవి ప్రతాపరుద్రీయమున చర్చించి సిద్ధాంతము చేసియున్నారు. "యత్ర పునరుత్తమ పురుష చరితం న నిబధ్యతే తత్కావ్యం పరిత్యాజ్యమేవ. తద్విషయాచ స్మృతిః. కావ్యాలాపాంశ్చ వర్జయేత్" (ప్రతాప రుద్రీయము). అనగా ఉత్తమ పురుషచరిత్రను చిత్రింపని కావ్యము పరిత్యజింపదగినదని, కేవలమానంద మాత్ర ప్రయోజనముగా రూపొందింపబడిన కావ్యాలాపము వర్జింపదగినదని విద్యానాథుని అభిప్రాయము ఉత్తమ పురుష చరిత్రము ఎల్లపుడును ధర్మబద్ధమే. ఉత్తమ పురుష చరిత్రచిత్రణమే కావ్యమున పరోక్ష ధర్మసందేశము.

ప్రభుసమ్మితమైన వేదవాఙ్మయముకంటె, మిత్రసమ్మితమైన పురాణవాఙ్మయముకంటె, కాంతాసమ్మితమైన కావ్యవాఙ్మయము ధర్మమును సరసముగా చిత్రించి మానవులను ఎక్కువగా ఆకర్షించును. ఈ విషయమును విద్యానాథ మహాకవి ప్రతాపరుద్రీయములో మనోహరముగ తెలిపియున్నారు.

శ్లో. యద్వేదాత్ ప్రభుసమ్మితా దధిగతం శబ్ద ప్రధానాచ్చిరం
యచ్చార్థ ప్రవణాత్ పురాణవచనా దిష్టం సుహృత్సమ్మితాత్
కాంతా సమ్మితయా యయా సరసతా మాపాద్య కావ్య
శ్రియా
కర్తవ్యే కుతుకీ బుధో విరచిత స్తస్యై స్పృహాం కుర్మహే.
(ప్రతాపరుద్రీయము- ఉ॥ 9)

కావ్యప్రయోజనముగూర్చి పాశ్చాత్య కవీశ్వరులు, విమర్శకులు విస్తారముగ చర్చించియున్నారు. అదియును పరిశీలనార్హమై యున్నది. సాహిత్యము సర్వమానవాళికి సంబంధించినది. సాహిత్య లక్షణములన్నియు సర్వదేశభాషలలో వెలువడిన కావ్యములన్నింటికి సమానమే. భాష వేరైనను, భావము ఒక్కటే.

పాశ్చాత్యసంస్కృతికి, సాహిత్యమునకు, కళలకు, భవ్యకవితావేశము నొసంగిన గౌరవము గ్రీకు సంస్కృతికి దక్కినది. 'హోమరు మహాకవి రచించిన మహేతిహాసముగు "ఒడెస్సీ" (Odyssey) కావ్య ప్రయోజనమునుగూర్చి అల్కినసు (Alcinous) ఇట్లు చెప్పించెను.

Be there Demodocus, the bard of fame,
Taught by the gods to please, when high he sings
The vocal lay, responsive to the strings" (Odyssey - Page 102)

కావ్యప్రయోజనము ఆనందమే యను అభిప్రాయము ప్లేటో కాలమువరకు ప్రచారములో నున్నది.

కాలక్రమమున కావ్యము నీతి బోధచేయవలెనను అభిప్రాయమునకు ప్రాచుర్యము వచ్చినది. ఫ్రాగ్స్ (Frogs) అను రూపకమున అరిస్టోఫేన్స్ [Aristophanes] ఇరువురి పాత్రముల ముఖమున ఏ విషయమును పురస్కరించుకొని కవి ఆరాధ్యుడగునో వివరించెను,

**Aeschylus :** Tell me this, for what merits it is that a poet may claim admiration?

Aristophanes - The Frogs

**Euripides :** For the charm of his style, and because all the while he is schooling a whole population to be good men and true.

ప్లేటో మహాశయుడు కవులు ప్రజలను ఉన్మార్గములో పెట్టునని భయపడి రిపబ్లిక్ (Republic) రాజ్యములో కవులను దారుణముగ బహిష్కరించెను. "కవులు దేవతలవిషయమున అసత్యము పలికెదరు. కవిత్వము మనలోనున్న కామక్రోధాది భావములను ఉద్రేకింప చేయును. అవి కృశింపచేయతగినవే కాని పెంపొందింపదగినవి కావు; సన్మార్గమును కోరువ్యక్తి ఇట్టి భావములను అదుపులో పెట్టుకొనవలెను. ఇట్టి దుష్టభావము లుద్రేకింపచేయు కవులను పరిత్యజించవలెను.

"Poetry has the same effect on us when it represents sex and anger and other desires and feelings of pleasure and pain which normally accompany our actions. It feeds them when they ought to be starved and make them control us when we ought in the interests of our own welfare and happiness"

Plato - Republic -

ప్లేటో మహాశయుని ప్రియశిష్యుడైన అరిస్టాటిల్ [Aristotle] గురువు ప్రతిపాదించిన సిద్ధాంతమందలి లోపములను సవరించి ఆతని అభిప్రాయములో నిగూఢముగ దాగియున్న విశ్వశ్రేయఃకాంక్షను విశద మొనర్చెను.

లలితకళలయొక్క ప్రధానాశయము సహృదయుని మానసమున ఆనందపూర్వక చిత్త సంస్కారము గలిగించుటయే. గ్రీసు దేశీయుల ఉదాత్తభావనలో కవి అనితర సాధారణమైన స్థానము అలంకరించెను. శిల్పి, చిత్రలేఖకుడు మొదలైనవారిలో కవియొక్క స్థానము అద్వితీయమైనది. కవి అనగా ఒక మహాసంస్థ. విశ్వవిద్యాలయము.

కళ కేవలము మానవులకు పంచేంద్రియ తృప్తినొసంగుటతో పాటు అది సహృదయులపై కలిగించు చిత్తసంస్కారముపై దాని విజయము ఆధారపడినదని స్పష్టముగా మహాశయుడు నుడివెను.

" The work of Art is in its nature and appeal to the senses and imagination of the person to whom it is presented its perfection and success depend on a subjective impression.
(Aristotle's Poetics by S. H. Butcher The End of Fineart)

ఆ మహామనీషి ఆ ఆనందమునుకూడ నిర్వచించెను. కావ్యానందము లౌకికానందమువంటిది కాదు. అది అలౌకికమైన ఆనందము. పామరుడు పొందు క్షుద్రమైన ఆనందము కాదనియు, సహృదయుడు, పరిణతప్రజ్ఞుడు పొందు ఆనందమే ప్రమాణముగ స్వీకరించవలెనని నుడివెను.

"To the ideal spectator or listner who is a man of Education taste and represents an instructed public, Every Fine Art addresses itself, he may he called the rule and standard of that art,"
(Aristotle's Poetics Art - Page 209 and 213.)

అసలు ఉత్తమమానవుడుకాకుండా ఉత్తమకవి కానేరడు. గ్రీసు దేశములోని కవులు, కళాభిజ్ఞులు కళలసహాయమున గ్రీసు దేశములోని పౌరులను ఉత్తమపౌరులుగ తీర్చిదిద్దిన విషయము జగద్విదితము.

ఆంగ్లేయుల సాహిత్యమును, విమర్శను పరిశీలించినచో కవిత్వ ప్రధాన ప్రయోజనము ఆనందమే అని చెప్పు వర్గమొకటియు, ఆనందోపదేశములు రెండును ఉండవలెనని చెప్పు వర్గము మరొకటియు కలవని తెలియుచున్నది.

"కళ కళకొఱకే" పేటరు (Pater) ప్రభృతులు దీనికి ఎక్కువ ప్రాధాన్యము నొసంగిరి. "కవిత కవితకొరకే." అనునది వీరి ముఖ్య

Sir Philip Sidney's Defence of Poesy అను గ్రంథములో వేదాంతులు, శాస్త్రజ్ఞులు, చరిత్రజ్ఞులకంటె కవి ప్రజల నందరిని ఆకర్షించు విధమున ఉపదేశముచేసి ప్రజలను ఉత్తమమార్గ సంపన్నులుగ తీర్చిదిద్దునని తెలిపియున్నారు.

I say the philosopher teacheth, but he teacheth, but he teacheth obscurely, so as the learned only can understand him; that is to say, he teacheth them that are already taught· But the poet is the food for the tenderest stomachs; the poet is indeed the right popuiar philosopher.

Sir PhiliP Sidney - Defence of Poesy - Page 16

"Wordsworth" మహాకవి. సంఘములో కవియొక్క అనితర సాధారణమైన స్థానమును ప్రశంసించియున్నాడు. "కవి అనగా క్రాంతదర్శి." ప్రపంచములోని వివిధదేశములలో భౌగోళిక, శీతోష్ణ భాషాభేదము లున్నను, మానవాళి నంతను ఏకోన్ముఖముచేయు సువర్ణ సూత్రము కలిగినవాడే కవి. ప్రపంచములోని మానవులు ఏ మారుమూలలలో ఉన్నను మానవత్వమును జాగృతమొనర్చి సమైక్యపరచి సర్వమానవులను పూలబాటపై నడిపించు నాయకుడే మహాకవి.

Poetry looks before and after an upholder of Preserver carrying every where with him relationship and love. In spite of difference and soil anh climate of Language and manner of Laws and customs Poets binds together by Passion and knowledge of the vast Empire of human society as it is spread over the whole earth and over all time:

Prose Writings of Wordsworth

'Coleridge No man was ever yet a great poet without being at the same time a profound philosopher'

మహాకవి గొప్ప తత్త్వవేత్త కానివాడు కవి కాజాలడు అని తెలిపి యున్నాడు. తత్త్వము ముందు దాని నుండి ఉద్భవించు కవిత్వము తరువాత అని తెలిపియున్నాడు.

రొమాంటిక్ కవీశ్వరులలో అగ్రేసరుడైన షెల్లీ మహాకవి, కవియొక్క అత్యున్నతమైన స్థానమును తనగ్రంథమున బహుధా ప్రస్తుతించెను. కవులు ఎన్నుకొనబడని శాసనకర్తలు. ఉత్తమపురుషులైన కవీశ్వరులు కవితా తపస్సుచేసి రచించిన సద్భావరత్న గ్రథితమే కావ్యము. కవిత మానవునిహృదయమును విశాలమొనర్చి ప్రకృతి గతమైన ఆనందసీమలకు గొనిపోయి, అతని మానసమున అప్రయత్నముగ ఉదాత్తచిత్త సంస్కారము సమకూర్చునని తెలిపియున్నాడు.

Poets are unacknowledged legislators of the world. Poetry is the record of the best happiest moments of the happiest best minds.

An Introuduction to the study of literature - Page No. 93

ఆంగ్లేయ విమర్శకులలో ఋషితుల్యుడగు మాత్యూ ఆర్నాల్డు Matthew Arnold కావ్యమునకు సందేశమునకుగల సంబంధమును సోపపత్తికముగా నిరూపించియున్నాడు. మానవునిపై కావ్యము కలిగించు ప్రభావము ఇంతింత అనరానిది. మానవజీవితములో అత్యంత ప్రధానమైనది ధర్మము. కావ్యము అవశ్యముగ ధర్మబోధ చేయవలెను. నీతిని ఉల్లంఘించినకవిత మానవుని జీవితమును ఉల్లంఘించినట్టిదే. నైతికభావమును ఉపేక్షించిన కవిత మానవజీవితమును ఉల్లంఘించినట్లే.

కవితయనగా జీవితతత్త్వ వ్యాఖ్యానమే. కవియొక్క వైశిష్ట్యము జీవితమునకు సంబంధించిన సర్వవిషయములను తనశక్తిమంతమైన, సుందరమైన భావములతో మేళవించి జీవనము ఎట్లుసాగించవలెనో చెప్పు దానిపైననే ఆధారపడియున్నది. ఈ మహామహుడు

కావ్యమునకు ధర్మోపదేశమునకుకల సన్నిహితమైన సంబంధమును నొక్కి చెప్పియున్నాడు.

More and more mankind will discover that we have to turn to poetry to interpret life for us to console us to sustain us.
Poetry is at bottom a criticism of life; that the greatness of a poet lies in his powerful and beautiful application of a ideas to life, - to the question How to live.
A poetry of revolt against moral ideas is a poetry of revolt against life; a poetry of indifference towards moral ideas is a poetry of indifference towards life.
(The study of Poetry - Essays From Matthew Arnold · words - worth - 52-53)

Lowell మహాశయుడు ఇంకొక్క అడుగుముందునకువైచి జీవితతత్త్వమును బోధింపని కవితగాని, కవిపైగాని నాకు గౌరవభావము కలుగదని అని తెలిపియున్నాడు.

No poem ever makes me respect its author which does not in someway convey a truth of philosophy.
An introduction to the study of Literature

ఎమర్సను కవితయొక్క వైశిష్ట్యము సహృదయులపై కలిగించు చిత్తసంస్కారమును పురస్కరించుకొనయే నిర్ణయింపబడునని తెలిపియున్నాడు.

The Great poets are judged by the frame of mind they induce
The study of poetry.

ఈ మహానుభావులెల్లరు కావ్యమునకు నీతిబోధకుకల అవినాభావసంబంధమును తెలిపియున్నారు. ప్రాక్ప్రతీచి విద్వాంసుల అభిప్రాయములను పరిశీలించినచో ఈ క్రిందివిధముగా సిద్ధాంతము చేయ

వచ్చును. కావ్యరామణీయకమునకు భంగమురాని విధమున కావ్యములో ధర్మోపదేశము నిర్వహించవలెను. సూక్ష్మముగా పరిశీలించినచో ఆనందోపదేశములు రెండును ఒకనాణెముయొక్క రెండుభాగములని చెప్పవచ్చును. సంస్కృతాలంకారికులు ధ్వనిప్రధానమైన కావ్యమును ఉత్తమకావ్యమని నిర్దేశించియున్నారు. ధ్వనియనగా నేమి ? ధర్మమే ధ్వనింపవలెను.

కావ్యములు ప్రాచీనకాలమునుండియు విశ్వశ్రేయమునకు సాధనములుగ నున్నవి. కావ్యప్రయోజనములలో ఉపదేశము ఒకటి. దుర్నీతిబోధకములగు కావ్యములు కవులు వ్రాయకూడదు. అవిప్రజలు చదువకూడదు. కవికి సామాజిక బాధ్యతకలదు. కవులు ఉత్తమ ధర్మోపదేశాత్మకములైన కావ్యములు రచించి, పరోక్షముగ సంఘశ్రేయమునకు తోడ్పడవలెను. సత్కవులు కావ్యములందు నీతిధర్మములను సరసముగా చిత్రించి ప్రజలను ధర్మప్రవణ హృదయులుగా చేయుటయే కర్తవ్యము.

వేదకాలమునుండియు కవికి ఉత్తమోత్తమ స్థాన మొసంగబడినది. కవిశబ్దము ప్రథమముగా పరమాత్మపరముగ వాడబడినది. ఆ పదము క్రమక్రమముగ పరమాత్మ సాక్షాత్కారముపొందిన ఋషులకు వాడబడినది. సాక్షాద్ద్రష్టలైన వైదిక ఋషులు, కవులు. వారు రచించిన కావ్యములు ఉపనిషత్తులు. ఆద్యులగు వైదిక కవులును, లౌకికులగు వాల్మీకి వ్యాసాదులును ఋషులగుటచే దివ్యదృష్టితో లోకోత్తర వర్ణనాత్మకములైన రామాయణ భారతకావ్యములు రచించిరి. వేదములను దర్శించినవారు నిర్మించినవారు ఋషులగుటచేతను లౌకిక కావ్యములు రచించినవారుకూడ ఋషులగుటచేతను ఋషికాని వాడు కావ్యము రచింపజాలడు. దీనిని బట్టియే "నానృషిః కురుతే కావ్యమ్" అను సుభాషితము కలిగినది.

వాల్మీకిమహర్షి, వ్యాసమహర్షి, భారతీయులను ధర్మవీరులుగ తీర్చిదిద్దు జగద్ధిత కాంక్షతో, భారతీయ విజ్ఞానసర్వస్వములుగ రామాయణ భారతములను ప్రసాదించిరి. ఉదారచరిత్రులగు శ్రీరామ, ధర్మజాది పాత్రలనుసృజించి, చిత్రించి మానవులనునుగడలకు ఒజ్జబంతులుగా తీర్చిదిద్దిరి. ఈనాటికి శ్రీరాముడు, ధర్మరాజుడు, సీత, ద్రౌపది మొదలగువారే మానవాళికి మార్గదర్శకులు.

భారతార్ణవమును మథించి ఎందరో మహానుభావులు, రత్నములను వెరి ఆంధ్రభారతిని అలంకరించిరి. ఆంధ్రభారతములో ప్రపంచింపబడిన ఔపదేశిక ప్రతిపత్తి వివరించుటయే ఈ సిద్ధాంత నిబంధన ప్రధాన ధ్యేయము.

# ఆంధ్రభారతావతరణము

ప్రాచ్యపాశ్చాత్య దేశములలో సాహిత్యమునకు- సంఘమునకు గల అనుబంధము విషయములో చాల భేదము కలదు. పాశ్చాత్య దేశములందు సాహిత్యముపై సమాజముయొక్క ప్రభావమధికము కాగా ప్రాచ్యదేశములందు సమాజముపై సాహిత్యప్రభావ మతి మాత్రము.

మానవుని మనుగడల కొరవడి పెట్టగల, ఒద్దికలు దిద్దగల సర్వ జీవిత ధర్మములు. సర్వసారస్వత ధర్మములు ఏకత్ర రాశీభూతమైన మహేతిహాసము భారతము. "ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని" ఇత్యాదిపద్యములో దాని బహిరంతర బంధుర స్వరూపమాపోశనము పట్టిన మహామనీషి, బహుళాంధ్రోక్తిమయ ప్రపంచ పరమేష్ఠి నన్నయ భట్టారకుడు.

భారతీయ సంస్కృతి ప్రాణసారములు వేదములు. సర్వవేద సారమైన పంచమవేదమే మహాభారతము. వ్యాసమునీశ్వర ముఖ వినిస్సృతమైన ఆ ముహూర్తబలమెట్టిదియో కాని అవతరించిన నాటి నుండి తరతరాలుగ పారతంత్ర్యమునకు లోగిన భారతీయత, వెట్టి మొట్టి వాలకములు వేసినను, బహుభాషల బహువిధముల, బహుజనముల వలన బహుముఖీన వ్యాప్తినొంది నేటికి ప్రాణకళతో తొణికిసలాడు పరమోదాత్త గ్రంథముగ పరిగణింపబడుచున్నది.

ఆచార్య జోగారావుగారు ఆంధ్రభారత ఆవిర్భావమునుగూర్చి పలికిన పలుకులు ఉదాహరణార్హములు. ప్రపంచసాహిత్యమున నాన్యతోదర్శనీయమైన ఆ మహేతిహాసము మనదగుటయు, తదన్వర్థ సంజ్ఞమన దేశమున లభిన్నమగుట విశేషము. మఱియొక విశేషమేమనగా ఆ భారతీయసంస్కృతి ప్రతిష్ఠలో బంధురభాగస్వామ్యముగల ఆంధ్ర

భాషలో తొలుతగా అవతరించిన గ్రంథము భారతమగుట మరింత విశేషము. అందును సర్వసారస్వత ప్రపంచమునకు, ఛందోమయ భారతకిని జగదాద్యమైన వాల్మీకిరామాయణముండగా మన రాజరాజు మన శబ్దశాసనుడు ఆంధ్రజాతి సాహితీసర్గమునకు భారతరచనతో ప్రారంభ సంకల్పము చెప్పియుండుటకు దోహదము చేసిన రాజకీయము త, సారస్వత పరిస్థితులు అనుశీలనార్హములు.

రాజకీయ పరిస్థితులు :

చాళుక్యులకాలమున ఆంధ్ర దేశమునకు వేంగిదేశమని పేరు కలదు. పశ్చిమ చాళుక్యులలో ఒకశాఖయే తూర్పు చాళుక్యులు దానార్ణవుడు శ్రీ విష్ణువర్ధనమహారాజను పేరుతో వేంగి సింహాసన మధిష్టించెను. దానార్ణవుని పుత్రుడు శక్తివర్మ. శక్తివర్మ అనంతరము విమలాదిత్యుడు క్రీ. శ. 1011 లో చాళుక్య సింహాసనమధిరోహించి పాలించెను. చోళరాజరాజు తన పుత్రిక కుందవాంబను విమలాదిత్యున కిచ్చి పరిణయము చేసెను. మన రాజరాజనరేంద్రుడు ఆపుణ్యదంపతుల తనయుడు. రాజరాజనరేంద్రుడు క్రీ. శ. 1022 సంవత్సరమున పట్టాభి షిక్తుడయ్యెను, ఈ రాజన్యుడు ఎనిమిది సంవత్సరముల కాలమున సర్వ జనానురంజకముగ పాలించెను, అంతలో దురదృష్టవశమున సవతితమ్ము డైన విజయాదిత్యునివలన, చుట్టుపట్లనున్న శత్రుకృత విప్లవమువలన రాజరాజనరేంద్రుడు సింహాసన భ్రష్టుడయ్యెను.

రాజరాజనరేంద్రుడు సింహాసనమున పునఃప్రతిష్ఠితుడైన కొలది కాలముననే క్రీ. శ. 1042 లో పశ్చిమ చాళుక్యసార్వభౌముడయిన రెండవ జయసింహుడు, తరువాత రెండు సంవత్సరముల కాలమునకు చోళ చక్రవర్తియగు రాజేంద్ర చోళుడు స్వర్గమలంకరించిరి. రాజాధి రాజు చోళసామ్రాజ్యమునకు, త్రైలోక్యమల్ల అహవమల్ల సోమేశ్వ రుడు కర్ణాటకరాజ్యమునకు ప్రభువులైరి. తిరిగి కర్ణాటక చోళవంశముల

మధ్య వైరాగ్ని ప్రజ్వరిల్లినది. రాజేంద్రచోళుని అనంతరము వేంగి రాజ్యమును కళింగమునందలి కొంతభాగమును కోల్పోయిరనియు, అవి పశ్చిమచాళుక్యుల చేతులలో చిక్కినవనియు పశ్చిమ చాళుక్యుల శాసనములవలన తెలియుచున్నది.

పశ్చిమ చాళుక్యులు వేంగి నాక్రమించుటకు వచ్చిన ప్రతి పర్యాయము రాజరాజనరేంద్రుడు గత్యంతరము లేక చోళుల ఆశ్రయించుట కర్తవ్యమైనది. తుదకు చోళులు వేంగిని పశ్చిమ చాళుక్యుల బారినుండి రక్షింపగలరను ఆశాతంతువు తెగిపోయినది. చోళుల నాశ్రయించుటవలనగాని, పశ్చిమ చాళుక్యులతో తెగించి యుద్ధముచేసినను తనకెంతమాత్రము లాభములేదని ఉన్న స్వల్పరాజ్యము పోగొట్టుకోనకుండ పశ్చిమ చాళుక్యప్రభువైన ఆహవమల్ల సోమేశ్వరునితో సంధి చేసికొనుటకు రాజరాజు నిశ్చయించెను. ఈసంధి రాజరాజనరేంద్రుడు రాజకీయ సుస్థిరత్వము పొందుటకు ఉపయుక్తమైనది. రాజరాజునకు ఆహవమల్లునకు మైత్రి వెలసెనని చెప్పుటకు రెండు నిదర్శనములు గోచరించుచున్నవి.

అహవమల్లుని ప్రధానులలో నొకడైన నన్నయకు సహాధ్యాయుడును, మహాపండితుడును, అష్టభాషా విశారదుడును కవిశేఖరుడును అయిన నారాయణభట్టు వేంగిదేశమునకు ప్రతినిధిగా పంపబడెను. నారాయణభట్టు మహాభారతాంధ్రీకరణము చేయుటలో నన్నయకు తోడ్పడినట్లు భారతావతారికవలన తెలియుచున్నది.

> "పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నా
> రాయణునట్లు వాసిగ ధరామరవంశ విభూషణుండు నా
> రాయణభట్టు వాఙ్మయధురంధరుడుం దనకిష్టుడున్ సహా
> ధ్యాయుడు నైనవాడభిమతస్థితిఁ దోడయి నిర్వహింపగాన్."

ఆది - అవతారిక - 25

రాజరాజనరేంద్రునకు సోమేశ్వరునకు సంధిప్రయత్నములో నారాయణభట్టు కూడ సాహాయ్యమొనరించియుండును. నందమపూడి శాసనములో నన్నయ, నారాయణభట్టును "జగదుపకరణః" అని ప్రశంసించెను. నారాయణభట్టు రాజకీయముగ కూడ ఉపకారము చేసి యుండునని చెప్పుటలో సందేహము లేదు. నారాయణభట్టు రాజకీయముగ సారస్వతపరముగ చేసిన ఉపకారములకు కృతజ్ఞతా సూచకముగ క్రీ. శ. 1051-52 లో రాజరాజనరేంద్రుడు నారాయణభట్టునకు నందమపూడి గ్రామమును దానము చేసినట్లు శాసనము కలదు. రాజరాజనరేంద్రుడు పశ్చిమచాళుక్య సార్వభౌమత్వమును అంగీకరించిన దానికి చిహ్నముగ రాజరాజు "సత్యాశ్రయ" అను బిరుదును ధరించియుండునని శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు చెప్పుట సమంజసము.

నన్నయ ఆదిపర్వ చతుర్థాశ్వాసములో రాజరాజనరేంద్రుని సత్యాశ్రయ కులశేఖరుడనియు, సమస్త భువనాశ్రయ కులశేఖరుడనియు ప్రశంసించెను.

"సత్యాశ్రయ కులశేఖర, సమస్తభువనాశ్రయ ధర్మధురంధరా

ఆది - చతుర్థ - 274

ఆది - చతుర్థ - 274

రాజరాజు మండతామ్రశాసనమున ప్రతిగ్రహీతయైన "అంకయ సమస్తభువనాశ్రయ బ్రహ్మమహారాజని పేర్కొనబడియున్నాడు. ఈ బిరుదు తూర్పుచాళుక్యుల శాసనములలో చాల తక్కువ కనిపించుచున్నది. పశ్చిమ చాళుక్యుల శాసనములలో ప్రాచుర్యము వహించి యున్నది. ఈ రెండు ఆధారములను పురస్కరించుకొని రాజరాజు పశ్చిమ చాళుక్య సోమేశ్వరుని సార్వభౌమత్వము అంగీకరించెనని చెప్పనగును.

మాళవాధీశుడైన భోజుడు క్రీ.శ. 1010ని పట్టాభిషిక్తుడై 1063 వరకు పాలించెను. రాజరాజనరేంద్రుడు వేంగి సింహాసనమునకు వచ్చుటకు 12 సంవత్సరములకు పూర్వము భోజుడు మాళవరాజ్యాధిపతి అయ్యెను. అందుచే ఈభోజుడు మన రాజరాజేంద్రుని సమకాలికుడని నిస్సందేహముగ చెప్పవచ్చును. రాజరాజనరేంద్రుడు తన జీవిత కాలములో పాండవులు కౌరవులచే దాయ విభాగవిషయములో పీడింప బడినట్లు తమ్ముడైన విజయాదిత్యునితో సామ్రాజ్యకాంక్ష ప్రబలిన పశ్చిమ చాళుక్యులతో నిరంతరము పోరాడవలసివచ్చినది. తత్కారణ ముగ వేంగిరాజ్యము యుద్ధరంగముగ మారినది.

అస్మద్గురుదేవులు శ్రీ ఆచార్యదివాకర్ల వేంకటావధానిగారు తమ సిద్ధాంతగ్రంథములో నన్నయమహాకవికి భారతాంధ్రీకరణము చేయుటలో తోడ్పడిన రాజకీయ, మత, సారస్వత పరిస్థితు లనుకూ లంకషముగ చర్చించియున్నారు.

## మతపరిస్థితులు

గౌతమబుద్ధు డవతరించుటకుపూర్వము ఆంధ్రదేశములో వేదము, కర్మకలాపములు ప్రాధాన్యమువహించెను. ఆంధ్ర శాతవాహనుల కాలమున బౌద్ధమతము మహాభ్యుదయము పొందినది. ఈ కాలమున శాతవాహనులు, ఇక్ష్వాకులు, విష్ణుకుండినులు, గుప్తులు, అశ్వమేధయాగాదులను చేసినట్లు చరిత్ర చెప్పుచున్నది. క్రీ. పూ. 300 నుండి క్రీ.శ. 300 వరకు ఆరుశతాబ్దములకాలము రాజాదరముచే బౌద్ధమతము మూడు పూవులు ఆరు కాయలు కాసినది. కాలక్రమమున బౌద్ధమున చీలికలువచ్చి పతనము ప్రారంభమయినది. బౌద్ధభిక్షువులు

నైతిక పతనము పొందుటచే ప్రజలకు బౌద్ధముపై ఆదరము సన్నగిల్లి నది. ఈవిషయము క్రీ. శ. 7వ శతాబ్దిలో హ్యూయాన్‌త్సాంగు భారత దేశమును దర్శించి బౌద్ధమత క్షైణ్యమును తెలిపెను.

బౌద్ధమతము అభివృద్ధిపొందుటతో, వైదిక మతానుయా యులు తమలోని లోపములను పునర్విచారణము చేయ మొదలు పెట్టిరి. అట్టి యత్నముచేసిన మొట్టమొదటి మహానుభావుడు జైమిని మహర్షి. అతడు మీమాంస నియమములకు ఒక పద్ధతిని కల్పించి సూత్రములను రచించి వేదములందలి ప్రత్యంశమును సమర్థించెను. దీనికి క్రీ. పూ. ప్రథమశతాబ్దికి చెందిన శబరస్వామి భాష్యము రచిం చెను. క్రీ. శ. 7వ శతాబ్దిలోనున్న కుమారిలభట్టు వేదప్రామాణ్య మును పురోహితుల ఆధిపత్యమును అంగీకరించి సూత్ర భాష్యములు రెండింటికి వ్యాఖ్య రచించెను. అతని తరువాత కుమారిలభట్టు అను చరుడైన మండనమిశ్రుడు విధివివేకము, మీమాంసానుక్రమణిక అను గ్రంథములను రచించెను. క్రీ. శ. 850 నాటి వాడగు వాచస్పతి విధి వివేకములోని భావములను న్యాయకణిక అను గ్రంథముగా వెలయిం చెను. ప్రభాకరుడు శబరస్వామి భాష్యము ననుసరించి బృహతి అను వ్యాఖ్య రచించెను. కుమారిలభట్టు శంకరాచార్యుని కించుక పూర్వుడని తెలియుచున్నది. అతడు మహామేధావి. కుమారిలభట్టు వేదవేదాంగములను జైమినిసూత్రములను తద్భాష్యమును అమూలా గ్రముగ ఆ మహాచార్యులదగ్గర అధ్యయనముచేసి బౌద్ధమును ఖండిం చెను. కుమారిలభట్టు అనుసరించిన విధానము కర్మాచరణమువలననే మోక్షము సిద్ధించునను సూత్రములు ప్రచారముచేయగా ఆంధ్రులపై అధిక ప్రభావము కలిగించెను. కుమారిలుడు ఆంధ్రుడగుట మరింత విశేషము. ఈతని సిద్ధాంతములు ఆంధ్రుల కెక్కువ ఆప్యాయకరము

లయ్యెను. ఈతని తరువాత శంకరభగవత్పాదులు ఉదయించి కర్మ జ్ఞానములకు చక్కనిసమన్వయముచేసి చూపిరి. ఈవిధముగ భట్టపాదుని యొక్కయు, ఆచార్యస్వాములయొక్కయు, ప్రచారముచే బౌద్ధమతము వెనుకబడి వైదికమతము పూర్వౌన్నత్యము పొంద నారంభించినది. చాళుక్యరాజులపాలనములో హిందూమతముపునరుద్ధరింపబడినది. ఆరాజు లందరు మొట్టమొదటినుండి వైదిక కర్మలను, వేదవిప్రులను పోషించిరి. ఒక్క విమలాదిత్యుడు మాత్రము అంత్యదశలో జైన శ్రావకు డయ్యెను. చాళుక్యుల శాసనములన్నియు వారి వైదికమతాభిమాన మును వేనోళ్ళ చాటుచున్నవి. రాజరాజనరేంద్రునకు వైదిక మతము నందు అనితరసాధారణమైన భక్తివిశ్వాసములు కలవు.

## సారస్వత పరిస్థితులు :-

నన్నయమహాకవికి, రాజరాజనరేంద్రునకు మాతృభాషయెడను పంచమ వేదమైన భారతమునెడను, మహాభక్తిప్రపత్తులున్నవి. ఆనాటి పరిస్థితులు భారతాభిమానము పెంపొందించుటకు తోడ్పడినవి.

క్రీ. శ. 11వ శతాబ్దములో భారత దేశమునకు స్వర్ణయుగమని చెప్పనగును. యావద్భారతదేశమునకు మహాభారతముపై అమితమైన శ్రద్ధాభక్తులేర్పడుట శుభసూచన ఉత్తరమునయున్న కాశ్మీరు మహాకవియైన క్షేమేంద్రుడు క్రీ. శ 1050లో భారతమును భారతమంజరి అనుపేర సంగ్రహించెను. క్రీ. శ. 11వ శతాబ్దారంభమున జావా ద్వీపపు పండితులు సంస్కృతభారతమును తమ "కవి" భాషలోనికి అనువదించుకొనిరి. డా హెచ్, హెచ్. జె. బోల్ అనుపండితుడు జావా భారతప్రతిని రోమనులిపిలో పరిష్కరించి డచ్చిభాషలోనికి అనువదించెను.

క్రీ శ. 1010 నుండి 1063 వరకు మాళవరాజ్యమును పాలించిన భోజమహారాజు స్వయముగా కవి, అనేకకవులను పోషించిన రాజేం

ద్రుడు ఆ రాజకవి రామాయణ భారతముల ప్రతులు వ్రాయించి భద్రపరచియుండును. నన్నయగారు రాజరాజనరేంద్రుని పనుపున భోజరాజు ఆస్థానమునకు వెడలి కొన్ని సంస్కృత భారతప్రతులను తెచ్చుకొని పరిశీలించియుండును.

రాజరాజునకు భారతముపై భక్తిప్రపత్తులేర్పడుటకు బలవత్తరమైన కారణములున్నవి. రాజరాజునకు చోళులకు చిరకాలమునుండి సంబంధబాంధవ్యములున్నవి. క్రీ. శ. 7, 8 శతాబ్దులలోనే 'పెరుందేవనార్' అను కవి తమిళమున భారతమును రచించెను. రాజరాజనరేంద్రుడు చోళదేశమునకు వెడలినపుడు తమిళభారతమును వినియుండును. నన్నయ చోళుని కొలువునుండికూడ భారతప్రతులను సంపాదించి యుండును. పల్లవుల కాలమునుండియు దక్షిణదేశమున దేవాలయములందు భారతము పురాణము చెప్పించు సంప్రదాయమున్నట్లు, పురాణము చదివినవారికి, ఊరిలో ప్రత్యేకించి ఇచ్చిన భాగమును తమిళ శాసనములు తెలుపుచున్నవి.

తూర్పు చాళుక్యులకు జ్ఞాతులు పశ్చిమచాళుక్యులు. వారును భారతాభిమానులే. వేంగి దేశమునుండి కన్నడదేశమునకు వలసపోయిన మహాకవి 'పంపడు' ఇతడు క్రీ. శ. 941లో అరికేసరి అనురాజునకు అంకితముగ కన్నడమున భారతమును రచించెను. పంపమహాకవి అరికేసరి పరాక్రమాదిగుణములను వర్ణించుట కనుగుణముగ కథనుమార్చి అర్జునునికి, అరికేసరికి అభేదముసాధించెను. పంపడు జైనమతాభిమాని అగుటచే తన అభీష్టానుగుణముగ మార్పులు చేసెను.

కన్నడ రత్నత్రయములో మూడవవాడగు 'రన్న' గదాయుద్ధము, లేక సాహసభీమ విజయము అను మహాకావ్యము రచియించి, పశ్చిమ చాళుక్యచక్రవర్తియైన సత్యాశ్రయునికి క్రీ. శ. 997-1008లో అంకితమిచ్చెను. ఇందుభీమున కధిక ప్రాధాన్య మొసంగబడినది.

ఈ విధముగ తనకాలములో నుండిన ఇతర రాజులు భారతమును ఆయా దేశభాషలలోనికి వెలయించుట చూచి, రాజరాజ నరేంద్రుడు తన దేశభాషయైన తెనుగున కూడ భారతము వెలయింప చేయవలెనను అభిలాష ప్రకటించుటలో ఆశ్చర్య మేమున్నది ? తమిళ కన్నడ భాషలలో వచ్చిన భారతము అసమగ్రముగ నుండుటచేతను వ్యాసాభిప్రాయమును చక్కగ తెలియచేయ లేకపోయినదని రాజరాజ నరేంద్రుడు గుర్తించెను. అతనికాలములో జైనము ప్రచారముచేయుచు ఆ మతానుయాయులు ప్రజలను ఆకర్షించుటకు అతిలోక మహిమలను ప్రకటించుచుండిరి. రాజరాజు తన తండ్రి తన కన్నులయెదుటనే జైన శ్రావకుడు అగుటచూచి యెంతయో మానసికవేదన పొందియుండెను. అందుచే వైదిక మతమును సామాన్య జనులకు సులభముగ సుబోధమొనరించుట అత్యవసరము. సంస్కృతభారతము సామాన్యులకు దురవగాహమైయున్నది. సంస్కృతభారతము దేశభాషయైన తెలుగులో రసవంతముగా చెప్పించినచో ఆంధ్రులు ధర్మవీరులగుదురని, రాజరాజనరేంద్రుడు నన్నయను వ్యాసభారతమును ఆంధ్రీకరింపుమని కోరియుండును.

అవతారికలో చెప్పిన పద్యములు అనుశీలనము చేసినచో రాజరాజునకు భారతాంధ్రీకరణము చేయించుటలో ఏ పరమాశయము కలదో తేటతెల్లమగును. "రాజరాజనరేంద్రుడు పురాణములు విన్నను అర్థధర్మశాస్త్రములను అనేకములను అనుశీలించినను, ఉదాత్త రసాన్విత కావ్యనాటకములు చూచినను మహాభారతమునందు అభిప్రాయము పెద్దయై యున్నదని తెలిపినాడు.

"ఇవి యేనున్ సతతంబు నామెడ గరం బిష్టంబులై యుండుఁబా
యవు భూదేవకులాభితర్పణమహీయః ప్రీతియున్ భారత
శ్రవణాసక్తియుఁ బార్వతీపతిపదాబ్జధ్యానపూజామహో

త్సవమున్ సంతతదానశీలతయు శశ్వాత్సాధుసాంగత్యమున్."

"హిమకరుఁ దొట్టి పూరుభరతేశకురుప్రభుపాండుభూపతుల్
క్రమమున వంశకర్త లనగా మహిఁబొప్పిన యస్మదీయవం
శమునఁ బ్రసిద్ధులై విమలసద్గుణశోభితులైన పాండవో
త్తముల చరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్టమెంతయున్."

"అమలసువర్ణశృంగఖురమై కపిలంబగు గోశతంబు ను
త్తమబహువేదవిప్రులకు దానముసేసిన తత్ఫలంబు త
థ్యమ సమకూరు భారతకథా శ్రవణాభిరతిన్ మదీయచి
త్తము ననిశంబు భారతకథాశ్రవణప్రవణంబ కావునన్."

(ఆదిపర్వము- ప్రథమ 12,14,15)

దీనివలన రాజరాజనరేంద్రునకు భారతకథాశ్రవణమున అధికాసక్తి కలదనియు అతనివంశమున సర్వసద్గుణశోభితులైన పాండవుల చరిత్ర వినకుతూహలము కలిగినదనియు భారతశ్రవణము కపిలగోశత దానములు చేయుటవలన కలుగు ఫలమును నొసంగజాలునవియు విశ్వసించెను. పరమేశ్వరసంకల్పానుగుణముగ కులబ్రాహ్మణు, అనరక్తు అవిరళ జపహోమతత్పరు, విపులశబ్దశాసను,సంహితాభ్యాసు, బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాననిరతు, పాత్రు, ఆపస్తంబ సూత్రు, ముద్గల గోత్రజాతు, సద్వినుతావదాతచరితు, లోకజ్ఞు, నుభయభాషాకావ్య రచనాభిశోభితు, సత్ప్రతిభాభియోగ్యు, నిత్య సత్యవచను,మత్య మహాధిపాచార్య్య సుజనుడగు నన్నపార్యు నర్థించెను. ఆంధ్రుల పుణ్యవిశేషమున నన్నయగారు విశ్వశ్రేయఃకాంక్షతో భారతాంధ్రీకరణమునకు శ్రీకారము చుట్టిరి.

తిక్కనమహాకవి

నన్నయ ఆరంభించిన భారతాంధ్రీకరణము రెండు శతాబ్దముల కాలము ఆగిపోయినది. దీనికి ఆనాటిపరిస్థితులే కారణము. నన్నయ్య ఆది, సభా, అరణ్యపర్వములలో సగభాగము వరకే ఆంధ్రీకరించెను.

## రాజకీయ పరిస్థితులు

రాజరాజనరేంద్రుని తరువాత కులోత్తుంగ చోళదేవుడు రాజ్యమునకు వచ్చెను. అతడు మేనమామలయిన చోళులరాజ్యమును పొంది వేంగిరాజ్యమును ప్రతినిధులకు అప్పగించి పరిపాలింపజేసెను. కులోత్తుంగ చోళదేవునిపుత్రులు, రాజప్రతినిధులు బలహీనులగుటచే, చాళుక్య సేనాపతులలో నొకడైన గొంకరాజు అనెడి మహావీరుడు చాళుక్య సామంతరాజుగా ధనదపురము అను నామాంతరముగల చందవోలును రాజధానిగా చేసికొని చాళుక్యరాజ్యమును పాలింప సాగెను. రాజరాజనరేంద్రుడు పెక్కు పాట్లుపడి రాజ్యస్థిరత్వము కలిగింపగా సామంతుల అసూయా ద్వేషమువలన చాళుక్యరాజ్యము ముక్కచెక్కలయ్యెను. ఒకప్పుడు చాళుక్యులకు సామంతులయిన కాకతీయులు స్వాతంత్ర్యమును ప్రకటించుకొనిరి. ఉత్తరభారతము మహమ్మదీయ దండయాత్రలకు లోనయినది. మహమ్మదీయ సంస్కృతి ఉత్తర భారతముపై అధికప్రభావము కలిగించినది. దాని మూలముగ మత సాహిత్య రంగములలో మార్పులు తెచ్చినది. గజనీమహమ్మదు, ఘోరీమహమ్మదు దండయాత్రలు శరపరంపరలుగ భారతదేశముపై చేసినారు. దక్షిణభారతముపై మహమ్మదీయులు దండయాత్రలు సాగించుటకు కాలుదువ్వుచుండిరి. అందుచే దక్షిణభారతములోని వీరులెల్లరు కాపయనాయకుని నాయకత్వమున సమైక్యముగ నిలబడి మహమ్మదీయుల దండయాత్రలను ఎదుర్కొనుటకు వీరరసావేశము పొంది, సింహకిశోరములవలె ముందునకు దుమికిరి.

ఈ కాలములో తెలుగుదేశమున అవైదికములయిన బౌద్ధ, జైనముల తిరస్కరించు భారతీయులందరిని ఒక్క త్రాటిపై నడిపించుటకు ఒక మతము అవసరమైనది. అదియే వీరశైవముగా పుట్టినది. శివుడు తప్ప వేఱు దేవుడు లేడు. ఈ వీరశైవులు దక్షిణభారతముపై

తురుష్కుల దండయాత్ర జరుగకుండ ఎదురొడ్డి నిలిచిరి. వీరు ఆనాడు ఆర్థిక, రాజకీయ, మత, సాంస్కృతికరంగములలో విప్లవము నెలకొల్పిరి. వీరిప్రభావము సాహిత్యముపై కూడ మిక్కుటముగ పడినది. ఈ వీరశైవము ప్రతిపాదించిన మహాకవులు నన్నెచోడుడు, పండితారాధ్యుడు, పాల్కురికిసోమనాథుడు మొదలైనవారు. వీరశైవమునకు పట్టుగొమ్మ కన్నడదేశము. వీరశైవమునకు ప్రధానపురుషుడు బసవేశ్వరుడు. ఈ కాలములో పరిస్థితులు ప్రజలు భారతమునుచదువుటకు, ఆదరించుటకు అనుకూలముగ లేవు. మహమ్మదీయ వెల్లువకు ఆనకట్ట కట్టుటయే అప్పటి భారతీయుల తక్షణకర్తవ్యమై యున్నది. అందుచేత సర్వజనుల సర్వశక్తులు దీనికొఱకే వినియోగింపబడినవి.

శివకవులు లౌకికలోకమున బ్రహ్మాండమైన విప్లవము లేవదీసినట్లే సాహిత్యరంగమునకూడ విప్లవము ప్రజ్వలింపచేసిరి. ఈ కాలములో శైవమతమును ప్రచారముచేయుటకు సాహిత్యమును సాధనముగ చేసికొనిరి. ఈ శైవకవులు పరోక్షముగ నన్నయను విమర్శించిరి. 1. భాష, ఛందస్సు, కథ దేశీయముగా నుండవలెను. 2 ఉరుతర గద్య పద్యోక్తులకంటె సరసమై పరగిన జాను తెలుగు చర్చింపగా సర్వసామాన్యము. 3. తెనుగుభాషను శాసించుటకు అధికారము సంస్కృత వ్యాకరణములకు లేదు. 4. బ్రాహ్మణాధిక్యము పనికిరాదు.

నెల్లూరు తెలుగుచోడులలో ప్రసిద్ధికెక్కినవాడు మనుమసిద్ధి తండ్రి తిక్కరాజు. ఇతడు శత్రుభయంకరుడై రాజ్యమేలినట్లు తెలియుచున్నది. పదభ్రష్టులైనవారికి సాయముచేయు సాధుశీలుడు. ఈ తెలుగుచోడులు చిరకాలమునుండియు కాకతీయులకు సామంతులుగా నుండిరి. సరిగా ఈ కాలములోనే గణపతిదేవచక్రవర్తి ఆంధ్రసామ్రాజ్యమును ఏకచ్ఛత్రముగ పాలించుచుండెను. ఇతడు సింహాసనము అధిష్ఠించుటకు పూర్వము ఆంధ్రదేశము చిన్నచిన్న మండలములుగా విడిపోయి పర

స్పరము తగువులాడుకొనుచు అదనుచిక్కినపుడు స్వాతంత్ర్యము ప్రకటించుకొనుచుండిరి. కాకతీయులకు దక్షిణమున పాండ్యులు, పడమట యాదవులు, ఉత్తరమున ఉత్కళులు, పక్కలో బల్లెమువలెనుండి నిరంతరము కాకతీయులపై కారములు మిరియములు నూరుచుండిరి. ఇట్టి క్లిష్టపరిస్థితిలో గణపతిదేవచక్రవర్తి రాజనీతితో గడిదేశములను దుర్గములను గట్టిపరచి సామంతులకు విశ్వాసపాత్రుడై ఆంధ్రమహాసామ్రాజ్యమును సురక్షితముగా ఆంధ్రప్రజల జీవికకు సౌఖ్యము నొనగూర్చుటకు నిరంతరము కృషిచేయుచుండెను. ఆ మహాప్రయత్నమున అండదండగా నున్నవాడు నెల్లూరులోని తిక్కభూపతి. ఈతడు నెల్లూరిపై దండెత్తివచ్చిన పాండ్యుని రెండుసార్లు ఓడించెను. మూడవసారి దురదృష్టవశమున వీరమరణము పొందెను. తిక్కనృపతి అనంతరము మనుమసిద్ధి కాకతీయుల సాయముతో బహుశః క్రి. శ. 1250 - 1259 ప్రాంతమున నెల్లూరు సింహాసన మధిష్ఠించెను.

తిక్కన మంత్రియై మనుమసిద్ధి ఆస్థానమున విశిష్ట స్థానమలంకరించి యున్నాడు. మనుమసిద్ధి జ్ఞాతులైన అక్కన్న బయ్యన్నలవలన రాజ్యభ్రష్టుడయ్యెను. తిక్కనామాత్యుడు తనయేలికకు కలిగిన ఆపదను నివారించుటకు రాయబారియై కాకతీయ గణపతిదేవచక్రవర్తి ఆస్థానమునకు వెడలి భారతము ఉపన్యసించి గణపతిదేవుని సాయమున మనుమసిద్ధిని రాజ్యమున పునఃప్రతిష్ఠితుని చేసినట్లు "కాసె సర్వప్ప రచించిన సిద్ధేశ్వర చరిత్రము," "కూచిమంచి జగ్గకవి రచించిన సోమదేవరాజీయము" తెలుపుచున్నవి. తిక్కన పెదతండ్రి సిద్ధన. తిక్కరాజు కాలములో ఇతడు ఉన్నతోద్యోగము వహించియుండెను. సిద్ధన కుమారుడే ఖడ్గతిక్కన. ఖడ్గతిక్కన బ్రహ్మనరుద్రయ్యతో భీకరసమరము చేసినట్లు "కాటమరాజు కథ" తెలుపుచున్నది. తిక్కనార్యుడు కేవలము మంత్రియేకాక దండనాథుడు. వీరులవంశమునకు చెందినవాడని తెలియుచున్నది.

తిక్కన బహుముఖ ప్రజ్ఞావంతుడు. ఆ మహామంత్రి చరిత్రలో ఎంత ప్రసిద్ధివహించెనో వాఙ్మయమున అంత ప్రసిద్ధివహించుట విశేషము. తిక్కనగృహము గురుపీఠముగ వాసికెక్కినది. ఆ కాలములోనున్న కేతన, బయ్యన, మొదలైనవారు ఆ మహామంత్రికి మిత్రులై కావ్యములు రచించి ప్రేమతో అంకితమొసంగిరి. సచివులు, మంత్రాలోచనమునకై అతనిని ఆశ్రయించుచుండిరి. పండితశ్రేష్ఠులు తిక్కనార్యుని సమక్షమున ధర్మతత్త్వమునుగూర్చి చర్చించి సిద్ధాంతము చేయుచుండిరి. ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు అన్నట్లు తిక్కనయే స్వయముగా విద్యాసంస్థ.

ధర్మప్రబోధమునకు సాహిత్యమే చక్కనిసాధనము. సరససాహిత్యముఖమున ధర్మతత్త్వ విశేషములను ప్రజలకందించుట ప్రాచీనమైన లోకాచారము. అట్టి ఉత్తమసాహిత్యసృష్టి రాజులు, మంత్రులు, ఉత్తమాధికారులు, ప్రోత్సహింపవలయును. ఆ మహోద్యమమునకే తిక్కన నాయకత్వము వహించుట స్తుత్యమైయున్నది. తిక్కనార్యుని వైభవము, వ్యవహారదక్షత్వము, కర్మపరత్వము, ఔదార్యము, కవిపండితపోషణము, కేతన తన దశకుమార చరిత్రమున సహస్రముఖముల ప్రస్తుతించియున్నాడు.

భారతరచనాకాలమున తిక్కనసోమయాజియై హరిహర నాథోపాసకుడై పరిణతిపొందెను. యజ్ఞముచేసి సోమయాజియై కర్మజ్ఞాన సమన్వయముచేసి బ్రహ్మణ్యుడై విరాజిల్లెను. నిర్వచనోత్తర రామాయణమున "అమహోదాత్త మనీష నేనుభయ కావ్యప్రౌఢి బాటించు శిల్పమునన్ బారగుడ" అని చెప్పుకొన్న తిక్కనార్యుడు భారతము రచించి వినమ్రుడై "నానేర్చిన భంగిచెప్పి వరణీయుడ నయ్యెద భక్తకోటికిన్" అని పలికెను. కవియొక్క అంతరంగమున ఇట్టిమహత్తర శుభపరిణామము ఏర్పడుట శుభసూచన.

తిక్కనార్యుడు హరిహరనాథోపాసకుడగుటకు ఆనాటి పరిస్థితులే దోహదము చేసినవి. గజనీమహమ్మదు రాజరాజనరేంద్రుడు పట్టాభిషిక్తుడైన నాలుగు సంవత్సరములకు ఉత్తరభారతముపై క్రీ.శ. 1026, సంవత్సరమున జనవరిలో సోమనాథదేవాలయమును కొల్లగొట్టి సువర్ణ మణి రత్నరాసులను దోచుకొనెను. క్రీ.శ. 1192లో ఘోరీమహమ్మదు స్థానేశ్వరయుద్ధమున పృథ్వీరాజును జయించెను. క్రీ.శ. 1197లో అతని సేనాధిపతి విశ్వవిఖ్యాతిబడసిన "నలందా విశ్వవిద్యాలయములోని రత్నోదధి, రత్నగర్భ అను పుస్తకభాండాగారములను నాశన మొనర్చెను." ఈ మహమ్మదీయుల దండయాత్ర ప్రభావము భారతదేశములోని మత సాంఘిక సాహిత్యరంగములపై విప్లవము ప్రజ్వరిల్లచేసెను. ఉత్తరాపథముదాటి దక్షిణాపథమునకూడ ఇస్లాముసంస్కృతి తురుష్కదండయాత్ర ముంచివేయకుండా అడ్డవలసిన ఆవశ్యకము ఏర్పడెను.

ఆనాడు హిందూసమాజము కులభేదములతో బహుదేవతోపాసనములతో బరస్పరవిద్వేషములతో క్రుళ్ళినది. ఇట్టి క్లిష్టపరిస్థితిలో వీరశైవులుప్రబలి ఏకేశ్వరోపాసన ప్రతిపాదించి కులభేదములకు స్వస్తి చెప్పిరి. శివుడు విశ్వపిత, శివభక్తులందరు సోదరులే అని ప్రబోధించిరి ముస్లిము సంస్కృతిని వింధ్యపర్వత పంక్తులను దాటకుండ త్రిశూల ఖడ్గధారులై ప్రతిఘటించిన ధీరులు వీరశైవులు.

వీరశైవులు సాంఘిక, రాజకీయ, వాఙ్మయరంగములలో మహోద్యమము సాగించిరి. అందుచే తమ సిద్ధాంతములకు వ్యతిరేకమైన నన్నయభారతమును ఎవ్వరును స్పృశింపలేదు. సరికదా దానిని తిరస్కరించిరి. శివకవులకు బ్రాహ్మణ పారమ్యము, సంస్కృతాధిక్యము, వర్ణాశ్రమ ధర్మము, వైదికసంస్కృతి అంగీకారయోగ్యము కాకపోయెను. శివకవులు నన్నయపాటించిన ఆరూఢసంస్కృత భూయిష్ఠ రచనను ఏవగించుకొనిరి. అప్పుడు కావలసినది వీరశైవ ప్రబోధముకాని భారతాం

ధ్రువీకరణము కాదు. ఇది ఈ విధముగా నుండగా వీరశైవులు ప్రతిపా దించిన వీరావేశమును వైష్ణవులు ప్రతిఘటించిరి. దక్షిణభారతమున శైవులు, వైష్ణవులు, మతములపేరిట కత్తులు నరకుకొనుటకు ఒడి గట్టిరి. జాతీయశక్తి అంతఃకలహములతో అన్యోన్య మారణోద్యమ ముగ మారసాగినది. తిక్కనార్యుడు ఇది చూచి అశ్రుసిక్తనయను డయ్యెను. నిర్మాణాత్మకమైన కృషి సలుపవలసిన మహాశక్తి వ్యర్థమై పోవుటచూచి మిగుల ఆవేదనము పొందినాడు. ఆంధ్రావళినుద్ధరించు టకై తిక్కనార్యుడు హరిహరనాథతత్త్వమును ప్రతిపాదించెను.

"శ్రీ యన గౌరి నాఁబరగు చెల్వకుఁ జిత్తము పల్లవింప, భ
ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపము దాల్చి 'విష్ణురూ
పాయ నమశ్శివాయ' యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చు పరతత్త్వముఁగొల్చెద నిష్టసిద్ధికిన్.

ఆంధ్ర సాంఘికజీవితమును నిత్యరణక్షేత్రి మొనర్చి జాతీయశక్తి నంతను నాశనముచేయుచున్న శైవ, వైష్ణములకు సమన్వయము చేయ దలచి హరిహరనాథోపాసన - శివకేశవాద్వైతము ప్రతిపాదించి నవ్య యుగోదయమునకు వైతాళికగీతముపాడిన మహాకవి తిక్కన.

జాతీయజీవితము నిత్యము కురుక్షేత్రముచేయుచున్న విప్రతి పన్న శక్తులకు శాశ్వతసమన్వయము వేదాంతము ప్రతిపాదింపదలచి నిలిచిన జ్యోతిర్మూర్తియైన ధర్మాద్వైతమూర్తి మహాభారతము. ఈ ధర్మాద్వైతమును మహాభారతము ప్రబోధించుచున్నది. తెలుగు జాతికి ఈ మహాప్రబోధ సందేశ మందించుటకై ఆంధ్రావళి మోదము బడయుటకు తిక్కన ఆంధ్రమహాభారతమును మహాకవిత్వ దీక్షా విధి నొంది రచించెను.

తిక్కన మహాభారతము స్వీకరించుటకు బలవత్తరములైన కార ణములు కలవు. వేదములు, ధర్మశాస్త్రములు, ఉపనిషత్తులు ప్రతిపా

దించిన సర్వసారము భారతములో నిక్షిప్తమైయున్నది. తత్ ప్రతిపాదిత మైన వేదాంతము తిక్కనజీవితములో ననుగమించినది.

తిక్కనార్యుడు మానవజాతికందింపదలచిన ధర్మాద్వైతమునే భారతము ప్రబోధించుచున్నది ఆ కారణముచే రెండు శతాబ్దముల కాలము నిలిచిపోయిన మహాభారతాంధ్రీకరణమును ఈ పరమాశయముతో తిక్కన చేపట్టెను. తిక్కన సమకాలీనజగత్తునకు - విశ్వమానవలోకమునకు, అందింపతలపోసిన జీవితవేదాంతము భారతములో ప్రత్యక్షరములోను మణిమాలలోని సూత్రమువలె ప్రకాశించుచున్నది.

తిక్కన అనుష్ఠానవేదాంతి. తెలుగుజాతి క్రియాశూరులైన కర్మవీరులుగా రూపొందవలెను. మానవుని పరమధ్యేయము కర్మయోగము. మానవుడు మొట్టమొదటజ్ఞానియై తత్త్వజ్ఞానమును అలవరచుకొని వైరుధ్యముకల ధర్మములలో నుత్తమధర్మము గ్రహించి ఆచరింపవలయును. కర్మాచరణమును బ్రహ్మార్పణబుద్ధితో అహంకారత్యాగముతో నిర్వర్తింపవలయును. తిక్కనమహాకవి సందేశమిది. జీవితమే కురుక్షేత్రము. కురుక్షేత్రమనగా ధర్మక్షేత్రము. ఈ ధర్మాద్వైతమును ఒకనాడు వేదవ్యాసమహర్షి భారతీయులకు పరమకరుణామూర్తియై భారతామ్నాయమున ప్రబోధించెను. ఆ సందేశమునే నవీనపరాశరసూన బిరుదాంకితుడగు తిక్కనార్యుడు భారతము రచియించి ఆంధ్రులకు మహోపకారము చేసెను.

నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలు వ్యాసమహర్షి ప్రణీతపరమార్థము వీసమంతకూడ బీరుపోకుండగ ఆంధ్రమహాభారతములో నిక్షేపించిరి. అందుచేతనే దేశభాషలలో ఎక్కడలేని ప్రాధాన్యము, ప్రతిష్ఠ తెలుగుభారతము సంపాదించుకొనగలిగినది. భారత ధర్మము త్రికరణశుద్ధిగ నలవరచుకొన్న కవిత్రయము చేతిలో తెలుగుభారతముపడుట తెలుగువారి పుణ్యఫలము. తెలుగుభూమిలోకూడ జాతీయగ్రంథము భారతమే.

ఆంధ్ర మహాభారతము అవతరించుటకు అనేక కారణములున్నను జగద్ధితమే పరమప్రయోజనమనుట సర్వజన శిరోధార్యమైన సిద్ధాంతము. అదియే కవిత్రయము వారి పరమాశయము.

ఆదిపర్వమందలి అవతారిక అనేక విషయములను విశదమొనర్చుచున్నది.

విమలాదిత్య తనూజుడు, విమలాచారుడైన రాజరాజనరేంద్రుని ఉదయము ఘన దురితానుబంధ కలికాలజ దోష తుషార సమూహమును దవ్వగజోపి జగజ్జనానురంజన మొనర్చినది. నన్నయమహాకవి వ్యాసమునీశ్వరు నిరూపితార్థమును భారతములో నిక్షేపించి కలికాలజ దోషములను పటాపంచలు చేసెను. ఆ భారతము హృద్యము, అపూర్వము, బ్రహ్మజ్ఞానప్రదమని నన్నయ నొక్కి వక్కాణించియున్నాడు.

"ఏయది హృద్య మపూర్వం
బేయది యెద్దాని వినిన నెఱుక సమగ్రం
బై యుండు నఘనిబర్హణ
మేయది యక్కథయ వినగ నిష్టము మాకున్"

ఆది - ప్రథమ - 30

కవిత్రయమువారు మహాభారతమును ఆంధ్రీకరించి తెలుగు వారికి కానుకగా నొసంగుటకు కారణము విశ్వశ్రేయమే. ఆంధ్ర సాహిత్యమునకు భారతాంధ్రీకరణముతో శ్రీకారముచుట్టబడుట ఆంధ్రుల పుణ్యవిశేషము.



# 3. భారతమహిమ

"ధర్మే చార్థేచ కామేచ మోక్షేచ భరతర్షభ !
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్"

(సంస్కృత భారతము)

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహ మని
యైతిహాసికు లితిహాస మనియు
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యం బని మహిఁ గొనియాడుచుండ
వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండ జేసె భారతంబు."

(నన్నయభట్టారకుడు)

వ్యాసమహర్షి ప్రణీతభారతము, భారతీయ విజ్ఞానసర్వస్వము. వ్యాసభగవానుని ముఖాబ్జమునుండి జాలువారిన భారతామృతమును భారతీయులు యుగయుగములనుండి ఆస్వాదించుచున్నారు. నారాయణావతారమగు వ్యాసుడు అష్టాదశపురాణములను, బ్రహ్మసూత్రములను, భారతభాగవతములను రచించి తరుగని పెన్నిధులుగ భారతీయులకు సమర్పించెను.

భారతీయులు అర్థకామములకు అత్యధిక ప్రాధాన్యము నొసంగుచు నైతికపతనము పొందుటచూచి, వ్యాసమహర్షి ఆవేదనము

పొంది భారతీయులను ధర్మవీరులుగ రూపొందింపకోరి సర్వజనారాధ్య మగు, విశ్వశ్రేయః ప్రదమగు భారతామ్నాయమును ప్రసాదించెను. భారతము ధర్మశాస్త్రము, వేదాంతగ్రంథము, నీతిశాస్త్రము, మహాకావ్యము, మహేతిహాసము, పురాణసముచ్చయము, వేయేల అది సర్వపురుషార్థసారము. ఈవిశేషణములు కేవలము సంస్కృత భారతమునకే కాక, ఆంధ్రమహాభారతమునకు నన్వర్థములు.

కావ్యములోని ఇతివృత్తము పురస్కరించుకొని ఆ కావ్యమునకు వైశిష్ట్యము సమకూడును. పాండవులు వినుతపరాక్రములు, ధృతవివేకులు, సత్యసమన్వితులు, యశోధనులు, కృతజ్ఞులు, ఉత్తములు, ధర్మపరులు, శరణాగత రక్షణ బిరుదాంకితులు. అట్టి సర్వసద్గుణ సంపన్నులగు పాండవుల చరిత్రను అహరహము పారాయణము చేయుట ప్రతిమానవుడు అనుసరించుట శ్రేయోదాయకము.

నన్నయ మహాకవి భారతమహిమను వేదవ్యాస స్తోత్రమును బహుగుణ రమణీయముగ చేసియున్నాడు.

> "ఆయుష్యం బితిహాస వస్తుసముదాయం బైహికాముష్మిక
> శ్రేయఃప్రాప్తి నిమిత్త ముత్తమసభాసేవ్యంబు లోకాగమ
> న్యాయైకాంతగృహంబునా బరఁగి నానా వేదవేదాంత వి
> ద్యాయుక్తం బగుదానిఁ జెప్ప నోడఁగెం దద్భారతాఖ్యానమున్"
> ఆది - తృతీ 11

భారత చంద్రుడు జనులకు అజ్ఞాన తిమిరమును తొలగించి చిత్తానందమైన గూర్చుచున్నాడు. నన్నయగారు భారత మహిమను వేదవ్యాస మహత్త్వమును పరమ రమణీయముగ కీర్తించి ఉన్నారు. తిక్కన సోమయాజియు వ్యాసమహర్షికి వినయ వినమిత గాత్రుడై అంజలి ఘటించెను.

"విద్వత్సం స్తవనీయ భవ్యకవితావేశుండు విజ్ఞాన సం
పద్విఖ్యాతుడు సంయమిప్రకరసంభావ్యానుభావుండు కృ
ష్ణద్వైపాయను డర్థి లోకహితనిష్ఠం బూని కావించె ధ
ర్మార్థైకస్థితి భారతాఖ్య మగులేఖ్యంబైన యామ్నాయమున్"
విరాట - ప్రథమ- 3

ధర్మము అతిసూక్ష్మమైనది. వేదశాస్త్ర పురాణములు పఠించి నపుడు ఏది ధర్మమో? ఏది అధర్మమో? తెలిసికొనుట ఒకింత కష్టముగా నున్నది. ధర్మమర్మమును చతుర్వర్గ వ్యుత్పత్తిని సాధించు నుపాయము భారతము పరమరమణీయముగ పరిబోధించుచున్నది.

"వేదములకు నఖిలస్మృతి
వాదములకు బహుపురాణవర్గంబులకున్
వాదైన చోటులను దా
మాదల ధర్మార్థకామమోక్షస్థితికిన్"
(విరాట - ప్రథమ - 4)

వ్యాసముని ప్రణీత భారతామృతమును గ్రోలుటవలననే తిక్కనార్యుడు జనన మరణ రూపమైన సంసార దురితమునుండి తప్పుకొను సాధనమైన జ్ఞానచక్షువును పొందెను. భారతసంహితను తెలుగులో వినిర్మించి, తన పుట్టువును కృతార్థత పొందించుకొని, ఆంధ్రులకు ఇహపర సాధనమైన ధర్మమార్గమును ఉపదేశించెను.

"కావున భారతామృతము కర్ణపుటంబుల నారఁ గ్రోలి యాం
ధ్రావలి మోదముం బొరయు నట్లుగ సాత్యవతేయ సంస్మృతి
శ్రీవిభవాస్పదం బయిన చిత్తముతోడ మహాకవిత్వ దీ
క్షావిధి నొంది పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్."
(విరాట - ప్రథమ 30)

ఇది తిక్కనార్యుని ప్రతిజ్ఞ. అది అక్షరాల సార్థకము చేసి కొనెను. భారత భాస్కరుని సహస్రదీధితులు త్రిలోకములలో ప్రకాశించినవి. భారతము బహుభాషలలో బహుజనులలో పొందిన ప్రచారము అనన్య సామాన్యమైనది. ఏవంగుణ విశిష్టమైన భారతామ్నాయమును ఆంధ్రీకరించి కవిత్రయ కవులు మహోపకారము చేసిరి.

ఆధునిక మనీషులలో శ్రేష్ఠుడైన శ్రీమాన్ రాజగోపాలాచారి గారు భారత మహత్త్వమును ప్రశంసించెను. "Mahabharata is a noble poem possessing in supreme degree the characterstics of true Epic, great and fateful movement, heroic characters and stately diction.....It disclosed a rich civilization and a highly evolved society, which though of an older world strangely resembles India of our own time with the same values and ideas..... The Mahabharata has moulded the character and civilization of one of the most numerous of the world's people."

C. R's Mahabharata - Preface Pages 4-7

1. ధర్మతత్త్వజ్ఞులు భారతమును ధర్మశాస్త్రంబని ఆరాధించు చున్నారు !

ధర్మమనగా నేమి ? ధర్మతత్త్వజ్ఞు లెవ్వరు ? ధర్మశాస్త్ర లక్షణము లేవి ? ధర్మశాస్త్ర లక్షణములు భారతములో మనోజ్ఞముగ పొందుపరుపబడియున్నవి.

"ధారణాత్ ధర్మమిత్యాహుః
ధర్మోధారయతి ప్రజాః" (అమరము – ఆ – శ్లో)

ధరించునదిగాన ధర్మ మందురు. ప్రజలను విశిష్టరీతిలో నడిపించు చున్నది. ధారణము చేయునదెల్ల ధర్మము. సమస్త జగత్తు ధర్మమునందే ప్రతిష్ఠితమైయున్నది. జైమినిమహర్షి ధర్మపదము నిట్లు నిర్వచించెను "చోదనా లక్షణార్థో ధర్మః" చోదన అనగా విధి మేలు సమకూర్చు కర్మము వేదము ధర్మమునకు మూలము. వేద

విదుల స్మృతులు, వారి శీలము, ధర్మమునకు ఆదర్శము. మను స్మృతి ధర్మమునకు దశ లక్షణములు నిర్దేశించినది.

(జైమిని ధర్మసూత్రములు – శ్లో)

"దశలక్షణకో ధర్మః
సేవి తవ్యః ప్రయత్నతః
ధృతిః క్షమా దమోఽస్తేయం
శౌచ మింద్రియ నిగ్రహః
ధీర్విద్యా సత్యమక్రోధో
దశకమ్ ధర్మ లక్షణమ్"    మనుస్మృతి అ 7 - శ్లో 91

ధర్మశాస్త్రకర్తలు ధర్మము విధిచోదన వాక్యములతో చెప్పిరి. వేదశాస్త్రోక్తములైన ధర్మములను గ్రహించి వ్యాసమహర్షి ప్రధాన కథాముఖమున, ఉపాఖ్యానముల ముఖమున కాంతాసమ్మితముగ వివరించెను. శాంతి అనుశాసనిక పర్వములు ధర్మప్రబోధమునకే ఉద్దిష్టములు. మానవజీవితములో జన్మాది మరణ పర్యంతము చేయవలసిన ధర్మములను సవిస్తరముగ వివరించెను. ధర్మరాజును నాయకునిగా చేయుటలో వ్యాసమహర్షికి ఎంత ధర్మనిష్ఠకలదో భారతము వేనోళ్ళ చాటుచున్నది. భారతయుద్ధానంతరము ధర్మరాజు తన కారణముగ జరిగిన ప్రజానాశము, గురు, మిత్ర, భ్రాతృవధను చూచి మనోవైక్లబ్యము పొందెను. అత్తరి భీష్మతపస్వి, శ్రీకృష్ణపరమాత్మ, వ్యాసమహర్షి, ధర్మజునకు ధర్మప్రబోధము గావించి కర్తవ్యోన్ముఖుని చేసిరి.

ధర్మములు పంచవిధములు :- 1. జాతిధర్మములు, 2. దేశధర్మములు, 3 కుల ధర్మములు, 4. గణ ధర్మములు, 5. ఆపద్ధర్మములు. బహుశాఖా సమంచితమైన ధర్మసూక్ష్మమును గ్రహించుట, ఆచరించుట కత్తిమీదసామువంటిది. ధర్మములలో నుత్తమోత్తమమైనది భూతహితము. ఆత్మమోక్షావలంబమైన ధర్మము శ్రేష్ఠమైనది. సర్వ

వర్ణోచితమైన ధర్మములు కలవు. అక్రోధము, సత్యాలాపము, స్వభార్యానురాగము, శౌచము, అద్రోహము, నియతమైన గుణములు. శీలంబున ధర్మంబు వెలయును. ధర్మంబున సత్యంబు దొరకొనును. సత్యంబున వృత్తంబు చొప్పడును. వృత్తంబున బలంబు గలుగును. బలంబున సిరి కలుగును. ఇవి అన్నియు ఉత్తరోత్తర శ్రేయః ప్రదములు.

ధర్మసూక్ష్మము నరయుటకు శీలవృద్ధులను, జ్ఞానవృద్ధులను ధర్మపరాయణులను సేవించి తెలియవలెను.

ధర్మరాజాదులు ధర్మముననుసరించి ఉభయలోక సౌఖ్యములు పొందిరి. అట్టి ఉదారచరిత్రులశీలమే మానవులకు మార్గదర్శకము. ధర్మసూక్ష్మమును గ్రహించి ఆచరించు మహానుభావులే ధర్మతత్త్వజ్ఞులు. భారత పరమార్థము.

"యతో ధర్మస్తతో జయః"

భారతీయ జీవితమునకు ఆధారస్తంభము ధర్మము. భారతము సర్వధర్మసారము. భారతము ధర్మశాస్త్రము. ఉపరి భారతములో ధర్మవిజయము ప్రస్తుతింపబడినది. భారతములో ధర్మశాస్త్ర లక్షణముల న్నియు సర్వాంగ సుందరముగ నమరియున్నవి.

2. అధ్యాత్మవిదులు భారతమును వేదాంతమని ప్రస్తుతించిరి :-

అధ్యాత్మ విద్య యనగా పరమాత్మ జ్ఞానము. మోక్షమార్గము. అధ్యాత్మవిద్యకు నిలయము భగవద్గీత. భగవద్గీతను యథాక్షరముగ తెలుగు భారతము తెచ్చుకొనకపోయినను, ఆ పరమార్థ మంతయు శాంతి అనుశాసనిక పర్వములలో కరబదరముగ గతార్థమైనది. స్వధర్మానుష్ఠానమే మానవుని పరమ కర్తవ్యమని శ్రీకృష్ణుడు ప్రవచించెను. కర్మసన్యాసము ధర్మము కాదని భారతకారుని మతము.

"కేవల నిష్కర్మత మో
క్షావహమగునేని గిరులు నవనీజములున్

భూవర ముక్తింబడయం
గావలవదె యడవి నునికి కైవల్యదమే ?"
(శాంతి - ప్రథమ - 68)

"ఫలముల యెడ బ్రహ్మార్పణ
కలన పరుండగుచు గార్యకర్మము నడపన్
వలయుం దత్త్వజ్ఞానము
దలకొనినం గర్మశేమను తానై కలుగున్.
(శాంతి - ప్రథమ - 69)

భగవద్గీతలోని సారమంతయు ఈ రెండు పద్యములలో చక్కగ ఇమిడియున్నది.

ఆత్మసాక్షాత్కారము పొందుటకు, పరబ్రహ్మప్రాప్తి పొందుటకు అనేక సోపానములున్నవి. ఆ సోపానములన్నియు నధిరోహించి నపుడే ముక్తికాంతాసమాశ్లేషము కలుగును. మానవుడు, వేదధర్మశాస్త్రముల ననుసరించి ధర్మాచరణము దేశకాలపాత్రానుగుణముగ ఒనరించుచు, ఇంద్రియ నిగ్రహము పొంది అరిషడ్వర్గ జయము చేసి, అణువునుండి బ్రహ్మాండమువఱకు పరబ్రహ్మస్వరూపమని తలంచి పరమాత్మానుసంధానము చేయుటయే మోక్షమార్గము.

ప్రధాన కథను ఆధ్యాత్మికముగ సమన్వయింపవచ్చును. సత్యధర్మస్వరూపుడైన యుధిష్ఠిరుడు ఆత్మ, యజకుండమునం దుద్భవమందిన ద్రౌపది ప్రకృతిశక్తి, పవననందనుడు ప్రాణమయశక్తి, అర్జునుడు మనోబుద్ధ్యాది రూపమైన యంతఃకరణము, నకుల సహదేవులు కర్మేంద్రియ జ్ఞానేంద్రియములు.

అనేక సందర్భములలో సాంఖ్యయోగము, అంతర్యాగ పద్ధతి నిరూపింపబడినది. వ్యాసమహర్షి ప్రియపుత్రుడైన శుకమహర్షికి అధ్యాత్మవిద్యనుగూర్చి ప్రబోధించుచు నిట్లనెను,

"అతుల వేదాంత శాస్త్రమహాంబురాశి
ద్రచ్చి పుచ్చిన నవనీత మిచ్చితిని స
మాదరంబున గైకొను మనుసరించు
నిర్మలాత్మ తపస్వికి నీవు నొసగు."

(శాంతి - పంచ - 158)

భారతమునందు ఆధ్యాత్మవిద్య ఓతప్రోతమైయున్నది. అందుచే భారతము వేదాంతరసాయనమని ప్రస్తుతించుట సముచితము.

3. భారతమును నీతి విచక్షణులు నీతిశాస్త్రంబని కీర్తించిరి :

నన్నయగారు భారతము లోకాగమ, న్యాయైకాంత గృహంబు అని ప్రశంసించియున్నారు. ఆ మహాగ్రంథము లోకన్యాయములకు, ఆగమన్యాయములకు నిలయము. లోకన్యాయము అనగా నీతులు. నీతి అనగా దేశకాలమతసంఘములకు లోబడి ప్రవర్తిల్లు సదాచారము. నీతియే ప్రవర్తన, నడవడి, ఆచారము అని చెప్పవచ్చును. ఈ నీతులను రాజనీతులని, గృహస్థ నీతులని, దండ నీతులని అనేకవిధముల విభజింపవచ్చును.

వ్యాసమహర్షి ప్రజలకు అన్నితరగతులవారికి ఉపయుక్తమగునట్లు నీత్యుపదేశము చేయుటకొఱకు భారతమును రచించెను. తత్కారణముగ కొన్నికొన్ని సందర్భములలో ఆయా పాత్రలు దీర్ఘముగ నీతినిగూర్చి ఉపన్యసించుట కలదు.

భారతములో రాజవంశీయుల చరిత్ర అత్యధికప్రాధాన్యము వహించినది. ఆ కారణముచే అధికభాగము రాజనీతి ప్రాధాన్యము వహించినది. యయాతి, భీష్ముడు, ధృతరాష్ట్రుడు మొదలైనవారు రాజనీతులను ప్రబోధించిరి. అందు ఉత్తమ రాజనీతితోపాటు కూటరాజనీతి కూడ కలదు,

రాజనీతి:

భారతీయసంస్కృతిలో రాజున కుదాత్తస్థానమున్నది. ప్రజారంజనము ప్రధానధ్యేయము. రాజర్షియే పాలనము చక్కగ చేయగలడు. రాజన్యుడు ధర్మయుక్తమైన అర్థమును, ధర్మయుక్తమైన కామమును సముపార్జింపవలయును నిత్యము శీలవృద్ధులను సేవించి ధర్మము తెలిసికొని, పరిపాలన సాగింపవలయును. నమ్మదగిన సత్పురుషులకుమాత్రమే పురరక్షణ మొసంగవలెను. రాజుయొక్క విజయమునకు మూలము మంత్రము. ఇది అత్యంతగోప్యముగా నుండవలెను. నానావిధరణ విజయనిపుణులను, మహావీరులను, విశ్వాసపాత్రులైనవారిని సైన్యాధ్యక్షులుగా నియోగింపవలయును. ఉపధాశుద్ధులను, పాపరహితులను, వినీతిమంతులను, సములను, నిపుణులను అర్థార్జనాది నృపకార్యములందు నియోగింపవలయును. అవగ్రహభయము కలుగకుండ చెఱువులను జలపరిపూర్ణముగ నుంచవలెను. హీనులగు కర్షకులకు ధాన్యబీజములను, వణిజులకు శతైకవృద్ధిగ ఋణములు నీయవలెను. ఆర్తులను దయతో కాపాడవలెను.

రాజు ప్రజలను ధర్మమార్గములో నడిపించుటకు ఉత్తమసాధనము దండనము. దీనిని మనోహరమైన ఉపమానములతో పాలక, పాలిత సంబంధము నిరూపించెను.

"మేదినీపతి యతి మృదువైన మావంతు
డేనుంగు నెట్లట్ల యెక్క యాడ
జూచు దేకువసెడి నీచపు బ్రజ కూ్రరు
డగునేని లోకంబు బెగడు గుడుచు
గాన వసంతంబు భానుని చాడ్పున
దగియెడు పాటితో ధరణి ప్రజల
నుదిత వర్తనముల నొందించు నది యిది
రాజధర్మములకు రాజుసుమ్ము." (శాంతి ద్వి. 178)

"కౌరవేంద్ర యదియుగాక దండము పరీ
క్షా విశుద్ధి పూర్వకముగ వలయు
దన తలంపు వెంట దమకించి ప్రజకు నొ
వ్వగ జరియించుటయును దగదు బతికి."
"విను గర్భిణి ప్రజ బ్రతుకున
కనురూపములైన యట్టి యాహారంబుల్
గొనుగతి బతి ధరణి ప్రజ
మనికికి దగ నడచునది తమకి గాకెపుడున్."

(శాంతి ద్వి. 178, 179)

గర్భిణిస్త్రీ తన ఆరోగ్యమునకు, తన ఆశాంకురమగు బిడ్డయొక్క ఆరోగ్యమునకు ఎంత జాగరూకత వహించునో రాజు ప్రజలపట్ల, తన పట్ల అంతశ్రద్ధ వహించినపుడే తన రాజత్వము అన్వర్థమగును.

గృహస్థ నీతి :

సర్వాశ్రమములకు మాతృభూతము గృహస్థాశ్రమము. అను శాసనిక పర్వమంతయు గృహస్థుచేయవలసిన విధులను సాకల్యముగ చెప్పినది. స్వభార్యానురక్తి, కరుణ, సత్యము, క్షమ, సుజనాసంగము, దేవపిత్రతిథి సమారాధనము, అగ్నిహోత్రసేవ, సమాదరణీయములు. గృహస్వామికి, గృహిణి చతుర్విధపురుషార్థములను సాధించుటకు ఉపకరణము.

"ధర్మార్థకామసాధన కుపకరణంబు
గృహనీతివిద్యకు గృహము విమల
చారిత్రశిక్ష కాచార్యకం బన్వయ
స్థితికి మూలంబు సద్గతికి నూత

గౌరవంబున కేకకారణం బున్నత
స్థిరగుణమణుల కాకరము హృదయ
సంతోషమునకు సంజనకంబు భార్యయ
చూవె భర్తకు నొండ్లు గావు ప్రియము
లెట్టి ఘట్టములను నెట్టి యాపదలను
నెట్టి తీరముల ముట్టబడిన
వంతలెల్ల బాయు నింతుల పరిజలను
నొనర జూడగనిన జనులకెందు.''

(ఆది - చతుర్థ - 85)

ముక్తిపొందుటకు మానవుడు సంసారమును త్యాగముచేయ నక్కర లేదు. సంసారములోనుండియే ముక్తిని సాధించవచ్చును.

దండనీతి:

రాజు సంఘమును సువ్యవస్థలో నుంచుటకు దండ ముత్తమ సాధనము. భారతీయుల భావనలో రాజదండనముపొందినవారికి యమ దండనము లేదు. దోషిని సక్రమమార్గములో పెట్టుటకు, పశ్చాత్తాపము కలిగించుటకు, ప్రజలకు అధర్మమునందు భయముకలిగించుటకు, దండ నము మించిన ఔషధము లేదు. గుఱ్ఱమునకు కళ్లెము, ఏనుగునకు అంకుశము ఎటువంటివో, దోషికి దండనము అటువంటిది. బ్రాహ్మ ణులు పూజార్హులైనను దోషముచేసినపుడు దండార్హులే. శాంతుడు గాక ఆయుధవంతుడై సమరాంగణమునకువచ్చి ఎదుర్కొన్నచో ఆ విప్రుడు వేదాంతియైనను, రాజు చంపవచ్చును. పంచమహాపాతకము లలో నే పాతకము బ్రాహ్మణుడు చేసినను, అతనిని చంపక దేశబహి ష్కారము చేయవలెను. రాజు దోషికి యుక్తదండనము విధించుట యెంత ఆవశ్యకమో అట్లే అయుక్త దండనము విధింపకుండ అప్ర మత్తుడై యుండవలెను.

సకల జీవరాశి సుకృత, దుష్కృతముల కనుగుణముగ శిక్షించు యమధర్మరాజు మాండవ్యమహర్షికి అల్పదోషంబునకు క్రూరదండనము విధించెను. మాండవ్యమహర్షి ఆ కారణముచే యమధర్మరాజును శపించెను. దండనము విధించుట కత్తిమీద సాము వంటిది.

మానవజీవితములో సర్వదశలలో నుపయుక్తమగు నీతులను మహర్షి ప్రబోధించెను. మహాభారతము నీతిరత్నాకరము. దీనిని పురస్కరించుకొనియే నీతివిచక్షణులు భారతము నీతిశాస్త్రంబని స్తుతించిరి.

## 4. కవి వృషభులు భారతమును మహాకావ్యమని ప్రశంసించుచున్నారు :

కవి శబ్దము పరమాత్మ పరముగా వైదికమంత్రములలో గోచరించుచున్నది. అది క్రమముగా పరమాత్మసాక్షాత్కారము పొందిన ఋషియని ప్రవర్తితమైనది. వైదిక కవులును, లౌకికులగు వాల్మీకి వ్యాసాదులును, ఋషులగుట చేత, వారు దివ్యదృష్టితో కావ్యములను లోకోత్తర వర్ణనాత్మకముగా రచించిరి. దీనిని పురస్కరించుకొని కవులపై "నానృషిః కురుతే కావ్యం, కవయః క్రాంతదర్శనః" అను సూక్తులు ఆవిర్భవించినవి. భారతకర్త "వ్యాసో నారాయణో హరిః" అని ప్రస్తుతింపబడెను. చతుర్వేద విభాగము చేసినవాడును, బ్రహ్మసూత్రములను రచించినవాడును, అష్టాదశపురాణ కర్తయును అగు వేదవ్యాసమహర్షి మహాకావ్యమగు భారతమును ప్రసాదించెను. ఇది భారతీయుల పుణ్యావిశేషము. మహాభారతము ఆధ్యాత్మిక విషయప్రధానమగు వైదిక వాఙ్మయమును, భౌతిక విషయ ప్రధానమగు లౌకిక జీవితములో ననుసంధించి రసవత్తరమగు లౌకికేతి వృత్తముతో నొప్పుచు మహాకావ్యముగా విరాజిల్లుచున్నది.

ప్రాసంగికములైన ఉపాఖ్యానములు భారతములో చేరినను పాండవ, కౌరవులకథ అఖండముగా సాగినది.

కథాసంవిధానము, విషయవివేచనము, రసోజ్జ్వలముగా నిర్వహింపబడినవి.

దేవాంశసంభూతులైన పాండవులు వారి ఉదాత్త ప్రవర్తనముతో క్రమపరిణామసుందరముగ వికసించినకథ మానవుల హృదయములో చొచ్చి వాచ్యముగ రసానుభూతిని, వ్యంగ్యముగ కర్తవ్యోపదేశమును పరిమళింపచేయుచున్నది. భారతకథలో వ్యాసమహర్షి పాత్రయగుట మరియు విశేషము.

వ్యాసమహర్షి కవులకు కవి విద్వత్సంసనీయ భవ్యకవితావేశుడని నుతి పొందియున్నాడు. ధ్వనిసిద్ధాంతము ప్రతిపాదించి సర్వజనానంద వర్ధనము చేసినవాడును, లాక్షణిక మూర్ధన్యుడునగు ఆనందవర్ధనుడు భారతము మహాకావ్యమని సిద్ధాంతము చేసియుండుట గమనార్హము. "తస్యహి ధ్వనేః స్వరూపం సకలసత్కవి కావ్యోపనిషద్భూత మతిరమణీయ మణీయసీభిరపి చిరంతన కావ్యలక్షణ విధాయినాం బుద్ధిభిరనున్మీలిత పూర్వమ్, అధచ రామాయణ మహాభారత ప్రభృతిభి లక్ష్యే సర్వత్ర ప్రసిద్ధవ్యవహారం లక్షయతాం సహృదయానామానందో మనసిలభతాం ప్రతిష్ఠామితి ప్రకాశ్యతే"

(ఆనందవర్ధనుడు - ధ్వన్యాలోకము)

సంస్కృత కావ్యములలో భారత రామాయణములు ఉత్తమోత్తమములు. వేద శాస్త్రోప బృంహిత కథాసంవిధాన మహత్త్వము కల మహాకావ్యము భారతము. అట్టి సులక్షణ లక్షితమైనట్టిదే ఆంధ్ర మహాభారతము.

"Winternitz" అను ఆంగ్ల పండితుడు భారత కావ్య మహత్త్వమును బహుధా కీర్తించెను.

"Indians themselves regard the Mahabharata, though always an epic, as a work of poetic art (kavaya), but also at the same time as a manual (Sastra) of morality, law and philosophy,

supported by the oldest tradition (smrti) and hence furnished with incontestible authority; and since more than 1500 years it has served the Indians as much for entertainment as for instruction and edification."

(A History of Indlan Literature by Witnternitz Vol. 1 Page 371)

కవిత్రయము ఆంధ్రభారతమును కావ్యశిల్పాభిరామముగ తీర్చి దిద్దిరి. నన్నయమహాకవి భారతమును ప్రసన్న కథాకలితార్థయుక్తితో, అక్షర రమ్యతతో, నానారుచిరార్థ సూక్తులతో జగద్ధితముగ రచించెను. తిక్కనార్యుడు భారతమును ఉజ్జ్వల కథోపేతముగను, నానా రసాభ్యుదయోల్లసితముగను, ఆంధ్రావళి మోదమును పొరయునట్లు భారతమును వినిర్మించెను. ఎఱ్ఱయ్య నన్నయ్య - తిక్కనల కవితా రీతులను అధ్యయనముచేసి భారతమును మనోహరముగ ఆంధ్రీకరించెను.

అష్టాదశపర్వసంభృతమైన భారతము కథాకథన నైపుణ్యముతో, వర్ణనాప్రాగల్భ్యముతో, రసపోషణముతో, సజీవపాత్ర చిత్రణముతో, మనోవృత్తినైపుణ్యముతో, నవనవోన్మేషమైన ధ్వనితో సహృదయులకు ఆనందము కలిగించుచున్నది. కవిత్రయ భారతములో కవిత విశ్వరూపప్రదర్శనము చేసినది. ఆంధ్ర మహాభారత కావ్య శిల్పముగూర్చి సర్వశ్రీ కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ, ఆచార్య కోరాడ రామకృష్ణయ్య, ఆచార్య పింగళి లక్ష్మీకాంతము, ఆచార్య దివాకర్ల వేంకటావధాని, ఆచార్య జోగారావు, కేతవరపు రామకోటిశాస్త్రి, నండూరి రామకృష్ణమాచార్య ప్రభృతులు సాకల్యముగ వివరించిరి. ఎందరో మహానుభావులు భారతాంబుధిలోని జాతి రత్నములను ఏరి తెలుంగులకు ఉపాయనముగా నొసంగిరి. అయినను భారతము రత్నాకరమే. ఆంధ్ర భారతము సర్వకావ్య లక్షణములతో సర్వాంగ సుందరముగ ప్రకాశించుచున్నది.

### 5. లాక్షణికులు భారతమును లక్ష్యగ్రంథముగ ప్రమాణీకరించిరి :

వ్యాకరణము, అలంకారము, ఛందము మొదలైన శాస్త్రములను దెల్పుగ్రంథములను లక్షణగ్రంథములందురు. పూర్వోక్త శాస్త్ర పారంగతులు లాక్షణికులు. సర్వలాక్షణికులు భారతమును లక్ష్య గ్రంథముగ స్వీకరించుటచేతనే దానిమహత్త్వము ఇనుమడించుచున్నది. ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకములో భారత ప్రాశస్త్యము ప్రశంసించి, భారతములో అంగిరసము శాంతమనియు, దీనిని నిబంధించుటలో వ్యాసభగవానుని పరమాశయమును వివరించెను. "మహాభారత కవి శాస్త్రరూపం కావ్యచ్ఛాయాన్వయిని వృష్ణిపాండవ నిరసావసాన వైమనస్యదాయినీం సమాప్తి ముపనిబధ్నతా మహామునినా వైరాగ్య జీవన తాత్పర్యం ప్రాధాన్యేన స్వప్రబంధస్య దర్శయతా మోక్ష లక్షణః పురుషార్థః శాంతోరసశ్చ ముఖ్యతయా వివక్షా విషయత్వేన సూచిత"

(ఆనందవర్ధనుడు – ధ్వన్యాలోకము)

మహాభారతమునందలి రసము శాంతము. కావ్యచ్ఛాన్వయియైన మహాభారత శాస్త్రమునందు యాదవక్షయము, పాండవ మహాప్రస్థానక్లేశము, శ్రీకృష్ణునికి వ్యాధునివలన మృతియు గల్పించి స్వప్రబంధమునకు వైరాగ్యజననమే పరమ తాత్పర్యమని వ్యాసమునీంద్రుని చేత మోక్షపురుషార్థము, శాంతరసము ముఖ్యముగా వివక్షితమైనవి. బ్రహ్మసూత్రములలో లక్ష్యములుగ భారతములోని శ్లోకములను శంకర భగవత్పాదులు సమన్వయించుట గమనార్హమై యున్నది.

ఆంధ్రకవులకు లాక్షణికులకు భారతము పరమ ప్రమాణగ్రంథము. దీనివలన భారతవైశిష్ట్యము ద్విగుణీకృతమగుచున్నది. అప్పకవి నన్నయ మహాకవి భవిష్యదాంధ్రకవీశ్వరులకు అనేక విషయములలో మార్గోపదేష్ట అని ప్రస్తుతించెను.

"ఆ మూడు పర్వములలో నామాన్యుడు నుడువు తెఱఁగు
లరసికొని కృతుల్
దాము రచించిరి తిక్కనను, భీముణి మొదలైన తొంటి తెనుగు
కవీంద్రుల్"
(అప్పకవీయము - పీఠిక - ప 47)

ఆంధ్రదేశములోని కవులు, లాక్షణికులు, కవితకు శ్రీకారము చుట్టునపుడు ఆంధ్రభారతప్రశంస భక్తివినమితగాత్రులై చేసియున్నారు. అవి కవిత్రయ కవులకు సాహిత్యకర్పూర నీరాజనము పట్టుచున్నవి. ఆంధ్రభారతములోని పద్యములు మొన్నమొన్నటివరకు ఆంధ్రుల జిహ్వారంగములపై నాట్యముచేయుట సర్వజన విదితమే.

6. ఐతిహాసికులు భారతమును మహేతిహాసమని పొగడు

చున్నారు :

భారతమునకు జయేతిహాస మను పేరు గలదు. నన్నయ, తిక్కన మొదలైన కవులు భారతమును ఇతిహాసరత్నముగ బహుధా ప్రస్తుతించి యున్నారు. ఇతిహాస స్వరూప స్వభావములనుగూర్చి సంస్కృతాలంకారికులు చర్చించియున్నారు. ఇతిహాసమనగా నేమి ? "ఇతిహాసః పురావృత్తమ్ - ఇతిహ పారంపర్యోపదేశః అస్మే అస్మిన్నితీతిహాసః ఆస ఉపవేశనే - ఇతిహ అనగా పారంపర్యోపదేశము - అది దీనియందు గలదు. పురావృత్తనిబంధన ప్రాయత్వాన్నివృత్తం - పురావృత్తం - పూర్వచరిత్ర నిబంధనప్రాయమైనది. ఈ ప్రాచీనచరిత్ర బోధక వ్యాసాదిప్రణీతములైన భారతాదుల పేళ్ళు."

(గురుబాలప్రబోధిక - ప్ర. కాం. - 125వ పుట.)

శ్రీ కేతవరపు రామకోటిశాస్త్రిగారు ఇతిహాసస్వరూప స్వభావములనుగూర్చి తమ సిద్ధాంతగ్రంథములో చేసిన చర్చ అను సంధింపనగును. భారతము మహేతిహాసము. ఇతిహాసము కావ్యభేదము

లలో నొకటి. భారతములో ఇతిహాసలక్షణములు కలవు. ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకములో భారతమునుగూర్చి చర్చించి ప్రధానరసము శాంతరసమని సిద్ధాంతము చేసెను. భారతములో శాస్త్రము, కావ్యము ఉన్నవి. ఇది పరమపురుషార్థమైన మోక్షము ప్రతిపాదించుటచే శాస్త్రమును, నాయకునిచరిత్ర ఆశ్రయించుకొని ఉండుటచే కావ్యమునై ఉన్నది.

సరస్వతీ కంఠాభరణమున కావ్యభేదములను మూడని భోజుడు తెలిపియున్నాడు. కావ్యము, శాస్త్రము, ఇతిహాసము - ఈ మూడింటిని మరల మూడిటిగా విభజించెను. అవి కావ్యశాస్త్రము, కావ్యేతిహాసము, శాస్త్రేతిహాసము. ఇతడు అతీతార్థ ప్రాధాన్యాత్ ఇతిహాసః" అని నిర్వచించెను. ఇతడు గతించిన విషయము ప్రధానముగా గలిగి ఇతిహాస ముండునని భావించెను. అతీత మనగా చారిత్రకమైన ఇతివృత్తము.

రాజశేఖరుడు కావ్యమీమాంసలో ఇతిహాసములు రెండు విధములనియు, రామాయణ, మహాభారతములే అందుల కుదాహరణములనియు తెలిపియున్నాడు.

విద్యారణ్యుడు "దేవసురా సంయత్తా ఆసన్ - ఇత్యాదయః ఇతిహాసాః"

(కావ్యాలంకార సంగ్రహము - పుట 264)

అని వ్రాసెను. దేవాసురసంబంధి ఇతివృత్తమెచట నిబంధింపబడి యుంయుండునో అది ఇతిహాసమని తెలిపిఉన్నారు.

నాట్యశాస్త్రమును వ్యాఖ్యానించుచు అభినవగుప్తుడు కర్మఫల సంబంధముకల సర్వార్థములును ఎందు ప్రత్యక్షముగా చూపబడునో అది ఇతిహాసమని చెప్పెను.

ఆంగ్లేయులు కూడ ఇతిహాస లక్షణములను చర్చించియున్నారు.
"An Epic Poem is by common consent a narrative of some length, and deals with event which have a certain grandeur and importance and come from a life of action, especially of violent action, such as war - It gives a special pleasure becauee its events and persons enhance our belief in the worth of human achievement and in the dignity and nobility of man."

("From Virgil to Milton" By Sir C. M. Bowra)

పై చెప్పినవలన ఇతిహాసముయొక్క ప్రధానలక్షణములను ఈ విధముగా నిర్ణయింపవచ్చును. 1. ప్రధానకథ చారిత్రక సత్యమైనదిగా ఉండవలయును. కొంతశాస్త్రము ప్రవర్తింపవలెను. 2. కథకు దేవాసుర సంబంధ ముండవలెను. 3. పారంపర్యోపదేశము కలిగిఉండవలెను. 4. కర్మఫలానుభవము సర్వము ప్రత్యక్షముగ చూపవలెను. భారతేతిహాసములో ఇతిహాసలక్షణములన్నియు చక్కగ పొందుపరుపబడియున్నవి. భారతేతిహాసము మానవునిఔన్నత్యము నిరూపించుచు కర్తవ్యోపదేశము చేయుచు మానవుని నడిపించునదై యున్నది. భారతములో పాండవ కౌరవుల యుద్ధము వర్ణింపబడుటచే చారిత్రకసత్యముతో నిమిడియున్నది. శాంతి అనుశాసనిక పర్వములలో మోక్షసంబంధమైన శాస్త్రము చక్కగ ప్రవర్తింపబడినది. ధర్మరాజాదులు దేవతల అంశమున, దుర్యోధనుడు కలి అంశమున, మిగిలినకౌరవులు రాక్షసాంశమున పుట్టినారు. దైవశక్తిమూర్తీభవించిన శ్రీకృష్ణుడు భారతముతో విడతెగని సంబంధము కలిగియున్నాడు. మహాభారతసంగ్రామమున దేవతలు, రాక్షసులు పాల్గొనిరి. ప్రధాన కథాపురుషులైన వారి పరలోకానుభవము, స్వర్గారోహణపర్వములో వర్ణింపబడినది. భారతము నిక్కముగ ఇతిహాసరత్నము, జయేతిహాసము.

9. పరమ పౌరాణికులు భారతమును పురాణసముచ్చయమని స్తుతించిరి :

ఆర్ష సంస్కృతి సస్యములను పండింపనేర్పఱచిన, రసప్రవాహములు పురాణములు. అపారకథానిధులను చెప్పి మెప్పించుచు కవి, రసిక, ముముక్షుజనులయొక్క రచనాప్రసంగముల నుపలాలించు మాతృమూర్తులు పురాణములు. ప్రాచీనకాలమునుండియు భారతదేశము పురాణములను ఆదరించి శ్రవణ, పఠనములుచేయు సంప్రదాయము అలవరచుకొన్నది. సనాతన ధర్మములు, వేదశాస్త్ర అర్థములు, వర్ణాశ్రమాచారములు, పునర్జన్మాదులు, ఆత్మనిత్యత్వము, పరలోకాస్తిక్యము దైవమునందు దృఢవిశ్వాసము, సామాజికవ్యవస్థ, సంస్కృతి, సఖ్యము, సంస్కారములు, ఉత్తమ స్త్రీధర్మములు మొదలగు అనేకానేక విషయములు వేదశాస్త్రములందు వలె పురాణములందు గలవు.

సంస్కృతభాషలో వెలువడిన సాహిత్య ప్రక్రియలలో పురాణము ఒకటి. వేదకాలమున పురాణము సాహిత్యప్రక్రియగా పేర్కొనబడెను.

"ఋచః సామాని ఛందాంసి పురాణం"

(శతపథ బ్రాహ్మణము)

ఆర్ష విజ్ఞాన సర్వస్వములో పురాణమునుగూర్చి ఇట్లు చెప్పబడినది.

"పురాణం–చిరంతనము–అనాది. సమస్తమునకు కారణమగునది బ్రహ్మ. పురాణశబ్దమునకు నిరుక్త్యాదులందు "పురానవం–పురాణం" ఇత్యాద్యనేకార్థములు జెప్పబడినవి. వానిలో పురాఅర్థేషు ఆనయతీతి–పురాణమను నిరుక్త్యర్థము సర్వాంశ సంబంధమగుచు అర్థానుబంధినియగుటతో సుందరతమమైన అర్థమగును. పురాయనగా వికృతికి పూర్వ

మేయున్న ప్రకృతి పురుషాత్మకమైన తత్త్వము, ప్రకృతిపురుష పరిణామమే యీ కనిపించు బ్రహ్మాండము. రెంటియొక్క [జడచేతనముల యొక్క పరిణామ పరంపరవిషయక జ్ఞానోపలబ్ధి అందు, అన-[ప్రాణస జాగ్రత] చేష్టించుచున్నది పురాణశబ్దము. అనగా ప్రకృతి పురుషాత్మక తత్త్వమును ప్రకాశింపజేయునది పురాణము. పద్మపురాణమునందలి పురాణశబ్దమునకు మధుసూదన సరస్వతీస్వామి "పురాణోత్పత్తి ప్రసంగము" నందు పురాణశబ్దనిష్కృష్టార్థముగ "విశ్వస్య సృష్టేరితి హాసః పురాణం" అనుచు జెప్పెను. వారి యభిప్రాయమున పురాణమనగా కేవల పురాతనమేగాక, విశ్వసృష్టియే ఇతిహాసార్థమగునని దెలియుచున్నది."

(అర్ష విజ్ఞాన సర్వస్వము - ప్ర, భా. పు. 171, శ్లో. 117)

పురాణములు చిరకాలమున పుట్టినవి. ప్రాచీనవిషయములను తమయందు పొందుపరచుకొన్నవి. ఇట్టి లక్షణములతో కూడిన పదునెనిమిది పురాణములు వేదవ్యాసమహర్షి రచించుట భారతీయుల తపః ఫలము.

పురాణము పంచలక్షణ లక్షితము.
"సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ
వంశానుచరితం చైవపురాణం పంచలక్షణం"
(అర్ష విజ్ఞాన సర్వస్వము - ప్ర. భా. - పు. 175, శ్లో. 178)

(1) సర్గము (2) ప్రతి సర్గము (3) వంశము (4) మన్వంతరము (5) వంశానుచరితము అనునవి పురాణలక్షణములు.

సర్గమనగా బ్రహ్మాండోత్పత్తి. భారతములో శాంతిపర్వము నందు బ్రహ్మాండోత్పత్తిగూర్చి చెప్పబడినది. ప్రతిసర్గమనగా కల్పాంతమున జరుగు ప్రతిసృష్టి. బ్రహ్మాదు లొనరించిన సృష్టివైవిధ్యము

భారతములో కలను. వంశము : దేవాసుర విభేదోత్పత్తి, బ్రహ్మర్షి వంశకర్తల చరిత్రములను చిత్రించి, జీవరాశులలో క్రమబద్ధమైన వికాసమును సంధింపచేయుటయే. పాండవ కౌరవులు దేవాసురాంశము లతో జన్మించి తుదకు మహాభారత సంగ్రామములో మడసిరి. మన్వంతరమనగా ధర్మశాస్త్రప్రవర్తకులైన భువిని శాసించిన పదునాలుగు మనువుల ఉత్పత్తి, పరిపాలనావిశేషములు. వేదధర్మములను లోకమున ప్రచారము చేయుటకు అవతరించిన మహాపురుషుల చరిత్ర కీర్తింప వలయును. భారతములో శౌనకుడు. మార్కండేయుడు, వశిష్ఠుడు, అగస్త్యుడు, వ్యాసమహర్షి, శ్రీకృష్ణుడు భీష్మాదులచరిత్ర వేదధర్మము ప్రచారము చేయుటకే గానము చేయబడినవి. వంశానుచరిత మనగా దైవమూలములైన సూర్యచంద్ర వంశోద్భవులైన ధర్మవీరుల చరిత్ర వర్ణింపబడెను. భారత పారిజాతఫలము చంద్రవంశోద్భవులైన పాండవుల ఉదాత్తచరిత్ర ధర్మార్థమధురముగ చిత్రించుటయే. అరణ్యపర్వములో సూర్యవంశములో శ్రేష్ఠుడైన శ్రీరామునిచరిత్ర సుధామధురముగా గానము చేయబడినది.

భారతము సకలపురాణసారము. ఆంధ్రదేశములో అనావృష్టి కలిగినప్పుడు విరాటపర్వము పురాణము చెప్పించుకొనుట ఈనాటికి ఆచారము కలదు. భారత దేశమున ప్రతిగ్రామములో భారత రామాయణములు పురాణములుగా చెప్పించుట, వినుట ఈనాటికి గోచరించు చున్న ఆచారము. ఆంధ్రదేశములో కొంతమంది గృహనామములు పౌరుషనామములుగా వచ్చినవి. పురాణమువారు, భారతమువారు అను ఇంటిపేర్లుకలిగిన కుటుంబములు కలవు. భారత దేశములో ఈ క్రింది శ్లోకము పురాణము చెప్పునప్పుడు పఠించుట నేటికి చూచుచునే యున్నాము.

"నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమం
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్."

]ఆర్షవిజ్ఞాన సర్వస్వము - ప్ర.భా. పుట 171 - శ్లో 166

నారాయణునికి [పరమేశ్వరునకు], నరునికి [జీవునకు] సరస్వతికి [వాగ్రూపమగు వేదమునకు] వ్యాసునకు [వాక్సంకలనజేయు గురునకు] నమస్కరించి యనంతరము జయమును [పురాణములను] జెప్పవలయును.

నన్నయ్యమహాకవి భారతము బహుపురాణ సముచ్చయమని చెప్పుట ఎంతయు తగియున్నది. భారతము అష్టాదశపురాణసారము. భారతము ధర్మశాస్త్రము, వేదాంతరసాయనము, నీతిశాస్త్రము, మహాకావ్యము, సర్వలక్ష్యసంగ్రహము, ఇతిహాసము, వేయేలభారతము సర్వపురుషార్థసారము. తిక్కనమహాకవి విరాటము నుండి స్వర్గారోహణ పర్వము వరకు తెలుగుభారతమును కావ్యశిల్పాభిరామముగ తీర్చి దిద్ది వేదవ్యాస మహర్షికి సాహిత్య కర్పూర నీరాజనము ఇట్లు సమర్పించెను.

"అమల ధర్మార్థకామ మోక్షములగుఱిచి
యొలయు తెరువెద్దియును నిందు గలుగునదియ
యొండెడల గల్గు దీన లేకుండు చొప్పు
దక్కకంటను లేదు వేదజ్ఞులార"

(స్వర్గారోహణ- 82)



# 4. భారతామ్నాయము

భారతీయ సంస్కృతికి మూలాధారములు వేదములు.

"విద్" జ్ఞానే అను ధాతువునుండి వేదపదము నిష్పన్నమైనది. వేదమునకు శ్రుతి, ఆమ్నాయమను నామాంతరములు కలవు.

"శ్రూయతే ధర్మాధర్మాదిక మనయేతి శ్రుతిః"

(గురుబాల ప్రబోధిక - ప్రథమ — 124)

దీనిచేత ధర్మాధర్మాదులు వినబడును.

"విదంత్యనేన ధర్మాధర్మావితి వేదః"

విద- జ్ఞానే- దేనిచేత ధర్మాధర్మానులు నెఱుగుదురు.

ఆమ్నాయతే పారంపర్యేణేత్యామ్నాయః "గురువునుండిశిష్యుడు పారంపర్యముగ నభ్యసించునవి వేదములు."

వేదములు, పరమేశ్వర ముఖోదితములనియు, పరమప్రమాణ గ్రంథములనియు, సనాతన భారతీయ విశ్వాసము. ఇవి ఆర్యుల ప్రాచీనతమమైన విజ్ఞానకోశములు. బ్రహ్మనిష్ఠులైన మహామునీశ్వరులకు ఈ మంత్రములు వినబడుటచే వేదమునకు శ్రుతియని పేరువచ్చినది.

"అనంతా వై వేదాః"

వేదము లనంతములు. వానిలో ఋగ్యజు స్సామాథర్వణములు పఠనపాఠములలో నున్నవి. "వేదములు మంత్రబ్రాహ్మణాత్మకములు. దేవతలస్తోత్రములు, అర్థవంతములగు వాక్యములు మంత్రములు. యజ్ఞాద్యనుష్ఠానములను వివరించునవి బ్రాహ్మణములు. వృద్ధిచెందినది, చెందించునది బ్రహ్మము. యజ్ఞమునకు బ్రహ్మశబ్దము వాడుచుండిరి. వానప్రస్థుల కుచితములగు విషయములను తెలుపునవి, యజ్ఞాది కర్మలను, గుహ్యములుగా, ఆధ్యాత్మికముగా అర్థముచేసికొనునవి. అరణ్యములందు పఠనీయములగు వేదభాగములు ఆరణ్యకములు, వేద

ముల అంతిమభాగములు ఉపనిషత్తులు. అవి జ్ఞానకాండ. వానిలో ఎక్కువగా బ్రహ్మ, ఆత్మల అనగా జగత్కారణమును గుఱించి విచారము కలదు."

(విజ్ఞానసర్వస్వము - దర్శనములు - వేదవిభాగము—54, 55)

1. ఋగ్వేదము : ఇది అత్యంత ప్రాచీనమైనదని విమర్శకుల ఊహ. ఆర్యకవీంద్రులు ప్రకృతిలోని ఇంద్ర, అగ్ని, సవితృ, అశ్వినీ దేవతలను స్తుతించిన ఋక్కులు కలవు. దీర్ఘాయుర్దాయముకొఱకు, కుటుంబ సౌఖ్యముకొఱకు, వీరసంతతికొఱకు యుద్ధములో విజయము పొందుటకొఱకు ఇందు ప్రార్థనలు చేయబడినవి.

2. యజుర్వేదము : ఈ వేదములో యజ్ఞములతో జరుపు వివిధ కార్యకలాపములు యజ్ఞోపకరణములు, యాగశాలనిర్మాణము వర్ణితము. కృష్ణయజుర్వేదశాఖలో వివిధ మంత్రముల వ్యాఖ్యానములను యజ్ఞముల ప్రశంసలు, తాత్త్వికచర్చలు పదవ్యుత్పత్తి విచారణలు, అనేక కథలు చేర్చబడినవి. సోమయాగము దాని రూపాంతరములగు రాజసూయము, అశ్వమేధము, వాజపేయము, సౌత్రామణి మొదలగు వివిధయజ్ఞములు ఈ వేదములో చెప్పబడినవి.

3. సామవేదము : ఇది గేయప్రధానమైనది. ఋగ్వేదము నుండి గ్రహించిన ఋక్కులను, అవి యాగములలో వాడుటకు వీలైన క్రమములలో గానానుగుణముగ అనుసంధింపబడినవి.

4. అధర్వవేదము : ఇందు దీర్ఘాయుర్దాయము, ఐశ్వర్యసముపార్జనము, బాధానివారణోపాయము, శత్రుసంహారమంత్రములు కీర్తింపబడినవి.

చతుర్వేదములు సర్వభారతీయులకు, శిరోధార్యములై పూజనొందుచుండగా భారతము పంచమవేదముగ పరిగణింపబడుట ఎట్లు తటస్థించినది ? సర్వభారతీయ విజ్ఞానకోశములను వేదములకు, వ్యాస

మహర్షికి అవినాభావసంబంధమున్నది. వేదములు నారాయణ ముఖో దితములు. భారతామృతము సాక్షాన్నారాయణుడైన వ్యాసముఖ పద్మమునుండి జాలువారినది.

"వ్యాసో నారాయణో హరిః"

వ్యాసమహర్షి జన్మప్రయోజనము శాంతిపర్వములో నిరూ పితము. ఆదికాలమున శ్రీమహావిష్ణువు ప్రజాభిసర్గముకొఱకు నిజనాభి పద్మమున బ్రహ్మను కల్పించెను. అతడు భూతసంఘములను సృజిం చెను. బ్రహ్మముఖమునుండి బహువేదములు ప్రసరించెను. శ్రీహరి అవాంతరతముని పుట్టించి "ఈ శ్రుతులన్నియు చక్కగావిని నీవు వ్యాస మొందింపుము" అనెను.

"అవ్విష్ణుండు నలఘుబోధుని నవాం
తరతమం డనుమొడు తనయు జిత్త
మునన కల్పించి యతిభక్తి మ్రొక్కి నిలిచి
యున్న యక్కుమారుని శ్రుతు లన్నియు దృ
ఢావధానుండవై విని నీవు వాని
నంచిత వ్యాసమొందింపు మనియె బ్రీతి."

(శాంతి - షష్ఠ - 520)

అపుడు నారాయణుడు అతనిని వేదవ్యాసనామమున పిలిచి "నీవు అన్ని మన్వంతరములలో వేదవ్యాసనామమునపుట్టి నాకు ఆనందమొసంగు మని" చెప్పెను.

"నాచరితంబులు ధైర్యిలో
క్యాచరణంబులును ధర్మ మఖిలంబు మదిం
జూచి త్రికాలజ్ఞత్వస,
మాచీనత వెలయు మునులు మేటి యనంగన్"

(శాంతి షష్ఠ - 524)

"కాలములకీడుకతమున గలగబడిన,
వేదముల నీవు నాడును విమలబుద్ధి
నంచిత వ్యాసమొందించి యఖిలదివిజ,
మునిగుణముల కొనర్తు సమ్మోదమనఘ"

(శాంతి - షష్ఠ- 527)

ప్రాచీనకాలమునుండియు వ్యాసమహర్షిని త్రిమూర్తుల అపరావతారముగ స్తుతించు సంప్రదాయము కలదు.

"అచతుర్వదనో బ్రహ్మ ద్విబాహురపరో హరిః
అఫాలలోచన శ్శంభుః భగవాన్ బాదరాయణః"

విష్ణుపురాణము ప్రతిద్వాపరమున విష్ణువు వ్యాసరూపమున నవతరించి వేదవిభాగము చేయునని తెలిపినది. శంకరభగవత్పాదులు విష్ణుసహస్రనామభాష్యములో వ్యాసుని సాక్షాత్తు నారాయణునిగా స్తుతించిరి.

"కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం ప్రభుం"

పూర్వోదాహృతములైన విషయము లన్నియు పరిశీలింపగా శ్రీమహావిష్ణువునకు వ్యాసమహర్షికి అభేదమని స్పష్టమగుచున్నది.

ధర్మతత్త్వమును ప్రజలకు బోధించుటకొఱకు వేదములను వ్యాసమహర్షి విభజించెను. ఇవి ఉత్తమాధికారులకుమాత్రమే గ్రాహ్యమగును. మధ్యమాధికారులకుకూడ వేదప్రతిపాదిత ధర్మమర్మమును వెల్లడించుటకు అర్థవాదములద్వారమున ప్రబోధించుటకు పురాణములు ఆ మహామనిషి అనుగ్రహించెను. ఇట్లుండ కాలక్రమమున వేదోక్తధర్మములు పురాణోక్తధర్మములు అసంఖ్యాకముగ పెరిగినవి. ధర్మసూక్ష్మమును తెలిసికొనుట సామాన్యమానవునికి చిక్కుసమస్యమైనది. ఆ క్లిష్టసమయమున వేదోక్తధర్మములను సర్వజనసులభముగ నర్థమగు విధమున సరససుందరమైన కావ్యపద్ధతిలో మహర్షి జయేతి

హాసము ననుగ్రహించెను. వేదములను విభజించియు, అష్టాదశ పురాణములను మహాభారతమును రచించియు, లోకమునకు మేలొనర్చిన కారణజన్ముడు, విష్ణువుయొక్క అపరావతారమైన వ్యాసుడే.

"ఆత్మావై పుత్రనామాసి" అను వేదవచనమునుబట్టికూడ నారాయణునకు నారాయణనందనుడైన వ్యాసునకు అభేదము. వేదములు శ్రీమహావిష్ణుముఖమునుండి ప్రసరితములుకాగా, పంచమవేదమైన భారతము వ్యాసముఖపద్మమునుండి జాలువారినది. ఈ విషయము తిక్కనార్యుడు శాంతిపర్వమున సమర్థించెను.

> "విద్వన్మోదవిధాయి నిర్మలవచోవిస్ఫూర్తివిఖ్యాతు గృ
> ష్ణద్వైపాయను నీ వెఱుంగుము విభున్ నారాయణుంగా విప
> శ్చిద్వంద్యం బగు భారతాధ్యయనముం జేయంగ శక్తుండు ధ
> ర్మాద్వైతుండు సరోజలోచనుండ కా కన్యుండు తద్వాచ్యుడే"
>
> (శాంతి - షష్ఠ - 476)

భారతము ఏ పరమాశయముతో వ్యాసమహర్షి రచించెనో, అది పంచమవేదమెట్లయినదో సుప్రసిద్ధవ్యాఖ్యాత నీలకంఠులు వివరించిరి.

> "ఇహ ఖలు భగవాన్ పారాశర్యః పరమకారుణికో మంద్రమధ్యమమతీ ననుగ్రహీతుం చతుర్దశవిద్యాస్థానరహస్యాన్యేకత్ర ప్రదర్శయిషు ర్మహాభారతాఖ్య మితిహాసం ప్రణేష్యన్ ప్రారిప్సితస్య గ్రంథస్య నిష్ప్రత్యూహ పరిపూర్ణాయ ప్రచయగమనాయ చ కృతం మంగళం శిష్యశిక్షాయై శ్లోకరూపేణ నిబధ్న న్నర్థా త్తత్ర ప్రేక్షావత్ప్రవృత్త్యంగ మభిధేయాది దర్శయతి"

వ్యాసభగవానుడు అవతారికలో పంచమవేదము, చతుర్వేదములకంటె, శ్రేష్ఠమైనదని నుడివెను. మునీశ్వరులు ఒకప్పుడు ఒక త్రాసులో ఒకప్రక్క చతుర్వేదములను, మరొకప్రక్క మహాభారత

మును పెట్టి తూచిరనియు, ముల్లు మహత్వము, గురుత్వముకల భారతము వంకకే మొగ్గినదని తెలుపబడినది.

"చత్వార ఏకతో వేదాః భారతంచైక మేకతః
సమాగతైః సురర్షిభిః తులామారోపితం పురా
మహత్త్వేచ గురుత్వేచ ధ్రియమాణం యతోఽధికం
మహత్త్వా ద్భారతవత్త్వాచ్చ మహాభారత ముచ్యతే
చతుర్భ్య స్సరహస్యేభ్యో వేదేభ్యోహ్యధికం యదా
తదా ప్రభృతి లోకేఽస్మిన్మహాభారత ముచ్యతే"

(సం. భా - ఆది - అధ్యాయము 1. – 253, 254, 257)

నన్నయభట్టారకుడు మహాభారతమును పంచమవేదముగ విష్ణుసన్నిభుడైన వ్యాసభగవానుడు నిర్మించెనని ప్రస్తుతించియున్నాడు.

"కృష్ణద్వైపాయనుడను బ్రహ్మర్షి తొల్లివేదంబు లేకీభూతంబులై యేర్పడకున్న ఋగ్యజుస్సామాధర్వంబులుగా విభాగించి తనశిష్యులైన పైల వైశంపాయన సుమంతు జైమినులం బంచి క్రమంబున జతుర్వేదసూత్రంబుల జేయించి వేదవ్యాసుండై నిజతపోమహత్త్వంబునం జేసి బ్రహ్మచేత ననుజ్ఞాతుండై యష్టాదశపురాణంబులును నీతిధర్మశాస్త్రార్థతత్త్వంబులును జతుర్వేద వేదాంతాభిప్రాయంబులును జతుర్వర్గ వర్గానుబంధబంధురకథేతిహాసంబులును జతుర్యుగ మహర్షి రాజవంశచరితంబులును జతుర్వర్ణాశ్రమ ధర్మక్రమంబులును జతుర్ముఖప్రముఖనిఖిలసురమునిగణపూజితుండైన శ్రీకృష్ణుని మాహాత్మ్యంబును బాండవాదిభారతవీరుల మహాగుణంబులును దనవిమలజ్ఞానమయంబైన వాగ్దర్పణంబు నందేర్పడ వెలుంగుచుండ"

"వివిధవేదతత్త్వవేది వేదవ్యాసు
డాదిముని పరాశరాత్మజుండు

విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండ జేసె భారతంబు."

(ఆది - ప్రథమ - 31, 32)

తిక్కనసోమయాజియు "ధర్మాద్వైతస్థితి భారతాఖ్య మగు లేఖ్యంబైన యామ్నాయమున్" అని, మహాభారత వైశిష్ట్యమును వేనోళ్ళచాటెను. సంస్కృతమునకు అచ్చమైన ప్రతిబింబము ఆంధ్ర మహాభారతము. నవీన పరాశరసూన బిరుదాంకితుడగు తిక్కనసోమయాజి తెలుగు భారతమును తెలుగువేదముగ తీర్చిదిద్దెను.

భగవంతుడైన వ్యాసమహర్షి మంద, మధ్యమ బుద్ధులను గ్రహింపదలచి చతుర్వేదచోదితములైన ధర్మ, నీతి, తత్త్వములను కథోపాఖ్యానముల ముఖమున ముగ్ధమోహనముగ పొందుపఱచెను. అందుచే భారతమునకు పంచమవేదమను పేరు సార్థకమైనది

"కావ్యకంఠ శ్రీ వాసిష్ఠగణపతి మునీంద్రులు" భారతచరిత్ర పరీక్షాగ్రంథమునఋగ్వేదములో నుదాహరింపబడిన "శుష్ణుడే" ప్రసిద్ధ కర్ణు డనియు, 'కుత్సుడే' ప్రసిద్ధమైన అర్జును డనియు, "వైకుంఠుడే" శ్రీకృష్ణు డనియు, "భయమానుడే" భీము డనియు, సోపపత్తికముగా నిరూపించిన విధము పరమాద్భుతము. గణపతిమునీంద్రులు భారతకథ ఋగ్వేదములో సూత్రప్రాయముగ నున్నదని వివరించిరి.

వేదములలో వర్ణితములైన వృత్రాసుర సంహారము, ఇంద్ర సురభి వృత్తాంతము, అశ్వినిదేవతలకథలు, భారతములో ననుసంధింప బడినవి.

యజుర్వేదము యజ్ఞప్రాధాన్యము కలిగియున్నది. వ్యాస మహర్షి శ్రౌతవిద్యాపారంగతుడు. తత్కారణముచే, ఆ మహామనీషి సర్పయాగము, రాజసూయము, అశ్వమేధము మొదలైనవానిని,

సాంగోపాంగముగ భారతమున వర్ణించెను. ధర్మరాజు చేసిన రాజసూయములో వ్యాసమహర్షియే బ్రహ్మత్వమును వహించియున్నాడు. యజ్ఞ నియుక్తులైన హోత, ఉద్గాత్రాదులు యజ్ఞములో ప్రయోగసరణిలో వేదమంత్రలోపములో స్వరదోషములో నెట్టి అపచారము జరిగినను, ప్రాయశ్చిత్తము నిర్ణయించి, చేయుబాధ్యత బ్రహ్మపై నున్నది. అశ్వమేధయాగ సందర్భమున సుత్రిస్త్రివాది క్రతుసాధనములను, తురగ పరీక్షా విధానమును, యజ్ఞకుండ నిర్మాణమును, విశదముగా వ్యాస మహర్షి వర్ణించెను. దీనినిబట్టి వ్యాసమహర్షి యజ్ఞయాగ క్రియాకలాపములో నెంత ప్రాముఖ్యము వహించియున్నాడో తెలియగలదు.

పంచమవేదమనబరగిన సంస్కృతమహాభారతము నాంధ్రీకరించుటలో దాని వేద సమ్మితత్వమున కెట్టి భంగము కలుగకుండ కవిత్రయము మిక్కిలి జాగరూకత వహించినారు. వేదములోని పంక్తులు నన్నయాదులు తెలుగుభారతమున భక్తితో నేర్చికూర్చిరి.

1. "అఙ్గా దఙ్గాత్సమ్భవసి" (ఆది - చతుర్థ - 86)
2. "పున్నామ్నో నరకాత్త్రాయత ఇతి పుత్ర" (ఆది - చతుర్థ - 89)
3. "ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః"
దీనిని వ్యాఖ్యానించుటకు జరత్కారు చరిత్రము వర్ణింపబడినది.
4. శ్యేనాః కపోతాన్ ఖాదన్తి (అరణ్య - తృతీయ - 231)
5. సంధ్యావందనములో మధ్యాహ్నార్ఘ్యం ప్రదాన మంత్రము
"హగ్ం సశ్శుచి షద్వసు రన్తరిక్ష సద్ధోతా వేదిష
దతిథి ర్దురోణసత్
నృషద్వ రసదృత సద్వ్యోమ సదబ్జా గోజా ఋతజా
అద్రిజా ఋతం బృహత్"
(తైత్తిరీయము - సంధ్యావందన ప్రకరణము - 15)

ఈమంత్రమును తిక్కనసోమయాజి భీష్మస్తుతిలో చక్కగా అనువదించెను.

"శుచియును హంసుండు శుచిషత్తు బరముండు
బరమేష్ఠియును నగుభవ్యుఁగొలుతు
మునులును సురలు నెవ్వనియున్నరూపెఱుం
గరు సర్వవిదుని నప్పురుషుఁగొలుతు
శ్రుతులు చెప్పఁగ మహామతులు దుఃఖౌషధం
బుగ నెఱింగెడు పుణ్యమూర్తిఁగొలుతు
లోపంబు లెల్లగల్గుట నిల్చు టొదుగుట
తనయందు యగుమహాత్తురునిఁగొలుతు"

(శాంతి - ప్రథమ - 20)

"సహస్రశీర్షాపురుషః
సహస్రాక్ష స్సహస్రపాత్
సభూమిం విశ్వతో వృత్వా
అత్యతిష్ఠద్దశాంగులమ్"

(పురుషసూక్తమ్ – ప్రథమ - మం. 1)

ఈ పురుషసూక్తములోని మంత్రమునుసహితము తిక్కనార్యుడు తేనెలొలుకు తెలుగుపలుకులలో ఆంధ్రీకరించెను.

"హరి సహస్రశీర్షు బరము సహస్రాక్షు,
వేదమయు సహస్రపాదు నలతు
లైనవారికంటె నలతి పెద్దలకును,
జాల బెద్ద యగు దయాళుఁ గొలుతు"

(శాంతి – ద్వితీయ - 21)

ఈవిధముగ వేదములోని పరమార్థమంతయు మహాభారతములో నిక్షేపించబడినది. ఈవిషయము శ్రీకృష్ణుడు, ధర్మజునకు ధర్మము లుప దేశింప నియోగించుచు నిట్లనియె.

"నాలుగువర్ణంబులకును నాలుగాశ్రమంబులకు నిట్టిట్టివి
యర్హంబులని
నాలుగు వేదంబులం జెప్పినధర్మంబులు నీకు విదితంబులు
ప్రవృత్తినివృత్తులును
సాంఖ్యయోగంబులును బురాణేతిహాసంబులు
ధర్మశాస్త్రంబులు నవగతంబులు"
(శాంతి - ద్వి - 110)

ఆధ్యాత్మికవాఙ్మయమున సర్వవాఙ్మయ శిరోభూషణమనదగు భగవద్గీతకు నసాధారణ స్థాన మున్నది. భగవద్గీత సనత్సుజాతీయము, భారతాంతర్గతమగుటచేతనే భారతమునకు ఆమ్నాయత్వము సిద్ధించి నది. వేదశిఖలైన ఉపనిషత్తుల సారమంతయు భగవద్గీతలో కలదు.

"సర్వోపనిషదోగావో । దోగ్ధాగోపాలనందనః
పార్థోవత్స స్సుధీర్భోక్తా । దుగ్ధం గీతామృతంమహత్"
(భగవద్గీత - స్తో - 16)

వేదముల సారము ఉపనిషత్తులు. ఉపనిషత్తుల సారము భగవద్గీత. భగవద్గీతాగర్భము భారతము. భారతము వేదముయొక్క ప్రతిబింబమే.

"వేదో ధర్మమూలమ్"
సర్వధర్మములకు నిలయము వేదము
"ధర్మజుండు ధర్మతరు వర్జునుడు ఘన
స్కంధ, మనిలసుతుడు శాఖ కవలు

పుష్పఫలము, లేను భూసురులును. వేద
ములు దదీయమైన మూలచయము"
(ఉద్యోగ - ప్రథమ - 356)

ధర్మజుడే ధర్మవృక్షము. ఆ ధర్మవృక్షమునకు శ్రీకృష్ణుడు వేదములు, విప్రులు మూలములని చెప్పబడినది. భారతము వేదప్రతి పాదిత ధర్మముపై నాధారపడి రచింపబడినది. భారతము పంచమ వేదమే.

శ్రుతి, స్మృతి, పురాణములకంటె పంచమవేదము సర్వశ్రేష్ఠ మైనదని తిక్కయజ్వ సోపపత్తికముగ నిరూపించెను.

"వేదైశ్చ సర్వై రహమేవ వేదః" (భగవద్గీత-15అ-15శ్లో)
సర్వవేదములచే బరమేశ్వరుడే తెలియదగినవాడు.
"అకాశవత్సర్వగతశ్చ నిత్యః"
శ్రుతులచే పరమేశ్వరుడు సర్వవ్యాపకుడని చెప్పబడుచున్నాడు.

భారతమునకు కార్ష్ణవేదమను ప్రఖ్యాతికలదు. కృష్ణసంబంధము కార్ష్ణము. శ్రీకృష్ణసంబంధముచేతనే భారతము కార్ష్ణవేద మనబడుచున్నది. భారతమునకు వేదగౌరవము శాంత్యనుశాసనిక, అశ్వమేధపర్వములనలననే కలిగినది. భగవద్గీత శ్రీకృష్ణ ముఖోదితము. ఈ శాంతిత్రయములో ప్రపంచితమైన ధర్మప్రపంచమంతయు, భీష్మముఖమున అభివ్యక్తము. సునిశితముగా పరిశీలించి చూచినచో, ఇదియంతయు శ్రీకృష్ణుని బుద్ధినుండియే కలిగినదని తెలియుచున్నది.

"వాగ్విభుడైన శ్రీకృష్ణుడుండగా, భీష్ముడు ధర్మబోధ చేయజాలనని వినయమధురముగ పలికెను. శ్రీకృష్ణుడు సకలభూతముల వర్తనమును, దివ్యబోధంబునలవడునట్టి పెంపు మత్ప్రసాదంబున కలుగునని ఆనతిచ్చెను. భారతమునకు శ్రీకృష్ణుని ప్రత్యక్షాప్రత్యక్ష సంబంధముచేతనే వేదత్వము సిద్ధించినది.

భారతప్రధాన పరమార్థము వాసుదేవపరబ్రహ్మ ప్రతిష్ఠాపనము. ఇది మనసులోనుంచుకొని నన్నయభట్టారకుడు భారతపారిజాత ఫలము శ్రీకృష్ణార్జున కీర్తనమని ప్రస్తుతించియున్నాడు. ఈకారణమును పురస్కరించుకొని భారతము పంచమ వేదమని చెప్పనగును. హరిమహత్త్వంబు భారతమంతటను మణిహారములో సూత్రమువలె వ్యాపించియున్నది. వ్యాసమహర్షి ప్రసాదమున సంజయుడు, ధృతరాష్ట్రునితో పరమేశ్వరతత్త్వమే శాశ్వతమైనదనియు, మిగిలిన జగత్తు అసారమైనదనియు తెలిపెను.

విష్ణుసహస్రనామములు, శివసహస్రనామముల తత్త్వము భారతములో ప్రపంచితమైనది. శ్రీకృష్ణుని విశ్వరూప, విశ్వవేత్తృత్వ, విశ్వమయత్వములు వర్ణింపబడినవి.

వేదములలో పూర్వభాగములో, కర్మమహత్త్వము, ఉత్తరభాగమందు అనగా వేదశిఖలైన ఉపనిషత్తులలో మోక్షము ప్రతిపాదింపబడినది. వ్యాసమహర్షి మహాభారతమందు ముముక్షువుల సంతోషము కొఱకు మోక్షపురుషార్థమును ప్రధానముగ ప్రకటించియున్నాడు. లాక్షణిక మూర్ధన్యులైన ఆనందవర్ధనులు భారతమున అంగిరసము, శాంతరసమనియు, మోక్షపురుషార్థము ప్రకాశితమైనదని సిద్ధాంతము చేసియున్నారు. భారతకథాంతమున యదుకుల కురుకులావసానము వర్ణితము. తస్మాలమున సర్వులైన శరీరధారులకిదియే ప్రాప్యమనియు సంసారమందు విరక్తియు, భంగురత్వమునందు మోక్షరూప పురుషార్థమే ఆశంసావిషయముగా ప్రకాశితమైనది. ధర్మార్థాది పురుషార్థముల ప్రకాశమున్నను, ప్రధానముగ మోక్ష ప్రకాశమే వ్యాసుల కభిమతము. లేనియెడల యాదవుల అవసానము, విరసముగను, తుచ్ఛముగను పరస్పర యుద్ధములతోడను పాండవుల మహాపథ ప్రస్థాన వినాశముతోడను వైమనస్యము కలిగించి యుండదు.

"యథాయథా విపర్యేతి
లోకతంత్ర మసారవత్
తథాతథావిరాగోఽత్ర
జాయతే నాఽత్ర సంశయః"

(సం॥ భా॥)

అట్టివారైన పాండవులకు ఇట్టి గతి కలిగినపుడు మానవమాత్రుల గురించి చెప్పవలసినదేమున్నది ? లోకతంత్రము స్వప్నావలోకితమైన వస్తువువలె నిస్సారమని అసత్పరిమాణ దర్శనముచేత అసత్తును గుర్తించుచున్నాడు భారతపఠనముచే విరాగోత్పత్తి కలిగించుటయే వ్యాసమహర్షి పరమాశయమని తెలియుచున్నది. శాంతి పర్వముయొక్క ప్రధానధ్యేయము పరమధర్మమైన మోక్ష నిరూపణమే.

వ్యాసమహర్షి భారతము పంచమవేదమని ఘంటాఘోషముగ నుద్ఘోషించెను. నన్నయ భట్టారకుడు "భారత సంహితారచన బంధురుడయ్యె జగద్ధితంబుగన్" అని తెలిపియున్నాడు. నవీన పరాశర సూనుడైన తిక్కన సోమయాజియు భారతము పంచమవేదమని పూర్వపక్షము లేని సిద్ధాంతము చేసెను. వేదము అలేఖ్యమైనది. భారతము లేఖ్యంబైన యామ్నాయముగ విశ్వశ్రేయము కోరి వ్యాసభగవానుడు ప్రసాదించెను. సంస్కృతభారతమునకు వేదత్వము ఎట్లుసిద్ధించినదో తత్ప్రతిబింబమైనదియు, ప్రియపుత్రియైనదియు అగు ఆంధ్రభారతమునకట్లే సిద్ధించినది.

"పారాశర్యుని కృతియయి
భారతమను పేర బరగు పంచమవేదం
బారాధ్యము జనులకు ద
ద్గౌరవ మూహించి నీ వఖండితభక్తిన్.

(విరాట - ప్రథమ - 17)

# 5. భారతోద్యానవనం

## ప్రధానపాత్రలు

శ్లో. నియతికృత నియమరహితాం
హ్లాదైకమయీ మనన్య
పరతంత్రాం నవరసరుచిరాం
నిర్మితి మాదధతీ భారతీః వే ర్జయతి॥

(కావ్యప్రకాశిక)

కవియొక్క భారతి ప్రకృతినియమబద్ధముగాదు. హ్లాదైకమయము, నవరసరుచిరమునైన యొకస్వతంత్రనిర్మాణము. బ్రహ్మసృష్టి ఎంతవిస్తృతమైనదో, వైవిధ్యకలితమైనదో, కవి బ్రహ్మసృష్టికూడ అట్టిదే. అయినను, కవి బ్రహ్మసృష్టి విశిష్టమైనది. బ్రహ్మసృజించిన పాత్రలు, సమగ్రములు. చిరంజీవములు కావు. కవిబ్రహ్మసృజించిన పాత్రలు సమగ్రములై, సాహిత్యచిరంజీవములై, ధర్మోపదేశ సమర్థములై యుండుట విశేషము. అందున ఆర్షకవిశేఖరులైన వాల్మీకి, వ్యాసుల పాత్రచిత్రణము అపూర్వమై, అసంఖ్యేయమై సజీవరూపరేఖావిలాసములతో, మానవస్వభావముతో, క్రమపరిణామసుందరమై, ప్రత్యేకవ్యక్తిత్వముతో పరిఢవిల్లుచున్నది.

సుధామధురమైన రామాయణమహాకావ్యమున, వాల్మీకిమహర్షి ఆదర్శప్రాయమైన పాత్రలను రూపొందించెను. శ్రీరామచంద్రుడు మానవోత్తముడు. భరతుడు భాతృవాత్సల్యసంశోభితుడు. లక్ష్మణుడు కైంకర్యలక్ష్మీసంపన్నుడు. జానకి జగదేకమాత. రామాయణము త్రేతాయుగమునకు సంబంధించినది. భారతము ద్వాపరయుగము నాటిది. కాలము పరిణామశీలమైనది. విప్లవాత్మకమైన కాలముననున్న వ్యాసమహర్షి, కలియుగమునకు సన్నిహితముగనుండునట్లు పాత్రచిత్రి

ణము చేసెను. అత్యంతవస్తువిస్తృతిగల భారతమహేతిహాసమునందు వ్యాసమహర్షి అసంఖ్యేయముగ పాత్రలను సృజించి, ప్రధానపాత్రలను ఉపపాత్రలందఱిని సుస్పష్టరూపరేఖలతో తీర్చిదిద్ది ఒక్కొక్కపాత్ర యందున్న ప్రత్యేకవ్యక్తిత్వమును ప్రకటించియున్నారు. భారతకథలో వ్యాసుడు ఒకపాత్రయగుటచే ఆ మహామనీషి ఆ పాత్రలలోని నిమ్నోన్నతములను నిష్పక్షపాతముగ నున్మీలనముచేసెను. భారత మనగా మానవహృదయ క్షీరసాగరమథనము. మహర్షి ప్రతిపాత్రను ధర్మదీపముతో పరీక్షించి ప్రకాశింపచేసెను.

ఉత్తమపాత్రలు సహితము ఆయాసన్నివేశములలో ప్రకటించిన మానసిక దౌర్బల్యము, అల్పదోషములను చిత్రించి, వారు ఆ దోషములను పశ్చాత్తాపముతో సరిదిద్దుకొనునట్లు సూచించినచో లోకసంస్కారమగునని వ్యాసమహర్షి విశ్వశ్రేయఃకాంక్ష. పాత్రలముఖమునధర్మము అవలంబించినవారికి విజయము, ధర్మసేతువును భంజించిన వారికి వినాశము తథ్యమని సిద్ధాంతము.

"ధర్మోరక్షతి రక్షితః"

కవిత్రయము వ్యాసహృదయమును చక్కగ నర్థముచేసికొని సజీవముగ, మనోధర్మవిశ్లేషణముతో, మానవస్వభావముతో, తొణికిసలాడుచున్నట్లు, ధర్మోపదేశము చేయుచున్నట్లు పాత్రలను కవితాశిల్ప కళాభిరామముగ చిత్రించినారు. శ్రీకృష్ణుని అవతారప్రయోజనమును ధర్మజుని ధర్మనిష్ఠను, విదురుని సర్వధర్మార్థవిదుషత్వమును, భీష్మ ద్రోణుల ధర్మపరాయణత్వమును, ధృతరాష్ట్రుని పుత్రపరాధీనత, లోభమును, దుర్యోధనుని ఈర్ష్య, దౌష్ట్యదురభిమానములను, భీముని అమాయకత్వమును, అర్జునుని ఉదాత్త పరాక్రమమును, నకులుని సౌజన్యమును, సహదేవుని రాజనీతినైపుణ్యమును, గాంధారి పాతివ్రత్య ధర్మభీరుత్వమును, కుంతీద్రౌపదుల ఆభిజాత్యసంపన్నతలు ప్రకటితము

లైనవి. సంస్కృతభారతమువలెనే తెలుగుభారతమునకూడ ప్రతిపాత్రి ముఖమున ధర్మోపదేశ సౌరభము పరిమళించుచున్నది.

## వేదవ్యాసమహర్షి

"కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం ప్రభుమ్
కోహ్యన్యః పుండరీకాక్షా న్మహాభారత కృద్భవేత్"
(పద్మపురాణము - సృష్టిఖండము)

"వ్యాసో నారాయణో హరిః
అయం సాక్షాన్మహాయోగీ వ్యాస స్సర్వజ్ఞ ఈశ్వరః"
(సూతసంహిత)

ప్రాంసు బయోదనీలతనుభాసితు నుజ్జ్వలదండధారు బిం
గాంశు జటాచ్ఛటాభరణు నాగమపుంజపదార్థతత్త్వని
స్సంశయకారు గృష్ణమృగచర్మకృతాంబరకృత్యు భారతీ
వంశవివర్ధనుం ద్రిదశవందితు సాత్యవతేయు గొల్చెదన్.
(భీష్మ - ప్రథమ - 71)

ఈ స్తోత్రలహరి యంతయు వ్యాసభగవానుని లోకోత్తర ప్రతిభను చాటుచున్నది కవిత్రియము వ్యాసభగవానునకు భక్తిపూర్వకముగ నొసంగిన వాక్పుష్పోపహారము నిత్యనూతన సౌరభసంవాసితము. నన్నయగారు వ్యాసమహర్షిని విష్ణుసన్నిభుడనియు, వచశ్శ్రియుతుడనియు, వచశ్శ్రీలలితుడనియు కీర్తించి యున్నాడు. తిక్కనార్యుడు పదునేను పర్వములలో వ్యాసభగవానునిమహత్త్వమును బహువారములు బహుగుణరమణీయముగ ప్రస్తుతించిరి.

సాక్షాద్విష్ణువే వ్యాసమహర్షియై యవతరించెను. వాల్మీకి మహర్షి, వ్యాసమహర్షి అంధతమసావృతమైనలోకమున రామాయణ మహాభారతములను విజ్ఞానదీపములను వెలిగించిరి. ప్రపంచసాహిత్యము లోని మహేతిహాసములలో కవులు పాత్రిలగుట అపూర్వము. భారత మహాకావ్యేతిహాసములగు రామాయణ, భారతములలో వాల్మీకి,

వ్యాసులు భూమికలను వహించుటయేకాక, ప్రధానకథలో నత్యంత ప్రాముఖ్యమువహించి సూత్రధారులగుట చిత్రాతిచిత్రమై ఆ గ్రంథ ముల మహత్వము సహస్రగుణాధికము చేయుచున్నది.

వాల్మీకిమహామునియు, శ్రీరాముచితత్త్వము నారదునివలన తెలిసికొనెను. తరువాత బ్రహ్మ ప్రత్యక్షమై రామాయణకథ జరిగినది జరిగినట్లు ఆతనికి వివరించుట, జరిగినపిమ్మట రామాయణము రచించెను. రామాయణకథలో ప్రధానపాత్ర వహించెను. వ్యాసుని విషయము అట్టిదే. వంశము నశించుతరుణమున అరాజకమురాకుండ వంశాంకురమును ప్రసాదింపుమని సత్యవతికోరగా, మాతృవాక్యపరిపాలనాసక్తచిత్తముతో భాతృక్షేత్రములలో నుత్తమసంతానమొసంగినందున వారి జీవితచరిత్రమంతయు ప్రత్యక్షముగా జూచియున్నందున తు. చ. తప్పకుండ ఉన్నదున్నట్లు తెల్పెనేగాని ఇది ఉచితము, ఇది అనుచితమని తలచి అనుచితమును పరిహరించి, లేక మార్చి తెల్పక పోవుటచేతనే వ్యాసునిగ్రంథము విశిష్టస్థానము నొందినది. అన్యథాకరణముగాని, యదార్థగోపనముగాని చేసి తెల్పినను ప్రమాదముండబోదు. కాని వారుసత్యవచనమునందే నిబద్ధచిత్తులు. నిత్యసత్యవ్రతులు. బ్రహ్మర్షి, వేదవిద్వరేణ్యులుగాన తమసమక్షములో జరిగిన తమ రక్త సంబంధమైన వారి చరిత్రములోని ధర్మాధర్మములను సమగ్రముగ వివరించుటలో నేమాత్రము వెనుదీయలేదు. వ్యాసవాల్మీకులు కేవల కవులుగాక కావ్యేతిహాసములలో ప్రధానపాత్రలై ధర్మోపదేష్టలుగా నుండుట భారతీయుల యదృష్టమనక తప్పదు.

మానవుల మనుగడలకు ఒరవడిపెట్టగల ఒద్దికలు దిద్దగల సర్వ జీవితధర్మములు, సర్వసారస్వతధర్మములు ఏకత్రరాశీభూతమైనమహేతిహాసము భారతము. ప్రపంచసాహిత్యమున నాన్యతో దర్శనీయమైన

మహేతిహాసము మనదగుటయు, తదనర్ఘసంజ్ఞ మన దేశమునకభిన్న మగుట విశేషము. వ్యాసమహర్షి మహాభారతములో సృజించిన పాత్రలవైవిధ్యమును, కథాప్రణాళికా మహత్త్వమును, ధర్మజిజ్ఞాస చేయుటలో ప్రదర్శించిన సర్వతోముఖ శేముషీవైభవము, సర్వవేద ఉపనిషచ్ఛాస్త్ర విజ్ఞానము ఉపనిబంధించుటలో ప్రదర్శించిన ప్రతిభా మహత్త్వము తలంచుకొన్నచో సహృదయులకు పులకాంకుర ప్రకర ములు కలుగును.

కృష్ణద్వైపాయనుడు బాల్యప్రభృతి జ్ఞానసూర్యుడై వచశ్శ్రీయుతుడై వెలింగెను. ఆ మహానుభావుడు, సత్యవతీ పరాశరులకు కృష్ణ ద్వీపమున కృష్ణాజినపరిధాన కపిలజటామండల మండితుడై జన్మించి, మాతృదేవికి ప్రణామమొనర్చి పనిగలయప్పుడు వత్తునని చెప్పి అఖిల లోకహితార్థము తపస్సునకరిగెను. శ్రీమహావిష్ణువే వ్యాసుడుగా ఆవిర్భవించెనని శాంతిపర్వకథ తెలుపుచున్నది.

వ్యాసమహర్షి కాలమున సమాజమునందు, వేదవాఙ్మయ మందు అవ్యవస్థ యేర్పడినది. వేదధర్మము బహుముఖముల విస్తరిల్లి నది. వేదధర్మమున కనేక వ్యాఖ్యానములు ప్రబలినవి. అనేకధర్మము లకు పరస్పరము వైరుధ్య మేర్పడినది. మందబుద్ధులు ధర్మమును అధర్మముగను, అధర్మమును ధర్మముగను చిత్రించు దుష్కాలము వచ్చినది. ధర్మతత్త్వమునుగూర్చి వివిధమతములు చర్చలు వ్యాప్తి నొంది సామాన్యజనులను పెడత్రోవ త్రొక్కించు ప్రమాదమేర్పడి నది. ఈవిధముగా నూలుపోగువలె చిక్కుపడిన వేదవాఙ్మయమును క్రమబద్ధముచేయవలసిన ఆవశ్యకమేర్పడినది. శ్రీకృష్ణభగవానుడు దుష్టశిక్షణ, శిష్టరక్షణ, వేదధర్మస్థాపనము సాంఘికోద్యమ ముఖమున సాధించెను. వ్యాసమహర్షి వేదవాఙ్మయము క్రమబద్ధమొనర్చి వేద

ధర్మములలో ఏర్పడిన వైరుధ్యమును క్లిష్టతను తొలగించి స్పష్టతను సమన్వయమును, భారతసంహితాముఖమున పరిష్కరించెను. పారాశర్యునకు వ్యాసనామము ఏర్పడినవిధము పరమాద్భుతము.

"పాదాపసారిణంధర్మం స తు విద్వాన్ యుగేయుగే
ఆయుశ్శక్తిం చ మర్త్యానాం యుగావస్థామవేక్ష్యచ
బ్రహ్మణో బ్రాహ్మణానాంచ తథానుగ్రహకాంక్షయా
వివ్యాసవేదాన్ యస్మాత్ స తస్మాద్వ్యాసస్మృతః."
(ఆది - అంశావతరణపర్వము - 63వ అధ్యాయము)

ప్రతియుగములోను ఒక్కొక్కపాదము ధర్మము లుప్తమగుటచే మానవుల ఆయుర్దాయము, శక్తి క్షీణించిపోవుటచే విప్రవరులపై అనుగ్రహబుద్ధితో వేదములను విస్తరింపసేసినందువలన ఆ మహాను భావునకు వేదవ్యాసనామము కలిగినది. వేదములు విభాగించియు, వేద సారమంతయు, భారతములో నిక్షేపించి, మందమధ్యమాధికారుల ననుగ్రహింపదలచి, విష్ణుమూర్తియే వ్యాసుడుగాపుట్టి, పంచమ వేద మనబడు భారతమును ప్రసాదించెను. బహుకళ్యాణగుణ విశిష్టుడగుట చేతను, కారణజన్ముడగుటచేతను వ్యాసమహర్షి భారతములో సకల ప్రాణిచిత్తవృత్తములను, తన దివ్యబోధంబున తేటపడంగని "సకల జనాశ్చర్యకరముగ నావిష్కరించెను."

వ్యాసమహర్షి జన్మించినదాది తపోనిష్ఠలో మునిగియున్నను, బ్రహ్మవాదియై నిర్మలముగ జీవించుచున్నను దుస్తరమైన విధి ప్రాబల్యముచే సంసారములో చిక్కుకొనెను. అయ్యును పద్మపత్రముపై జలకణము పగిది నిస్సంగముగ జీవించెను. చిత్రాంగద, విచిత్రవీర్యులు సంతానములేక అకాలమరణము పొందిరి. వంశాంకురము లేకపోయిన అరాజకత్వమేర్పడు దుస్థితి దాపురించినది. సత్యవతి ఎంతయో కుంది,

ధర్మసంస్థాపనార్థము భాతృక్షేత్రములలో సంతానము ప్రసాదింపుమని నిజనందనుడగు వ్యాసుని కోరినది. మాతృవాక్యమును పరిపాలించుట కొరకు, ధర్మరక్షణార్థము ధృతరాష్ట్ర, పాండు, విదురులను ప్రసాదించెను. పిమ్మట, ఆ మహానుభావుడు సంసారమునకు దూరముగ నుండియు, పరమకరుణామూర్తియగుటచే తనకుటుంబములోని వ్యక్తులు కష్టములు సమస్యలలో చిక్కుకొని అల్లాడునప్పుడు ప్రత్యక్షమై ఓదార్పవలసినవారిని సముచితముగ ఓదార్చి రక్షింపవలసినవారిని రక్షించి ధర్మసూక్ష్మము చెప్పవలసిన సమయమున హితోపదేశముచేసి పాండవకౌరవులను రెండు కన్నులవలె చూచుకొనుచు నిష్పక్షపాత బుద్ధితో జగద్ధితముకొఱకు జీవించిన మహోదాత్తమూర్తి వ్యాస మహర్షి.

ఉదారచరిత్రులకు వసుధయే కుటుంబము. పాండవకౌరవులు దురదృష్టవశమున దుఃఖమగ్నులైనపుడు జాలిగుండెకల వ్యాసమహర్షి వారికి హితోపదేశము చేసియున్నాడు. గాంధారి అసూయాగ్రస్త హృదయయై, ఉదరతాడనము చేసికొనగ మాంసఖండము పుట్టినది. పరాశరనందనుడు ఆ సమయమున ప్రత్యక్షమై ఆ మాంసఖండములను ఏకోత్తర శతఖండములుగ విభాగించి, వీనిని వేఱువేఱ నేతికుండలలో పెట్టి చల్లని నీరుతో తడుపుమనియు, నూర్వురు కొడుకులు, ఒకపుత్రిక పుట్టుదురని అనుగ్రహించెను. పాండవులు లాక్షగృహదహనములో ఏమాత్రము ప్రమాదము పొందకుండ రక్షింపబడిరి. తండ్రిలేని పిల్లలకు పాండవులపై ఇది అశనిపాతమువలె దెబ్బతీయుననిభావించి తాతగారు జాలిగుండెతో, మనుమలను ఓదార్చి కొడిగట్టిన దీపశిఖను కదల్చి వెలుగు ప్రసాదించెను. ఆ మహానుభావుడు ధృతరాష్ట్రుని దుర్మార్గమును ఖండించి మనుమలను దీవించి కౌగలించుకొని కోడలిని ఓదార్చి శోకోపశమనముచేసి, కర్తవ్యోపదేశము చేసెను.

వ్యాసమహర్షికి ఏవ్యక్తికి ఏసమయమున ధర్మోపదేశము చేసినచో, ధర్మము రక్షింపబడునో తెలిసినట్లు మరొకరికి తెలియదు. క్రాంతదర్శియైన మహర్షి భవిష్యత్కాలములో క్రూరులు, అధర్మపరులైన కౌరవుల కారణముగ జగత్ప్రళయము వచ్చునని గ్రహించి, తల్లియైన సత్యవతికి ఏకాంతమున సంసారముయొక్క అసారత్వమును తెలిపి, ఆమెను నిమిత్తముగ చేసికొని మానవులకు అమృతోపదేశము వర్షించెను.

"మతి దలపఁగ సంసారం
బతిచంచల మెండమావు లట్టుల సంప
త్ప్రతతు లతిక్షణికంబులు
గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్."

(ఆది - పంచమ - 159)

సంసారముయొక్క అసారత్వమును తెలుపుటకు పరమార్థమునందు మానవుల హృదయములు సంలగ్నమొనర్చుటకొరకే వ్యాస మహర్షి భారతకథను స్వీకరించెను.

ద్రుపదుడు ప్రియపుత్రికయగు ద్రౌపదిని పాండవుల కైదుగురికి ఇచ్చి పెండ్లిచేయుటకు ధర్మసందేహము ప్రకటించెను. అంత తాతగారు ప్రత్యక్షమై ద్రౌపదీ పూర్వజన్మవృత్తాంతమును పంచేంద్రియోపాఖ్యానము చెప్పి, ధర్మసూక్ష్మమును తెలిపి పాండవులతో ద్రౌపదీ పాణిగ్రహణము చేయించి మనుమలను ఆశీర్వదించెను. ధర్మరాజు వేదవ్యాసుని ధర్మమర్మజ్ఞతను ప్రశంసించెను.

"ధర్మసూక్ష్మత నిర్ణయింప మనకశక్యంబు త్రిలోకవంద్యుండు త్రికాలప్రవర్తన విజ్ఞాననిధి యీ కృష్ణద్వైపాయనుండు విచారించి యెద్ది యానతిచ్చె నదియ యిప్పుడు కర్తవ్యంబు"

(ఆది - సప్తమ - 255)

ధర్మసేతువు భంజించునపుడు ధర్మమును రక్షించుటకొరకు మునీశ్వరులు తమ యావచ్ఛక్తిని ఉపయోగింతురు. దుష్టచతుష్టయము అరణ్యావాసము చేయుచు ఇడుమలలో మునిగియున్న పాండవులను సంహరించుటకు ఉద్యుక్తులైరి. కృష్ణద్వైపాయనుడు దివ్యదృష్టితో నెఱింగి, ధృతరాష్ట్రునికి హితోపదేశము చేసెను.

"పుడమియు రాజ్యము గోల్పడి
యడవుల నేకతమ యున్న యప్పాండవులం
గడగి వధియింపగా నీ
కొడు కరిగెడు; నిట్లు తలప గూడునె బుద్ధిన్ ?"

"విను మేనును, నీవును, శాం
తనవుడు. విదురుండు నుండి తగునె యధర్మం
బున నీయుపేక్ష ? నయం
బును బాండవవిగ్రహంబు పుట్టుట లగ్గే ?"

(అరణ్య - ప్రథమ – 76, 79)

ధృతరాష్ట్రుడు తనపుత్రుడు దుర్మార్గుడైనను పుత్రప్రేమచేత విడువజాలనని చెప్పెను. ఆ సందర్భమున మహర్షి కథాకథన దక్షుడై వేదప్రసిద్ధంబైన ఇంద్ర సురభి సంవాదము చెప్పి జీవులలో పెద్దబలహీనత పుత్రప్రేమయని చెప్పెను. పుత్రప్రేమ ఉండరాదని ఎవ్వరును చెప్పరు. ఒకవేళ చెప్పినను అది లోకరీతికి విరుద్ధము. మనపుత్రప్రేమ ఇతరులకు అపకారము, అనర్థప్రదము కారాదు. ధృతరాష్ట్రుని పుత్రులపై అమితమైనప్రేమ పాండవులకు కీడుకలిగించుటచే నింద్యమైనది. ఆ సమయమున మహర్షి ధృతరాష్ట్రునితో కౌరవులనువలె పాండవులను చూచుకొన్నచో శ్రేయము కలుగునని సకలమానవ శిరోధార్యమైన సందేశ మొసంగెను.

"నీవు పాండుండు విదురుండు నెమ్మి నాకు
నొక్కరూపై నయట్లు, నీ కుదితయశులు
నీ సుతులు నూర్వురును, పాండునృపతనూజు
లేవురును నొక్కరూప కా నెఱుఁగవలయు."

(అరణ్య - ప్రథమ - 87)

పాండవులు వనవాసాయాస కృశదేహులై, అధికదుఃఖాయమాన హృదయులై క్రుంగిపోవుచుండిరి. కర్ణుడు దుర్యోధనునిచే వైష్ణవయాగము చేయించి పార్థుని పరిమార్చగలనని శపథము చేసెను. ఆ వార్త విని పాండవులు విషణ్ణవదనులైరి ధర్మరాజునకు కంటిమీద కునుకులేదు అట్టి క్లిష్టసమయమున వ్యాసమహర్షి అరుదెంచి మనుమలను ఓదార్చెను. ఈ సందర్భమున సుఖదుఃఖముల అస్థిరత్వముగూర్చి వచశ్శ్రీలలితుడు వ్యాసమహర్షి ధర్మార్థ మధురముగ ప్రవచించెను.

"సుఖదుఃఖములు కాలవిపర్యయంబున సంప్రాప్తించును. ఎవ్వరికిని శాశ్వతముగ సుఖము, దుఃఖము ధ్రువముగా నుండదు. తత్కారణముచే బుధుడు ప్రమోద ఖేద సంశీలుడుగాక ప్రసిద్ధపథంబున పచరించును ఆపదలకు మానసికముగ లొంగిపోవక తపస్సాచరించిన సకలసౌఖ్యములు సిద్ధించును. క్షమ, అహింస, సత్యము, సమత, ఇంద్రియ జయము, తపోలక్షణములు. ఇవి అన్నియు క్రమముగ స్వర్గగతికి గారణములు. దానధర్మములు చేసిన చిరోపకారము చేయును."

ఆ మాటలు విని పాండవాగ్రజుండు దానతపములలో దుష్కరమైనదేది ? అని ఎద్దాన అధికఫలంబగునని ప్రశ్నించెను. ఆ ప్రశ్నకు మహామనీషి చతురముగ ప్రత్యుత్తరము చెప్పెను. "దానతపస్సులలో, దానమే అధికఫలప్రదము, దానము అర్థసాధనమైయున్నది. లోక

ములో మానవులు పగలనక రాత్రియనక, ప్రాణమును సహితము
పణముగ పెట్టి ధనార్జనము చేయువిధము పరమాశ్చర్యకర" మని తెలియ
చెప్పెను.

"…. …. …. ప్రాణంబుల కంటెను
రూపింప నర్థంబు తీపు వినవె;
యుగ్రంబులైన యాయుధముల మొనలపై
నుఱుకుట యంభోధి దఱిసి చనుట
కృషిపాశుపాల్యసంక్లేశంబు నొందుట,
యడవుల గొండల నిడుమ వడుట
నవసి సొవసి యనుదినము బరప్రేష్యులై
యునికి దలప నర్థమునక చూవె;
యట్టిదుఃఖలబ్ధమైన యయ్యర్థంబు
విడుచు టెవ్విధమున గడిది గాదె ?"

(అరణ్య – షష్ఠ – 111)

అన్యాయార్జితమైన విత్తము దానముచేసినను పుణ్యము కలి
గింపదు. అది మూర్ఖన్యాయము. యుక్తన్యాయార్జిత విత్తము కొలది
యైనను, దేశకాలపాత్రముగ దానము చేయుట ఫలప్రదము. ఆ సంద
ర్భమున వ్రీహిద్రోణాఖ్యానము చెప్పి, దానమహిమను ప్రస్తుతించెను.
పిమ్మట అచిరకాలములో పాండవులు రాజ్యప్రాప్తిని పొందగలరని
ఓదార్చెను. ఈ సందేశము మానవులందరికి అన్నికాలములకు శిరో
ధార్యమైయున్నది. నేటి సామాజికమైన అశాంతికి ప్రబలకారణము
ధనవంతులకుకల ధనాశయే. దీనికొరకే ధనవంతులకు, బీదవారికి మధ్య
పోరాటము నిరంతరము సాగుచున్నది. ధనవంతులు ధర్మకర్తలుగనుండి
పేదలను ఆదుకొన్నచో విశ్వశ్రేయము మొనగూడును. అసలు మానవుడు
తనఆకలికి మించిన ధనమును సేకరించుట తోడివాని నోటిదగ్గరనున్న

అన్నమును పడగొట్టుటయే అని గుర్తింపవలెను. ధనవంతులకుగల అమితధనాశయే పేదలను మరింత పేదలుగ అణగద్రొక్కుచున్నది. ఈవిధముగ భారతము సామాజిక సమస్యలను పరిష్కరించుటచేతనే విశ్వజనీనత పొందినది.

పరమకారుణ్యమూర్తియగు బాదరాయణుడు యుక్తసమయమున ధృతరాష్ట్రునకు వాసుదేవపరబ్రహ్మతత్త్వమును ఉపన్యసించి మహాభారతసమరమును నివారించుటకు ప్రయత్నించెను. ధృతరాష్ట్రునకు తనపుత్రుని పక్షమున పదునొకండు అక్షౌహిణీ సేన యుండుటచే జయము తనపుత్రునికే కలుగునని నమ్మి ఏ బలమును చూచుకొని ధర్మరాజు దండయాత్రకు ఎత్తివచ్చుచున్నాడని సంజయుని ప్రశ్నించెను. అదియే మంచి సమయమని గాంధారి వ్యాసమహర్షిని ప్రార్థించెను. సర్వప్రాణి హృదయ చిత్తవృత్తులను పసికట్టిన సత్యవతీనందనుడు వచ్చి, సంజయునిచే పాండవబలమును, వాసుదేవతత్త్వమును సాకల్యముగ చెప్పించి తాను శ్రోతగా నుండెను. ఇదియే తాతగారి గడుసుతనము. ఇంత సంజయుడు చెప్పినను ధృతరాష్ట్రునిలో చీమంతైన పరివర్తనము రాలేదని గుర్తించి వ్యాసమహర్షి పరమార్థమునందు నిబద్ధబుద్ధియగునట్లు ధృతరాష్ట్రునితో ఇట్లు చెప్పెను.

"కృష్ణుండు నీకుంగూర్చు, నీవుం బరమాప్తుండైన సంజయునతని పొలికిం బుచ్చి తది లెస్స కార్యం బయ్యె, వీడును నిమ్మహానుభావు మహనీయ ప్రభావం బున్నరూపెఱుంగు, వీనిబుద్ధి విని యద్దేవు నాశ్రయింపు, మతం డేకాగ్రచిత్తులై యారాధించిన వారికి జేరువయగు, గామక్రోధోపహతులై తమతమ ధనంబులం దృప్తులుగాక యన్యాయంబున వర్తించువారలకు దూరంబై యుండు, నెల్లభంగుల నాతని జొచ్చి బ్రదుకుము"

(ఉద్యోగ - ద్వితీయ - 325)

మహర్షి ధృతరాష్ట్రునితో వాసుదేవపరబ్రహ్మమును సమాశ్రయించి బ్రతుకుమని సమ్మతింపచేసెను. భారతపరమార్థమిదియే. మానవుడు నశ్వరమైన ప్రాపంచిక వస్తువుల అశాశ్వతత్వము గుర్తించి పరమేశ్వరతత్త్వము నాశ్రయించినపుడే మోక్షము పొందగలడని సూచితము.

విధి బలవత్తరమైనదని గుర్తించి, వ్యాసమహర్షి ధృతరాష్ట్రునికి మహాభారతయుద్ధమును చూచుదృష్టిని ప్రసాదించెనని, దానివలననైనను, అతనిలో వివేకదీపము వెలుగునని భావించెను. కాని దివాంధమనస్తత్వముగల గ్రుడ్డిరాజు దీనిని తీసికొనుటకేమాత్రము అంగీకరింపలేదు. మఱియొకసారి వ్యాసమహర్షి పాండవకౌరవులకు కలహము మహాభారతయుద్ధము ధృతరాష్ట్రుని ఉపేక్షలోభమువలననే కలిగినదని నొక్కిచెప్పెను. పాండవకౌరవుల పక్షములవారు దివారాత్రపరివర్తనము గ్రహించునట్లును కనునట్లును వారి రహస్యప్రకాశభాషణంబులు వినునట్లును మనోవృత్తిని ఎఱుంగునట్లును వరమును సంజయునకు వ్యాసమహర్షి అనుగ్రహించెను. విధియొక్క దుస్తరత్వమును వివరించి దుష్పథవర్తులగు దుర్యోధనాది కుమారులను నివారింపకపోయినచో నాశము పొందుదురని తెలియచెప్పెను. అతని జగద్ధితకాంక్ష ఇంత దొడ్డది.

యుద్ధసమయములలోకూడ వ్యాసమహర్షి ప్రవేశించి ఆయా వ్యక్తులకు హితోపదేశము చేసియుండుట పరిశంసార్హము. అభిమన్యుని మరణముచే దుఃఖభారవిహ్వలుడై ధర్మరాజు కింకర్తవ్యతామూఢుడయ్యెను. అంత తాతయైన వ్యాసులు ప్రవేశించి మృత్యువుయొక్క అపరిహార్యత్వమును, ఆత్మనిత్యత్వమును నిరూపించెను. అశ్వత్థామ తాను ప్రయోగించిన నారాయణాస్త్ర ఆగ్నేయాస్త్రములు నరనారాయణులపై వ్యర్థముకాగా పారాశరనందనుడు హరిహరాద్వైతమును బోధించెను.

మహాభారత సంగ్రామానంతరము, నిహతులైన గురువులను, హితులను, చూచి ధర్మరాజు దుఃఖసముద్రములో మునిగెను. ఆ సమయమున వ్యాసమహర్షి ప్రవేశించి ధర్మజుని నిమిత్తముగా చేసికొని మహోపన్యాసము చేసెను.

రాజులకు తపమును, దమమును, బ్రహ్మచర్యమును ధర్మములు కావు. రాజనీతి దండనమున కాని మరొకదానిచేత సాధింపవీలులేదు. లిఖితుడు అన్న ధనమును దొంగతనము చేయుటచే సుద్యుమ్నుడను రాజుచే యుక్తదండనము పొంది యమదండనము లేకుండ రక్షింపబడెను. నీవును ఉత్తమ క్షత్రియుడవై లోకకంటకులు దుర్మార్గులు, ఆతతాయులుఅగు కౌరవులను సంహరించుట ఏమాత్రము అధర్మము కాదు. సంగరంబునం జంపుటయు చచ్చుటయు ప్రజాపరిపాలనంబును తగినతెఱంగున దండించుటయును, నుత్తమ క్షత్రియధర్మంబులు. ఇందు ఉత్తమ క్షత్రియధర్మము నిరూపింపబడినది.

మహామనీషి ధర్మజుని శోకసంతాపములుడుగునట్లు సుఖదుఃఖముల స్వరూపస్వభావములు సోపపత్తికముగ నిరూపించెను. "జనన మరణంబులును హానివృద్ధులును, లోనుగా సకలంబును కాలాధీనంబు. సర్వజీవులు ఎప్పుడో ఒకప్పుడు శోకకర్శితులగుట తథ్యము." మానవ హృదయావృతమైన విషాదమేఘములను తొలగించి వివేకసూర్యుని ప్రతిభాసింపచేయుటకొరకు సేనజిత్తుచెప్పిన వాక్యములను ఉదాహరించెను.

"ఏ మానవునికైనను, దుఃఖము పొమ్మని త్రోసివేయుటకు, సుఖంబు రమ్మని తెచ్చికొనవశమా ? జీవి పూర్వజన్మలో చేసిన దుష్కృతముచే, దుఃఖమును, సుకృతముచే సుఖములు కలుగుచున్నవి. ఇవి రెండును స్థిరములు కావు. సుఖదుఃఖములు కాలకలితములు. ఆర్యులు

ఉదయమునుండి సాయంతనమువఱకు రెక్కలు ముక్కలుచేసికొన్నను ఆకలి తీరుటలేదు. దుర్బుద్ధులు ఏపనియు చేయకుండగనే సిగపూవు వాడకుండ అష్టైశ్వర్యములతో తులతూగుచున్నారు. గాలి, వాన, ఎండ వెన్నెల కాలకలితములు. కమలంబులు కలువలు వికాసము పొందుట, లతలు, తరులు, సకుసమ ఫలభావము పొందుట, మృగములు మదయు తములగుట, కాలముచేతనే కలుగుచున్నది. అందుచే బుధులు సుఖ దుఃఖములకు, హానివృద్ధులకు శోకింపక, పొంగిపోవక, సమతతో నుండుట కర్తవ్యము.

> "దుఃఖంబు బొమ్మని త్రోవ సుఖంబు ర,
> మ్మని తెచ్చికొన వశమయ్యె వాని
> దోలు బాముఁనంపలి దుష్కృతంబును సుకృ,
> తంబు హేతువులుగఁదగిలిచేయుఁ
> బురుషునికాలంబు తిరములుగా వని,
> పొరి బొరి వచ్చుచు బోవుచుండు
> నర్థముల్ దుర్బుద్ధికైనను సిద్ధించు,
> నగుకాలమున నార్యులయ్యు గాని
> కాల మవి ఘటింపగా నేర రనిల వ
> ర్షాతపేందురుచులు నధిప కాల
> కల్పితములు మంత్రశిల్పౌషధంబులు,
> మేలు సేత కాలకీలితంబు."

(శాంతి - ప్రథమ - 185)

ఆధునిక కాలములో మేధావులకు చిక్కుసమస్యలైన అనేకము లైన సమస్యలకు పరిష్కారమార్గము భారతము సర్వజన సులభముగ సూచించినది.

ఒకరు అపకారము చేసినారని పగ పెంచుకొనుట తగదని ఉదాత్త వివేక నిరూఢమైనవి, విద్వదాదరణీయమైన మాటలు వ్యాసమహర్షి ఉపన్యసించెను. వివేకి, ధన, దారా, పత్యబాంధవహానికొఱకు కుందడు. సుఖదుఃఖములు అనిత్యములు. లోకములో కేవలసుఖైక భోగియు, దుఃఖైక భాగియు లేడు. పదార్థముల నైజగుణము పొదలుట, తఱుగుట, దానికి నెవ్వగ పొందరాదు. మానవుడు శాస్త్రవిజ్ఞానములో దినదినము నకు క్రొంగొత్త పరిశోధనములను చేసి జర, మృత్యువులను జయింప గలిగిననాడా? అందుచే ఏకాలమునకు ఏది ప్రాప్తించునో దానిని సమ చిత్తముతో స్వీకరించుటయే మానవుల కర్తవ్యము.

"వల నధికంబుగా గలుగువైద్యులు శాస్త్రము లభ్యసించి మం
దుల నొడగూర్ప నేర్చి తనుదోషము లారయుబుద్ధి గల్గి యా
ర్తులకు జికిత్స చేసెదరు రోగము పాయమి లేదె వారు రో
గు లగుట కాన మెట్లు ప్రతికూలవిధిన్ నరు నేర్చు ద్రోచునే"

సద్వంశజన్మంబు సౌందర్యమును బలం
బును సుభగతయును భోగములును
భవితవ్యతానురూపంబులు పేదలై
పెంచుట కలయంగ బెల్లు పుట్టు
చురు ప్రజ లెంతయు సిరిగలవారు కో
రంగ బుట్టరు దరిద్రపుజనంబు
లాకటం దిని జాలు నఱిగించుకొందురు
భోజ్యసంపన్నులు భోజనంబు
చేయజాలరు.

"అట్టివి దైవకృతంబులు కావున నిష్టానిష్టప్రాప్తులకుం గారణం బులు కనికొనలేవు బాంధవలాభంబును తద్వియోగంబును వఱదం

గాఢ్యంబులు సంగతంబులై పదంపడి పాసినచందంబు''

(శాంతి- ప్రథమ- 215, 216, 217)

నేటి హేతువాద యుగములో మేధావులు వేయు ప్రశ్నలు వ్యాసమహర్షి ప్రాచీనకాలములోనే వేసి దానికి చతురమైన ప్రత్యుత్తరములు తెలిపియున్నాడు. ఆ మహామనిషి విచారధార అత్యంత మాధునికము. నేటి సమస్యలను కారణము చెప్పలేని సందర్భములలో వేదాంతమును ఆశ్రయించుటయే పరమకర్తవ్యమని తెలియుచున్నది. మానవుడు తన శరీరము ఎరవని గుర్తించి, ఆత్మకులార్హ కర్మసంసేవనము భగవద్భావము కల్మషమును పోగొట్టి చిత్తశుద్ధి నొనగూర్చును.

వ్యాసమహర్షి ధర్మాధర్మముల తెఱంగును వివరించెను. ప్రాజ్ఞులు పాపమనగా ఆగమోక్తకర్మను విడుచుట, నిషిద్ధకార్యము చేయుట అని నిర్వచించిరి. అవి స్థూలముగ ఇట్లు చెప్పవచ్చును.

"ఆదిత్యునుదయాస్త మయకాలముల నిద్ర,
బొందుటయును ఛాత్రభూతుడింటి
కరుగుదెంచిన బూజ ఆచరింపమియును
బరదారగమనంబు గురులకెదురు
చేతయు గ్రామంబు చెఱచుటయును వేద
విక్రయంబును రసవిక్రయంబు
భృత్యుబ్రోవమియు నసత్యోపచారంబు
గహనదాహము నన్యకర్మకృతియు
దనదుకర్మంబు విడుచుటయును వృథాప
శుప్రహరణంబు మేదినీసురులకలిమి
గొనుటయును శరణార్థి జేకొనమి విప్ర
వధయు బాపంబు లందురు బుధజనములు.

(శాంతి- ప్రథమ- 293

మహర్షి అపవాద ధర్మమును సాకల్యముగ వివరించి పిమ్మట దానముచేయుటలో పాత్రాపాత్రల తారతమ్యమును గుర్తించవలెనని చెప్పెను. పాత్రులకు దానము చేయని పాపముకంటె అపాత్రులకు దానముచేయుటవలన అత్యధికపాతకము సిద్ధించును.

"పునుక గుక్క తిత్తి బోసినపాలు నీ
ళ్ళధికనింద బొరయునట్లు దుష్ట
మై యపాత్రవిషయ మగునిగి వృషభోవు
నిచ్చుచోట బాత్ర మెఱుగవలయు."

(శాంతి- ప్రథమ - 331)

అభిమన్యు మరణ శోకవ్యాకులుండగు ధర్మరాజునకు తాపోపశమనంబుగ వ్యాసమహర్షి షోడశమహారాజుల చరిత్రలను తిరిగితిరిగి చెప్పెను. ఇది పునరుక్తి కాదా ? సత్యధర్మ విషయములలో పునరుక్తి దోషము కాదు. శ్రీకృష్ణుడు, వ్యాసమహర్షి ఆగరముతో ధర్మజుని నిమిత్తముగా చేసికొని ఉపన్యసించిన వచఃప్రకరము మహార్థగాథము, పరమహితోపదేశము. అవి ధర్మజునకే కాక, మానవులకెల్లరకు శిరోధార్యములు. సత్యమును, ధర్మమును పునరుక్తి చేయుటలో పరమార్థము జగద్ధితమే. తల్లిదండ్రులు తమ బిడ్డలు విన్నను. వినకపోయినను, ఒకటికి పదిసార్లు హితోపదేశము చేసి, వారిని సన్మార్గమున పెట్టుట మనము చూచుటలేదా ? ఇదియు అట్టిదే. వ్యాసమహర్షి శ్రీకృష్ణుడు భీష్ముడు ధర్మసూక్ష్మమును ఒకటికి వేయిసార్లు నొక్కి చెప్పుటకు కారణము జగద్ధితముకొరకే.

లోకములో మహర్షులు ఏకాండకోనలలోనో ఆశ్రమములు కల్పించుకొని మౌనముద్రాంకితులై ఆత్మోద్ధరణముకొరకు ప్రయత్నింతురను భావము కలదు. వాల్మీకి, వ్యాసుడు, గౌతముడు, అత్రి మొదలైన ఆర్యఋషులు తాము తరించి మానవులను తరింపచేయుట స్తుతింపదగి

యున్నది. వ్యాసమహర్షి సంసారమునకు దూరముగా నున్నను మనుమలు కష్టములలో చిక్కుకొన్నప్పుడు పరమకరుణామూర్తియై హితోపదేశము చేసి విశ్వశ్రేయముకొఱకు పాటుపడెను. వ్యాసమహర్షి ప్రధాన పరమార్థము భారతముఖమున విశ్వశ్రేయమును పాటించుటయే. భారతీయులు వ్యాసమహర్షి చేసిన ధర్మోపదేశమును సాధించుటయే ఆ మహర్షికి మనము చేయు నిజమైనపూజ. ఇదియే ఋషిఋణము తీర్చుకొనుట. వ్యాసమహర్షి జగద్ధితముకొరకు జీవించిన మహోదాత్తమూర్తి.

## 2. శ్రీకృష్ణుడు

"యదా యదా హి ధర్మస్య
గ్లాని ర్భవతి భారత !
అభ్యుత్థాన మధర్మస్య
త దాత్మానం సృజా మ్యహమ్"

(భగవద్గీత - 4 - శ్లో 7)

"పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ
సమ్భవామి యుగే యుగే"

(భగవద్గీత - 4 - శ్లో 8)

ఎప్పుడు ధర్మమునకు చ్యుతి అధర్మమునకు విజృంభణము కలుగునో అప్పుడు భగవంతుడు అవతరించి ధర్మసంస్థాపనము చేయును. శిష్టరక్షణ, దుష్టశిక్షణ, ధర్మసంస్థాపనములు అవతార ప్రయోజనములు. భారత పరమార్థమును నన్నయగారు అవతారికలో మనోహరముగ ప్రస్తుతించియున్నారు. మహాభారత పారిజాతమునకు శ్రీకృష్ణుని,

అర్జునుని ఉత్తమగుణకీర్తనము ఫలము. "చతుర్ముఖ ప్రముఖ నిఖిల సురమునిగణపూజితుండైన శ్రీకృష్ణుని మాహాత్మ్యంబును పాండవాది భారతవీరుల మహాగుణంబును దన విమలజ్ఞానమయంబైన వాగ్దర్పణంబునం దేర్పడ నెలుంగుచుండ" (ఆది - ప్రథమ - 31)

విద్యానాథుడు ప్రతాపరుద్రీయమున ఏకావ్యమున ఉత్తమ పురుషుల కళ్యాణ గుణగానము చేయబడునో ఆ కావ్యమే సత్కావ్యమని వక్కాణించెను. శ్రీకృష్ణునికంటె పురుషోత్తముడెవరు ? విష్ణుమూర్తి అవతారమైన వ్యాసమహర్షి శ్రీకృష్ణుని విశ్వరూపత్వ విశ్వనేతృత్వ విశ్వమయత్వములను సర్వతోముఖముగ వర్ణించి భారతమునకు ఆమ్నాయత్వము ప్రసాదించెను. భారతమును సమ్యక్పరిశీలనము చేసినచో శ్రీకృష్ణుడు మహారాజనీతి సంపన్నుడుగా విశ్వరథసారథిగా లీలామానుష విగ్రహుడుగా ఆచార్యపుంగవుడుగా యోగీశ్వరేశ్వరుడుగా విధియొక్క చేతిలో లొంగిన మానవోత్తముడుగా సాక్షాత్కరించును. వేయేల ! ధర్మసంస్థాపనార్థము ఉద్భవించిన అవతారమూర్తి, అచింత్యుడు, అక్షరుడు, పరబ్రహ్మము శ్రీకృష్ణుడు.

భారతములో వ్యాసమహర్షి ధర్మప్రబోధము మహాపురుషులచే సర్వజీవ దుఃఖ ప్రశమనార్థము అభివర్ణించెను. ధర్మరహస్యము ఆవిష్కరించుట ధర్మసంకటములు తీర్చుటకొరకే భారతముద్దేశితము. భీష్మాచార్యుడు ధర్మవేది. శ్రీకృష్ణుడు ధర్మస్వరూపుడు. విదురుడు సాక్షాత్తు ధర్మదేవత అవతారము. శ్రీకృష్ణునకు ధర్మమునకు అవినాభావ సంబంధమున్నది. ధర్మికి, ధర్మమునకు సంబంధము అవిభాజ్యము. ఈ విషయము శ్రీకృష్ణుని ముఖమున

"ధర్మజుండు ధర్మతరు వర్జునుండు ఘనస్కంధము" అను పద్యమున సూచితము.

శ్రీకృష్ణావతార ప్రయోజనము భారతములో ప్రపంచింపబడినది. ప్రజలలో స్వార్థము పెరిగి, అధర్మము విజృంభణము పొంది అర్థ

కామములకు బానిసలై ధర్మమునకు గ్లాని కలిగినపుడు అవతారపురుషు లుదయింతురు. ద్వాపరయుగములో భారతదేశము అధర్మపరులకు ధర్మవిద్వేషులకు నిలయమైనది. అధర్మముయొక్క పరిణామ ఫలమే భారతయుద్ధము. రాజులలో భోగములపై మక్కువ మిక్కుటమైనది. సంఘములో స్వార్థముతో యుక్తాయుక్త వివేకజ్ఞానము కోల్పోయి ప్రజలు మద్యపానము, జూదము, ధన సంపాదనము, స్త్రీలౌల్యము, స్వైరవిహారము చేసినది. బలవంతునిదే రాజ్యమన్న పాశవిక నియంతృత్వ ధోరణి విశృంఖలవిహారము చేసినది. జరాసంధుడు మదోన్మత్తుడై నియంతయై భూమండలములోని రాజులందఱను జయించి కారాగారములో బంధించి నిత్యము ఒక్కొక్కని వధించి భైరవపూజ చేయుచుండెను.

అయుత భుజవీర్యులు, మాయాయోధులైన హంసడిభకులు జరాసంధుని ఆప్తులు. వారును దుష్టకోవలోనివారే. జరాసంధుని సేనాధిపతి శిశుపాలుడు. ఇతడు చేసిన అన్యాయములు, మహాపాపములు లెక్కలేనన్ని కలవు. ఇతడు తపస్వియగు బభ్రుని భార్యను తన దానిగా చేసికొనెను.

వీరే కాక నరకాసురుడు, బాణాసురుడు మొదలైన రాక్షసులు ఆసురశక్తిచే ధర్మమును అణచి సజ్జనులకు తీరని బాధలు కలిగించుచున్నారు. పౌండ్రక వాసుదేవుడు వాసుదేవుని నామము ధరించి అధర్మపరాయణుడై సంచరించుచుండెను. సమాజములో స్వార్థము, భోగాసక్తి మద్యపానాసక్తి పెచ్చుపెరిగినవి. ధర్మము ఆముష్మికము అను మాట ఎంతమాత్రము రుచించుటలేదు. మద్రదేశ ప్రజలు అసుర ప్రవృత్తితో వావిలేక యెల్ల వనితలను పొంది యథేచ్ఛగా సంచరించుచుండిరి.

"వావి లేక యెల్లవనితలు బురుషులు
గలయ మీకు నెగ్గు గాక యుండు;
మున్ను గల్గు పిదప జున్ను బాత్తె పెరు
గుదురు, సెప్ప నేల గుణము లింక ?"

(కర్ణ- ద్వితీయ-47)

"పలువురకు బుట్టి, నిచ్చలు
గలు ద్రావుచు బెరిగి, యెట్లు గఱతురు శీలం
బులు నుచితములగు భాషణ
ములు నీ విమ్మాట లుడిగి పొదపొద మనికిన్"

(కర్ణ - ద్వితీయ - 48)

యాదవులుకూడ అమిత భోగాసక్తితో మహామునీశ్వరులకు అవజ్ఞ తలపెట్టియు, బ్రాహ్మణులకు బాధలు కలిగించుచు, లజ్జలేక రాజాజ్ఞను తిరస్కరించి తప్పత్రాగి ఒకరినొకరు మోదికొని చచ్చు నుస్థితికి వచ్చిరి. ఇది ఆనాటి సామాజికమైన అవ్యవస్థకు అధర్మ విజృంభణమునకు నిదర్శనము.

ప్రధానకథలో ధృతరాష్ట్రుడు తనకున్న రాజ్యములో తృప్తి పడక ఉత్తమ సచివవ్యవస్థను కాలదన్నెను. దుష్టచతుష్టయము మాయ జూదము నెపమున ఉత్తములు, శీలవంతులు, ధర్మమార్గావలంబులు అగు పాండవుల రాజ్యలక్ష్మిని నిర్బంధముగా అపహరించిరి. మహా పతివ్రతయగు ద్రౌపదిని కని విని యెరుగని విధముగా నీచాతినీచముగ పరిభవించిరి. కౌరవులు అర్థకామములకు బానిసలై ఎన్ని ఘోరములు చేసిరో ఎంతమంది సజ్జనులను అవమానించిరో లెక్కలేదు. ఇది ఆనాటి ద్వాపరయుగస్థితి. ఇట్టి క్లిష్టాతిక్లిష్టమైన పరిస్థితిలో దుష్టశిక్షణ చేసి ధర్మసంరక్షణము చేయవలసిన అవసరము కలిగినది. ధర్మవిద్వేషు

లను ధర్మవిముఖులను నాశముచేసి శిష్టరక్షణముచేయవలసిన ఆవశ్యకము ఏర్పడినది. దీనితోగాని భూభారము తగ్గదు. ఆ మహాకార్యక్రమమునే శ్రీకృష్ణుడు సూత్రధారియై నడిపించెను. దానికొరకు శ్రీకృష్ణుడు అవతరించెను.

వ్యాసమహర్షి వాఙ్మయద్వారమున వేదప్రతిపాదిత ధర్మములను సమన్వయముచేసి ప్రజలకు మార్గముపదేశించెను. శ్రీకృష్ణుడు ధర్మోద్ధరణము సామాజికోద్యమము ద్వారమున సాధించియున్నాడు.

శ్రీకృష్ణుని అవతరణమునకు బలవత్తరమైన కారణమున్నదని భారతమే సూచించియున్నది. పూర్వము పరశురాముడుగ్రుడై భీకర నిజకోపాగ్నిచే నిరువదియొక్క మారులు భూమండలముపై లోకకంటకులై ధర్మబాహ్యులై రాజులు సంచరించు తఱి రాచపురుగు లేకుండగ వధించి భూమికి రక్తాభిషేకము చేసెను. "బ్రాహ్మణ వీర్యప్రభువు లయిన క్షత్త్రియులు ధర్మమార్గంబునం బ్రజాభిరక్షణంబు సేయుటం జేసి వర్ణాశ్రమధర్మస్థితులు దప్పక ప్రవర్తిల్లుటయు బ్రహ్మక్షత్త్రింబుల కాయుర్వర్ధనంబును ననవరతయాగ తర్పిత పర్జన్య ప్రసాదంబున గోరిన యప్పుడు వానలు గురియుచు సకలసస్యసమృద్ధియు బ్రజావృద్ధియునైన భూదేవి ప్రజాభారపీడితయై సురాసురముని గణపరివృతులై యున్న హరిహర హిరణ్యగర్భులకడకుం జని యిట్లనియె"

"భూరి ప్రజానిరంతర
భారము దాల్చుటిది కరము భారము దయతో
మీ రీభారమునకుం బ్రతి
కారము గావించి నన్ను గావుండనినన్"

తత్ప్రార్థనానుగుణముగ శ్రీకృష్ణుడు భూభారము తొలగించుటకు అవతరించెను.

"యాదవవంశంబున జగ
దాదిజుఁడగు విష్ణుదేవుఁవంశంబున ను
త్పాదిల్లె గృష్ణు డపగత
ఖేదుఁడు వసుదేవ దేవకీదేవులకున్"

(ఆది - తృతీయ - 52 - 74)

శ్రేష్ఠులగువారలెట్లు ఆచరింతురో, అట్లే సామాన్యులు ఆచరింతురు. శ్రేష్ఠులగువారి ప్రవర్తనమే సామాన్యప్రజలకు ప్రమాణము. ఇదియే భగవద్గీతకూడ నొక్కిచెప్పినది.

"యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరో జనః
స య త్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే"

(భగవద్గీత - తృ - 21)

సనాతన వైదికమతము మహాత్ములు మునీశ్వరులు నవతారపురుషులు లోకసంగ్రహార్థము వేదశాస్త్ర విహితమైన కర్మాచరణము చేసినారని తెలిపినది. తపస్సుచేత సాధింపరాని దుష్కరకార్యము లేదు. తపస్సునకు అనితర సాధారణమైన ప్రాముఖ్యమున్నది. శ్రీకృష్ణభగవానుడు మానవాతీతశక్తులతో ఉద్భవించియు గంధమాదనంబున, పుష్కరంబున, ప్రభాసంబున, బదరీవనమున, బహుసహస్రవర్షములు తపస్సాచరించెను. ఆ మహానుభావుడు తపోనిధానము చైత్రరథంబున నియమకృతశరీరుడై ఉత్తమక్రతువులు చేసి, తపోయజ్ఞంబుల రెంటను సమిద్ధతేజుండై వెలింగెను. వాసుదేవుడు బ్రహ్మచర్యవ్రతసంపన్నుడై హిమాలయపర్వతముపై ఘోరతపస్సుచేసి చక్రమును సముపార్జించి సకలవిద్యాసాకల్యవేదియైన సాందీపని భక్తితో సేవించి సకలవిద్యావిదుడై యోగీశ్వరేశ్వరుడై ప్రకాశించెను.

వ్యాసమహర్షియొక్కయు కవిత్రయు భారతముయొక్కయు పరమార్థము హరిహరభేదము లేదని చెప్పుటయే. ఆదిదేవుడైన విష్ణుమూర్తి అఖిలలోక రక్షణార్థము శ్రీకృష్ణుడై అవతరించి, మైనాక పర్వతముపై చాలకాలము పరమశివుని గూర్చి తపస్సుచేసి వరముపొందెను. పరమేశ్వరుడు ప్రసన్నుడై ఇట్లుచెప్పెను.

"నీవు వరసురగంధర్వకిన్నర గరుడోరగాదిభూతంబుల నవలీల గెలిచి పరమ తేజోవిరాజమానుండవై వర్తింపుము. నీకు నస్త్రంబుల శస్త్రంబుల నగ్నిజలంబుల నశనినార్ద్రంబునను, శుష్కంబునను స్థావరంబునను జంగమంబునను జావునొప్పులు లేకుండంగలయవి దొడరిన నన్నైనజయింపుమని వరంబిచ్చె"

(ద్రోణ - పంచమ - 414)

కర్మసన్యాసము పనికిరాదు. మానవుడు తనకువిహితమైన స్వధర్మాచరణము, బ్రహ్మార్పణబుద్ధితో ఆజన్మాంతము చేయుటయే అవశ్యకర్తవ్యమని సూచితము.

శ్రీకృష్ణుని అవతారమునకు దుష్టశిక్షణ, శిష్టరక్షణ, ధర్మసంస్థాపనములను త్రిపుటియే ప్రధాన పరమార్థము. ఈ ఉద్యమమునకు శ్రీకృష్ణుడు విశ్వరథసారథ్యము వహించెను. దానికొఱకు ఆ మహానుభావుడు వేచియున్నాడు. శ్రీకృష్ణుడు లోకకంటకులైన కంసుని, శిశుపాలుని, సాల్వుని మొదలగు రాక్షసులను స్వయముగ సంహరించెను. భీమునిచే ఉపాయముగ సకలజగద్భయంకరుడైన జరాసంధుని సంహరింపజేసెను.

భారతదేశములో కౌరవసామ్రాజ్యము సువిశాలమైనది. సుప్రతిష్ఠితమైనది. అది ఆనువంశికముగా రాజర్షులచే ధర్మోత్తరముగ పరిపాలింపబడి మహాభ్యుదయము నొందినది. అట్టి కౌరవసామ్రాజ్యము నేడు అసూయాపరులు ఆతతాయులు, కామక్రోధపరాయణులు

మత్సరగ్రస్తులు అయిన దుర్యోధనాదుల చేతికి చిక్కినది. శీలవంతులు ధర్మపరాయణులు అవక్రపరాక్రమవంతులు సత్యశీలురు సర్వసద్గుణ సంశోభితులైన పాండవులు రాజ్యము పోగొట్టుకొని అవమానముల పాలై దిక్కులేక అలమటించుచున్నారు. అట్టి పాండవులకు చేయూత నిచ్చినచో సజ్జనులకు రక్షణకల్పించినట్లగును. ధర్మము నవలంబించిన వారికి రక్షణకల్పించుట అవశ్యకర్తవ్యము. అదియే శ్రీకృష్ణుడు చేసినాడు. దుష్టులైన దుష్టచతుష్టయమును పాండవులచే సంహరింపచేసినచో దుష్టశిక్షణ కార్యక్రమము పూర్తియగును. శ్రీకృష్ణుడు తాను దుష్టులను సంహరించుటయే కాక సంఘములోనున్న ఉత్తమవీరాగ్రసరులచే దుర్మార్గులను సంహరింపచేసినచో "ఏదో ఒకనాటికి ధర్మము జయించును. దుష్టులకు శిక్షపడును" అను అభిప్రాయము ప్రజలలో కలిగి ధర్మాభిరతితో అధర్మభయముతో మెలగుటకు వీలగును. జగన్నాటకసూత్రధారి అయిన శ్రీకృష్ణుడు తాను కొన్ని ముఖ్యమైన వ్యాపారములను నిర్వహించి పాండవులచే నిర్వహింపజేసి మహాభారత యుద్ధరూపమున భూభారము తొలగించెను.

శ్రీకృష్ణరాయబారము భారతములో అత్యంత ప్రాముఖ్యము వహించినది. వాసుదేవుని ధర్మనిష్ఠ, దుష్టశిక్షణ, శిష్టరక్షణ, రాజనీతి నైపుణ్యము, కార్యనిర్వహణాచణత, పరమేశ్వరత్వము, పరమోత్కృష్టముగా ఇందు ప్రకటితమైనవి. భారతములో ద్రుపదపురోహితుని రాయబారము కంటె సంజయుని రాయబారముకంటె శ్రీకృష్ణునిరాయబారము ఉత్తరోత్తర రమ్యమై ధర్మార్థమధురమై యున్నది. దీనివలన అనేక ప్రయోజనములు సాధింపబడినవి.

అన్నదమ్ములలో దాయవిభాగ విషయములలో వివాదము కలిగినపుడు ఉభయపక్షములకు హితైషులైన పెద్దలు కలుగచేసికొని ఇరు

పక్షములకు నచ్చచెప్పి సమస్యను పరిష్కరించవలెను. ఉభయపక్షములు క్షీరోదకగతిలో మెలగునట్లు పెద్దవారు తాము చేయవలసిన ప్రయత్నమంతయు చేయవలెను. అదియే శ్రీకృష్ణుడు చేసియున్నాడు.

"చుట్టములలోన నొప్పమి పుట్టినప్పు
డడ్డపడి, వారితోడ గొట్లాడియైన
దాని నుడువంగ జొరకున్న వాని - గ్రూర
కర్ముడని చెప్పుదురు కర్మకాండవిదులు."

(ఉద్యోగ - తృతీయ - 242)

అన్నదమ్ములలో కలహముకలిగినపుడు శ్రీకృష్ణుడు వారింపక, ఉపేక్షించెననియు, అతడు పూనుకొన్నచో ఈ కులనాశనము, చక్క బడదా ? అని కొందరు ప్రశ్నింతురు. దానికి అవకాశము శ్రీకృష్ణుడు ఎంతమాత్రము ఒసంగలేదు. ఉభయపక్షములకు సంధిచేయుటకు బహుధా యత్నించెను. కాని విధి బలవత్తరము కదా.

ద్రుపదపురోహితుని రాయబారము శ్రుతికి పరుషమై విప్ర స్వాభావికముగా నడచినది. సంజయుని రాయబారము శుష్కప్రియ ములతో శూన్యహస్తములతో నడచినది. శ్రీకృష్ణుని రాయబారము జగన్మోహనమైనది, విశిష్టమైనది. రాయబారికుండవలసిన సర్వసద్గుణ ములు ఆ పురుషోత్తమునిలో రాశీభూతమైనవి. రాయబారికి జగన్మో హనమైన ఆకృతి అత్యంతావశ్యకము. ప్రతిపాదించవలసిన విషయము, జలదస్వన గంభీరముగ ధర్మార్థ మధురముగ త్రికరణశుద్ధిగా సత్యము చెప్పవలెను. పరేంగితజ్ఞత, వాగ్వైభవము ఎదుటివారిని తనప్రక్కకు త్రిప్పుకొను నేర్పు రాయబారికి అత్యావశ్యకము. ఆ మహానుభావుని సంభాషణలో మర్మము మందునకైనను లేదు. ప్రప్రథమముగ రాయ బారమునకు వెళ్ళుచు పాండవులయొక్కయు, ద్రౌపదియొక్కయు, అభి ప్రాయము లన్నియు విని కార్యభారమంతయు తనమీద వైచుకొని

హస్తినాపురమునకు వచ్చెను. అతడు ధృతరాష్ట్రునికొలువులో భీష్మ, ద్రోణ, కృప, విదురుల సమక్షమున దుర్యోధనునకు చెప్పవలసినదంతయు చెప్పి కర్తవ్య ముపదేశించెను. నారద, జమదగ్ని, కణ్వాది మహర్షులుకూడ కౌరవసభకు ఏతెంచి కేశవుడుచేయు చతుర సంభాషణాచాతుర్యము విని ఆశ్చర్యచకితులైరి.

"అంబుదశుభగాత్రుం, బీ
తాంబరధరు, కమలదళనిభాక్షున్, హరి జూ
డం బడసి లోచనము లమృ
తం బానిన మాడ్కి సమ్మదంబున దేలన్."

(ఉద్యోగ – తృతీయ - 255)

"ఆ కొలువువారు గరమచ
లాకృతి నొకపలుకు లేక, యందఱు వింజం
బాకిడినకరణి నవశము
దాకారితచిత్తవృత్తులై యుండంగన్."

(ఉద్యోగ - తృతీయ – 255)

సర్వహృదయాంతర స్థితభావ మర్మజ్ఞుడగు పురుషోత్తముడు గంభీరాకృతితో సంభాషణా చాతుర్యముతో సభలోనున్న సర్వులను మంత్రముగ్ధ భుజంగములువలె ఆకర్షించెను. ఆ మహానుభావుడు ధృతరాష్ట్రునితో నిట్లుచెప్పెను.

"నీ వెఱుంగని పనులు కలవే, అయినను, తగవు, పరమహితము, తనవారికి చెప్పుట భావ్యమని భారతాన్వయము ప్రియము పొందుటకై ఇటకు వచ్చితిని. పాండవులు కౌరవులు క్షీరోదకగతి కలసి మెలసి యుండునట్లు చూచుట మనకర్తవ్యము. అదియే నీవు ముఖ్యముగ చేయవలెను. కౌరవులు నీబిడ్డలని పాండవులు పరులని భేదదృష్టి పెంచుకొనవలదు. కౌరవపాండవులు కలసిమెలసి శాంతత పొంది

యుండుట నీకు నాకు కులమునకు రాజమండలమునకు మేలు కలిగించును. అట్లుకాక పోరు సంభవించినచో గొప్ప ఆపద పుట్టును. ధరిత్రీ రమణాగ్రగణ్య! పర్యాలోచించి పొందు ఒనరింపుము.”

శ్రీకృష్ణుడు తనఉపన్యాస సౌధమునకు శిఖరమువంటి ఒక పద్యము తెలిపెను.

“సారపుధర్మమున్ విమలసత్యము – బాపముచేత బొంకుచేఁ
బారము బొందలేక చెడబారినదైన యవస్థ, దక్షులె
వ్వారు లుపేక్షచేసి రది వారలచేటగు, గాని ధర్మని
స్తారక మయ్యు, సత్య శుభదాయక మయ్యును దైవముండెడున్”

“పాండవులకు దగిన పాలు మేదినిఁబంచి
యిచ్చుకంటె గార్య మెద్ది గలదు?
ధర్మ మెద్ది? సముచితం బగువిధ మెద్ది?
శక్య మెద్ది చెపుడ వాక్యవిదులు”

(ఉద్యోగ – తృతీయ – 273 – 275)

శ్రీకృష్ణుడు ప్రస్తుత పరిస్థితిని సమీక్షించి ధర్మమహత్త్వము సహస్రముఖముల ధ్వనించునట్లు ప్రవచించెను. ధర్మసత్యములను పాపముచేత, బొంకుచేత, అనాగ్రహిక్కినపుడు అధర్మమును నివారింపగల దక్షులుండియు, ఉపేక్షవహించినచో, వారలతోపాటు అధర్మమును నాశముచేసి, ధర్మసంస్థాపనము దైవము చేయును. ధృతరాష్ట్రుడు అమిత పుత్రప్రేమ వ్యామోహితుడై రాజ్యలోభముతో, దుర్యోధనుని దుర్మార్గమును నివారింప సమర్థత కలిగియు చూచియుచూడకుండ మిన్నకుండెను. పైపెచ్చు పుత్రుడుచేయు అన్యాయములకు పరోక్షముగ సహకరించుచున్నాడు. ద్రోణ భీష్మాదులు కూటికాశించి ఔదాసీన్యము వహించిరి. తత్ఫలితముగ ధర్మము అనాగ్రహిక్కబడుచున్నది.

ఆ సమయమున శ్రీకృష్ణుడు ధర్మోపదేశముచేసి తుదకు విశ్వరూపము ప్రదర్శించియు దుర్యోధనునకు భావపరివర్తనము తెచ్చుటకు బహుధా ప్రయత్నించెను. తాను చేయదలచిన దుష్టశిక్షణ పాండవులచే చేయించి ధర్మసంస్థాపనము చేసియున్నాడు.

రాజు చతురుపాయములను క్రమముగ అనుసరించి చరమోపాయముగ యుద్ధమును స్వీకరింపవలెను.

శ్రీకృష్ణుడు కర్ణునిపై భేదనీతిని ప్రయోగించెను. రాయబారము పూర్తిచేసికొని హస్తినాపురమునుండి వెడలుచు కర్ణుని తనను సాగనంపుటకు రమ్మని శ్రీకృష్ణుడు కర్ణుని తోడ్కొనిపోయి ఇట్లు చెప్పెను.

"నీవు కుంతీపుత్రుడవు. రాధేయుడవు కావు. పాండవులలో చేరినచో నిన్ను సింహాసనముపై కూర్చుండబెట్టగలను" అని చూపవలసిన ప్రలోభములన్నియు ప్రదర్శించెను. దీనివలన కర్ణుని తేజోవధ అయినది. కర్ణునకు దుర్యోధనునిపై అపారమైన పలుకుబడి కలదు. కర్ణదుర్యోధనుల స్నేహబంధము విడదీయుటకు శ్రీకృష్ణుడు ఎత్తులనెత్తెను. కర్ణుడు ఒకింత దూరమైనచో దుర్యోధనుని ఊహాలన్నియు పేకమేడవలె కూలిపోయెడివి. అయినను శ్రీకృష్ణుని భేదనీతి ప్రత్యక్షముగ విఫలమైనట్లు కనిపించినను పరోక్షముగ మహాప్రయోజనము సాధించినది. కర్ణుడు పాండవులు తన తమ్ములని తెలిసికొన్నపిదప అతనికి పాండవులపైనున్న ద్వేషము పలుచబడుట జరిగినది. అంతియేగాక తాను, దుర్యోధనుడు, దుశ్శాసనుడు కలసి పాండవులకు చేసిన ఘోరాపరాధములన్నియు కన్నుల ముందు ప్రత్యక్షమయినవి. దీనితో ఆతని హృదయము పశ్చాత్తాపముతో కుతకుతఉడికినది. శ్రీకృష్ణుడుపయోగించిన భేదనీతి కర్ణుని హృదయమును మార్చివేసినది. సర్వజన హృదయాంతరవర్తియైన పురుషోత్తముడు జీవులలోని బలహీనతలపైన దెబ్బకొట్టి లొంగదీయును.

శ్రీకృష్ణుడు ఉభయపక్షముల శ్రేయము మనసులో నుంచుకొని సంధిచేయుటకు తాను ఎట్లు ప్రయత్నించెనో ఇట తెలిపియున్నాడు.

"నేనును నా యోపినంత సామవాదంబు లాడితి; నారదాది మహామునులును సుయోధనునకు బుద్ధులు సెప్పునట్లు సేసితి; నేమి చెప్పినను నెంతటంబో కున్నంగినుక తెచ్చికొని, జంకించియు భంగించియు ధిక్కరించియు దృణీకరించియుం జూచితి; గార్యంబు భగ్నంబగుట కోర్వక వెండియు శాంతవచనంబులు పలికితి; నతం డశక్తు దుర్జనత సేయంజూచిన నమానుషంబు లగువానిం గొన్ని వెడ మాయలం బన్ని వెక్కసోకలం బోయితి; నెన్నిభంగుల సంధియు గావలయునని పోరలం గలయంతయుం బోరలితి; నప్పాపాత్ముం డెట్లు నుం జక్కంబడక, తనచలంబుతోన పొట్టుపోరలయ్యె గయ్యంబు వోడుచుంగాని యవశ్యంబును రాజ్యంబు పాలిచ్చువాడు గాడు; కౌరవులయెడ దండంబు దక్క నొండుపాయంబు లేదు; మీకుం బోలినతెఱంగు సేయుండు." (ఉద్యో- చతుర్థ- 83)

శ్రీకృష్ణునికి బంధువాత్సల్యము అమేయము. ఉత్తములు, ధర్మాత్ములు, తననే జీవితసర్వస్వముగా నమ్ముకొన్న పాండవులకొఱకు శ్రీకృష్ణుడు తనసర్వస్వము సమర్పించి సంతోషించిన సాధుపురుషుడు. దీర్ఘదర్శియైన శ్రీకృష్ణుడు సుభద్రార్జునుల పరిణయమునకు అన్నయగు బలరామునకు ఇష్టములేకున్నను కపటనటనాసూత్రధారుడై ఆ పెండ్లి చేయించెను. సుభద్రార్జునుల గర్భశుక్తి ముక్తాఫలము, అసామాన్య పరాక్రమ సంపన్నుడు, దుర్నిరీక్ష్య తేజోవిరాజితుడు, పాండవవంశకీరు డగు అభిమన్యుడు ఉద్భవించెను. ఉత్తరాభిమన్యుల పుత్రుడే పరిక్షిత్తు. దురభిమానియగు అశ్వత్థామ శ్రీకృష్ణుడు ఎంత బ్రతిమాలినను వినక ఉత్తరగర్భమును విచ్ఛిన్నము చేయుటకు బ్రహ్మాస్త్రము ప్రయోగించెను. పరమ కారుణ్యమూర్తియగు శ్రీకృష్ణుడు మృత్యుముఖమున

పడియున్న పరిక్షిత్తునకు ఆయుర్దాయము ప్రసాదించి పాండవుల వంశాంకురము నిలబెట్టెను.

మహాభారత యుద్ధములో అనేక విషమసమస్యలు ఎదురైనవి. అవి అన్నియు శ్రీకృష్ణుడు వివిధోపాయ పరాయణుడై రాజనీతి ధురంధరుడై సమన్వయించెను. పాండవులకు విజయలక్ష్మిని ఆ మహానుభావుడే సముపార్జించిపెట్టెను. ఆతని భక్తవాత్సల్యము నిరుపమానము. శ్రీకృష్ణుడు మూడు పర్యాయములు విశ్వరూపమును ప్రదర్శించి పరబ్రహ్మత్వమును ప్రకటించెను. ఈ ప్రదర్శనములకు విశేషప్రయోజనమున్నది. రాయబారమునకు వచ్చినపుడు శ్రీకృష్ణుడు దుష్టచతుష్టయము యొక్క హృదయములో పరివర్తనము కలిగించుటకు చూచెను. మహాభయంకరమైన ఆ తేజోరూపము చూచి కౌరవసభలో నున్న వారందరు భయభ్రాంతులైరి. దుర్యోధనాదులలో ఆవగింజంత అయినను పరివర్తనము కలుగలేదు. విధి బలవత్తరముకదా ! దుర్యోధనుని కారణముగ మహాభారత సంగ్రామములో ప్రజానాశనము కావలసి యుండగా సంధిమాటలు ఆతనికి ఏల రుచించును ?

కురుక్షేత్రమున ఉభయపక్షములు సమరోన్ముఖులై ఉండిరి. అపుడు అర్జునుడు స్వజనసంహారము చేయజాలననియు, గురువులను, తండ్రులను తాతలను చంపి రక్తపుకూడు తానుతినజాలననియు మోహసంక్రాంత హృదయుడై గాండీవము క్రిందపడవైచి చతికిలపడెను. ఆ క్లిష్టసమయములో జగన్నాథుడైన శ్రీకృష్ణుడు ప్రియశిష్యునకు భగవద్గీత ఉపదేశించి ఆతనికి విశ్వరూపమును ప్రదర్శించెను. ఈ విశ్వరూప ప్రదర్శనము అర్జునునిపై అమేయమైన ప్రభావము కలిగించినది.

"మోహతమంబు వాసె దుది ముట్టనసీదు ప్రపత్తి వీతసం
దేహుడ నైతి గాఢపరిదీప్తమహాకృతి గాంచి బోధస

న్నాహానిరామయస్థిరమనస్స్థితి బొందితి సర్వలోక ని
ర్వాహవినోద నీ విమలవాక్యము చొప్పున నెల్ల జేసెదన్."

(భీష్మ- ప్రథమ- 228)

ఉదంకమహాముని కౌరవనాశము విని సమర్థుడైన శ్రీకృష్ణుడు ఉండియు ఈ ప్రజాక్షయమేల నివారింపలేదని కోపించి శ్రీకృష్ణుని శపింప నుద్యుక్తుడయ్యెను. ఆ సమయమున శ్రీకృష్ణుడు తన శక్తి మత్త్వము నెఱిగించుటకొరకు విశ్వరూపప్రదర్శనము చేసెను. దానితో ఉదంకమహర్షి తన తప్పు తెలిసికొని శ్రీకృష్ణపరమాత్మను బహుధా ప్రస్తుతించెను.

నరనారాయణుల సంబంధము శరీరాత్మల సంబంధము వంటిది. ఆ గురుశిష్యసంబంధము జగదేక పూజ్యమైనది. శ్రీకృష్ణుడు జగద్గురుడు సద్గురుడు. అర్జునుడు ఉత్తమశిష్యుడు. గురువు సాక్షాత్ భగవానుడు, యోగీశ్వరేశ్వరుడు. జగదాచార్యుడు. శిష్యుడు దైవీగుణసంపన్నుడు స్వచ్ఛహృదయుడు. పుణ్యకర్మపరతంత్రుడు ఉత్తమసఖుడు. బంధువు. వినయ సంపన్నుడు. తనయందు అచంచలమైన భక్తికలవాడు. ఈ సమావేశము అపూర్వమైనది. కారణజన్ములైన నరనారాయణులే అర్జున శ్రీకృష్ణులుగ అవిర్భవించిరి.

ప్రస్థానత్రయములో భగవద్గీత విశేషప్రాముఖ్యము పొంది యున్నది. తిక్కనార్యుడు సంస్కృతభారతములో వ్యాసమహర్షి రచించిన భగవద్గీతను యథాక్షరముగ అనువదింపకపోయినను అందలి వ్యాసహృదయమును తెలుగుభారతములో మనోహరముగ ఆవిష్కరించి యున్నాడు. సంస్కృతభారతమునకు ఎంత వైశిష్ట్యమున్నదో తెలుగుభారతమునకుకూడ అంత వైశిష్ట్యముకలదని నొక్కి చెప్ప వచ్చును. భగవద్గీతలోని సారభూతములైన శ్లోకములభావము తెలుగు

భారతములో తిక్కనగారు తేనెలూరు తెలుగు పలుకుబడులతో పేర్చి కూర్చిరి. అర్జునుడు స్వజన సంహారము చేయుటకు శంకించి మోహా సంక్రాంత హృదయుడై అస్త్రసన్యాసముచేసెను. అంత జగదీశ్వరుడు కలకలనవ్వి అర్జునుని హృదయదౌర్బల్యము నిందించి ఇట్లనెను.

"దెప్పరపుజోట నీ కీ
యొప్పనివిధ మెచటినుండి యొరవెను నిను మీా
చొప్పవివేకులయది యిది
దప్పించును సద్గతియు నుదాత్త యశంబున్."

"తగునే యర్జున యీా పెంటితనము నీకు
దండివై లెమ్ము మనసు పేదరిమి విడిచి
యనిన నట్లున్న భంగిన యల్ల నిట్టు
లనియె నాతండు పుండరీకాక్షుతోడ."

(భీష్మ - ప్రథమ - 190 - 192)

ఇది అవివేకుల పద్ధతి. ఒప్పనివిధము ననుసరించిన సద్గతియు, ఉదాత్తాశయము తప్పును. తగనివారికొరకు వగచుట అవివేకము. పండితులైనవారు చనిపోయినవారికొఱకు వగవరు. పుట్టువారు గిట్టుట తథ్యము. దేహమునందు బాల్యము, యౌవనము, వార్ధక్యము కలుగు విధమున జీవులు పరిణామముపొందుట అవశ్యభవితవ్యము. శరీరమునకు నాశముగాని, ఆత్మకు కాదు.

"పురుషుడు సెడు నను వాడును
పురుషుడు సెఱుచునని పలుకు పురుషుండును స
య్యెరుగరు నవివేకుల య
ప్పురుషుడు సెఱుపండు సెడడు భుజవీర్యనిధీ."

(భీష్మ - ప్రథమ - 198)

పురుషుడనగా వేరొకడు లేడు. పురుషోత్తముడు శ్రీకృష్ణుడే. భగవద్గీతకు అంతయు పరమార్థమైన

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ"

అను శ్లోకము ఇట్లు ఆంధ్రీకరించబడినది.

"క్రందుకొను సర్వధర్మవికల్పములను
నెడల విడిచి దృఢంబుగ నే నొకండ
శరణముగ నాశ్రయింపుము సకలదురిత
ములకు దొలగింతు నిన్ను బ్రమోద మొంద"

(భీష్మ - ప్రథమ - 224)

శ్రీకృష్ణునకు అర్జునునిపైగల వాత్సల్యము ఇంతింత అనరానిది, అర్జునుని విజయమనగా శ్రీకృష్ణుని మహోద్యమ విజయమే. శ్రీకృష్ణార్జునుల మైత్రీమాధుర్యము శ్రీకృష్ణుని విజయునకు సారథిగ చేసినది. శ్రీకృష్ణుడు అర్జునునకు తనకు గల సంబంధము అనేకసందర్భములలో ప్రశంసించియున్నాడు.

"సఖుడు సంబంధి శిష్యుండు సవ్యసాచి
నాకు నతనికినై యేను నరవరేణ్య
కూర్మిమై నిత్తు గండలు గోసియైన
నరయ నాతండు నాయెడ నట్టివాడ."

(భీష్మ - తృతీయ - 284)

పరిశీలనము చేసి చూసినచో శ్రీకృష్ణునకు సంధిచేయుట ఇష్టమా? యుద్ధమునకు అనుగుణముగ సర్వము తీర్చిదిద్దుటయా? అనునది తేల్చవలసియున్నది. శ్రీకృష్ణుని అవతారప్రయోజనము నెరవేర్చుటలో దుష్టశిక్షణము ఒక భాగము. అది చేయుటకొరకు యుద్ధమునకు కావలసిన సామగ్రి యంతయు నేర్పుగా సమకూర్చెను. శ్రీకృష్ణుడు సంధిచేయుటకొరకు మహాయత్నము చేసెను. దానిలో

అంతర్యమేమనగా మానవుడు పురుషప్రయత్నము ఎంతమాత్రము విడనాడరాదని చెప్పుటకొరకే. విద్వాంసులు ఉపాయము ఉపేయము సర్వమును ఈశ్వరుడే అని చెప్పుచున్నారు. శ్రీకృష్ణుడు భూభారమును తొలగించుటకొరకు ఉదయించెను. స్థూలదృష్టికి ఉభయపక్షములకు సంధిచేయుటకు శ్రీకృష్ణుడు బహుధా యత్నించినను సూక్ష్మముగ పరిశీలించినచో సమరమునకు వలసిన సకలశక్తులను సమాయత్తము చేసెను. శ్రీకృష్ణుని ప్రధానధ్యేయము పాండవులచేత దుష్టులు ఆతతాయులు అయిన కౌరవులను సంహరింపజేసి ధర్మరాజును సింహాసనముపై అధిష్ఠింపచేసి ధర్మసంరక్షణము చేయుటయే. దుష్టనాశము సమరముఖమున కాని జరుగదు.

ఉత్తరాభిమన్యుల పరిణయానంతరము బంధువులను సమావేశపరచి పాండవుల రాజ్యభాగము పొందుటకు ఉపాయముకొరకు చర్చ సాగింపచేసెను. ఈ చర్చ ఎవరు పాండవుల పక్షమువహింతురో ఎవరు కౌరవపక్షము వహింతురో తెలిసికొనుటకు తోడ్పడినది. బలరాముడు కౌరవపక్షముపై మొట్టమొదటినుండి మొగ్గుదలచూపెను. సభలో రాయబారినిపంపి కార్యము సానుకూలము చేసికొనవలెనని నిశ్చయింపబడినది. ఆ చర్చకు శ్రీకృష్ణుడు అధ్యక్షతవహించి ముక్తాయింపుగ నిట్లు పలికెను.

"పొందైన లెస్స, విరసపుఁ
గ్రిందయ్యెడు చందమైన, రాజుల నెల్లన్
ముందర రావించి, క్రమం
బొందఁగ మము బిలువబంపుఁ డొయ్యన పిదపన్."

(ఉద్యోగ - ప్రథమ - 45)

"మీ పనుపున రాజ్యము పా
లీ పాండుతనూభవులకు నీకన్న, భుజా

టోపభయంకరు డర్జును
కోపానల మడరి ముట్టికొనదే వారిన్ ?"

(ఉద్యోగ - ప్రథమ - 46)

దుర్యోధనుడు, అర్జునుడు మహాభారత సంగ్రామములో సాయ మర్థించుటకొరకు శ్రీకృష్ణుని సమీపించిరి. శ్రీకృష్ణుడు తాను ఒక భాగమున ఉందుననియు, గోపాలురు మరొకభాగమున ఉందురనియు, బాలుడగుటచే అర్జునునకు కోరుకొను అవకాశము ముందునిచ్చెను. విజయుడు శ్రీకృష్ణుని సారథిగనుండుమని ప్రార్థించెను. శ్రీకృష్ణునకు అర్జునునిపై గల వాత్సల్యము ఇందు తేటతెల్లమగుచున్నది.

సంజయుడు వాక్చాతుర్యముతో కౌరవులను సమర్థించుచు పాండవులను పొగడుచు వారు యుద్ధముచేయుటకంటె భిక్షాటనము చేసికొని జీవించుటమేలని చల్లగా తెల్పెను. అదివిని శ్రీకృష్ణుడు మండిపడి దుర్యోధనాదుల దుర్మార్గమును ఖండించుచు ఇట్లనియె :

"పాండవాగ్రజన్ము పలుకుల చందంబు
సూడ సంధిలేని చొప్పుదోచె"

"ఈ సంధికార్యంబు అత్యంత దుర్ఘటంబు."

(ఉద్యోగ - ప్రథమ - 338 - 352)

రాయబారమునకు వెడలునప్పుడు తనఎదుట ద్రౌపది ఆమెకు కలిగిన పరాభవమును వివరించి రాజరాజుపీనుగు చూడకపోయినచో శాంతిలేదని శ్రీకృష్ణునకు విన్నవించెను. అత్తరి శ్రీకృష్ణుడు ద్రౌపదిని సమాశ్వాసించి

"క్రూరాత్ములగు కౌరవులెల్లవారికి వధ్యులు గాంచగుదురు- నీకేల యవధ్యులైరి; పాపాత్ములగు హింసకులం బాముల నెట్లట్లు నిర్విచారంబుగా వధియించుట కర్తవ్యంబు."

(ఉద్యోగ-తృతీయ-37)

సమరము చేయుచున్నప్పుడు తాతలను గురువులను సోదరులను ఏవిధముగా చంపగలనని అర్జునుడు విచారమును అసమర్థతను ప్రకటించెను. అప్పుడు శ్రీకృష్ణుడు విశ్వరూప ప్రదర్శనము చేసి ఇట్లనెను.

"ఏను లోకక్షయకర్త యగు కాలుండ నిచ్చో జనసమాజ సమాహారంబునకు ప్రవృత్తుండ నైతి నీవు సంపవలయు నని లేదీ గురు భీష్మాదులెల్లును లేకుండువార నాచేతం జచ్చిన వీరి నెల్లను జయించిన వాడవగుటకు నిమిత్తమాత్రమ్ము గమ్ము కెమ్ము రాజ్యమ్ము గైకొనుము." (భీష్మ- ప్రథమ- 215)

అయినచో శ్రీకృష్ణుడు సంధిచేయుటకు ఏల ప్రయత్నించెను? అను ప్రశ్న ఉదయించును. ఏ కార్యమైనను ఫలించుటకు పురుష ప్రయత్నము, దైవానుకూల్యము కలిసిరావలెను. అందుకొరకే శ్రీకృష్ణుడు ఇంతచేయవలసివచ్చెను. కర్మాచరణము మహాపురుషులకు చేయవలసిన అవసరము లేకపోయినను లోకసంగ్రహార్థము చేయుదురని తాత్పర్యము. దీనివలన మరొక ప్రయోజనము కూడ సిద్ధించినది. మానవుడు చేసిన సుకృతము కాని దుష్కృతముకాని ఫలము పొంది తీరవలెను. దోషము చేసిన వ్యక్తికి ఆతడు చేసిన దోషము తెలియ చెప్పి, ఆతని ఆత్మీయులచేత మందలించునట్లుచేసి అతని తప్పు సరిదిద్దు కొనుట కవకాశమీయవలెను. శ్రీకృష్ణుడు చెప్పినట్లు దుర్యోధనుడు చేసియుండినచో పిల్లలతో పాపలతో సకలలోకము చల్లగ నుండి యుండెడిది. అట్లుచేయకపోవుటచేతనే దుర్యోధనుడు తానుచేసిన తప్పునకు ప్రతిఫలము పొందినాడు. శ్రీకృష్ణుడు ఈ మహాప్రయత్నములకు సూత్రధారుడై తాను చేయవలసినదంతయు చేసి ధర్మము న్యాయము పాండవుల పక్షముననే ఉన్నదని ప్రజాభిప్రాయమును పాండవులపై త్రిప్పుకొనుటకు తోడ్పడియున్నాడు. జగన్నాటకసూత్రధారి సమరమునకు వలసిన సర్వశక్తులను సర్వరాజ్యమండలమును, సమీకరించి సమర యజ్ఞముతో పాండవులచే దుష్టులగు కౌరవులను బలిపశువులుగ సంహా

రింపజేసి తన దుష్టశిక్షణ కార్యక్రమము నిరంతరాయముగ నిర్వ హించెను.

శ్రీకృష్ణుడు రాజనీతిలో నీతిని మేళవించెను. రాయబారులు, న్యాయనిర్ణేతలు. వాదము పరిష్కరించుటకు వెడలినపుడు ఉభయ పక్షములిచ్చు సత్కారములకు లొంగకపోవుటయే సత్సంప్రదాయము. రాయబారముకొరకు హస్తినాపురమునకు వెళ్ళిన శ్రీకృష్ణుడు దుర్యో ధనుడు మహాసంరంభముతో తనకుగల ప్రాభవమంతయు ప్రకటీకృత మగునట్లు ఏర్పాటుచేసిన విందుభోజనము తిరస్కరించి మహాభక్తు డైన విదురుడొసగిన హృదయపూర్వకమైన ఆతిథ్యమును స్వీకరిం చెను. దుర్యోధనుడు తనయింటికి శ్రీకృష్ణుడు భోజనమునకు రాకపోవు టకు గల కారణమును గుచ్చి ప్రశ్నించెను. శ్రీకృష్ణుడు పగవారి యింట తిన్న అమృతమైనను విషమగుననియు ఆత్మీయులొసగిన పత్రము, పుష్పము, తోయము తన కెంతయో తృప్తి కలిగించునని చెప్పెను. పాండవులు తనకు ప్రాణసమానమైనవారనియు ఆ పాండ వులకు శత్రువులు తనకును శత్రువులే యనియు ధర్మమునకు ధర్మికిగల సంబంధమును మనోహరముగ వివరించెను.

"పగవారియింటఁ గుడిచిన,
నగుఁ దమ కనుమాన; మమృతమైనను దారుం
బగతురకుఁ గుడువఁబెట్టగఁ
దగ దొడఁబుల కెప్పు డెవ్విధము వాటిలునో."
"ఏను బగతుండను యంటేని"
"అలుగుదు పాండవులకు, వా
రలు నాకుం బ్రాణములు; ధరావల్లభ! యి
ట్టులముగ దమ ప్రాణములకు
నలుగు జనులు పగతు రగుట యనుమానంబే ?"

"కారణంబు లేక కౌంతేయులకు బాల్య
మాదిగాఁగఁ గీడె యాచరింతు
పుణ్యవరులు దోఁడబుట్టువు లార్యులు
వైర మెత్తఁ దగునె వారితోడ !"

(ఉద్యోగ - తృతీయ - 224, 225, 226, 227)

కౌరవుల అన్నము దుష్టాన్నము. యజమాని చేసిన పాపము అన్నమును ఆశ్రయించుకొనియుండును. ధర్మమునకు శత్రువులు పరమేశ్వరునకును శత్రువులే. ధర్మసేతువును నిలుపువారే ధర్మశీలురు. యుక్తాహారము, యుక్తవిహారము మానవుల ఇహలోక, పరలోకసౌఖ్యములు సమకూర్చు సాధనములు. భగవద్గీతలో సాత్త్విక, రాజస, తామస పదార్థ విభజనము చేయబడినది. అన్నమునకు దోషము ఆశ్రయమునుబట్టియే వచ్చును. మల్లెలు నీటిలో వేసినచో వాని పరిమళము నీటికి సంక్రమించుచున్నది. నీటిలో ఉల్లి వేసినచో ఆ వాసనయే వచ్చుచున్నది. అట్లే ధర్మమునకు శత్రువులు పరమేశ్వరునకు శత్రువులేయని ధర్మమునకు అనురక్తులు పరమేశ్వరునకు అనురక్తులనియు ఇందు స్పష్టముగ సూచింపబడినది. శ్రీకృష్ణుడు ధర్మసేతువు భంజించిన దుష్టులను తాను సంహరించి పాండవులచేత సంహరింపచేసి తన అవతారప్రయోజనమును సాధించెను. ధర్మమర్మము ఎఱుంగుట కడుంగడు గహనము. శాస్త్రహాని, లోకలంఘనము కలుగకుండ ధర్మమెట్లు అవలంబింపవలయునో భారత ముపదేశించుచున్నది. నీతి, రాజనీతి పరస్పర విరుద్ధములు. శ్రీకృష్ణుడు అవతారపురుషుడగుటచే నీతిని రాజనీతిలో మేళవించి సమన్వయము చేసెను. యుగప్రవృత్తులను బట్టి ధర్మాధర్మముల స్వభావము మారుచుండును. మహోద్యమము సాగించుటలో మహాత్ములకు లోకకళ్యాణమే పరమార్థము. ఉత్తమాశయము సాధించినపుడు ఒక్కొక్కసారి లోకసామాన్య

దృష్టిలో అన్యాయమమా? అను భ్రమ కలిగించునట్లు మహాపురుషులు వ్యవహరింతురు. అట్టి సందర్భములలో పవిత్రమైన ఆదర్శము సాగించుట కొరకు ధర్మము సంరక్షించుటకొరకు ఆ క్లిష్టమైన పరిస్థితులలో ఒకింత అధర్మము అనుసరించినను అధర్మము కాదు. శ్రీకృష్ణుడు రాజనీతిని, మహనీయవ్యక్తిత్వమును, సంభాషణమును, సర్వమును జగత్కల్యాణకాంక్షతో నిర్వహించెను. స్వార్థము మందునకైనను లేదు. చక్రము త్రిప్పునేకాని ఫలము ఆ మహాపురుషునకు అక్కర లేదు. ఫలభోక్తలు ధర్మశీలురు. భారతకథారంభము నుండియు శ్రీకృష్ణుడు సూత్రధారియై కథ నడిపి ధర్మరాజును ధర్మసింహాసనముపై అధిష్ఠింపచేసెను. వ్యక్తియొక్క వ్యాపారముయొక్క ప్రధాన ధ్యేయమును పరిగణింపవలయును. ఆచరణములో పవిత్రత ఉన్నదా లేదా అని చూడరాదు. స్థూలదృష్టికి అధర్మమువలె కనిపించినను సూక్ష్మదృష్టికి అది ధర్మమే - అని సిద్ధాంతము.

ప్రియపుత్రుడైన అభిమన్యుని మరణమునకు ప్రబలకారణమైన సైంధవుని సంహరింతునని అర్జునుడు భీకరప్రతిజ్ఞ చేసెను. శ్రీకృష్ణుని నేతృత్వమువలననే అర్జునుడు తీర్ణప్రతిజ్ఞుడయ్యెను. మానవాతీత శక్తిసంపన్నుడగు జగన్నాథుడు మాయాతిమిరము కల్పించెను. సైంధవుడు సూర్యాస్తమయమయినదని భ్రమించి ఈవలకు వచ్చెను శ్రీకృష్ణాదేశము పురస్కరించుకొని అర్జునుడు సైంధవుని మస్తకమును ఖండించెను. శ్రీకృష్ణుడు పాండవులను కంటికిరెప్పవలె కాపాడెను. బ్రహ్మజ్ఞానియగు ధర్మజుడు శ్రీకృష్ణుని కరుణను ప్రస్తుతించి కృతజ్ఞతాంజలీబద్ధుడయ్యెను. శ్రీకృష్ణుడు ఇట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

"నీదు కోపవేగంబున దు
ర్జను డా జయద్రథుడు ...
... నెవ్వరికెట్లు సేయ జెల్లదె యనినన్"

(ద్రోణ - పంచమ - 191)

"ధర్మేతర్కృష్ణుండవగు నీకు నరిష్టం
బాచరించిన వారికి జెడకుండవచ్చునే"

(ద్రోణ - పంచమ - 22)

ధర్మమహత్త్వము చాలదొడ్డది. "ధర్మో రక్షతి రక్షితః" ధర్మమును రక్షించుటకొరకే శ్రీకృష్ణుడు మాయాతిమిరమును కల్పించెను.

మౌసలపర్వములోని కథ శ్రీకృష్ణుని జీవితపరమార్థమును వ్యాఖ్యానము చేయుచున్నది. శ్రీకృష్ణుని జీవితచర్యలు, అతనియొక్క రాజనీతి మొదలైన కార్యములన్నిటికి ప్రధానపరమార్థము దుష్టశిక్షణ, శిష్టరక్షణ, ధర్మసంస్థాపనములు. యాదవులు బలరామకృష్ణుల అండ చూచుకొని, విశృంఖల ప్రవర్తనముతో మదోన్మత్తులై అవినీతిపరులై ధర్మనాశము కావించుటకు పాల్పడిరి. యాదవులు కణ్వాదిమహర్షులను అవమానించిరి. వనితలు లజ్జవిడిచి ఇచ్చవచ్చినరీతి ఉన్మార్గమున సంచరించిరి.

"యాదవనివహంబు బ్రాహ్మణ ప్రతతికి బాధసేయు"
"గురులకవమాన మొనరించు దిరుగు లజ్జవిడిచి, యభిలాషముల వెంట విభులపంపుసేయక ఉన్మార్గములలో తమచిత్తమునకు వచ్చినట్లు ప్రవర్తించుచున్నారు."

గాంధారి యాదవులెల్లరు తగవులాడుకొని మరణింతురన్న శాప కాలము, యాదవులు కణ్వాదిమహర్షులను అవమానించుట అన్నియు కలసివచ్చినవి. తత్కారణముగ పాపనిర్మూలనమునకు శ్రీకృష్ణుడు దోహదము చేసినాడు. సాత్యకి, ప్రద్యుమ్నుడు మొదలైన యాదవులెల్లరు మదిరను సేవించిరి. కల్లుయొక్క కైపుతో ఒకరినొకరు నిందించుకొనుచు తుంగలతో మోదుకొని మరణించిరి. ఇచట ఒకప్రశ్న ఉద

యించును. ఘటనాఘటన సమర్థుడగు శ్రీకృష్ణుడు కంస సంహారము చేసినవాడు, మృతుడైన పరీక్షిత్తును పునర్జీవింపచేసినవాడు, తనకుసంబంధించిన యాదవులు నశించుచుండగా ఏల ఉపేక్షించెను?

కణ్వాదిమహర్షులు యాదవక్షయము కలుగునట్లిచ్చిన శాపము విని నియతికి అన్యథాత్వము చేయుటకిష్టములేక పాపము చేసినవారు తన వారైనను శిక్షింపబడవలసినదే అని కాలవేదియగుటచే శ్రీకృష్ణుడు ఉపేక్షించెను. ఆ సమవర్తికి పాపముచేసినవారు తనవారైనను గర్హింపదగినవారే. ఆ మహామహిమాత్మునకు అధర్మద్వేషమేకాని వ్యక్తి ద్వేషము లేదు. వైద్యుడు దుష్టాంగమునుఖండించి శరీరమును కాపాడు విధమున సంఘములోని అధర్మపరులను, ధర్మద్వేషులను ధర్మధ్వంసకులను నిష్పక్షపాతముగ సంహరించును, సంహరింపచేయును అట్లు కానియెడల సత్యధర్మములయెడ ప్రజలకు భక్తిప్రపత్తులు కలుగవు.

"వలసిన నెట్టికార్యమును వానిరి నెట్టుగనైనఁజేయగా
వలతి మృతుం బరీక్షితుని వత్సలతన్ బ్రదికించె శౌరి మొ
క్కలమున యాదవుల్ పెనగగా గని మాన్పడుపేక్ష సేసె నీ
పొలియు టవశ్యభావ్య మని బుద్ధి గలంచుట గాన
నయ్యెడున్"
(మౌసల - 112)

మహాభారతయుద్ధమందు శ్రీకృష్ణునికి ఎట్టిస్వార్థములేదు. ధర్మజయము అతని పరమార్థము. ధర్మాత్ముడగు ధర్మరాజు భూమికి ప్రభువుకావలెనని శ్రీకృష్ణుడు నిశ్చయించెను. దీనికొరకే శ్రీకృష్ణుడు తన జీవితసర్వస్వమును సమర్పించెను. దుర్వృత్తి కలిగిన దుర్యోధనాదులు జయించినయెడల ధర్మమునకు హానికలుగును. లోకమునకు సంక్షోభము సంభవించును. తత్కారణముచే అట్టి దుర్మార్గులైన దుష్ట

చతుష్టయమును దుష్టసర్పములనువలె ఏవిధముగానైనను మట్టు పెట్టించుట అవశ్యము చేసి తీరవలయును. ఇది శ్రీకృష్ణావతారప్రయోజనము. అందుచే మహాభారతయుద్ధములో కౌరవుల దుర్బలస్థానములను తెలిపి కౌరవనాశనమునకు మార్గము సుగమము చేసెను. ఇవి అన్నియు లౌకికదృష్టికి అధర్మమువలె గోచరించును. శ్రీకృష్ణుడు ధర్మసంరక్షణము చేయుటకొరకు, జగత్కల్యాణము కలిగించుటకొరకు సజ్జనులను రక్షించుటకొరకు ఒకింత అధర్మముచేసినను అది ధర్మమే - అని సిద్ధాంతము. శ్రీకృష్ణుడు అనుసరించిన ఆపద్ధర్మమును అపవాద నీతిలో చర్చితము. ఈ సందర్భమున గురుదేవులు ఆచార్య ఖండవల్లి లక్ష్మి రంజనముగారు శ్రీకృష్ణుని ప్రవర్తనము ధర్మమా? అధర్మమా? అని ప్రశ్నించువారికి చక్కని సమాధానము చెప్పినారు.

"మహానుభావుడగు శ్రీకృష్ణుని చర్యల ధర్మాధర్మముల విమర్శించుట

ఏరులకు వంకలు తీర్పయత్నించుట వంటిది"

(ద్రోణపర్వ పీఠిక)

ఆనందవర్ధనులు భారతములో శాంతమే అంగిరసమనియు, చతుర్విధ పురుషార్థములలో మోక్షపురుషార్థమును ప్రతిపాదించుటయే వ్యాసుని ప్రధానధ్యేయమని సమన్వయించిరి. యాదవుల అవసానము, విరసముగను, తుచ్ఛముగను వర్ణించి, పాండవుల మహాప్రస్థానపద వినాశము వర్ణించుటలో సహృదయులకు వైమనస్యము కలిగించుటకు అనువుగా వ్యాసమహర్షి కథను మలచుకొనెను. అట్టి శ్రీకృష్ణపాండవులకే ఇట్టిగతి కలిగినచో మానవమాత్రులగురించి చెప్పవలెనా? అను విషయము గ్రంథావసానమున ధ్వనించునట్లు చేసియున్నాడు. మహాభారతమందు పాండవాది చరితమే కీర్తింపబడినను పరమేశ్వరు

డైన శ్రీకృష్ణునియందు భావిత చేతస్కులు కండు అనియు, నిస్సార మైన విభూతులయందు అనురక్తులు కాకూడదను విషయము కావ్యము గనుక వ్యంజకశక్తితో ప్రకటించెను.

శ్రీకృష్ణుడు భగవంతుడేకాని మానవమాత్రుడు కాడు. శ్రీకృష్ణుడాచరించినపూతనాదిసంహారము కురుపాండవ సంగ్రామ సాహాయ్యము వేదప్రతిపాదితములే. శ్రీకృష్ణపరమాత్మ పరిపూర్ణ స్వరూప జ్ఞానమును లోకులకు కలుగచేసి తన్మూలమున లోకులను ఉద్ధరించుట కొరకే వ్యాసభగవానుడు మహాభారతరచనము చేసెను. శ్రీకృష్ణ పరబ్రహ్మతత్త్వము భారతకథ ఆద్యంతములందు మణిహారములో సూత్రమువలె వ్యాపించియున్నది.

## 3 ధర్మరాజు

వ్యాసమహర్షి భారతామ్నాయములో వినుత పరాక్రముడు, అనుపమ వివేకవంతుడు, సత్యవ్రతుడు, యశోధనుడు, కృతజ్ఞుడు, ఉత్తముడు, ధర్మపరుడు, శరణాగత రక్షకుడు అగు ధర్మజుని ధీరోదాత్త నాయకునిగా చిత్రించెను. ఇందు మహాపరమార్థమున్నది. శ్రీరామ చంద్రుడు "విగ్రహవాన్ ధర్మః" అను ప్రసిద్ధి వడసెను. అట్లే ధర్మము మూర్తీభవించిన మహోదాత్తమూర్తి ధర్మజుడు. కుంతీదేవియందు ధర్మరాజు జన్మించినపుడు శతశృంగమున సంశ్రితవ్రతులగు విప్రవరులు జాతకర్మ చేసిరి. అపుడు ఆకాశవాణి ఇట్లుపలికినది :

"కురుకుల విభుడగు ధర్మ
స్థిరమతి యగు నీత డనుచు ధృతి జేసి యుధి
ష్ఠిరుడను నామము దా ను
చ్చరించె నాకాశవాణి జనవినుతముగన్"

(ఆది - పంచమ - 97)

రాజసూయమాగ యాగదీక్షితుడగు ధర్మరాజు బ్రహ్మతేజమ్ముతో రాజతేజమ్ముతో సర్వభూషణ రత్నరాజితేజమ్ముతో, "మూర్తమైన ధర్మమును బోలె" ప్రకాశించెనని వర్ణింపబడెను. శ్రీకృష్ణుడు ధర్మరాజును ధర్మవృక్షమని ప్రశంసించెను. ధర్మమునకు ధర్మరాజునకు అవినాభావసంబంధ మున్నది. జగదారాధ్యుడైన శ్రీకృష్ణుడుకూడ ధర్మజునకు నమస్కరించెను. ధర్మమహత్త్వము అట్టిది.

భారత ప్రధానపరమార్థము ధర్మవిజయము. ధర్మమునందే జగత్తునకు ప్రతిష్ఠకలదు. ధర్మిష్ఠునే ప్రజలు సమీపింతురు. ఆరాధింతురు. ధర్మముచేతనే పాపము తొలగును. వేయేల! జగత్తు ధర్మమునందే ప్రతిష్ఠితమై యున్నది. శ్రేయోరూపమగు ధర్మము పరమేశ్వరుడు సృజించెను. బలహీనుడుకూడ ధర్మముచే బలవంతుడగును.

ప్రజలను లెస్సగా నిలువబెట్టునది కాన ధర్మమయ్యెను. లోకమునకు సాహాయ్యము కావించునది ధర్మమేకాని మాతా, పితృ, దారపుత్రాదు లెంతమాత్రము కారు. ధర్మము భారతీయజీవితమునకు ఆధారస్తంభము.

ధర్మమర్మజ్ఞుడు ధర్మరాజు. ఈ మహానుభావునకు ధర్మరాజు, అజాతశత్రుడు, యుధిష్ఠిరుడు అను నామములు కలవు. ఇవి అన్నియు అతనిపట్ల అన్వర్థములు.

జీవితసమరములో నెన్ని క్లిష్టపరిస్థితులెదురైనను, ధర్మము పీసమంతయైన వీడక ధర్మస్థిరమతియై మెలగుట ఈతనికి వెన్నతో పెట్టిన విద్య. మానవులు చతుర్విధ పురుషార్థములలో నొకదానితో నొకటి సంఘర్షణ కలుగకుండ సాధించు ఉపాయము ధర్మరాజు జీవితచరిత్ర అనుశీలనము చేసిన అవగతమగును. ఈ ఆశయముతో భారత

మును ధర్మజనాయకమగ వ్యాసమహర్షి జగద్ధితకాంక్షతో ప్రసాదించెను.

లోకములో ధర్మసత్యములనుగూర్చి ఉపదేశించువారు పరశ్శతముగనున్నారు. "పరోపదేశ వేళాయాం, సర్వే వ్యాస పరాశరాః" చిక్కు ఆచరణదగ్గర వచ్చును. జీవితములో నెన్నికష్టములు వచ్చినను శత్రుసంహారము చేయగలశక్తి కలిగియు, ధర్మపథమును అసిధారావ్రతముగ అనుసరించువారే మహాత్ములు, జగదారాధ్యులు. అట్టి మహనీయుల చరిత్రయే మానవాళికి శిరోధార్యము. ధర్మజుని క్షమాగుణము చాలగొప్పది. మహాపతివ్రత, అయోనిజ, అగు ద్రౌపదీదేవిని రజస్వలను, ఏకవస్త్రను, గురు, వృద్ధజనులు సమావిష్టులైన సభలోనికి తీసికొనివచ్చి భర్తలసమక్షములో దుష్టచతుష్టయము నీచాతి నీచముగ పరాభవించిరి. కర్ణాదులు, పాండవులను అత్యంతనీచముగ నిందించిరి. ఇంతకంటె విషమాతివిషమమైన ప్రాణసంకటము మానవునకు ఏమున్నది ? అత్తరి కనుసన్నచే భీమసింహము, కౌరవ కరియూధము నశ్రమముగ సంహరించును. అయ్యును ధర్మరాజు తనవ్రతమగు క్షమను ఏమాత్రము కోల్పోలేదు. ధర్మజుని ధర్మనిష్ఠ, క్షమాగుణము సామాన్యమానవుల కర్థముకావు. అలనాడు నీలగళుడు హాలాహలమును లోకరక్షణార్థమై మ్రింగినట్లు, ధర్మరాజు ఉభయ వంశశ్రేయస్సు కొఱకు పరాభవ హాలాహలము మ్రింగెను.

సప్తవ్యసనములలో ద్యూతము సర్వానర్థప్రదము. గుణశరణ్యుడు, వృద్ధోపసేవి, ధర్మమర్మజ్ఞుడు అగు ధర్మరాజును ద్యూతవ్యసనమునకు పాల్పడెను. తత్ఫలముగ ప్రియపత్నికి, తమ్ములకు తీరనికష్టములు తెచ్చిపెట్టెను. దానికారణముగనే సకలజనక్షయకరమగు సంగ్రామము సంభవించినది. ధర్మజుని జూదము ఎంతనష్టమునకు అవమానములకు దారితీసినదో వర్ణనాతీతము. మానవులు వీలైనంతవరకు ద్యూతాది

వ్యసనములకు దూరముగ నుండవలెనని సూచితము. విఘ్నప్రాబల్యము మానవుని ఎట్లు కీలుబొమ్మగాచేయునో వివరింపబడినవి. ధర్మజముఖమున దుష్టద్యూతమువలన కలుగు అనర్థములు తెలుపబడినవి.

"క్షత్త్రనీతిక్రమంబులుగావుసూవె
నికృతియును జూదమును ధర్మనిత్యులైన
వారికీ రెండు వర్జింపవలయునెందు,
బాపవృత్తంబు జూదంబు పార్థివులకు"

"కుటిల మార్గులయిన కితవుల,
తోడగడగి జూదమాడజనదు
దానజేసి యర్థధర్మ వివర్జితు,
లగుదు రెట్టివారు జగములోన"

(సభా - ద్వితీయ - 166 - 167)

ధర్మములలో పరమధర్మము శరణాగత రక్షణము. అది ఉత్తమ రాజన్యలక్షణము. పుట్టిననాటినుండి తనకు, అనుంగు తమ్ములకు, భార్యకు నిత్యము అపకారము చేయుటయే ధ్యేయమైనవాడును, ధార్తరాష్ట్రాగ్రజుడును, తనచేత చిక్కినను అపకారముచేయక బంధవిముక్తుని చేసి మహోపకారము చేసినవిధము పరమాశ్చర్యకరము. ఇది అతని అజాతశత్రుడను పేరునకు ఎంతయు తగియున్నది.

"శరణం బని వచ్చిన భీ
కరశత్రుని నయిన బ్రీతి గావగ వలయుం;
గరుణాపరుల తెఱం గిది;
యిరవుగ సరిగావు దీని కేధర్మంబుల్"

(అరణ్య - పంచమ - 413)

ఉపకారముచేసినవారికి ప్రత్యుపకృతి చేయుట మానవత్వము. అపకారికి మహోపకారముచేయుట దైవీగుణము. శత్రువునకుకూడ ఉపకారముచేయుట ధర్మరాజునకే చెల్లినది.

ధర్మజుని భ్రాతృవాత్సల్యము, సర్వజనారాధ్యమైయున్నది. అన్నదమ్ముల అనుబంధము ధర్మానుగుణమై లోకశ్రేయోదాయకమై పరగినది. ఆ కలయిక యున్నచో ఎంతటి దుర్లభమైన కార్యమైనను అప్రయత్నముగా సాధింపవచ్చునని నిరూపింపబడినది.

ధర్మరాజు నిరంతరము శీలవృద్ధులు జ్ఞానసముద్రులైన మహర్షులను, వ్యాసమహర్షిని, యోగీశ్వరేశ్వరుడైన శ్రీకృష్ణపరమాత్మను సేవించి జ్ఞానామృతమును గ్రోలినాడు. అరణ్యపర్వములో ధర్మరాజు శుశ్రూష, శ్రవణ, గ్రహణ, ధారణాది సాధకలక్షణములను పొంది మెలగెను. ఆ మహాభాగుడు ధర్మనిష్ఠుడై పుణ్యకర్మలు, పుణ్యకథాశ్రవణము, పుణ్యతీర్థయాత్రలు చేసి సర్వదుఃఖ విముక్తుడయ్యెను. కర్మము జ్ఞానము రెండును చిత్తశుద్ధికి సోపానములు. అగ్నిహోత్రము చేయు ప్రతి గృహస్వామి జ్ఞాన, కర్మ రూపములు వహించినవాడును కర్మ, బ్రహ్మస్వరూపుడును, స్వర్గాపవర్గ ప్రదాతయు అగు యజ్ఞేశ్వరునకు నమస్కరించుట ఆచారము. కర్మజ్ఞానముల రెంటిని ధర్మరాజు సమముగ అనుష్ఠించెను. మానవుడు దుఃఖములో మునిగినపుడు నిర్వీర్యుడై, నిర్వేదముతో పరివేదనముచేయుట కర్తవ్యము కాదనియు, ఉత్తమజన శుశ్రూష, ఉత్తమవిషయ శ్రవణము, తద్గ్రహణము చేసి ఆచరించినచో తాపత్రయము నశించి, ధర్మరాజువలె సశరీరముగ స్వర్గప్రాప్తి పొందవచ్చునని సూచింపబడినది. శ్రవణము, మననము, నిధిధ్యాస మున్నగునవి సాధకునకు అత్యావశ్యకములు. ధర్మజప్రశ్నల ముఖమున మానవులకు కలుగు సందేహములు, వర్ణాశ్రమ ధర్మములు,

తీర్థయాత్రల ప్రయోజనములు సమస్తము తెలిపియున్నారు. ఆ చర్చల న్నియు విజ్ఞానదాయకములై ఉభయలోక సౌఖ్యసంధాయకములై భారతమునకు ఆమ్నాయత్వమును సిద్ధింప చేయుచున్నవి.

భారతము రాజనీతి రత్నాకరము. ఈగ్రంథములో నధికభాగము రాజన్యుల చరిత్రయగుటచే రాజనీతి అనేకపాత్రిలముఖమున ప్రబోధింప బడినది. శకుని, కణికుడు, సంజయుడు, ధృతరాష్ట్రుడు మొదలైనవారు రాజనీతి నుపదేశించిరి. శ్రీకృష్ణుడు, విదురుడు, ధర్మరాజు మొదలైనవారు ప్రదర్శించినరాజనీతి సర్వోత్తమమై, సర్వజన సౌఖ్యసంధాయకమై సర్వరాజర్షి సేవితమై అలరారుచున్నది. భారతములోని రాజనీతి తెలుపు శ్లోకములు కౌటిల్యుని అర్థశాస్త్రములోకూడ కనిపించుచున్నవి.

శ్రీకృష్ణునితో రాజనీతివిషయములో ధర్మజుడు సమానుడని చెప్పవచ్చును. ఉత్తమరాజనీతికి ప్రధానలక్షణము లోకారాధనము. రాజు అనగా రంజింపజేయువాడు. ప్రజల కన్నీళ్ళుతుడిచి ఆనందము కలిగించువాడు. అట్టి రాజునకు సంబంధించినది రాజనీతి. కేవలము స్వార్థమునకు అధికారదుర్వినియోగమునకు ఉపయోగించు నీతి కూట రాజనీతి. ధర్మజుని రాజనీతి సర్వోత్తమమైనది, అది పాలకునకు, పాలితులకు మేలుగూర్చినదై యున్నది. ఉత్తమరాజన్యుడు స్వసుఖ నిరభిలాషియై, వృక్షమువలె శిరోభారముచే, ఎండవానలకోర్చి, తన్ను ఆశ్రయించిన సకలజీవులకు నీడను, పుష్ప ఫలములొసగి కాపాడవలెను. తల్లిదండ్రులు ప్రజలకు కేవలము జన్మహేతువులు. ప్రజలకు తండ్రి రాజే. ఈ సంప్రదాయము శ్రీరామచంద్రునినుండి అనుస్యూతముగ ప్రవహించుచున్నది. ధర్మజ, భీమార్జున, నకుల సహదేవులు అరణ్యాజ్ఞాతవాసములలో అనేకకష్టనష్టములకు, అవమానములకు గురియయ్యును ప్రతీకారము చేయుటమాని శాంతమును కోల్పోక కౌరవులతో

సంధిచేసికొనుటకు చివరకు పంచగ్రామ సంధికైనను ఒడంబడుటలో యుద్ధమును నివారించి సకల జన శ్రేయమును కోరుట స్పష్టమగును. యుద్ధము చరమోపాయము. ధర్మరాజు కౌరవులతో యుద్ధము జరిగి నచో సంభవించు అనర్థములన్నియు ముందుగా ఊహించి దానిని నివారించుటకు ఎంతయో ప్రయత్నించెను. ఇది ఆతని శాంతికాముకత్వ మును సూచించుచున్నది. ఆయా సందర్భములలో ధర్మరాజు మిత్ర హిత సత్యవాక్య పరిపాలకుడై సంభాషించినను ఘట్టములు ఉదాత్త రాజనీతికి రమణీయ మణిదర్పణములు.

పాండవుల నపహసించుటకై వచ్చిన దుష్టబుద్ధియైన దుర్యో ధనుడే సామాత్య, భార్యా బంధు మిత్రుడై గంధర్వులచే బంధింప బడెను. దుర్యోధనునిభటులువచ్చి,సోదరునిరక్షింపుమని పరమపుణ్యుడు, శరణాగతరక్షకుడు నయిన ధర్మజుని ప్రార్థించిరి. శత్రునకు తగినశాస్తి జరిగినదని భీముడు సంతసించెను. యుధిష్ఠిరుడు తమ్ములను కార్యోన్ము ఖులుగా చేయుటకు, దుర్యోధనబంధవిమోచనము చేయుటకు ఇట్లు ప్రబోధించెను.

"ఏకాన్వయజ్ఞాతులైనవారికి నర్థనిమిత్తంబయినభేదం బొకొ్కొ క్క-మాటు వర్తిల్లు; నంతనచేసి సహజస్నేహంబు దప్పనేరదు; జ్ఞాతి జనంబులు దమలో నెట్టివారైన నొప్పుం గాని యన్యులవలనం బరిభ వంబు దొడరినప్పుడు దా రొండొరుల జేకొన కునికి లోకనింద్యంబు; దుర్యోధనుడు దుర్వినీతుండైనను సభార్యుం డయి పరుల చేతం బట్టువడియె; దీని నుపేక్షించిన మనకుం గులహాని యగు; నిదియు నుం గాక శరణాగతరక్షణంబు రాజమాత్రంబుగు వాని కెల్లధర్మంబు; నీయట్టి బాహుబలసంపన్నునకు నిట్టి సుకర్మంబు కర్తవ్యంబని వేఱు చెప్పనేల? లెమ్ము నీవును నీతమ్ములు నిమ్ముల రథంబులెక్కి- సర్వాయుధసన్నద్ధులై చని సుయోధను చెఱ దలుగుం" డనిన.

(అరణ్య - పంచమ - 409వ)

అమ్మాటలువిన్న భీమన్న మండిపడి దుర్యోధనుడు పుట్టినప్పటి నుండి తమకుచేసిన అపకారముల జాబితపఠించి మనము చేయవలసిన శత్రుభంజనము గంధర్వులే చేసిరి. ఇన్ని అపకారములుచేసినను దయ కలిగియుండుట మనకుకార్యహాని కాదే ? అనిసూటిగా ధర్మజుని ప్రశ్నించెను. గడుసువాడైన ధర్మరాజు సాంత్వనపూర్వకముగా శత్రువుకూడ శరణువేడినచో రక్షించుట రాజుయొక్క ప్రధానధర్మ మనియు దీని కేధర్మము సరికాదని ఇట్లుచెప్పెను:

"ధృతరాష్ట్రిసూనుండు భవదీయ బలశౌర్యంబుల పేర్మి యెఱుంగుం గావున దన్ను నవశ్యంబును విడిపింతురని మనదెస బద్ధాశుం డై యుండు; నిది మనకు బుణ్యంబును గీర్తియుం జేకొను సమయంబు; ఇన్నింత నిర్బంధింప వలవ, దేన యరుగుదు; నిప్పుడు యజ్ఞదీక్షితుండు నై యున్నవాడ గావున నాకుం జనరాదు; మీరు వేగ చని గంధర్వులు ప్రియపూర్వకంబుగా ననునయించి, సుయోధను విడిపించునది."

(అరణ్య - పంచమ - 414 వ)

ఈ సన్నివేశము పరిశీలించినచో ధర్మజుని ఉదాత్త ధర్మదృష్టి నీతిచణత, పరేంగితజ్ఞత, కార్యసాధనాకౌశలము, విశేషించి గరువంపు పలుకుబడి, రాజనీతి పై శారద్యము స్వయం వ్యక్తమగుచున్నవి. దుర్యోధనుని బంధప్రాప్తిని జనసామాన్యదృష్టితో భీముఁడుచూచి, తన ఆగర్భ శత్రువునకు శాస్తి బాగుగా జరిగినదనియు సంతసించెను.

అత్తరి ధర్మరాజు ఇది పరుషవాక్యములకు సమయముకాద నియు, జ్ఞాతివైరమునకు, సహజస్నేహములకుకల భేదము తెలిపి శరణాగతరక్షణమే ఉత్తమక్షత్రియ పరమధర్మమని హెచ్చరించెను. అతడు, సాంత్వనపూర్వకముగ భీముని ఉత్తమసూరతను ప్రశంసించి,

సామదాన, భేద దండోపాయములను ప్రయోగించి పెద్దతమ్ముని ధర్మ నిర్వాహణోద్యుక్తునిగ చేసెను. ధర్మరాజు తనకాలమునాటి ఉత్తమ రాజనీతి కోవిదుల కెంతమాత్రమును తీసిపోనివాడు. దుర్యోధనునివలన ఇంకను తమకీర్తి లోకమున వ్యాపింపవలసియున్నది. గంధర్వులిప్పించిన రాజ్యమును ధార్మికులని, సత్యసంధులని శరణాగతరక్షకులని, దేవతలనైన జయింపగల యోద్ధలని పేరుపొందిన పాండవులైన తమకు గ్రహించుట సమయమునకు పెద్దదెబ్బ. అన్నింటిని మించినది గంధర్వులు దుర్యోధనుని కాంతలను పట్టుకొనిపోయిరి. కావున కులహాని. దుర్యోధనునిభటులు తమరాజును విడిపింపుడని అభ్యర్థించిరి గాని మీరు వచ్చి రాజ్యమును స్వీకరింపుడని కోరలేదు. ఆపని తామొనర్చిన ప్రజా వ్యతిరేకత ప్రాప్తించును. ఇది భీష్మ ద్రోణ విదురాదులు మెచ్చనిపని. ఇంతయోచించి నీతికుశలుడైన ధర్మజుడు దుర్యోధనశత్రువులు మఱియొక సమయమునకు నిలుపుకొనుటకు నిశ్చయించి బంధమోక్షితుని కావింప సోదరుల నంపినాడు. ధర్మజుడు దుర్యోధనునకు బంధమోక్షణ మొనర్చి ఇట్లు బుద్ధులు చెప్పినాడు :

> "ఎన్నడు నిట్టి సాహసము లింక నొనర్పకు మయ్య; దుర్జనుం
> డన్నన సాహసక్రియలయందు గడంగి నశించు గావునం
> గన్నన తమ్ములన్ దొరలగైకొని యిమ్ములబొమ్ము వీటికిన్;
> సన్నుత! దీని కొండొక విషాదము బొందకుమీ మనంబునన్"
>
> (అరణ్య - పంచమ - 434)

"నాయనా, ఎన్నడును ఇట్టిసాహసములు చేయవలదు. దుర్జనుడు దుస్సాహసములయందు కడంగి నశించును. సన్నుత! దీనికి విషాదము పొందకుము. తమ్ములతో మెల్లగ వీటికిపొమ్ము.

ఇవి మాటలా ? కావు ఈటెలు. ధర్మజుడు మెత్తని పులివలె వ్యంగ్య గర్భితముగ మాటలాడెను. ఇంతగడుసుగా మాటాడుట

ధర్మజునకుతప్ప ఎవ్వరికి శక్యమగును ? ప్రీతిగపల్కుటలో ఎంత పేశ లుడో, మెత్తని చివాట్లుపెట్టుటలో అంత మేటి. ఘోషయాత్ర నిజ ముగ ధర్మజుని కీర్తిఘోషయాత్రగ పరిణమించుటకు ధర్మజుని రాజ నీతి ధౌరంధర్యమే కారణము.

ధృతరాష్ట్రుని పనుపున సంజయుడు ఉపప్లావ్యములోనున్న పాండవులకడకు రాయబారముకొఱకు వచ్చి రాజ్యభాగము కౌరవు లీయరనియు, యుద్ధముచేసి సంపాదించిన నెత్తుటికూడుకంటె మీ నడ వడికి భిక్షాన్నమే మేలని తన వాక్చాతుర్యము నంతయు నుపయో గించి పల్కెను. ఆతని మాటలన్నియు విని, ధర్మరాజు అంతకంటె గడుసుగ సమాధానము చెప్పెను.

"ఆ రాజు మాదెసం గల
కారుణ్యాతిశయమునను సుఖంబున నిట్లు
న్నారము; నిను బుత్తెంచిన
గారవమున నాదుమది వికాసము బొందెన్."

(ఉద్యోగ - ప్రథమ - 276)

ఆ రాజు మాయందుచూపు దయవలన నిట్లున్నారము. ఈ వాక్యములో అనేకార్థము లిమిడియున్నవి. ఆ రాజునకు మాయందు దయ యుండబట్టి ఇట్లున్నాము. సుఖంబున ఉన్నారమని కాని లేదా ఇట్లున్నారమని కాని అనుట సామాన్యముగా నుండును. అట్లుకాక సుఖంబున నిట్లున్నారము అనుటచేత ఇన్ని ఇడుమలు పడు చున్నారమని ఆతని అభిప్రాయము. అతని దయవలననే రాజ్యభ్రష్టు లమై, అవమానములపాలై, చెట్టుకు పుట్ట కొకరమై, నానాయాతన ననుభవించుచు, జీవించియే యున్నారము అని భావము. పిమ్మట మేమర్థిజనసంగినట్టి వృత్తులు చెల్లుచున్నవా ? యుద్ధసమయములయందు భీమార్జునులను స్మరించుచున్నారా ? కౌరవులు ఆటోపమున ఘోష

యాత్రకు వచ్చినసంగతి మరచినారా? యుద్ధమునుగూర్చి మమ్మేల భయపెట్టుచున్నావు? నా పలుకులలో నెయ్యముతప్ప నొండొకటి నీ చెవి సోకెనా?

యుద్ధములేకుండ అర్థము సిద్ధించునేని వలదని యుద్ధమునకు పూను నెట్టివా డుండునా? ధర్మానుగతములగు జనారాధ్యము అయిన పనులుచేయు భీమార్జునులే దుష్కర్మము రోయని వారలా? ధృతరాష్ట్రుడు ఆనాడు వక్రుడై నీతిపథము విడిచి, ఈనాడు మమ్ము చక్కని తెరువునపూని నడవుడనుచు బుద్ధులు చెప్పుచున్నాడు. ఎదుటి వారిని తమవలె భావించి గౌరవించిన సంధి పొసగును. కాని మాకు గుడుమిండు మీరిది క్రనక్కగొనుండు అనగా ఎట్లు చక్కబడును? సంపదలేని మమ్ము రావించి పూజించుటకు ధృతరాష్ట్రుడు అంత వేలయా? విదురాదుల హితోపదేశము వినలేదు. అతని చరిత్రము మీకును, మాకును వింతయా? శకుని, కర్ణుడు, దుర్యోధనాదుల చేతిలో ధృతరాష్ట్రుడు కీలుబొమ్మ. భీష్ముడు, కృపుడు, అశ్వత్థామ, కర్ణుడు మున్ను యుద్ధము సంగతి ఎరుగరా? ఆశాపాశముచే చుట్టు కొని ఎదిరిబలము నెఱింగియు, చావేడి మార్కొందురా? తమ్ము కపి ధ్వజ ప్రభలు అంధీభూతులం జేయవే? ముందు మమ్ము పొగడి పద పడి యుద్ధములో కౌరవులను గెల్వనరిది యను మాటను నేనెంత మాత్రము అంగీకరింపలేను. సంజయా, పక్షపాతవృత్తి విడువుము.”

ధర్మజుని కోపము ఇటు మనోహరముగ వ్యక్తమగుచున్నది.

గాండీవజ్యారవం బుత్కటమయి పెలుచం గ్రమ్మినన్
భీము బాహా

దండం బేపారి శుంభద్గద జడియుచు రౌద్రంబుగా
దోచినన్, వే

దండద్వంద్వంబు మాడ్కిం దఱిమి కవలు మాద్యద్గతిం
దాకినం, జా
కుండం బోకుండ గౌరవ్యులకు వశమె బిట్టుల్కి
మూర్ఛిల్లకుండన్ !"
(ఉద్యోగ - ప్రథమ - 324)

తండ్రికి మామీద నిజముగ ప్రేమఉన్న చో మమ్ము పిలిచి కొడుకులను ఒప్పింపచేసి, ఇంద్రప్రస్థమో ఇంకొకటియో ఇచ్చుట ఉచితము కాదా ? నీవు చెప్పినదంతయు ధర్మమువలె నీ వాక్చాతుర్యముచే భావింపచేసినావు. అధర్మము ధర్మమువలె పైకి సామాన్యులదృష్టికి భాసించి, జ్ఞానులచే అధర్మములుగా నిరూపింపబడును. కొన్ని ధర్మములు అధర్మములువలె కనిపించును. నేను చేయునది ధర్మమా? అధర్మమా నిరూపించి నిందించుము. కోపము నివారింపదగును. అహింస ఉత్తమధర్మమే కాని వంశదూషకులు, లోకకంటకులు అగు పాపాత్ములను నిర్మూలించుట ధర్మమని పెద్దలు చెప్పుదురు."

ఈ ధర్మజుని ప్రసంగమంతయు అతని రాజనీతి నైపుణ్యమును తెలుపుచున్నవి. అతనికి తనతమ్ముల పరాక్రమమునందు అచంచల విశ్వాసము కలదు. ధృతరాష్ట్రుని దుష్టత్వమును పేరుపేరున ఖండించెను. "వజ్రమును వజ్రముతో కోయవలెను" అన్నట్లు సంజయుని వాక్చాతుర్యమును, వాక్చాతుర్యముతో ఖండించెను. ధర్మాధర్మ నిర్ణయము సజ్జనస్తవనీయముగ చేసెను. సంజయుడు నోరెత్తి సమాధానము చెప్పకుండ వాకట్టు కట్టించెను. ధర్మరాజువంటి మహాపురుషులకు కోపము కూడ అలంకారమే యని నిరూపించెను. అల్పాక్షరములలో అనల్పార్థము నిక్షేపించబడినది. ఇది ఇంతయు విన్న సంజయుడు తాను వేసికొన్న పథకము అంతయు భగ్నమైనదని వగచి ధృతరాష్ట్రునితో ధర్మజుని గూర్చి ఇట్లు చెప్పెను :

"వశీకృత చిత్తుడు, ధర్మసూతి మెత్తని పులి"
అనుట సర్వదా సమర్థనీయమై యున్నది.

శ్రీకృష్ణుడు రాయబారమునకు వెళ్ళుసమయమున ధర్మరాజు, మహాభారతయుద్ధము అపరిహార్యముగ కలిగినచో పుట్టు విషమ ఫలితములన్నియు గ్రహించి ఉభయపక్ష శ్రేయోదాయకముగు పొందొనగూర్చుమని త్రికరణశుద్ధిగా ప్రార్థించెను. ఆ ప్రసంగములో సర్వజనులకు చిత్తశాంతిని కలిగించు రాజమార్గ ముపదేశించెను. పగ సర్వానర్థప్రదము. శ్రేయస్సు పొందగోరువాడు మనస్సులో పగను పెంచుకొనరాదు. పగ పెంచుకొనుట యనగా పామున్న యింటిలో నివసించుట వంటిదే. పగ కలిగినవ్యక్తి ఊరక ఉండనేరడు. చిత్త మొక రీతిగనుండక సమత తప్పును. దీర్ఘవైరవృత్తి ఎంతమాత్రము తగదు. పగను సమూలముగ నణచవలెను. అది శుభప్రదము. సర్వోత్తమము. పగ పొందినవారు శత్రువు నెదుర్కొనక, పల్కక, ఉండ నేరడు. నెయ్యి ఎంతపోసినను అగ్ని ఎట్లుచల్లారదో అట్లే పగచేత పగ అణగదు. దీనినిగూర్చి ధర్మజుడు ఇట్లు చెప్పెను.

"పగ యడగించు టెంతయు శుభం బది లెస్స; యడంగునే పగం
బగ! పగగొన్న మార్కొనక పల్కక యుండగ వచ్చునే! కడుం
దెగ మొదలెత్తిపోవ బగ దీర్పగవచ్చిన గార్యమొందు; నే
మిగతి దలంచినం బగకు మేలిమి లేమి ధ్రువంబు కేశవా!"
(ఉద్యోగ - తృతీయ - 21)

ధర్మజుని హృదయౌన్నత్యము తెలుపుచున్నది. పగచేత యేమియు సాధింపలేము. భారతము పరిశీలించినచో దుర్యోధనుడు పగ పెంచుకొని నశించెను. ధర్మజుడు పగ తెంచుకొని విజయమొందెను. మానవులు జీవితసమరములో విజయము పొందుటకు ఐహిక సౌఖ్యము పొందుటకు అరిషడ్వర్గమును త్యాగము చేయవలెను.

ధర్మజునియందు క్షమ, దయ, శరణాగత రక్షణాది సుగుణము లతోపాటు పరమధర్మమైన శ్రీకృష్ణభక్తి అపారముగనున్నది. రాయబారమునకు వెడలుచున్న శ్రీకృష్ణునితో ధర్మరాజు నివేదించిన విన్నపమంతయు రాజనీతి, ధర్మ పక్షపాతము, లోకశ్రేయః కాంక్ష తొణికిసలాడుచున్నవి. శ్రీకృష్ణుని పరతత్త్వమును పరిపూర్ణముగ నర్థము చేసికొన్న బ్రహ్మజ్ఞాని ధర్మజుడు.

"ఆపద గడవం బెట్టగ,
నోపి శుభం బైనదాని నొడగూర్పను మా
కీపుట్టువు నకు బాండు
క్ష్మాపాలుడు నిన్నుజూపి చనియె మహాత్మా !"
(ఉద్యోగ - తృతీయ - 6)

"మమ్మెఱుగు, దెదిరి నెఱుగుదు,
నెమ్మి యెఱుగు, దర్థసిద్ధి నెఱి యెఱుగుదు, వా
క్యమ్ముల పద్ధతి నెఱుగుదు;
పొమ్మెవ్వడ నేను నీకు బుద్ధులు సెప్పన్"
(ఉద్యోగ - తృతీయ - 34)

ధర్మజుని పురుషకారమునకు, శ్రీకృష్ణానుగ్రహముకూడి యుద్ధములో విజయము సంప్రాప్తింపచేసినది. అనగా మానవుడు సత్యధర్మనిష్ఠతో కర్తవ్యపాలనము చేసినచో, ఇహపర సౌఖ్యములొనగూడును.

భారతమనగా మానవహృదయ క్షీరసాగరమథనమని చెప్పవచ్చును. ఫలము అమృతము. మహాభారతయుద్ధము అనేక విషపరిణామములకు దారితీసినది. ఇందు పాపులతోపాటు మంచివారు కూడ మరణించిరి. అభిమన్యుని వీరమరణముతో ఉత్తర నవవైధవ్యముతో నసహ్యా వేదనము పొందుచున్నది. సుభద్ర ప్రియపుత్రు మరణముతో

కుమిలిపోవుచున్నది. గాంధారి, కురు పాండవస్త్రీలు, సమరాంగణమున భర్తృ భ్రాతృ పుత్రాదుల మృతదేహములపైబడి దీనముగ విలపించుచున్నారు. కర్ణుడు కుంతి యొక్క జ్యేష్ఠపుత్రుడని తెలిసినది. ధర్మరాజునకు యుద్ధసమయములో తాను చేసిన అపరిహార్యములైన అకార్యములు జ్ఞప్తికి వచ్చినవి. అమానుషమగు పాపములుచేసిన దుర్యోధనాదులు సంహరింపబడిరి. ధర్మరాజు శోకసముద్రమునుచూచి నిర్వేదమును పొందినాడు. సజ్జనుడు, సుకుమారమైన హృదయసంపద కలవాడగుటచే ధర్మరాజు ఆత్మవిమర్శ చేసికొని తనవంటి అధర్మప్రవర్తకుడు రాజ్యమున ధర్మమునెట్లు స్థాపింపగలడనియు సంకోచించెను. సకల బంధునాశనమునకు తానే మూలమని శోకసంవిగ్నచేతస్కుడై, యింతటి పాపమునకు కారణమగు రాజ్యసంపదను సంపూర్ణముగ విసర్జించుటయే కర్తవ్యమని నిశ్చయించెను. ఇట ఆచార్యభూపతి లక్ష్మీనారాయణరావుగారి వాక్యములు అనుసంధింపనగును.

"అపకారముచేసిన పాపిని చంపుటతో కోపము చల్లారినది. కాని మనస్సు శోకాక్రాంతమైనది. ప్రతిహింసాచరణముచే చిత్తస్వాస్థ్యము లభించుట కల్ల. తద్విపరీతమగు ఫలము కర్త అనుభవింపవలసియున్నది."

(భారతము - తిక్కన రచన - పే. 158)

మానవుడు ప్రశాంతత పొందుటకు ముందు ఇట్టి హృదయసంక్షోభము నెదుర్కొనవలెను. ఇది పశ్చాత్తాపముయొక్క ముఖ్యలక్షణము. మనోవైకల్య నివారణమునకు, ప్రశాంతత పొందుటకు గురూపదేశమత్యావసరము. ఆ ఉపదేశామృతమును శ్రీకృష్ణ వేదవ్యాసాదులు ప్రజాపాలన భారముపూను ధర్మజునికై అభివర్షించిరి. ధర్మరాజు విశిష్టజ్ఞాన సంపన్నుడైన కర్మయోగిగ రూపొందవలెను.

జనకునివంటి జీవన్ముక్తులే రాజ్యపాలనార్హులని భారతీయుల విశ్వాసము. ఆ స్థితియే ధర్మజునియందు సిద్ధించినది. జ్ఞానోపదేశము బడసి, స్వధర్మనిష్ఠుడై రాజ్యభారముపూని, వ్యాసమహర్షి ప్రోత్సాహమున లోకహితార్థము అశ్వమేధమునుచేసి సర్వరాజన్యులను ఏకైకశాసనబద్ధులుగా నొనరించెను. దీనివలన మానవుడు నిరాసక్తుడై కర్మయోగివలె స్వధర్మానుష్ఠానము చేసినచో భవబంధవిమోచనము పొందునని సూచితము.

ధర్మజుని వాక్చాతుర్యము, పరేంగితజ్ఞత, సమత, బహుధా ప్రస్తుతింపదగియున్నవి. ఈ వాక్చాతుర్యము అనేక క్లిష్టపరిస్థితుల నుండి పాండవులను కాపాడినది. రాజసూయయాగ సందర్భములో మూర్ఖుడగు శిశుపాలుడు శ్రీకృష్ణుడు ఏవిధముగ చూచినను పూజార్హుడుకాడని తీవ్రముగ నిందించెను. అప్పుడు ధర్మరాజు అతనిని అనునయించుచు ధర్మార్థమధురముగ నిట్లు పలికెను.

"భూరిగుణోన్నతు లనదగు,
వారికి ధీరులకు ధరణీవల్లభులకు వా
క్పారుష్యము చన్నె మహా
దారుణ మది విషముకంటె దహనము కంటెన్."

(సభ - ద్వితీయ - 17)

వాక్పారుష్యము విషముకంటె, అగ్నికంటె కీడు కలిగించును. శిశుపాలుని మరణమునకు ప్రబలకారణము వాక్పారుష్యమే. మానవుడు లోకములో అందరిమన్నన పొందుటకు కార్యము సానుకూలము చేసికొనుటకు మాటనేర్పు ఎంతయో అవసరము. వాక్పారుష్యమున్నచో శత్రువు అక్కరలేదు. అదియే శత్రువులను కూర్చును.

పాండవ, కౌరవసైన్యములు కురుక్షేత్రములో సమరమునకు మోహరించి యున్నవి. అపుడు ధర్మరాజు రథముదిగి వినీతవేషధారియై,

కౌరవపక్షమునకు వెడలి పితామహుడగు భీష్మునకు నమస్కరించి "నీచేత దీవింపబడసి చనిన నేను పగఱగెలుతు" "నిన్ను పోరగెలుచు విధము బోధింపవె" యని అతనిహృదయమును చూరగొనెను. ఇట ధర్మజుని వచోనైపుణ్యమే యుద్ధారంభమున భీష్మద్రోణుల హృదయములను జయించుటకు తోడ్పడుచున్నది. దుర్యోధనాదులందరు భీముని గదాఘాతములకు బలియైరి. విజయము ధర్మరాజు కరగత మైనది. అయ్యును ధర్మరాజు పొంగిపోలేదు. వినయము పెంచుకొనెను. పుత్రశోకార్తయైన గాంధారి పాదములపై పడి నీపుత్రులందరిని చంపించిన పాతకుడను నేనే. నన్ను శపింపుమనెను. అతనిమాటలకు గాంధారి కూడ కరిగిపోయి తనకోపమును ఉపసంహరించుకొనెను.

ధర్మదేవత ధర్మజుని ధర్మనిష్ఠను అగ్నిపరీక్ష చేయగా పదారువన్నెల బంగారముగ ప్రకాశించెను. యక్షుని ప్రశ్నలకన్నింటికి ధర్మార్థమధురములగు ప్రత్యుత్తరము లిచ్చెను. అంత అతడు సంతోషించి "నీ తమ్ములలో నొక్కనికి ప్రాణంబులిచ్చెదనని వేడుకొనుమని కోరెను. అంత ధర్మజుడు ప్రియసోదరుడైన నకులుని కోరెను. అదివిని యక్షుడు అతిబలవంతులైన భీమ ఫల్గునులను కోరక నకులుని ఏల కోరితివని ప్రశ్నించెను. దానికి ధర్మరాజు పాండురాజునకు కుంతి మాద్రిదేవి అనుపుణ్యభార్యలు కలరనియు, కుంతిపుత్రులలో తాను బ్రతికియుంటినని యు, మాద్రిపుత్రులలో ఒకడు బ్రతుకుట ధర్మమని చెప్పెను. అతని ధర్మనిష్ఠను యక్షుడు మిక్కిలి మెచ్చుకొనెను.

"ధర్మనందనుండు ధర్మాత్ముడని యొప్ప
నీతి మార్గము నన్ను బొగడు చుండు;
[illegible] నేను ధర్మసూనునికి [illegible]
ల్పాంతి వచ్చెనేని, యింత నిజము."

(అరణ్య - సప్తమ - 457)

ధర్మజాదులు మహాప్రస్థానమున కరుగునపుడు సోదరులు, ప్రియ పత్ని యైన ద్రౌపది మార్గమధ్యమున పడిరి. ఆ మహామహితాత్మునితో నొక కుక్క నీడవలె అనుసరించి వచ్చుచున్నది. ఇంద్రుడు రథముగొని వచ్చి ధర్మజుని అధిరోహింపుమనగా ఆ సారమేయము లేకుండ తానొక్కడు స్వర్గమునకు రాజాలనని చెప్పెను.

"భీమముఖ్యులును ద్రౌపదియు జచ్చి
రేను వారల విడువక యేడ్చుచున్న
వత్తురేతోడ వచ్చి చావని శునకము
విడువకుండుట తప్పుగా నుడువ దగునె."

(మహాప్రస్థాన - 1 - 57)

"అనఘచరిత్ర విన్ము శరణాగతు జేకొనకున్కి శుద్ధమి
త్రునియెడ జేయు ద్రోహము వధూటి వధించుట

విప్రునర్థముం

గొనుట యనంగ గల్గు నివిగూడ సమంబగు నాకు జూడ భ
క్తు ననపరాధునిన్ విడుచు దోషముతో నిది యోర్వ

వచ్చునే."

(మహాప్రస్థానిక - ప్రథమ - 58)

దృఢనిశ్చయముతో పలికిన ధర్మార్థయుక్తములగు పలుకులకు సంప్రమోదముపొంది ధర్మదేవత సారమేయాకృతివిడిచి స్వస్వరూపము దాల్చి ఆనందభరితుడై యిట్లనెను.

"నీ పుణ్యవృత్తంబు సర్మల మేధయు
నఖిల భూతంబుల యందు గలుగు
దయయు నాదు చిత్తము బ్రమదమున దేల్చె
వత్స భూలోకమున నిట్టివారు గలరె"

(మహాప్రస్థాన - ప్రథమ - 61)

ధర్మదేవత ధర్మజుని ధర్మప్రవణహృదయమును ప్రశంసించెను. అందుచేతనే ధర్మరాజు సశరీరముగ స్వర్గము పొందెను.

ధర్మరాజునకు గురుజనులయందు భక్తి, భ్రాతృవాత్సల్యము, పుత్రవాత్సల్యము, తప్పుచేసినపుడు ఒప్పుకొని పశ్చాత్తాపము పొందుట, నవ్యనవనీత సమానమైన హృదయసౌకుమార్యములను తలచుకొన్నచో సహృదయులకు పులకాంకుర ప్రకరములు కలుగును. అట్టి ఉదాత్త హృదయము పొందుటకు ప్రయత్నించినచో మానవులు దేవతలై విరాజిల్లగలరు.

భారతసంగ్రామము పూర్తియైనది. దుర్యోధనాది పుత్రులందరు మడిసిరి. గాంధారీ ధృతరాష్ట్రులు పాండవులపంచ చేరిరి. సకలజన క్షయకారణమగు యుద్ధమునకు, ద్రౌపదీ పరాభవమునకు, అనుంగు తమ్ముల అరణ్యవాసాది కష్టములనుభవించుటకు మూలకారణము ధృతరాష్ట్రుడే. అయ్యు ధర్మజుడు పెదతల్లి పెదతండ్రులను ఏలోటు రానియ్యక పల్లెత్తుమాటనక ఎవ్వరిని అనవలదని అనుశాసించి నెత్తి మీద పెట్టుకొని పూజించిన సాధుహృదయుడు ధర్మరాజు. అతడు తన తమ్ములతో భార్యలతో ఇట్లు చెప్పుచున్నాడు:

"వంశవృద్ధులు పుత్త్రివర్గ వియుక్తులై
యున్నవా రేమిట నుమ్మలింతు
రో యనుపుయిలోట నాయుధిష్ఠిరుడు ద
మ్ములకును దగునమాత్యులకు నిష్ట
భృత్యులకును మీరు ప్రీతియు భక్తియు
నాంబికేయునిదెస నతిశయిల్ల
నారాజు పంచినయట్లచేసి చరింపు
డతని నారాధించు టస్మదీయ

చిత్తమునకు బ్రియముసేయుట యతనికి
మనసు గానియట్టిపని యొనర్చు
టగ్గలంపు దుఃఖ మావహించుట యని
యనుదినంబు జెప్పు మనుజనాథ."

(ఆశ్రమవాస - ప్రథమ - 10)

ఇది అతని గురు జన భక్తిపారవశ్యమును తెలుపుచున్నది.

పద్మవ్యూహము ఛేదించుటకు ధర్మజుని ప్రోత్సాహముచేతనే అభిమన్యుడుప్రవేశించి అసహాయశూరుడై ద్రోణాదివీరులకుకూడ ఆశ్చర్యము కలిగించునట్లు పోరెను. భీమాదులు ప్రవేశించుటకు సైంధవు డడ్డు తగిలెను. కౌరవులు వంచనచేత అభిమన్యుని సంహరించిరి. అభిమన్యు వియోగ దుఃఖము ధర్మరాజుహృదయమును కాల్చివేసినది. అది వజ్రహృదయమునుగూడ కరగించునదై కరుణరస నిర్భరముగా నున్నది.

"కుడువను గట్టను బూయను
దొడువను బోబనిచి కాకతోలుత మొన సారం
గొడుకుం బనుచుట కెవ్వడు
గడగునె నాయట్టి పాపకర్ముడు దక్కన్.
వాని తోడిద లోకమై యేను బోవ
నైతిఁ బోగన్న బుత్రశోకాతురత్వ
మున నితాంత వివర్ణత బొందుచుండ
జూడకుండెడి వాడ నర్జును మొగంబు.
వాసవు నంతవానికిని వచ్చిన యాపద దీర్చు గాలకే
యాసురులట్టి బల్వగఱనైనను బ్రేల్మిడి ద్రుంచు నాజి న
వ్వాసవి యాత్మజుండు పగవారలచే హతుడైన దుర్దశం
జేసి యులంత జేడ్పడగజేసె విధాత్రుని నేమి సెప్పుదున్.

కొడుకు వధించిరన్న గురుకోటిని నెట్టన యల్గి రూపుమా
పెడున కడంగి పార్థుడెద బెర్చినశోకము నార్పజాలునే
పుడమి ధనంబు నాకము విభూతియు జేరినయేని నల్లన
నవ్వెడు నభిమన్యు నెమ్మొగము వేయుగుపాలును బోలనేర్చునే”
(ద్రోణ - ద్వితీయ - 142, 143, 145)

అభిమన్యునిమృతికై శోకించు ధర్మజుడు దుఃఖవిహ్వలతచే రమణీయుడై ప్రకాశించెను. గురు శారద్వతాదులచే రక్షితమైన మహా సైన్యమును గోవులలోజొచ్చు సింగమువలె ప్రవేశించి వీరశిరములను చెండాడి, ఈర్ష్యారోషములతో నొప్పు దుశ్శాసనుని పారిపోవునట్లు నభిమన్యుడు చేసినాడు. తాను అర్జునునకు సుభద్రకు పుత్రశోకము కల్పించిన దోషమునకు బాధ్యతవహించుట మహాత్మునిలక్షణము. బాలుడు, సుకుమారుడు అగు అభిమన్యుకుమారుని కుడువను కట్టనుపంపక యుద్ధరంగమునకుపంపిన పాపకర్ముడనని ఎంతెయో వగచెను. ఈఘట్టము చదివినచో సహృదయులు అశ్రుసిక్తనయనులగుదురు. ధర్మజుని పుత్రప్రేమ భాతృవాత్సల్యము, దయాగుణముతోకూడిన కోమలప్రకృతి కరుణాభావము వ్యక్తమగుచున్నవి. ఇంద్రునిఆపదలను తీర్పగల అర్జునునిపుత్రుడు పగవారలచే హతుడైన దుర్దశను సోదరునికి కల్పించి నందుకు విధిని తలపోయుటలో ధర్మజుని వివేకము వెల్లడియగుచున్నది.

ధర్మజునకు కర్ణుడు తనఅన్న అని తెలియదు. సంగ్రామానంతరము తర్పణములువిడుచు సందర్భములో కుంతీదేవి కర్ణ జన్మరహస్యముగూర్చి చెప్పెను. అప్పుడు ధర్మరాజుపొందిన మనః పరితాపము వర్ణనాతీతము. భ్రాతృవధ జన్యమైన దుఃఖము అతని హృదయమును చీల్చివేసినది. “అప్పుడు తొడంగి యంతరంగంబునిప్పులం బొరలినట్ల య్యెడి నక్కుంతీమహాదేవి తాను దివాకరువరంబున నప్పురుషవరుం

బడసి పాలుపై చుటయు పిదప నాతండు ధార్తరాష్ట్రుల పాందొరవై యుండ మాకును వారికిం గలహంబుపుట్టిన నదిమాన్పించుటకై యన్నో డుకు కడకుం జని యేకాంతంబునం బుట్టువు తెలుపుటయు లోనయిన తద్విషయ వార్తలను దినంబునుం జెప్పుచుండు"

(శాంతి - ప్రథమ - 8)

"తొల్లితాన దాచె దల్లి పదంపడి
యతడు చెప్పవలవదనగ దాచె
నిట్లుగాన యెఱుగమేపురమును నతం
డిట్టిడగుట దాననింత పుట్టె.
అతడు దుర్యోధనునకు
బ్రీతిగ జూదంబు నాడు పెక్కాడెను ధ
ర్మేతరములు వానికి మ
చ్చేతోగతి కోపభరము చెందక యుండున్.
అతని మేను కుంతియట్టులకై వడి
యరయ నేను - జూచి యాత్మనెద్ది
కారణంబో యిట్లుగా ననుచుండుదు
నేమి సేయువాడ నింక జెపుమ"

(శాంతి - ప్రథమ - 8 - 10 - 11 - 12)

ధర్మజుడు తానే అర్జునుని నొవ్వ బలికి కర్ణుని వధచేయకపోయి తమ్ముడవుకావని నిందించి అర్జునునిచే కర్ణుని చంపించెను. తత్కారణ ముగా తాను సోదరఘాతినైతినని మిగుల వగచెను. తన కతంబున మృతిబొందిన యుభయపక్ష బంధుమిత్రకోటులం దలచి యుమ్మలించి విశేషించి కర్ణు చావునకు దూర వగచెను. ఇది అతని సుకుమార హృదయము.

మహాభారతయుద్ధమునాటినుండియు ధర్మజునిలో శోకము, నిర్వేదములు అంతర్వాహినిగా ప్రవహించినవి. తుదకు ఆ మహామహి తాత్ముడు ఇహలోకవాంఛవీడి సహధర్మచారిణి, సహోదరులును కూడిరాగా స్వర్గారోహణమున కుపక్రమించెను. సహధర్మచారిణి, సహోదరులు మధ్యేమార్గమున వీడినను ధర్మదేవత శునకరూపమున ధర్మజుని అనుసరించి వచ్చినది. ధర్మస్వరూపుడు, ధర్మస్వభావుడు ధర్మముకొఱకు బ్రతుకంతయు మీదుకట్టినవాడు, తుదకు ధర్మము తోడురాగా బొందితో స్వర్గము పొందెను. యౌవనమున ఉత్సాహ ప్రధానమైన మానవునిజీవితము క్రమక్రమముగా ప్రాపంచిక కష్ట సుఖానుభవములచే పరిణామముపొంది తుదకు శాంతిప్రధానమగుట లోకసహజము.

జీవిత మధ్యకాలమువఱకు ఐహికములపై కేంద్రీకరించిన మానవునిదృష్టిప్రాయమింతకై వ్రాలుచున్నపుడు ఐహికవిముఖమై ఆముష్మికములపై ప్రసరించుట సహజము. ధర్మజుని జీవితచరిత్రలో మానవుని జీవితపరిణామవిధానము చిత్రితమైనది. ఉన్నస్థితినుండి ఉన్నతస్థితివైపు పరిణతుడైన మహామానవునిగా ధర్మరాజు పురోగమించెను. ఈప్రపంచమును వీడిపోవునపుడు మనవెంట వచ్చునది బంధువులుకాదు. భార్యకాదు, సంపదలుకాదు, ధర్మమొక్కటే.

భారతనాయకుడైన ధర్మజునియందు తృష్ణాక్షయసుఖమును చక్కగా పరిపోషింపబడినది. రాగద్వేషములు క్రమముగా శమించినవి. ధర్మజుడు స్వర్గమునకువెడలి ఆకాశగంగయందు స్నానము చేసినంతనే అతని రాగద్వేషములు మటుమాయమైనవి శమము స్థాయికెక్కినది. అదే శాంతము.

"వైర మాత్సర్య స్నేహ సంవాస లౌల్య
గర్వశోకాదులైన హృద్గత వికార

ముల దొఱంగి నిర్ధూమత్వమున వెలుంగు
పావకుడు బోలె శోభిల్లె"

(స్వర్గ - ప్రథమ - 52)

సర్వభావములు ధర్మజునిలో శమించినవి.

## 4. విదురుడు

మహాభారతాకాశములో సహస్రదీధితులతో ప్రకాశించుపాత్ర ధర్మార్థవిదుడు విదురుడు. వ్యాసమహర్షి లోకహితనిష్ఠంబోని ధర్మాద్వైతముతో కూడిన లేఖ్యమైన భారతామ్నాయమును ప్రసాదించెను. ధర్మాచరణమునకు, ధర్మరాజాదులు, ధర్మప్రబోధమునకు శ్రీకృష్ణ, వేదవ్యాస, భీష్మ, విదురులు మార్గదర్శకులు. ధర్మనిర్ణయపరులు, ధర్మాత్ములును, సూక్ష్మబుద్ధి కలిగియుండవలెను. యమధర్మరాజు అవతారమగుటచే విదురుడు ధర్మాభిముఖ్యము కలిగియు, సమవర్తియై, అందరియందు పక్షపాతము లేకుండనుండియు, దండధరునివలె పాపులయందు క్రూరత్వము కలిగి ప్రవర్తించినాడు. భారతములో క్లిష్టాతిక్లిష్టమైన సన్నివేశములలోకూడ నెంతమాత్రము మోమాటము లేక నిస్సంకోచముగా ధర్మదుందుభిని మ్రోయించిన కారణజన్ముడు విదురుడు. విదురుడనగా సమస్తధర్మములను సమగ్రముగ నెఱింగిన స్థితప్రజ్ఞుడని అర్థము. ఆ మహామూర్తి ధీరమతి, మహామనీషి, నయవిశారదుడు, దీర్ఘదర్శి, మంత్రిమాణిక్యము. కారణజన్ములైన మహాపురుషులు క్లిష్టాతిక్లిష్టమైన సన్నివేశములలోకూడ ధర్మమును వీడక తమ సహచరులను జీవితచారితార్థ్యము పొందునట్లు చేయుదురు. మానవులు ధర్మము ఎల్ల వేళల అవలంబించినపుడే ఇహలోక సౌఖ్యము, పరలోకములో నిశ్శ్రేయసము కలుగునని తాత్పర్యము.

మాండవ్యమహర్షి శాపానుగుణముగ, వేదవ్యాసమహర్షి దయవలన, అంబికయొక్క దాస్యాంగనయందు యమధర్మరాజు విదురుడుగా ఆవిర్భవించెను. భరతరాజ్యవల్లరి పితామహుని బాహుబలము, విదురుని బుద్ధిబలము నాలంబనముగా నిడికొని చిగురించి, పుష్పించి, పరిమళమును పరివ్యాప్తము చేసినది. అట్టి ధర్మ తత్త్వవిదుడు, ధర్మాచరణశీలియగు విదురుని ధృతరాష్ట్ర పాండురాజులు, సోదరసమానునిగా గౌరవించి, ఉత్తమ సచివోత్తమునిగా స్వీకరించియున్నారు.

మంత్రి ధర్మవిశారదత్వముతోపాటు, శత్రుజనులను, వారిచేష్టలను పసికట్టి ప్రతీకారముచేయు నైపుణ్యము కలిగియుండవలెను. రాజ్యాంగవ్యవస్థలో మంత్రశక్తికి ప్రభుశక్తి తలవంచవలసినదే. అనగా ప్రభువు, మంత్రి పొత్తు కలిగి, రాజ్యక్షేమము ప్రధానధ్యేయముగా భావించి కృషిచేయవలెను. దుర్యోధనుడు ఏవిధముగానైనను పాండవులను మట్టుపెట్టుటకు కృషిచేసెను. ఆ కుట్రలో ఒకభాగమే లాక్షగృహదహనము. విదురుడు దుర్యోధనుని కుట్రను ఇట్టే పసికట్టి అతికుశలుడైన ఖనకుని పంచి లాక్షగృహములో సొరంగముత్రవ్వించి, పాండవులను ప్రమాదమునుండి రక్షింపచేసెను. అతడు రహస్యముగ ధర్మరాజునకు మాత్రమే తెలియునట్లు అగ్నివిషముల బారిపడకుండయుండుడని ప్రబోధించెను పాండవులు సుఖముగా నున్నారని వినువరకు ఆ మహానుభావుడు నిద్రపోలేదు. ఇంతచేసియు, విదురుడు మాటమాత్రము చేతనైన ఆత్మకార్యకౌశలము ఎవ్వరిఎదుటను స్తుతించుకొనలేదు. దానికి కారణము అతనికిగల ధర్మపక్షపాతమే. జ్ఞానముకలిగియు మౌనముగా నుండుట, ఉపకారముచేసియు ఆత్మశ్లాఘ చేసికొనకుండుట, అపకారము చేయకలిగిన శక్తి కలిగియున్నను ఉపకారము చేయుట సజ్జనుల లక్షణము. ఇది మానవులకు మార్గదర్శకము.

రాజ్యాంగము సువ్యవస్థిత మగుటకు రాజు హితాహితులను గుర్తించి, అహితులను దూరముగా నుంచుకొనవలెను. అరిషడ్వర్గము నకు బానిసయైన రాజు ఉన్మార్గములో సంచరించునప్పుడు ఉత్తమ మంత్రి, తాత్కాలికముగా అప్రియమైనను, హితోపదేశముచేసి యేలి కను సన్మార్గములో పెట్టవలెను. అట్టివాడే రాజునకు ఉత్తమ సహా యుడు. అదియే విదురుడు ఆద్యంతములయందు చేసియున్నాడు. దుష్ట చతుష్టయము పాండవ పాంచాల విభేదనోపాయమునుగూర్చి ధృత రాష్ట్రుని సమక్షములో చర్చించిరి. అంబికేయుడు అభిప్రాయమును అర్థించుటకు భీష్మ ద్రోణ విదురులను రావించెను. భీష్మ ద్రోణ విదు రులు ఐక్యకంఠముగా కౌరవులు పాండవులతో విరోధమును పెంచు కొనుట ఎంతమాత్రము శ్రేయస్కరము కాదనియు, పితృ, పైతా మహాగతంబైన రాజ్యము న్యాయముగ పాండవులకిచ్చుటయే కర్తవ్య మని నొక్కిచెప్పిరి. ఆ సందర్భమున విదురుడు భీష్మ ద్రోణులు రాజు నకు అత్యంత హితైషులని హేతుపూర్వకముగా వివరించెను.

"ధర్మార్థవిత్తముల్ తథ్యవాదులు
వయోవృద్ధులు మధ్యస్థ విమలమతులు
ద్రోణగాంగేయులు దురితవిదూరులు
నిన్నెద్ది గఱపిరి నెమ్మి తోడ
దానిన చేయుట ధర్మువు వారలకంటె
హితుల్ నీకుగలరె యొరులు
దుర్యోధనుండును దుశ్శాసనుండును
గర్ణుండు శకునియు గరము బాలురు."

(ఆది - అష్టమ - 43)

ధర్మార్థవిదులు, సత్యవచనులు వయోవృద్ధులు, మధ్యస్థ విమల మతులు, ధర్మాధర్మ నిర్ణయముచేయుట కర్హులు. పూర్వోక్తగుణ విశి

ష్ఠులు ద్రోణభీష్ములు. దురితవిదూరులైన ఆ మహనీయులు నిర్ణయిం చిన విధమును లక్షణముగ స్వీకరించుట ప్రభువుయొక్క కర్తవ్యము. దుర్యోధనుడు దుశ్శాసనుడు, కర్ణుడు, శకునియు, బాలురు. ఆకారణ ముచే వారు ధర్మనిర్ణయము చేయుటకు సమర్థులుకారు. పాండవులు బాహుబల సంపన్నులగుటచే అజేయులు. అదియేకాక వారికి, ఇప్పుడు ద్రుపద, శ్రీకృష్ణులతో వైవాహిక సంబంధము లేర్పడుటచే, దైవ బలము, మానుషబలము కలిగినవారై యుండిరి. అట్టివారిపై కౌర వులు విజృంభించుట మండుచున్న అగ్నిలో శలభమువలె ప్రవేశించు టయే. పురోచనునిచే కలిగిన అపయశస్సు, పాండవుల ననుగ్రహించు టచే తొలగించుకొనవచ్చును. ఈ ఘట్టమును పరిశీలించినచో మంత్రి యొక్క దీర్ఘదర్శిత్వము వ్యక్తమగుచున్నది. రాజు ఎట్టి క్లిష్టపరిస్థితుల లోను ధర్మబలమును దూరము చేసికొనుట తగదని అభిప్రాయము.

విదురుడు ప్రభునియోగము వలన పాండవులను కరిపురమునకు తోడ్కొనివచ్చుటకు వెడలినసందర్భములో అతడు చేసిన సంభాష ణము మితహిత సత్యవాక్య సంశోభితము. అతడు ప్రప్రథమముగ ద్రుప దుని యశోవిభావాలంకృతుడని సంబోధించి, ఆభిజాత్యము, ధర్మశీల సంశోభితుడగు ద్రుపదునితో పాండవులు చేసిన పరిణయబంధము అభి రమ్యము, అనురూపమనియు, సౌహార్దముతో కురువృద్ధులందరు ప్రశం సించి, ప్రమోదభరితులైనారనుట ఔచిత్య శోభితము. పిమ్మట, ధృతరాష్ట్రాది వృద్ధులు పాండవ వియోగమునకు దుఃఖిత చిత్తులైనా రని విన్నవించెను. మహాపతివ్రత, అయోనిజ యగు ద్రౌపది కోడ లగుట, కురుకులమునకు వెలుగును ప్రసాదించుటయే అని చెప్పెను. పాండవాగమనము కొఱకు పెద్దతండ్రి ఎదురుచూచుచున్నాడని తెలి పెను. అతడు ధృతరాష్ట్రుడుచేసిన అన్యాయమును మునుముందు

పేర్కొని, కార్యానుకూలము చేసికొనునట్లు సంభాషించెను. మర్మము మందునకైనను లేదు.

ధృతరాష్ట్రుడు ఒకనాడు ఏకాంతముగ విదురుని పిలిచి, ధర్మజ దుర్యోధనాదులు వినోదార్థము సుహృద్ద్యూతము ఆడుకొందురని చెప్పెను.

అట్టి దుష్టసంకల్పము ప్రభువునకు ఉభయవంశ శ్రేయోభిలాషి యగు తండ్రికే కలుగుటకు విదురుడు విస్మితుడై, కలిద్వాపర సమీప మగుటచే, జూదంబు అఖిల ప్రజాక్షయ కారణంబని గుర్తించి, వినుటకు అప్రియమైనను మోమోటము లేక నొక్కి చెప్పెను.

"ఇట్టి కార్యమునకు నే నవశ్యంబును,
నొడబడంగ నోప నుక్కివమున
సుతులతోడ నేల సుతులకు భేదంబు,
సేయ గడగి తిదియు జెట్టయనక.
ఒలసి నీపుత్రు లెల్ల నొండొరులతోడ,
నెట్లొడంబడి యుండుదు రట్ల చేయ
వలయు దమలోన జూదంబువాదునగుట,
గలహమూలంబ యెట్టి శాంతులకునైన.

వ॥ నీ నేర్పువిధంబున శకునిదుర్యోధనుల దుర్వ్యవసాయం బుడిగించి యిక్కురు వంశంబు రక్షింపుము."

(సభా - ద్వితీయ - 130, 131, 132.)

జూదము, వ్యభిచారము, మధుసేవ మొదలైనవి దుర్వ్యసనములు. వానిని ఉత్తమాధికారులు చేసినను అది మరింత అనర్థప్రదము. వానివలన ప్రభుత్వమునకు ఆదాయము వచ్చినను సంఘారోగ్య భంజకములే. అందుచే దుర్వ్యసనములను మేధావులు, ప్రభుత్వము ఏవిధముగను ప్రోత్సాహ మొసంగరాదు. ఒకవేళ కుతర్క

ముతో ప్రోత్సాహమిచ్చినయెడల ప్రజలు ధృతరాష్ట్ర సుతులవలె లోకోపద్రవము కలిగింతురని ధ్వని.

తాను చేసిన ధర్మప్రబోధము ధృతరాష్ట్రుడు ఎంతమాత్రము ఆచరణలో పెట్టకపోయినను, విదురుడు ప్రభువుయొక్క ఆజ్ఞను జవ దాటి ఎఱుగడు. దురదృష్టవశమున ధర్మరాజును ద్యూతార్థము హస్తి నాపురమునకు తోడ్కొనివచ్చు బాధ్యత విదురునిపై బడినది. అద్దా నిని విధాతృనియోగము అవిలంఘ్యమని భావించి స్వకర్తవ్యమును నిర్వర్తించిన స్థితప్రజ్ఞుడు విదురుడు.

శకుని, మాయజూదమున ధర్మరాజును వంచించుటచూచి విదు రుడు దుర్యోధనుని తీవ్రముగా నిందించి ప్రభువును సమీపించి కర్త వ్యోపదేశమును చేసెను. దుర్యోధనుని కృత్యము అంగార కారుని కృత్యము వంటిదని హేతుపూర్వకముగా తెలిపెను.

"అంగారములు గొనువేడ్క బుష్పఫలావళీలలిత
తుంగద్రుమప్రకరంబు గరుణావిదూరుడై కాల్చు
నంగారకారు బోలంగ సమకట్టె నర్థలోభంబు
నం గురుకులహానికరుడు ధారుణీనాథ నీసుతుడు.

అధికదర్పయుక్తమై బలీవర్దంబు, నగముదరి విదారణంబు సేయ గాలు ద్రవ్వునట్లు గడుబలాఢ్యులతోడ, నేచి వీడు విగ్రహింప దొడగె".

(సభా - ద్వితీయ - 182, 183)

విదురుని ప్రబోధమంతయు ధృతరాష్ట్రుని పట్ల అడవికాచిన వెన్నెల అయినది.

ధర్మరాజు జూదములో ద్రౌపదిని ఓడిపోవుటచూచి, ఏమి ఉప ద్రవము రానున్నదోయని, భీష్మద్రోణ కృపులు అవిరళ స్వేద సిక్తాం గులైరి. విదురుడు మొగమువాయ దుఃఖించి తలవాంచెను. ఇట్లు

అధర్మము విజృంభించి, ధర్మము కుత్తుక నొక్కుచుండుటచూచి అస
హ్యమైన ధార్మిక క్రోధము వహించి విదురుడు దుర్యోధనుని చీవాట్లు
పెట్టెను. రోషముతో సుయోధనుడు అడుగకుండ సలహా చెప్పినందు
లకు విదురుని తూలనాడెను. అధర్మము ఎదుర్కొన్నవారు ఇన్ని కష్ట
ములు ఎదుర్కొనవలెను. అతడు లోకస్వభావమునకు అద్దము పట్టు
చున్నాడు.

"సామాన్యముగ మనసులో విషము, పెదవికి బెల్లముపూసి
కొని, సమయానుగుణముగ ప్రియముగా మాటాడువారిని, ఎక్కువ
మంది మెచ్చుకొందురు. తాత్కాలికముగ అప్రియమైనను శాశ్వత
ముగ మేలు కలుగునట్లు పలుకువారు సామాన్యుల దృష్టిలో శత్రు
వులు. తత్కారణముగ ఉత్తమ ప్రతిభావంతులు తత్కాలమున
అప్రియమైన పథ్యమైన మాటలను, లోకము స్వీకరింపదను భయ
ముతో చెప్పక మౌనము వహింతురు.

"ప్రియము పలికెడువారిని పెద్దమెత్తు;
రప్రియంబును బథ్యంబు నైన పలుకు
వినగ నొల్లరు గావున వేడ్క దాని
బలుక రెవ్వరు నుత్తమ ప్రతిభులయ్య."
"మొదల నప్రియ మయ్యును దుదిగరంబు
పథ్య మగుపల్కు ప్రియులందు బలిమి నైన
బలుక వలయు నో మోడక యొలసి యట్టి
వాడు దగు సహాయుండు భూవల్లభునకు."

(సభా - ద్వితీయ - 191, 192)

మహాపతివ్రత, పాండవధర్మపత్నియగు ద్రౌపదికి పరాభవము
చేయబూని దుశ్శాసనుడు కొప్పుపట్టి సభకీడ్చి తెచ్చెను. కోప లజ్జా
పరవశయైనద్రౌపది కడుదుఃఖించి తాను ధర్మవిజితనా? అధర్మవిజితనా?

అని గ్రుచ్చి గ్రుచ్చి ప్రశ్నించెను. బాలుడయ్యును వికర్ణుడు జ్ఞానవృద్ధుని వలె ధర్మనిర్ణయము చేసెను. దానిని కర్ణుడు గర్హించెను. విదురుడు ధీరమతియై రాజసభకు ధర్మాధర్మ నిర్ణయము చేయవలసిన ఆవశ్యకము కలిగినపుడు ఏవిధముగా ప్రవర్తించవలెనో విదురుడు సూచించెను. ప్రహ్లాదుడు తనపుత్రుడైన విరోచనునకు, సుధన్వునకు వివాదము గలిగినపుడు సుతుడను పక్షపాతము లేకుండ ధర్మ నిర్ణయము చేసెను. అదియే ధృతరాష్ట్రుడు ప్రస్తుతము అనుసరింపదగియున్నది రాజు ధర్మాధర్మ నిర్ణయము చేయవలసిన స్థితికలిగినపుడు లాభలోభ పక్షపాతబుద్ధి వహింపరాదు. సభలోనివారుకూడ ఈవిధముగా పక్షపాతమువహించి ధర్మాధర్మ నిర్ణయము చేయరాదని నొక్కిచెప్పెను.

"ధర్మం బధర్మవిద్ధం బయి సభకువచ్చిన దానిం దీర్పనిసభ్యులధర్మవిద్ధులగుదురు. మఱిసభ్యులు కామక్రోధంబులువిడిచి యధర్మంబు నాపనినాడయ్యె ధర్మంబుం దొక్క పాదంబు సభ్యుల నొక్కపాదంబు భూపతి దక్కినయది గర్తనుం బొందు సమంజసులైన సభ్యులచేత విధ్యుక్తంబయ్యెనేని నధర్మంబు కర్తనుం బొందు గావున ధర్మంబు దప్పక చెప్పవలయు...."

(సభా - ద్వితీయ - 243)

విదురుడు ధర్మప్రబోధములో ఎంత అభినివేశము ప్రకటించెనో అంతకంటె ఎక్కువ ఆచరణమునకు ప్రాధాన్యము నిచ్చెను. అతడు ధర్మప్రబోధకుడు, ధర్మాచరణసమర్థుడు. పాండవులు అరణ్యమునకు వెడలినపిమ్మట ధృతరాష్ట్రుడు విదురునిరావించి పాండవుల క్షేమ సమాచారమునుగూర్చి ప్రశ్నించెను. విదురుడు తనమామూలుధోరణిలో కులదూషకుడైన దుర్యోధనుని పరిత్యజించుట ధృతరాష్ట్రుని పరమకర్తవ్యమని చెప్పెను. అమ్మాటలు విన్నంతనే ధృతరాష్ట్రుడు మండిపడి విదురుని ఎక్కడకైనను నిరభ్యంతరముగ వెడలవచ్చునని

పలికెను. దానికి ఎంతమాత్రము భయపడక ధర్మవీరుడగు విదురుడు పాండవులకడకు వెడలెను. తరువాత ధృతరాష్ట్రుని ప్రార్థనను పురస్కరించుకొనియే తిరిగి హస్తినాపురమునకు వచ్చెను. అధర్మమును ఎదుర్కొనుటకు ఇంత ఆత్మప్రత్యయము కావలెను.

విదురుడు సర్వజీవదుఃఖ పశమనార్థము, ధృతరాష్ట్రుని నిమిత్తముగా చేసికొని చేసినఉపదేశము స్థలాంతరమున వర్ణితము. అతడు ఆశావాది. ధర్మము ఏనాటికైన జయించుననియు, సోదరుడైన ధృతరాష్ట్రునిలో పరివర్తనను తెచ్చుటకు నిరంతరము ప్రయత్నించెను. ఈ ఉపదేశముచేయుటలో అతడు చతురుపాయములను ప్రయోగించెను. తల్లిదండ్రులు తమబిడ్డలను బుజ్జగించియు, కినిసియు, సన్మార్గమున పెట్టువిధమున విదురుడు ప్రత్యక్షర రమణీయముగ పలికెను.

"దక్కను రాజ్యమంచు నకటా యిటు దమ్ములభాగ మీక నీ
వెక్కటి మ్రింగజూచె దది యెట్లరుగున్; విను, మీను లోలతన్
గ్రక్కున నామిషంబు చవి గాలము మ్రింగిన చాడ్పు సూవె; యి
ట్లుక్కివుడైన నీకొడుకు నుల్లము నున్నటు లాడగూడునే!"

"ఒకరుని చేతిప్రోవును తదున్నతిప్రాపును గాంచి, యెల్ల వెంటకును గొఱంతలేక, పొగడం దగుసంపద నొంది, యట్టి దాతకు దుది గీడు చేసిన కృతఘ్నునిపీనుగు నైన, రోతపుట్టక కబళింపఁగుక్కలు నొడంబడునే? కురువంశవర్ధనా!"

"కావున గృతము దలంపమి గీడు; పాండురాజు నీకుం బరమభక్తుండు, పాండవులునుం దేజోలాభంబులు గాంచినవారలు, వారల నాదరింపుము."

(ఉద్యోగ - ద్వితీయ - 52, 77, 78)

ఈవిధముగా అల్పాక్షరములలో అనల్పార్థము పరిమళించు నట్లు హితోపదేశము చేసినారు కాని రోగికి పథ్యాహారము నట్లు ధృతరాష్ట్రునకు రుచింపలేదు.

కొన్ని కొన్ని సందర్భములలో రాజుచేయు అధర్మమును సూటిగా ఖండించెను. శ్రీకృష్ణుడు రాయబారమునకు వచ్చుచున్నాడని గ్రహించి అతనికి కావలసిన వస్తువులన్నియు ఇచ్చి కర్తవ్యమును మరపింపుమని విదురునితో ధృతరాష్ట్రుడు చెప్పెను. దానికి విదురుడు ఇట్లు చెప్పెను.

"సితల పేనుగంటి, నొకనేర్పున శౌరికి లంచ మిచ్చి సం
ప్రీతుని జేసి కార్యగతి భేదము సేయగ జూచె దింత బే
లైతి గదే! సుమేరుసదృశార్థము జూచియు బార్థు బాయునే
యాతడు? కిరీటిభక్తియును నచ్యుతుపెంపును నీ వెఱుంగవే!"
(ఉద్యోగ - తృతీయ - 159)

విదురుడు ఉత్తమ శ్రీకృష్ణభక్తుడు. రాయబారమునకు వచ్చినపుడు శ్రీకృష్ణుడు దుర్యోధనుని ఇంటికి భోజనమునకు వెడలక విదురుడిచ్చిన విందునే ప్రీతిపూర్వకముగ స్వీకరించెను. శ్రీకృష్ణుడు పాపాత్ములు ధర్మద్వేషులైన దుర్యోధనాదుల అన్నము దుష్టాన్నమనియు, విదురుని అన్నమే భోక్తవ్యమని చెప్పుట గణనీయమైయున్నది. విదురుడు, అభిప్రాయమర్థించకుండ ఎన్నడును రాజునకు ఉపదేశము చేయక ఔచిత్యమును పాటించుచు సంచరించెను.

యుద్ధసమయమున, విదురుడు ఏపక్షమును వహించక తీర్థయాత్రలు చేసి మైత్రేయ మహామునీంద్రుని సేవించి ఆత్మజ్ఞానమును పొందెను. పాపమునకు దూరముగనుండుట నిరంతరము నశ్వరమైన ప్రాపంచిక భోగములలో మునిగిపోవక ఉండుట, ఆత్మోద్ధరణమునకు ప్రయత్నించుట సజ్జనలక్షణము కదా. తీర్థయాత్రలన్నియు పూర్తిచేసి

కొని విదురుడు గృహోన్ముఖుడైననాటికి మహాభారతసమరము పూర్తి అయినది. ధృతరాష్ట్రుడు నూరుగురు కొడుకులను పోగొట్టుకొని అగతి కుడై ప్రేమోడువలె జీవించుచున్నాడు. అట్టిసోదరునిపై జాలిపడి విదురుడు ఆధ్యాత్మికోపదేశము చేసి కర్తవ్యోపదేశము చేసెను. ఈ ఉపదేశమంతయు భగవద్గీతలోని సారము.

"ఇహలోకమును ఆనందమయము, సుఖమయము చేయుటకు వైరాగ్యము అత్యవసరము. వైరాగ్యముయొక్క ప్రథమసోపానము జగత్తుయొక్క అశాశ్వతత్వము గుర్తించి, ఆత్మనిత్యత్వము అను భూతిలోనికి తెచ్చుకొనవలెను. పదార్థములకు పెరుగుట, అణగుట, రుచికలుగుట, అరుచికలుగుట నైజగుణము. మృత్యువు పిరికివారిని బలముగలవారిని, పండితులను, సర్వులను అవధి తీరినంతనే ఈలోకము నుండి తీసికొనిపోవును. దుర్యోధనాదులు ఉత్తమ క్షత్రియోచితముగ సమరముచేసి ఉత్తమగతిని పొందిరి. వారినిగూర్చి వగచుట నిష్ప్రయోజనము. సంసారమున ఉండుటచేతనే మాతృ, పితృ, సోదర, దార, పుత్ర సంబంధములు అనుభవగోచరములు. యౌవనము, రూపము, జీవితము, ద్రవ్యసంచయములు అనిత్యములు. పాండిత్యసంపన్నుడైన బుధుడు బంధుజీవహానికొరకు వగవడు.

ప్రియాప్రియ వస్తు వియోగ సంయోగంబువలన జనించు దుఃఖము బొరయకుండుటకు మార్గముపదేశించెను. పరిశీలింపగా, తన శరీరమే తనకు ఎరవు. ఈలోకము అరటికంబమువలె నిస్సారమైనది. జగత్తు అశాశ్వతమని గుర్తించి, ఆత్మ నిత్యమని నమ్మిన బుధునకే శోకము దూరమగును.

"వాసాంసి జీర్ణాని యథా విహాయ" అను

భగవద్గీతా శ్లోకమునందలి భావమును గ్రహించి శరీరముపుట్టి నప్పటినుండి మరణించు పర్యంతము గ్రసించుటకు మృత్యువు ఎట్లు

పొంచి చూచుచుండునో లోకసామాన్యమైన దృష్టాంతముతో సీస పద్యములో తేనెలొలుకు తెలుగు మాటలలో తిక్కనార్యుడు మనో హరముగ వివరించెను.

"ఒకయింటనుండి వేరొక యింటికరిగిన
విధమున వస్త్రంబు విడచి యొండు
వస్త్రంబు గట్టినవడువును నై యుండు
నొడలు దొలంగి యొండొక్క యొడలు
గైకొంట నృప విను కడవరు సారెపై
నమర మృత్తిక యిడునపుడు విరియు
టయు వెరవార బట్టగ రాక చెడుటయు
వాసియెత్తెడునెడ వ్రయ్యుటయును
నెత్తి యొకచోట డించిన నెడలుటయును
నెండి యవియుటయును నావ మిడిన బగిలి
పోవుటయు వాడు జనులచే బొలియుటయును
గలుగు గతి మేని కెట్లును గలుగు జేటు."

(స్త్రీ - ప్రథమ - 34)

జీవి ఈ లోకమునకువచ్చుటలో ఎంత జుగుప్సఉన్నదో తెలిపి, బాలత్వంబున, యౌవనంబున, వృద్ధాప్యమున, మృత్యువాత పడుట నిరూపించి సంసారము దుఃఖ బహుళమని తెలుపుచు, సంసార గహ నత్వము తేటతెల్లమగుటకు ఒక కథ కమనీయముగ చెప్పెను. లోభ క్రోధ మదోన్మత్తులై దుర్మతు లింద రమింతు రిందలి సుఖలేశంబు నకై యొండొరులం జెఱుపను జంపను జొచ్చి ధర్మపథంబుదప్పి యమ కింకరుల చేతపడుదురు. జనన మరణాదులవలన కలుగు భయము నుజ్జ గించి పరమసుఖముపొందు మార్గ ముపదేశించెను.

విదురుడు చివరివరకు గాంధారి ధృతరాష్ట్రులను నీడవలె అనుస రించి అరణ్యమునకుకూడ వెడలి తపస్సుచేసికొని ఆత్మోద్ధరణమునకు

పూనుకొనెను. పాండవులు గాంధారి ధృతరాష్ట్రులను, కుంతీమాతను కురుక్షేత్రమున ఆశ్రమము కల్పించుకొని తపస్సు చేయుచున్నవారిని చూచుటకొరకు వచ్చిరి. విదురుడు కొంతకాలము జలములను అనిలమును ఆహారముగాస్వీకరించి కొంతకాలము అవియు గానక శూన్య విపినమున దైన్యరహితసంచారియై మెలంగుట మునిజనులకుసహితము ఆశ్చర్యముగలిగించినది. కాంతారధూళి మలినాంగుడు, జటీభూత కేశపాశుడు, దిగంబరుడై, ఆశ్రమసమీపమునకు వచ్చిన జనులనుచూచి పొదలచాటునకు వెడలెను. ధర్మరాజు ఓ విదురా! అని ఎలుగెత్తి పలికెను. విదురుడు యోగమార్గమున తన తేజోమయరూపమును ధర్మజుని యందు ప్రవేశింపచేసెను.

యమధర్మరాజే విదురుడుగా ఆవిర్భవించుటచే అతడు ధర్మాధర్మనిర్ణయము చేయుట తగియున్నది. శ్రీకృష్ణుడు, భీష్ముడు, ధర్మరాజుల సరసన కూర్చుండతగినవాడు విదురుడు. అతడు ధర్మోపదేష్ట. మంత్రిమాణిక్యము. దీర్ఘదర్శి. నయవిశారదుడు. ఉభయపక్ష హితారంభుడు. ఎట్టి క్లిష్టసమయమునందైనను మోమోటములేక సమవర్తియై విదురుడు ధర్మోపదేశము చేసియున్నాడు. విదురకృత ఉపదేశము సర్వమానవాళికి శిరోధార్యమై యున్నది. ధర్మాచరణములో, ధర్మప్రబోధములో ధర్మరాజు, విదురుడు పోటీపడుట గమనింపదగియున్నది. ధర్మస్వరూపుడే విదురుడు.

## 5. సంజయుడు

సంజయుని జన్మవృత్తాంతము ఆంధ్రభారతములో పేర్కొనియుండలేదు. సంస్కృతభారతములో గవల్గణము సూతసంజయులుగా నావిర్భవించినట్లు అంశావతారవర్ణనములో కలదు. సంజయునకు గావల్గణిః అని పేరు.

"సంజయో ముని కల్పస్తు సూతో గవల్గణాత్"
(సంస్కృతభారతము - అంశావతారవర్ణనము - 63 అధ్యా)

సంజయుడు ధృతరాష్ట్రుని ఆంతరంగిక మంత్రి. మాటనేర్పుతో వినయముతో ఎట్టి దుర్ఘటకార్యమైనను అవలీలగా నిర్వహించు రాయబారి సంజయుడు. చిత్తశుద్ధిగల భృత్యధర్మము సంజయ పాత్రముఖమున నిరూపితము. భారతపరమార్థమును శ్రీకృష్ణుని ఆధ్యాత్మిక తత్త్వమును అర్థము చేసికొన్న ఉత్తమజ్ఞానిగా నితడు గోచరించును. అనివార్యకారణములచే అధర్మపక్షము వహించియు సత్ధర్మములను వీడని సాధుశీలుడు సంజయుడు.

విదురుడు కోపించి హస్తినాపురమునువీడి పాండవులున్న కామ్యకవనమునకు వెడలెను. ధృతరాష్ట్రుడు ఆతని వియోగమువలన హృదయదృష్టిలేనివాని భంగి విచారించి సంజయుని పిలిచి విదురుని తోడ్కొనిరమ్మని పంపెను. సంజయుడు ముగుముందు ధర్మజుని అనుమతిని పొంది విదురుని తోడ్కొనివచ్చుటలో తన వచోనైపుణ్యమంతయు ప్రకటించియున్నాడు. విరుద్ధకార్యమును సానుకూలముచేయు నేర్పు ఆతనిలో పుష్కలముగా నున్నది.

ధర్మరాజాదులు ద్రౌపదీసహితులై అరణ్యములలో కష్టనష్టములన్నియు ననుభవించి రాజ్యభాగముకొరకు ద్రుపదపురోహితుని రాయబారము పంపిరి. ధృతరాష్ట్రునకు పాండవుల రాజ్యభాగము ఇచ్చుట ఎంతమాత్రము ఇష్టములేక అనునయ వాక్యములచే ధర్మజుని మనః క్లేశమును ఉపశమింపజేసి, వంశరక్షణ, బంధురక్షణ అను బాధ్యతలను ధర్మజునిపై పెట్టి అతనిని శాంతునిచేయందలంచెను. అటులైన చో దుర్యోధనుడు ఒప్పుకున్నను ధర్మరాజు యుద్ధమునకు పూనుకొనకుండ చేయవచ్చు ననుకొనెను. అనగా రాజ్యభాగములో చిల్లిగవ్వయైనను ఇయ్యకుండ, యుద్ధముచేయకుండ పాండవులను మెత్తబరచుట ధృతరాష్ట్రుని

యొక్క కూటనీతి. ఈ దురుద్దేశముతో సంజయుని రాయబారమునకు పంపెను. ఇట్టి అత్యంత క్లిష్టమైన రాజకార్యనిర్వహణ బాధ్యత సంజయునిపై నిడెనన్నచో, ధృతరాష్ట్రునకు అతనిపై ఎంత గాఢప్రత్యయమున్నదో తెలియుచున్నది. ప్రభువునకు విదురునిపైకన్న సంజయునిపై అత్యంత విశ్వాసమున్నది. పాకముతప్పిన వ్యవహారములను సమర్థులగు రాయబారులు కౌశలముతో పరిష్కరింతురు. అదియే సంజయుడు చేసెను.

ఉభయపక్ష హితాభిలాషియు, యుక్తాయుక్త వివేకశీలియు, రాజుల సమక్షములో మెలగవలసిన నైపుణ్యముకలవాడు, సంభాషణా చతురుడు అగు సంజయుడు ఈ రాయబారము నిర్వహించినతీరు అత్యద్భుతము. అధర్మమును ధర్మముగ ప్రతిభాసింపచేయుటలో తనయుక్తి నంతను ప్రయోగించెను. ధృతరాష్ట్రునకు పాండవులపై మిక్కిలిప్రేమ కలదనియు, పరాభవఖిన్నమానసుల యోగక్షేమముల పేరుపేరున అడిగినాడనియు, సంజయుడు పాండవులకోపాగ్నిని శాంతింప చల్లనినీరు చల్లుచు, ప్రసంగము ప్రారంభించినాడు.

"భాగ్యమున నిన్ను గనుగొన బడసి, నాదు
చూడ్కి చరితార్థ మయ్యె; నస్తోకపుణ్య
ధనుడు మీతండ్రి ధృతరాష్ట్రధరణినాథు
డిందు మీయునికి విని ప్రియ మెసక మెసగ."

"అనుజులు నీవును ద్రోవది
యును బుత్రచయంబు నున్న యోగక్షేమం
బున తెఱ గారయ బుత్తెం
చె నితాంత స్నేహపూర్ణచేతోవృత్తిన్"

(ఉద్యోగ - ప్రథమ - 273 274)

ధృతరాష్ట్రుడు వృద్ధుడనియు, అతని మాట పుత్రులు వినుట లేదనియు, అట్టి మీ పెదతండ్రిమీద గౌరవముచేతనైన యుద్ధము చేయవలదని, పాండవులతో సంజయుడు చెప్పెను. పాండవులకొసంగవలసిన రాజ్యభాగము సంగతి ప్రస్తావింపకయుద్ధము సర్వానర్థ ప్రదమని చెప్పుటయే ఆతని రాయబారపు సారాంశము.

ఎంత కఠినమైన మాటనైనను ప్రియముగ ప్రతిపాదించుట ఆతనికి చక్కగా తెలియును.

"పాలిక కౌరవులు దు
శ్శీలత చెడదలచిరేని, జెప్పెద, రుధిరా
భీలాన్నంబునకంటెను,
మేలగు భిక్షాన్నమైన మీనడవడికిన్"

(ఉద్యోగ - ప్రథమ - 329)

తనయేలికయొక్క దుర్మార్గమును అధర్మమును కప్పిపుచ్చి తన యేలిక నిర్దోషియని నిరూపించుటయే సంజయుని కూటనీతి. సంజయు రాయబారమనగా శుష్కప్రియములు, శూన్యహస్తములు. సంజయుని రాయబారపు తెరగును ధర్మరాజు చక్కగా వ్యాఖ్యానించినాడు.

"విను సంజయ! పక్షపాతవృత్తి విడువుమీ"

(ఉద్యోగ ప్రథమ - 322)

"... నీ పలికినట్టిద, ధర్మువులట్లయుండి బోధనులరయంగ
వచ్చిన అధర్మములై చెడు"

(ఉద్యోగ - ప్రథమ - 334)

జ్ఞానియైన సంజయుడు కౌరవుల అధర్మమును గుర్తించి ప్రభువునకేకాంతమున హితోపదేశముచేసి కర్తవ్యమును ఉపదేశించెను. ధర్మరాజుయొక్క ఓర్పును వెలుపుగా భావించుట తగదని చెప్పెను.

"పాదు రేగనేని న్వాను తలపాలమునన కాని నిలువదు
సుమ్మీ!"
(ఉద్యోగ - ద్వితీయ - 13)

"ఆలుబిడ్డ లేని యట్టి త్రిమ్మరి యగు
కొయ్యగాక, కుదుట గూడు వెట్టి
కుడుచువార లిట్టి క్రొవ్విదంబులు సేయ
జొచ్చు టిచ్చగించి చూతురయ్య."

"అనయము పుట్టె జూదమున యప్పుడ; యెంతయు జిచ్చు వెట్టి కా
ల్చినయది నీయుపేక్షయ, వశీకృతచిత్తుడు ధర్మసూతి మె
త్తనిపులి; యెల్లవారలు నధర్మము నీపయి బెట్టునంతకు
న్వినదును గానదుం, బిదప నీకును నాకు మరల్పవచ్చునే"
(ఉద్యోగ ద్వితీయ - 9 - 14)

ఉభయపక్ష హితాభిలాషియైన సంజయు డేమాత్రము మోమో టము లేక ధృతరాష్ట్రుని దంభ ప్రవృత్తిని ఖండించి, కర్తవ్యమును ఉపదేశించుట ఆతని ధర్మాభిముఖ్యమును తెలియచేయుచున్నది. సంజయుని వచోనైపుణ్యమును ధర్మరాజు మిక్కిలి ప్రశంసించెను.

"దుర్ణయమును బె
ట్టిదమును బెండును నగు పలు
కొదవదు నీ నాలుకకు - నయోన్నత యెపుడున్"
(ఉద్యోగ - ప్రథమ - 363)

ధృతరాష్ట్రుడు మహాభారతయుద్ధప్రారంభమున సంజయుని పిలిచి ఏ బలమును చూచుకొని ధర్మరాజు కౌరవులపై ఎత్తివచ్చు చున్నాడని ప్రశ్నించెను. అపుడు సంజయుడు పాండవుల బలమును,

వాసుదేవ పరబ్రహ్మ మహత్త్వమును సాకల్యముగ వివరించెను. సంజయుడు పాండవ బలపరాక్రమములనుఅగ్గించి ధృతరాష్ట్రుని హేళన చేయుచున్నాడు.

"అట మి న్నందినయట్టి వానిపోడ వెంత"న్నట్లు, ఫాలాక్షు నె
క్కటి కయ్యంబున గన్న ఫల్గును భుజాగర్వంబు లెక్కించు, టం
తటవానిం గొని ధర్మసూతి సమరోత్సాహంబుమై నెత్తి వ
చ్చుటకుం గొంకనె - వీవు సక్కనయి నిల్చంగాక మీ

సైన్యముల్"

(ఉద్యోగ - ద్వితీయ - 174)

ఈవిధముగ సంజయుడు పాండవుల ధర్మబలమును వివరించెను. సంజయుడు శ్రీకృష్ణుని పరమేశ్వరతత్త్వమును అర్థముచేసికొన్న మహాజ్ఞాని. సంజయుడు వేదవ్యాసమహర్షి అనుగ్రహముచే ధృతరాష్ట్రునకు వాసుదేవ పరబ్రహ్మతత్త్వమును, విద్యావిద్యలను సాకల్యముగ వివరించెను.

"ఒకతల సమస్తజగములు
నొకడ జనార్దనుడు నిలిచి యొకతల యైనన్
సకలము నసార, మాతం
డొకరుని సారంబ చాల నుత్కృష్ట మగున్."

(ఉద్యోగ - ద్వితీయ - 315)

"ఎక్కడ నడచును సత్యం
బెక్కడ ధర్మంబు వరగు, నెక్కడ గలుగుం
జక్కటి, నిలుచుం గృష్ణుం
డక్కడ, నత డున్న కడన యగు జయమధిపా!"

(ఉద్యోగ - ద్వితీయ - 317)

"సాత్త్వికరాజసతామస వికారంబుల త్రిప్పలం బడక, ధర్మం బాచరించుచు భావశుద్ధి గలిగియుండుదు; దీన నే నచ్యుతు నెఱుంగుదు; విద్య యిట్టిది; నీకునుం దక్కొవ్వరికైనను నతని నెఱుంగుటకు నిదియె తెరు, విట్టిదిగాని విధం బవిద్య"

(ఉద్యోగ - ద్వితీయ - 320)

సంజయుడు తాను అచ్యుతుని తత్త్వమును నెఱింగినవాడనని చెప్పుటకంటె విశేషమేమున్నది. వ్యాసమహర్షి సంజయుడు అత్యంతాప్తుడనియు, అట్టి ఆప్తవాక్యమును ప్రమాణముగ తీసికొని ప్రవర్తింపుమని ధృతరాష్ట్రుని ప్రబోధించెను. భీష్మపర్వమునుండి సౌప్తిక పర్వమువరకు ప్రధాన విషయము యుద్ధము. ఇది సర్వజనాకర్షణీయమైనది కాదు. యుద్ధమనగా రక్తపాతము. బీభత్సము. అట్టి కథను రసవంతముగ చూచినది చూచినట్లు చెప్పుట సంజయుని వంటి మహాపురుషునకే చెల్లినది.

"వేదవ్యాసమునీశ్వరు
పాదంబులు దలంచి మ్రొక్కి భక్తిరసైకా
స్వాదనసుకరా నందో
త్పాదనదివ్యమతి నగుచు దగ నెఱిగింతున్"

(భీష్మ - ప్రథమ - 69)

విన్నదానికంటె చూచినవిషయము మానవుని హృదయములో చక్కగా హత్తుకొనును. చూచినది చూచునట్లు వినువారు ఆనందించునట్లు రసవంతముగ చెప్పుట వక్తనుబట్టి ఉండును. యుద్ధము రక్తపాతముతో జననష్టముతో కూడి తలచుకొన్నచో, భయము, హేయ భావము కలుగును. అట్టి యుద్ధమును ఐదు పర్వములలో వినుగు జనింపకుండ తెలుపుట, చారుభీషణముగ వర్ణించుట, సంజయ తిక్కనార్యులకు మాత్రమే చెల్లినది. ఈ పద్యము ఇరువురకు అన్వర్థమై

యున్నది. సంజయుడు వ్యాఖ్యాతగా ధర్మమహాత్మ్యమును, అధర్మవిష ఫలితమును చెప్పి ధృతరాష్ట్రునిలో పరివర్తనను తెచ్చుటకు ప్రయత్నించెను. యుద్ధపంచకమును సంజయునిచేతను శాంతిత్రయమును భీష్మునిచేతను చెప్పించుటలో వ్యాసమహర్షికి ఏదియో పరమాశయమున్నది. సంజయుడు ధృతరాష్ట్రునికి విశ్వాసపాత్రుడైన భృత్యుడు. అందుచే అతనిచే సమరప్రకారము చెప్పించుట సముచితమై యుండునని భావించియుండును.

చివరివరకు సంజయుడు ఏలికయగు ధృతరాష్ట్రుని నీడవలె అనుసరించియున్నాడు. సంజయుడు ఉత్తమ భృత్యుడై మహాజ్ఞానియై కారణాంతరములచే అధర్మపక్షములో నున్నను, ధర్మమును దైవమును, వీడక కర్మయోగిగ జీవించిన సాధుశీలుడు. సంజయుడు మునిసంతతికి చెందిన వ్యక్తి కదా!

## 6. భీష్మాచార్యుడు

వ్యాసమహర్షి రాజర్షిగా భీష్ముని చిత్రించెను. శ్రీకృష్ణుని తరువాత పేర్కొనదగిన మహోదాత్తమూర్తి భీష్ముడు. సత్యపరాక్రమసంపన్నుడై ఆజన్మకర్మయోగియై గురుజన భక్తిసంపన్నుడై, పరమపవిత్రమూర్తులైన గంగాశంతనుల నందనుడై, భారతీయ హృదయపీఠము నలంకరించిన రాజర్షి. వ్యాసభగవానునకు ఇతనిపై అపారమైన గౌరవము కలదు. దానికి నిదర్శనముగ సమస్తధర్మములు భీష్మ ముఖమున వెలువడినవి. ఉత్తమ సచివ వ్యవస్థకు ప్రతీక భీష్ముడు.

ఈమహాపురుషుని జన్మయే అపూర్వము. పరమపవిత్రతకు వైశిష్ట్యమునకు ప్రతీకమైన గంగ యందు శంతన మహారాజున కుద్భవించినవాడు శాంతనవుడు. అష్టవసువులలో ప్రభాసుడను వసువు వశిష్ఠ శాపముచే భీష్ముడుగా నవతరించెను. గంగామాతయొక్క పావిత్ర్యము

తండ్రియొక్క సత్యవ్రతము లోకోత్తరపరాక్రమము, పుత్రునకు సంక్రమించినవి.

గాంగేయుని బాల్యము మాతృదేవత సాన్నిధ్యమున సాగుట ప్రశంసింపదగియున్నది. తల్లియే బిడ్డయొక్క ప్రప్రథమ గురువు. మందాకిని ప్రియపుత్రుని అలౌకిక గురువులకడ విద్యాధ్యయనము చేయించినది. ఆ దివ్యమాత ప్రియపుత్రుని గురుపరంపరను, ఆతని మహత్త్వమును అత్యుక్తి లేకుండ ప్రస్తుతించినది.

సాంగంబు లగుచుండ సకలవేదంబులు
సదివె వసిష్ఠుతో సకలధర్మ
శాస్త్రాదిబహువిధశాస్త్రముల్ శుక్రబృ
హస్పతుల్ నేర్చినయట్ల నేర్చె
బరమాస్త్ర విద్య నప్పరశురామునంతెంత
దక్షుఁ డంతియు కడుదక్షుఁడయ్యె
నాత్మవిజ్ఞానంబునందు సనత్కుమా
రాదుల యట్టిడ యనఘమూర్తి.

(ఆది - చతుర్థ - 169)

గాంగేయుడు అలౌకిక మహాపురుషులైన వశిష్ఠుడు, బృహస్పతి, శుక్రాచార్యుడు, పరశురాములకడ శుశ్రూషకు చేయుటచేతనే లోకోత్తర ధనుష్కళా పాండిత్యము, ఆత్మజ్ఞానము కలిగినవి. ఇతడు రాజనీతిలో ధర్మమును మేళవించెను.

విచిత్రవీర్యుని అనంతరము ధృతరాష్ట్ర పాండురాజులు బాలురుగ నున్నపుడు ఇతడు రాజప్రతినిధియై రాజ్యపాలనము చేసి ప్రజలకు రామరాజ్యస్ఫూర్తిని కలిగించిన రాజమూర్ధన్యుడు. రాజునకు ధర్మబలమే ఉత్తమబలమని నిరూపించినవాడు.

భారతీయ సంస్కృతిలో జననీజనకులు ప్రత్యక్షదైవతములను పవిత్రభావన కలదు. "మాతృదేవో భవ", "పితృదేవో భవ", "ఆచార్యదేవో భవ".

అనునవి తైత్తిరీయోపనిషత్తులోని వాక్యములు. వీనికి రమణీయమైన వ్యాఖ్యానమే భీష్ముని చరిత్ర. జననీ జనక సమారాధనమునకు మించినతపస్సు లేదు. కృతయుగములో శ్రీరామచంద్రుడు పితృవాక్య పరిపాలనార్థము, రాజ్యసింహాసనమును అష్టైశ్వర్యములను తృణప్రాయముగ త్యాగముచేసి భార్యాసహితుడై అరణ్యమున కేగెను. శ్రీరామునకు పదునాలుగు సంవత్సరముల అనంతరము రాజ్యము దక్కునను ఆశాకిరణముకలదు. మన శాంతనవునకట్టి ఆశపడుట కవకాశమే లేదు. అతడు పితృపాదులకు పునఃపరిణయము చేయుటకొఱకు నిజరాజ్య పరిత్యాగంబును బ్రహ్మచర్యవ్రతమును, సత్యవ్రతమును అవలంబించెను.

రాజ్యత్యాగముచే లోభమును, బ్రహ్మచర్యవ్రతముచే కామమును, ఏకకాలమున జయించుటచే దేవతలు భయభ్రాంతులై అతనికి భీష్ముడను బిరుదునొసఁగిరి. తండ్రియైన శంతనుడు పరమానందభరితుడై అతనికి స్వచ్ఛందమరణము ప్రసాదించెను. ఇట్టి అచంచల పితృభక్తి, సత్యవ్రతము, త్యాగము, ప్రపంచసాహిత్యములో నెచ్చటను గోచరించవు. త్యాగమునకున్నశక్తి అమేయము. ప్రతిభచేకాని అభిజాత్యముచేగాని, ధనముచేగాని, పాండిత్యముచేగాని, మనము అమృతత్త్వము పొందజాలము. మానవుడు సత్యధర్మపరాయణుడై, త్యాగముచేతనే లోభకామములను వశముచేసికొని మృత్యువును జయింపగలడని తెలియుచున్నది. భీష్ముడు మృత్యుంజయుడు.

భీష్ముడు సంసారమును త్యాగముచేసినను, కుటుంబముయొక్క బాధ్యతనుండి తప్పించుకొన తలంచలేదు. చిత్రాంగద, విచిత్రవీర్యులను

సొంత తమ్ములుగా ప్రేమించి రాజ్యపాలకులుగ తీర్చిదిద్దెను. వారిరువురు మరణించుటచే వారిపుత్రులకు ధృతరాష్ట్ర పాండురాజులకు పెండ్లిండ్లు చేయించి కంటికిరెప్పగా కాపాడెను. మనుమలైన కౌరవ పాండవులు లోకములో నిస్సీమపరాక్రమ సంపన్నులుగ వెలుగొందుటకు ఎంతయో ప్రయత్నించెను. కురువంశ మహాభ్యుదయమే అతని జీవితపరమార్థము. తాతగారు మనుమలను ధనుర్విద్యా విశారదులైన కృపద్రోణాచార్యులకడ విద్యాభ్యాసము చేయించెను. అతడు సంసారములోనున్నను సుఖదుఃఖాది ద్వంద్వముల కతీతుడైన యోగిగా జీవించెను. మానవులు సంసారములో ఉండియు యోగి చిత్తవృత్తితో జీవించిన ముక్తిపొందుదురని ధ్వనితము.

భీష్ముడు లోకోత్తర ధానుష్కుడయ్యును, బ్రహ్మజ్ఞానియై, శ్రీకృష్ణుని పరతత్త్వమును అర్థముచేసికొన్న మహాభక్తుడుగా గోచరించును. రాజసూయయాగసమయమున ధర్మరాజు అర్ఘ్యప్రదానము చేయుటకు పూజార్హుడయిన వ్యక్తిని నిర్ణయింపుమని పితామహుని ప్రశ్నించెను. శ్రీకృష్ణుడు ఏ కారణములచే జగత్పూజార్హుడో వేదోక్తవిధమున భీష్మ తపస్వి నిరూపించెను.

"రోదసీకుహరంబు రుచిరాంశుతతి జేసి
యర్కుండు వెలిగించునట్టులమృత
సందోహనిష్యందచంద్రిక జేసి శీతాంశు
డానందించునట్లు సకల
జనులకు దనదైనసదమలద్యుతి జేసి
తనరంగ దేజంబు దనువు దాన
చేయుచు నున్నసత్సేవ్యుండు పుండరీ
కాక్షుండు గృష్ణు డనాదినిధను

డజ్జనాభు డుండ నర్ఘ్యంబునకు నింక,
 నర్హులొరులు గలరె యజ్ఞపురుషు
నఖిలలోకపూజ్యు నచ్యుతు బూజింపు
 మధిప ! యదియ చూవె యజ్ఞఫలము"
(సభా - ద్వితీయ - 6)

"ఉత్తమజ్ఞానవృద్ధు నానుండె నేని,
బాలుడయ్యును బూజ్యుండు బ్రాహ్మణుండు
క్షత్రియుడు పూజ్యు డమితవిక్రమసమృద్ధి,
నఖిలపతులతో నధికుడై యుండెనేనిలో."
"ఈ రెండు కారణముల ము
రారాతియ యర్ఘ్యమునకు నర్హుడు జగదా
ధారుండు మాక కాదు స,
దారాధ్యుడు విష్టపత్రయావాసులకున్."
(సభా - ద్వితీయ - 25, 26)

"బుద్ధియు మనమును బురుషుండు
 నవ్యక్త మగుచున్న ప్రకృతియు నంబరంబు
ధరణియు దరణియు దహనుండు
 జంద్రుండు గాడ్పును దిక్కులు గాలములును
దానయై జంగమస్థావరాత్మక
 మైన సకలభూతప్రపంచంబు నెల్ల
దనదివ్యశక్తిమై దాల్చినసర్వాత్మ
 సర్వభూతేశ్వరు సర్వవంద్యు."
(సభా - ద్వితీయ - 29)

భీష్మస్తుతియే విష్ణుసహస్రనామముగా ప్రసిద్ధిపొందినది. అది స్తోత్రవాఙ్మయములో శిఖర శేఖరము. భీష్ముడు బ్రహ్మనిష్ఠుడు. అతని విష్ణుస్తుతి వేదప్రతిపాద్యమైనది.

విమర్శకులు భీష్ముని శీలముపై నిందారోపణము చేయుచున్నారు. పాండురాజు మరణానంతరము దుర్యోధనాదులు పాండవులను సంహరించుటకు లాక్షగృహదహనాదులు చేయుచు అధర్మపరాయణులైన సంగతి తెలిసియు భీష్ముడు ఏల ఉపేక్షించి ఊరకుండెను ? జూదమును నివారించుటకు తాతగారు ఏల ప్రయత్నింపలేదు? ధర్మాధర్మములు తెలిసిన మహోదాత్తమూర్తి, అస్త్ర శస్త్ర ప్రావీణ్యము కలవాడు, ఉభయవంశ శ్రేయోభిలాషియైన భీష్ముడు ద్రౌపదీ పరాభవమునకు పాల్పడిన దుష్టచతుష్టయమును ఏల సంహరింపలేదు ? మహాభారతయుద్ధమునందు అధర్మము కౌరవులపక్షమున ఉన్నదని గుర్తించిన భీష్ముడు కౌరవపక్షమునే పట్టుకొని ఏల వ్రేలాడినాడు. భీష్మునివంటి మహాపురుషుడు మొట్టమొదటనుండి అధర్మము జరుగుచుండగా ఔదాసీన్యము వహించుటచేతనే మహాభారతయుద్ధము దాపురించినది. ఈవిధముగ ఎన్నియో అభాండములను ఆ తపస్విపై వేయుచున్నారు. ఈ ప్రశ్నలన్నిటికి భారతమే ప్రత్యుత్తరము చెప్పుచున్నది. ఏకదేశమును చదివి, కామక్రోధ లోభ దూషితమైన దృష్టితో చూచువారికి ఇట్లే భ్రాంతి కలిగించును. ధర్మసూక్ష్మము తెలిసికొనుట అత్యంత కష్టము. ఏనాడు భీష్ముడు దాశరాజుకడ సత్యవతికి పుట్టిన బిడ్డలకు రాజ్యాధికారము దానముచేసెనో, ఆనాటినుండి సామాన్యపౌరుడు. రాజునకు భృత్యుడు. పాండురాజు రాజ్యాధికారము పొందినరీతిని విదురుడు మంత్రిస్థాన మలంకరించెను. పాండవులు మంచికి, చెడ్డకు శ్రీకృష్ణునిసాయమును అర్థించుచున్నారు. ఈ విధముగా మనుమలు ప్రాజ్ఞులై స్వయముగా కార్యములు చక్కబెట్టుకొనుట చూచి తాతగారు తృప్తిపడి రాజకార్యములకు దూరముగ నుండుటకు ప్రయత్నించిరి. దుర్యోధనాదులు పాండవులను సంహరించు

టకు చేసినకుట్రలు తెలిసియు తగిన సాక్ష్యములేకుండ ప్రభువైన ధృతరాష్ట్రుని ఏవిధముగా నిందింపగలడు ? వంశప్రతిష్ఠ, రాజ్య ప్రతిష్ఠ కాపాడవలసిన వయోవృద్ధుడు తాను పనిగట్టికొని ధృత రాష్ట్రుని మందలింపగలడా ? భీష్ముడు జూదమును, ద్రౌపదీపరాభవ మును ఏల నివారింపలేదు ? అనుదానికి సమాధానము కలదు. ధృత రాష్ట్రుడు మహారాజుపదవిలోనుండి సుహృద్ద్యూతమునకు ఆజ్ఞఇచ్చెను. సమానపు హాయిదాలలోనున్న ధర్మరాజు దాని కంగీకరించెను. మధ్యలో సామాన్యపౌరుని స్థానములోనున్న భీష్ముడు ప్రభువును ప్రశ్నించుట తగునా ? వీని అన్నిటికంటే బలవత్తరమైన కారణము ఉన్నదని ఊహింపవచ్చును. భీష్మునకు తల్లి అయిన సత్యవతి యందు అచంచలమైన గౌరవము. ఆమెతో చెప్పకుండ భీష్ముడు ఏ పనియు చేయలేదు. ఆమెకును భీష్మునిపై అత్యంత గౌరవము. ఆమె ఈలోక మును వీడిపోవుచు తమ్ములకొడుకులైన పాండవకౌరవుల బాధ్యత భీష్మునికి ఇల్లడపెట్టి వెళ్లియుండును. తాతగారు వారినందరిని పెంచి పెద్దచేసి పెండ్లిండ్లు చేసినాడు. కన్నప్రేమకంటె పెంచినప్రేమ చాల దొడ్డది. అట్టిచో భీష్ముడు తానుపెంచి పెద్దజేసిన ధృతరాష్ట్రునిపైనను దుర్యోధనునిపైనను కత్తిదూయగలడా ? ఎంత కూరుడైనను తాను పెంచి పెద్దజేసిన వృక్షమును సహితము స్వయముగా కొట్టలేడుగదా ?

ద్రౌపది పరాభవము పొందుటకు పూర్వము తాను ధర్మ విజి తనా? అధర్మ విజితనా? అని ప్రశ్నించినది. ఆ సమయమున పితా మహుడు ఎంతయో విచారించి ఇట్లు చెప్పెను.

"అవ్వా! నీ ప్రశ్నంబునకు నుత్తరం బయ్యుధిష్ఠిరుడు సెప్ప వలయు గాని నాడు ధర్మసూక్ష్మత యెవ్వరికిని నెఱుంగ గహనంబు. దీని ఫలంబు వేగంబ యిక్కురుకులపాంసను లనుభవింతురు."

(సభా – ద్వితీయ – 245)

ధర్మాధర్మ నిర్ణయము చేయు సమర్థత ధర్మరాజునకే కలదని చెప్పెను. దీనివలన ఆతనికి ధర్మముపైనున్న అత్యధిక గౌరవము తెలియుచున్నది. కౌరవుల కార్యము అత్యంత పాపమయినదనియు దాని ఫలము వారు అచిరకాలములో పొందుదురనియు చెప్పెను. ఆజన్మయోగియైన భీష్ముని హృదయమునకు గాయము కలుగుటయే కౌరవవంశనాశమునకు బీజము.

మాయాద్యూతమువలన సిద్ధించిన అక్రమ విజయముతో దుష్ట చతుష్టయము పట్టపగ్గములు లేక దుర్మార్గమునకు ఒడిగట్టిరి. మహాపతివ్రతయగు ద్రౌపది వస్త్రములను దుశ్శాసనుడు బలవంతముగా లాగెను. ఆ మహాపతివ్రత ఆర్తనాదము మిన్నుముట్టినది. వాతావరణమంతయు మహాభయంకరముగా బీభత్సముగా తయారైనది. ధర్మరాజు ఓటమిని అంగీకరించి తలవంచినాడు. కురుకులేశ్వరుడు, ఉభయవంశముల మేలు కోరవలసిన ధృతరాష్ట్రుడు బెల్లముకొట్టిన రాయివలె ఊరకున్నాడు. ఇట్టి క్లిష్టపరిస్థితిని నివారించుటకు ఆవశ్యకమైనవి దైవబలము, బాహుబలము. ఇట్టి క్లిష్టపరిస్థితిలో భీష్ముడు ధనుష్టంకారము చేసి, దుర్మార్గులైన కౌరవులను చీల్చిచెండాడి, ద్రౌపదీసాధ్విని రక్షింపనవసరము లేదా ? కాని భీష్ముడట్లు చేయలేదు. శ్రీకృష్ణావతార ప్రయోజనము దుష్టసంహారము. అది దైవమునకే భీష్ముడు వదలినాడు. తాను చెప్పినను ధృతరాష్ట్రుడుగాని దుర్యోధనాదులుగాని వినుస్థితిలో లేరు.

పితామహునకు ఈనాటికి కాకపోయినను మరొకనాటికైనను మనుమలందరు కలసిమెలసి ఉండు మంచిరోజు వచ్చునని ఆశాకిరణము కలదు. అందుకొరకే భీష్ముడు తనశక్తినంతను ప్రయోగించెను. భీష్ముడు చాల సందర్భములలో దుర్యోధనునకు హితోపదేశము చేసెను. దానికి కారణము మనుమలందరు కలసిమెలసి ఉందురనియే.

పాండవపాంచాల విభేదనోపాయముగూర్చి యోచించుచుండిరి. అప్పుడు తాతగారు నొక్కి చెప్పిరి.

"అప్పాండవులతోడి విగ్రహంబుచేత కెన్నండును నోడంబడ నేర బిత్రు పైతామహం బయిన రాజ్యంబునకు నీయట్ల వారు నర్హులు గావున వారికి నర్ధరాజ్యంబిచ్చిన నీకును నీ బాంధవులకును లోకంబులకును బ్రియంబగు నట్లు గానినా డపకీర్తియగు గీర్తి నిలుపుటయే కాదె రాజులకు జన్మఫలంబు"

(ఆది - అష్టమ - 30)

ఘోషయాత్రకు వెడలి పాండవులను బంధింపలేక దుర్యోధనుడే గంధర్వులచే బంధితుడయ్యెను. అతనిని పాండవులు విడిపించిరి. ఇది దుర్యోధనునకు చచ్చినంతపని అయినది. అప్పుడైన దుర్యోధనునిలో కొంతపరివర్తనము రాకపోవునా అని భ్రాంతిపడి పితామహుడు కర్తవ్యోపదేశము చేసెను. "నీవు నమ్ముకొన్న కర్ణుడు, పాండవుల శౌర్యాయుధనైపుణ్యములో పదారవపాలునకుకూడ పోలడు. గంధర్వులతో కలిగిన యుద్ధములో వీని చందము అర్థమైనదా ? లేదా ?

"కులమును సిరియును జెఱుపక
యలఘుస్థితి నింకనైన నప్పాండవులం
గలసి మన వయ్య; నాదగు
పలుకు విన గదయ్య: హితము బథ్యము జుమ్మీ.

అనిన భీష్ము వచనంబులదెస ననాదరంబు చేసి దుర్యోధనుండు గర్ణసౌబలులం జూచి నవ్వుచు, వారలుం దమ్ములుం దోడన చన నక్కడ వాసి చనియె; భీష్ముండును లజ్జితుండై నిజగృహమున కరిగె"

(అరణ్య - షష్ఠ - 64, 65)

ఈవిధముగ భీష్మపితామహుడు దుర్యోధనునకు పాండవులతో విరోధము పెట్టుకొనుట పాడిగాదని హితోపదేశము చేసెను. అది అంతయు దుర్యోధనునిపట్ల అడవికాచిన వెన్నెల అయినది.

భీష్ముడు చాల సందర్భములలో కర్ణుని నిందించుట, సైన్య విభాగము చేయునపుడు కర్ణుని అర్ధరథునిగ పేర్కొనుటకు కారణ మున్నది. ఆతనికి కర్ణునిపై ఏమాత్రము ద్వేషములేదు. కర్ణుని ప్రేరణ మూలముననే దుర్యోధనుడు యుద్ధమునకు కాలుద్రవ్వుచున్నాడని గ్రహించి అతనిని దూరముచేసినచో దుర్యోధనుడు చెప్పినమాట విని సుఖముగా నుండునని ఇట్లు చేసియున్నాడు. భీష్ముడు శరతల్పగతుడైన సందర్భమున కర్ణుడువచ్చి పాదాభివందనముచేయగా వంశాభ్యుదయమే తన జీవితధ్యేయమని నొక్కిచెప్పెను.

భీష్ముడు అధర్మము కౌరవులపక్షమున ఉన్నదని తెలిసియు దానిని పట్టుకొని చివరివరకు ఏల వ్రేలాడినాడు? అనుదానికి ఆతనిమాటలే ప్రత్యుత్తరముగా స్వీకరింపవచ్చును.

"మీరు పాండుసుతులు నారయ నాకొక్క
రూప కార్యమున్నరూపు వలుక
వలయు గయ్యమైన వత్తు; మీలోన నా
యునికి చందమునకు నుచితమిదియ."

(ఉద్యోగ - చతుర్థ - 148)

భీష్ముడు చిరకాలమునుండియు కౌరవులకడనే యుండి వారి ఉప్పు పులుసు తిన్నందులకు అచ్చటనే ఉండి ఉండును. అర్జునుడుకూడ ఈ అభిప్రాయమునే సమర్థించెను.

"బహుమహితాయుధవిద్యా
రహస్యసంవేది ధార్తరాష్ట్రులకును మా
కు హితంబ కోరు సముడై
సహాయ మగువారలకు నచట దా నునికిన్."

(విరాట - పంచమ - 18)

భీష్ముడు ఆ కారణముచేతనే కౌరవ సైన్యాధిపత్యమునుకూడ స్వీకరించెను. అతనిహృదయమున భృత్యధర్మమునకు ధర్మమునకు సంఘర్షణ కలిగినది.

భృత్యధర్మము ననుసరించి కౌరవపక్షమును వహించుటయా ? ధర్మము పాండవులపక్షము నున్నది కాన వారి ననుసరించుటయా? అను నది అతనికి చిక్కు సమస్య అయినది. వ్యక్తిగతధర్మము ననుసరించియే భీష్ముడు కౌరవపక్షమును వహించెను. కాని అతనిహృదయము ధర్మపక్షమునెడనే మాటిమాటికి వ్రాలియున్నది. మహాభారత సమరారంభమున సైన్యాధిపత్యము వహింపుమని దుర్యోధనుడు కోరగా అత డిట్లు చెప్పెను.

"పెఱవారినెల్ల దరమిడి
నఱకుదు బాండుక్షితీశనందనులను రూ
పఱ నేయం జేయాడదు"

(ఉద్యోగ - చతుర్థ - 150)

సమరప్రారంభమున పాండవులు, కౌరవులు ఇరుపక్షములవారు తనకు కావలసినవారనియు, అర్థించినపుడు శ్రేయ ముపదేశింతుననియే దుర్యోధనునకు తెలిపెను. ఆ పితామహుడు యావచ్ఛక్తిని ఉపయోగించి సైన్యాధిపత్యము వహించినపిమ్మట పోరాడుచున్నను దుర్యోధనుడు ఆతని చిత్తశుద్ధిని శంకించి పాండవపక్షపాతి అని మాటిమాటికి నిందించెను. పది దినముల యుద్ధములో భీష్ముడు తనపేరు సార్థకము చేసికొన్నట్లు శత్రువులను చీల్చి చెండాడెను. అంబోపాఖ్యానము చెప్పుచు శిఖండి ముందుండగా అర్జునుని ఎంతమాత్రము జయించజాలనని తెలిపెను. ఎనిమిదవనాట రాత్రి దుర్యోధనుడు పితామహుని శిబిరమునకు వెడలి "నీవు ప్రక్కకుతొలగి పోరికి కర్ణుని పంపవే"

అని కఠినముగా పలికెను. మనుమడు లోకోత్తర ధానుష్కుని తాతను పట్టుకొని అంతమాటలన్నందులకు అతనిహృదయము బాణముగ్రుచ్చిన రీతిని బాధపడినది.

"అమ్మాట మనమునకు వా
లమ్మై తాకుటయు భీష్ము డత్యంత విషా
దమ్మున నించుకవడి మా
నమ్ము దగం దాల్చియుండె నతవదనుండై."

(భీష్మ - తృతీయ - 173)

తొమ్మిదవరోజున భీష్ముడు దావాగ్ని అడవిపై విజృంభించు విధమున విజృంభించి పాండవసేనను పట్టి పల్లార్చెను. ఆ క్లిష్టసమయమున శ్రీకృష్ణుడు తాను చేసిన ప్రతిజ్ఞను ఉల్లంఘించి చక్రముపట్టుకొని భీష్మునిపై దుమికెను.

భీష్ముడు కౌరవసేనకు ఆధిపత్యమువహించి పాండవులకు ఆత్మవధోపాయము చెప్పుట న్యాయమా? అనుదానికి కూడ సమాధానమున్నది. దుర్యోధనుడు తన చిత్తశుద్ధిని మాటిమాటికి శంకించి దూషించుచున్నాడు. మహాభారతసమరములో రక్తము కాలువలై ప్రవహించినది. శ్రీకృష్ణుడు ధర్మపక్షమును అవలంబించినాడు. ఈ పరిస్థితులలో తానెంత ప్రయత్నించినను కౌరవులకు జయముకలుగుట కలలోని మాట. అవి అన్నియు చూచి అతడు విరక్తిపొంది తన వధోపాయమును ధర్మరాజునకు ఎఱింగించెను. ఇందు తప్పు ఏమియు లేదు.

భారతములో శాంతిపర్వము రత్నము వంటిది. వ్యాసమహర్షి మానవాళికి ఒసంగదలచిన ఉపదేశములన్నియు ఇందు కలవు. వ్యాసమహర్షికి ఆజన్మయోగియైన రాజర్షియైన భీష్మునిపై అత్యంత గౌరవము, తత్కారణముగా జీవితములో ఏమాత్రము కల్మషమంటని

వాడు. జ్ఞానవృద్ధుడు, వయోవృద్ధుడు, ధర్మతత్త్వజ్ఞుడు అగు భీష్మ పితామహుడు ఉత్తమ జిజ్ఞాసంపన్నుడగు ధర్మరాజునకు ధర్మోపదేశము చేయుట ఎంతయు తగియున్నది. శాంతిపర్వమునకు శాంతనవ గీత అను పేరు కలదు. అది భీష్మోపదేశమువలననే సిద్ధించినది. శ్రీకృష్ణుడు ధర్మరాజునకు ధర్మోపదేశముచేయుటకు భీష్ముడే సమర్థుడని నొక్కి చెప్పెను.

"నీవు తపోవిశేషమహనీయత జేసి జగంబు లన్నియున్
భావమునం గనుంగొన నృపాలమహోత్తర చాలు దీత డ
త్యావిలచిత్తు డయ్యె సుహృదాప్తమృతిన్ దురపిల్లు నెవ్వగం
బోవగ ద్రోవు నీ దయిన పుణ్యతమస్ఫుటవాక్యపద్ధతిన్"
(శాంతి - ద్వితీయ - 109)

"ధరణి యెందాక నుండుసుస్థిరత నీదు,
కీర్తి యందాక నక్షయస్ఫూర్తిదాల్చి
నడవగలయది నీవు చెప్పెడి సువాక్య
ములును వేదతుల్యంబులై వెలయుచుండు."
"ధర్మజునకు నీ చెప్పెడు
ధర్మస్థితివాక్యసమితి తాత్పర్యముతో
నిర్మలులై కొనియాడెడు
ధార్మికులకు నుభయజగదుదాత్తత కలుగున్"
(శాంతి - ద్వితీయ - 148, 149)

వ్యాసమహర్షి భీష్మచరిత్ర ముఖమున మానవాళికి అమూల్యమైన సందేశములనొసంగెను. అతడు జననీజనక సమారాధనముకొరకు బ్రహ్మచర్యమును నిజరాజ్య పరిత్యాగమును చేసి కామలోభములను జయించెను. అతడు రాజర్షియై రాజనీతిలో నీతిని మేళవించెను. అవక్ర

పరాక్రమ సంపన్నుడై యుండియు మహాభక్తుడై విరాజిల్లెను. అతడు చేసిన ధర్మోపదేశము మానవాళికి వేదతుల్యము. జీవితాంతము లోక హితముకొరకు జీవించిన మహోదాత్తమూర్తి భీష్మతపస్వి.

## 7. ధృతరాష్ట్రుడు

"రోషమయ మహాతరువు సుయోధను డురు
స్కంధమందు లోన గర్ణు డలరు
గొమ్మ సౌబలుండు, గుసుమ ఫలములు దు
శ్శాసనుండు, మూలశక్తి తండ్రి !"

(ఉద్యోగ - ప్రథమ - 355)

ఇది శ్రీకృష్ణపరమాత్మ కౌరవులనుగూర్చి చేసిన సూత్రప్రాయమైన వ్యాఖ్య. దీని ప్రపంచీకరణమే భారత కథ. మన్యుమయ వృక్షమునకు మూలశక్తియే ధృతరాష్ట్రుడు. వ్యాసమహర్షి చిత్రించిన సంక్లిష్టపాత్రలలో నత్యంతప్రధానమైనపాత్ర ధృతరాష్ట్రుడు. భారతమునకు ప్రతినాయకుడు ధృతరాష్ట్రుడు. ఇతడొకగొప్ప ధర్మధ్వజి (Hypocrite). ధృతరాష్ట్రుడు దంభము, దుర్నీతి, అమితమైన పుత్రప్రేమ, లోభము, మూర్తీభవించినవాడు. అతనిపలుకు తీయన, మనసు కత్తికంటె పదునైనది, గోముఖవ్యాఘ్రము. వృద్ధసేవ, కార్యసాధన కౌశలము, వ్యవహారదక్షత, విజిగీష, రాజ్యాధికార కాంక్ష, రాజ్యపరిపాలనా దక్షత అను మంచిగుణములు కలవు. మాత్సర్యము మొదలైన దుర్గుణములు గలవు. ధృతరాష్ట్రుడు కన్నులు లేకపోయినను ఆవులించిన ప్రేగులులెక్కపెట్టు నైపుణ్యము గలవాడు.

లోకములో ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడు, ధర్మపక్షపాతి, కొడుకులు అతనిమాట వినలేదు, దీనికి అతడేమి చేయగలడు ? అను అభిప్రాయము సామాన్యులలో కలదు. అది సత్యదూరము. భారతము

బాగుగ పరిశీలించినచో ధృతరాష్ట్రుడు దుర్నీతికి పుట్టినిల్లు. కాపట్య మునకు పట్టుగొమ్మ. వ్యాసమహర్షి ధృతరాష్ట్రుని మానవసహజము లైన పుత్రలోభము, రాజ్యలోభము గలవానిగ చిత్రించి అతని కన్నులయెదుటనే నూరుగురు కొడుకులను పోగొట్టుకొనుట చూచి పశ్చాత్తాపముపొంది ఆత్మజ్ఞానము పొందినవిధమును ఒక క్రమములో వర్ణించి యున్నాడు.

ధృతరాష్ట్రుని పుత్రవ్యామోహ రూపమైన ఉపేక్షయే భారత యుద్ధమునకు కారణము. లోభము, దంభము, పుత్రైషణ, ధనైషణ, అశాంతికి ఎట్లు దారితీయునో నిరూపించి శాంతిపొందు ఉపాయమును ధృతరాష్ట్ర పాత్రముఖమున మహర్షి జగద్ధితకాంక్షతో ప్రబోధించి యున్నాడు.

ధృత: ధరింపబడిన, రాష్ట్రము గలవాడు. తనకు ధర్మముగా రావలసినదానికంటె అధికముగా కోరి తమ్మునిరాజ్యమును తనస్వంతము చేసికొని పాండవులను ప్రేమించుచున్నట్లు పైకి నక్క-వినయము నటించెను. అధర్మమును ధర్మమని భావించి ధర్మశీలురైన పాండ వులను దూరముచేసికొన్న దుర్నీతుడే ధృతరాష్ట్రుడు.

ధృతరాష్ట్రుడు "ధర్మధ్వజి". దంభము అతనిలోమూర్తీభ వించినది. దంభమనగా పలుకొకటి చేయునది ఒకటి. ఇదియే కాపట్యము. త్రికరణములు అతని స్వాధీనములో లేవు. ధృతరాష్ట్రుని హృదయము చాల నిగూఢమైనది. దాని యథార్థస్వరూపము సునిశిత ముగ పరిశీలించినగాని అవగతము గాదు. అతనిహృదయము అగాధ మైన సుడిగుండమువంటిది. దుర్యోధనుడు బాల్యమునుండియు పాండ వులను ఏదోవిధముగ మట్టుపెట్టి తనమార్గమును సుగమము చేసికొను టకు నెన్నియో కుట్రలను పన్నెను. ఇవి యన్నియు ధృతరాష్ట్రుడు

చూచియు చూడనివానివలె నటించెను. ధర్మరాజును విధిలేక యువ రాజుగ చేసి వేరొకవంక వారిపై అసూయ పెంచుకొనెను. ధర్మ రాజునకు యౌవరాజ్య పట్టాభిషేకము చేసినపిమ్మట ధృతరాష్ట్రునకు నిద్రపట్టలేదు. ఎంతయో దుఃఖముతో బాధపడెను. అనగా తనపుత్రు లకు రాజ్యాధికారము సున్నయే. ధర్మరాజు రాజు అయినచో ఇక తన బిడ్డలు రాజ్యయోగము లేక బాధపడవలసినదేనా ? అను చింతతో అతడు ఎంతయో కుందెను.

"దూషితస్యమహాసాభావో ధృతరాష్ట్రస్య పాండుషు
స చింతా పరమో రాజా న నిద్రా మలభ న్నిశి"
(సం.భా - ఆది - అధ్యా - 139 శ్లో - 27)

ధృతరాష్ట్రుడు పాండవులు, కౌరవులు తగువులాడుకొనుచున్నా రను నెపముతో పాండవులను ఖాండవప్రస్థమునకు తోలివేసెను. ద్రౌపదీ స్వయంవరసమయములో విదురుడు ధృతరాష్ట్రుని సమీపించి పాండవులు జీవించియేఉన్నారని ద్రౌపది పాండవులను వరించినదని తెలిపెను. పాండవులు బ్రతికియున్నందులకు ఎంతయోసంతోషము ధృతరాష్ట్రుడు ప్రకటించెను. పాండవులు పాండుమహారాజుయొక్క పుత్రులుమాత్రమే కాదు. నా పుత్రులపైకంటె వారిపైననే నాకు గొప్ప ఆదరము అని ప్రకటించెను. సరిగా అదియే దినమున దుర్యో ధన, కర్ణ, శకునులు ధృతరాష్ట్రుని సమీపించిరి. దుర్యోధనుడు తన మనస్సులో పాండవులపైయున్న అసూయను ధర్మరాజు యువరాజుగా అయినచో భవిష్యత్కాలములో ఏర్పడు ఇబ్బందులను తెలియచెప్పు చున్నాడు.

"వీరులని పాండుసుతులకు వెఱతు నేను
వెఱచుటకు తోడుగా నిప్డు విభుడ నీవు

పాండవజ్యేష్ఠునకుఁ బ్రీతి బరమయూవ
రాజ్య మిచ్చితి కురువృద్ధరాజులొద్ద."

(ఆది - షష్ఠ - 121)

ఆ మాటలువిని ధృతరాష్ట్రుడు పాండురాజే రాజార్హుడని చెప్పెను. అవి దుర్యోధనునకు ఎంతమాత్రము రుచింపలేదు. అతడు తండ్రిని పాండవులను ఏదో మిషమీద వారణావతమునకు పంపుమని ఇట్లు చెప్పెను.

"ఇంపుల దుష్టజనుల పక్షపాతవచనంబులుడుగునంతకునుపాయం బున గొంతిని బాండవులను తదీయ భృత్యామాత్యవర్గంబుతో వార ణావతంబునకుం బుత్తము"

"ఏ నెల్ల ప్రొద్దు నాయెడలోన దలఁతు నీయభిప్రాయంబ
యిది దారుణంబు
గాన వాకునకు జుల్కన తేరనోప గడగి పాండవుల
నేకత మెట్లు లనుప
గానగు మఱి దీని గాంగేయవిదుర కలశజాశ్వత్థామ
గౌతముల్ బుద్ధి
గా నొడంబడుదురె కాదయ్య యనిన గౌరవజ్యేష్ఠుండు
ఘను డిట్టులనియె."

(ఆది - షష్ఠ - 129, 130)

దీనినిబట్టి దుర్యోధనునకు పాండవులరాజ్యమును అపహరింపవలె నను దుర్బుద్ధి కలదు. ఇతడుచెప్పినది ధృతరాష్ట్రుడు చేయుచున్నాడు. ధృతరాష్ట్రుడును పాండవులరాజ్యము తనబిడ్డలకే కట్టబెట్టవలెనని గట్టిగా కోరుచున్నాడు. కాని పైకిమాత్రము చెప్పుటలేదు. ఇదియే ధృతరాష్ట్రుని దుర్నీతి.

ధృతరాష్ట్రుడు కూటరాజనీతిజ్ఞుడగు కణికు డుపదేశించిన కూట రాజనీతిని అక్షరాల పాటించెను. పాండుపుత్రులు వీరులు. అత్యంత

బలవంతులు, తేజస్వులు అగుటచే ధృతరాష్ట్రునకు అమితమైన చింత పొడమి కణికుని పిలిపించి ఇట్లు ప్రశ్నించుచున్నాడు. "పాండవులు దిన దినమునకు తేజోవంతులై ప్రకాశించుచున్నారు. నాకు వారిపై అసూయ జనించినది. నీవు సంధి విగ్రహాదికమైన నీతిశాస్త్రమున గొప్పవాడవు. నేను ఎట్లు కార్యమును సాధించుకొనవలెనో చెప్పు మనెను."

కణికుడు చెప్పిన నీతిలో ప్రధానమైన విషయములు కలవు. (1) దాయాది ఉన్నతుడైనను, పరాక్రమియైనను, యుద్ధకుశలుడయి నను వానినెట్లో మాయోపాయమున మట్టుబెట్టవలెను. రాజునకు దయ ఎంతమాత్రము తగదు. (2) రాజు అనుకూలమునుబట్టి గ్రుడ్డివాడుగ, చెవిటివానిగ నటింపవలెను (3) కార్యసాధకుడు లోకము తన్ను మంచి వాడని విశ్వసించుటకు తగిన పనులన్నియు చేయవలెను. యాగములు చేయవలెను. కాషాయములు కట్టవలెను. జడలు పెంచవలెను. మృగా జినములు ధరింపవలెను. పూజోపవాసాదికములు నటింపవలెను. ఈ క్రియలతో మంచివాడని భ్రాంతిని కలిగించి లోకమునే వంచింప వలెను. (4) పలు కెంతయో మృదువుగ నుండవలెను. మనసు కత్తి వాదర గావలెను. హృదయమున ఎంత విషమున్నను పైకి స్నేహ పూర్వకముగ మాటాడవలెను.

ఇవి అన్నియు తు. చ. తప్పకుండ ధృతరాష్ట్రుడు అనుసరించి నాడు. విదురుడు, సంజయుడు, భీష్ముడు, అందరు హితోపదేశము చెవినిల్లుకట్టుకొని చేసినను కణికుని ఉపదేశముమాత్రమే అతనికి రుచించినది. దీనినిబట్టి ధృతరాష్ట్రుని చిత్తవృత్తిలోని క్రౌర్యము తెలి యును. ఇంత దుష్టత్వము మనసులో పదిలముగా దాచుకొనుటచేతనే అతడు నూరుగురు కొడుకులను పోగొట్టుకొని కొమ్మలుకొట్టిన మ్రోడ యిన వృక్షమువలె అయినాడు. అనగా మానవుడు దుష్టత్వముతో

కాపట్యముతో ఇతరులను వంచించుటకు ప్రయత్నించినచో దానవిషమ ఫలితము తప్పక అనుభవించి తీరునని సూచితము.

ధృతరాష్ట్రుడు గుప్తముగా మాయోపాయము లన్నియు పన్నినాడు. ధర్మరాజును హస్తినాపురమునుండి ఆవలకు పంపివేయవలెను. అతడు తిరిగి వెనుకకు రారాదు. ఇంతలో దుర్యోధనుడు ప్రజలలో పలుకుబడిని సంపాదించుకొనవచ్చును. ఇవి ధృతరాష్ట్రుని ఊహలు. ఈ దురూహతో పాండవులను వారణావతమునకు పంప నిశ్చయించి ఒక పథక మల్లెను. ఈ కార్యమును నెరవేర్చుటకు నియోగించెను. వారు వచ్చుచు పోవుచు వారణావతము రమ్యమైన పట్టణమనియు, ఆ పట్టణముననున్న పరమశివుని దర్శనార్థము అసంఖ్యాకముగ యాత్రికులు వచ్చుచుందురనియు, అది దర్శనీయమైన ప్రదేశమనియు వేనోళ్ల వర్ణించిరి. పాండవులకు ఆ పట్టణము చూడవలెనని కోరిక కలిగింపచేసెను. దానిని పసికట్టి వారణావతము పాండవులకు నివాసయోగ్యమైనదనియు మీరు అక్కడికి వెళ్లవలసియున్నచో వెళ్లవచ్చునని చెప్పెను. అటులయినచో అచట అన్నిఏర్పాటులు చేయగలనని హామీ ఇచ్చెను. అచ్చట దుర్యోధనుడు లాక్షాగృహము నిర్మింపచేసి సపరివారముగ కౌంతేయులను వధించుటకు కావలసిన యత్నములుచేసెను. విదురుడు ఆకుట్ర తెలిసికొని పాండవులనురక్షించుటకు వలసినయత్నము చేసెను. రాచరికము చక్కగా నడువవలెనన్నచో రాజునకు మంత్రికి సమైక్యము కుదురవలెను. విదురుడు ధార్మికుడు. ధృతరాష్ట్రుడు అధార్మికుడు. కడకు ధర్మదూరమైన రాజశక్తిని ధర్మశక్తిగల సచివశక్తి గెలిచినది. రాజశక్తి మంత్రశక్తులకు నడుమ ద్వంద్వ యుద్ధమేర్పడినది. ఆ యుద్ధమున రాజశక్తికి పరాజయము కలిగినది. విదురుని వంటి మంత్రిమాణిక్యము ఎక్కడను కనిపించడు. అట్టివాని హితోప

దేశము ధృతరాష్ట్రునిపట్ల చెవిటికి ఊదిన శంఖమువలె వ్యర్థమయినది. ఈ కుట్రతో ధృతరాష్ట్రుడు తమ్మునిని రాజ్యభాగములో అర్ధరాజ్యము తన కొడుకులకు చతురముగ కట్టబెట్టెను. శ్రీకృష్ణుడు ఆపద్ధర్మముగ కూటరాజనీతిని అనుసరించెను. ధృతరాష్ట్రుడు జీవితాంతము అనుసరించినది స్వార్థపూరితమైన కూటరాజనీతి. అందుచేతనే ధృతరాష్ట్రుడు దుర్మార్గుడైనాడు. శ్రీకృష్ణుడు ధర్మమును సంస్థాపించుటకు సజ్జనులను రక్షించుటకు కూటరాజనీతిని అనుసంధించినను అతడు జగదారాధ్యుడే. ధృతరాష్ట్రుని రాజనీతి పుత్రవినాశమునకు దోహదమొనర్చెను.

ధృతరాష్ట్రునిపాత్రను బాగుగ పరిశీలించినచో అమితమయిన పుత్రమోహము, రాజ్యలోభము కలిగియున్నట్లు గోచరించును. అందు చేతనే అన్ని అకార్యములను అధర్మములను దయాదాక్షిణ్యములు లేక చేసిఉన్నాడు. దుర్యోధనుడు రాజసూయయాగమునకు వెడలి తత్సభాలక్ష్మి తనమనోనయంబుల కగ్నిజ్వాలయై మహోదాహంబు చేయుటచే సంతప్తుడైనాడు. పాండవుల రాజ్యవైభవము దుర్యోధనుని కన్నుకుట్టినది. మాలిన్యముతో కూడిన బంగారమువలె దుర్యోధనుని హృదయము అసూయతో నిండిపోయెను. అన్నపానములు మానివేసెను. అది చూచి శకుని దుర్యోధనుని శరీర కార్శ్యవైవర్ణ్యములు ధృతరాష్ట్రునకు విన్నవించెను. అదివిని ధృతరాష్ట్రుడు అదిరిపడి కొడుకును ఒడలంటిచూచి కడు దుఃఖితుడయ్యెను. అదే మంచి సమయమని ఎంచి శకుని పాండవుల రాజ్యలక్ష్మిని మాయజూదమున ఓడించి దుర్యోధనునకు ఇత్తుననెను. వెంటనే దుర్యోధనుడు ఈ శకుని మతంబునకు ఒడంబడుమని మొండిపట్టుపట్టెను. ధృతరాష్ట్రుడు ఇది దీర్ఘదర్శి, ధీరమతి, విదురునితో ఆలోచించి చేయుదమని చెప్పెను. అంత దుర్యోధనుడు పాండవపక్షపాతియగు విదురుడు దీనికి ఎంత

మాత్రము అంగీకరింపడనియు, నీవు దీనికి అంగీకరింపని పక్షమున అగ్నిలోపడి ప్రాణములు విడిచెదననియు, ఆపైన నీవు విదురుడు కళ్ళు చల్లగా నుండవచ్చునని తెలిపెను. ధృతరాష్ట్రుడు ఇది ఉచితముకాదని తెలిసియు పుత్రుని ఆహ్లాదముకొరకు అంగీకరించెను. ధృతరాష్ట్రునకు జూదమనిన అంతరాంతరములలో నిష్టమే. విదురుడు ధృతరాష్ట్రునితో శకుని దుర్యోధనుల దుర్వ్యవసాయమును నివారింపుమనియు నొక్కిచెప్పెను. ధృతరాష్ట్రుడు తన సహజమయిన వచోనైపుణ్యముతో ఇట్లనుచున్నాడు :

"పుత్త్రుల కేల భేద మగు భూనుత ! యేనును నీవు జాహ్నవీ
పుత్త్రుడు నుండగా నహితమున్ భయమున్ దొరకొన్నె నాకు నా
పుత్త్రులకుం బ్రసాదకృతబుద్ధులు వేల్పులు గాన దీనికిన్
మిత్త్రనిధీ ! యొడంబడుము మిన్నక సంశయమంద నేటికిన్ ?"

(సభా - ద్వితీయ - 133)

ఈతని మాటలవలన లోకస్వభావము వెల్లడియగుచున్నది. సప్తవ్యసనములలో జూదము అత్యంతప్రమాదకరమైనది. ఒకవ్యక్తి పేక ఆటకు బానిసయై ఆటలో ఒకచేయి తక్కువకాగా ఇంటిలోనున్న తన పుత్రుని పిలిచి కూర్చుండబెట్టుకొని ఆటాడుట మొదలుపెట్టును. ఇంతలో బుద్ధిమంతుడు వచ్చి ఇదియేమి నీవు ఎట్లయినను పాడయినావు. నీపుత్రునికూడ ఎందుకు పాడుచేసెదవు అని ప్రశ్నించెను. అపుడు అతడు నవ్వుచు సరదాగా కూరుచుండబెట్టితినని తాను చేసిన తప్పును సమర్థించుకొనును. ధృతరాష్ట్రుడు చేసినదికూడ అట్టి ఘోరాపథమే. పాండవులను జయించుట చాలకష్టము. జూదములో ఒక రక్తపు బిందువు చిందకుండ ఒక్కభటుడును మరణించకుండ ఒక్క చిల్లుకాని ఖర్చుకాకుండగ పాండవైశ్వర్యము జూదముమూలమున తన

సొంతము చేసుకొనవచ్చునని ధృతరాష్ట్రుడు పాపద్యూతమునకు ఒడి కట్టెను.

యుధిష్ఠిరుడు ద్యూతవ్యసనియై ద్రౌపదిని పణముగ పెట్టి ఓడి పోయెను. శకుని విజయగర్వమునకు మేరయే లేదు. భీష్మద్రోణాదులు భయకంపితులయి వణికిపోవుచున్నారు. విదురుడు మొగము వాయ తలవాంచి దుఃఖితుడయ్యెను. ధృతరాష్ట్రుడు ఆనందముతో విదురుని వీపుతట్టి "కింజితమ్ ?" 'జయింపబడిరా ?' అని మాటిమాటికి ప్రశ్నించుచున్నాడు. ఆ క్లిష్టమైన సన్నివేశములో ధృతరాష్ట్ర దుర్యోధన కర్ణ శకునులు సంతోషపడిరి. సదస్యులందరును మిగుల దుఃఖించిరి. ఇది ధృతరాష్ట్రుని దుష్టత్వమునకు పరాకాష్ఠ. కౌరవులు జూదముతో ఆగినారా ? ద్రౌపదీమాతను జుట్టుపట్టి ఈడ్చిరి. సామ్రాజ్ఞి అగు ద్రౌపదిని తనదాసీలతో కలసి ఇళ్ళు ఊడ్వుమనెను. నిండుసభలో వస్త్రాపహరణము జరిగెను. దుర్యోధనుడు ద్రౌపదీసాధ్విని తొడపై కూర్చుండుమని సంజ్ఞచేసెను. ఈ దురాచారములన్నియు ఒకదాని నైనను ధృతరాష్ట్రుడు అడ్డగించెనా ? లేదు. ధృతరాష్ట్రునికి ఇవి అన్నియు సమ్మతములే. భారతీయ ధర్మశాస్త్రములో పాపము చేసిన వాడు, చేయించినవాడు అనుమోదకుడు పాపులే. అందులో మహాపతి వ్రతకు నిండుసభలో మహారాజు పదవిలోనున్నవారు పరాభవము చేయుట ఘోరమయిన పాపము. అదియే ధృతరాష్ట్రుడు దుర్యోధనునిచే చేయించి ఆనందించెను. ఇంతకంటె నీచాతినీచమయిన దుష్టత్వమే మున్నది ?

సామాన్యముగ మానవులకు పుత్రులపైనున్న ప్రేమ ఇంతింత అనరాదు. అది ఒక్కొక్కసారి వెఱ్ఱితలలు వేయును. ఈ పుత్రులపై నున్న మమకారముచే దుర్యోధనుడు చేయు అకార్యముల కన్నిటికి

ధృతరాష్ట్రుడు చూచియు చూడకుండ సమ్మతిని ప్రకటించియే యున్నాడు. విదురుడు ధర్మార్థమధురముగ దుర్యోధనుని దుర్మార్గము లన్నిటిని తెలియజెప్పి ఇట్టి దుర్మార్గుని విడిచిపెట్టుటకంటె ఉత్తమ ధర్మము లేదని నొక్కిచెప్పెను. అపుడు ధృతరాష్ట్రుడు విదురుని మాటలకు మండిపడి ఇట్లు చెప్పుచున్నాడు. నీవెప్పుడును పాండవులకే హితమెంతువు. నా కుమారులు నీ పాలికహితులు. నీ వాక్యమువలన నాకు దోచు అర్థమింతే. కనుక నీవు నా కహితములయిన వచనము లను మాటిమాటికి నా ఎదుటనే నుడువుచున్నావు. పాండవుల కొరకునై నేను నాకుమారుని వదలుకొనగలనా ? దుర్యోధనుడు నా రక్తమును పంచుకొని పుట్టినవాడు. ఇతరుల మంచికై ఎవ్వడైనను తనదేహమును గోసికొనయత్నించునా ? నీకిష్టమైనచో నిటనుండ వచ్చును. కాకున్న వెడలిపోవచ్చును.

ధృతరాష్ట్రునకు పుత్రులపై ఎంత గాఢమైన ప్రేమకలదో తెలియనగును. ఈ పుత్రప్రేమ సజ్జనులకు హాని కలిగించినది. అందుచే నింద్యమైనది.

ధృతరాష్ట్రుని వ్యవహారదక్షత, సూక్ష్మబుద్ధి అర్థముచేసికొనుట కడుంగడు కష్టము. అతనికి నొసట కన్నులు లేకపోయినను అవులించిన ప్రేవులు లెక్కపెట్టువాడు. లోకములో ఒక అవయవ లోపమున్న వాడు మహా ప్రతిభాశాలిగా ప్రవర్తించును. ద్రుపద పురోహితుని రాయబారము విన్నంతనే ఆలస్యము చేయక సంజయుని పాండవుల కడకు పంపినాడు. అతనికి ధర్మరాజు దయావంతుడనియు, వికృత భాషణములతో పాండవులు లొంగరనియు ధర్మముపై వారికి అచం చలమైన విశ్వాసము అనియు గ్రహించి వానినే ప్రశంసించుచు వారి చేతితో వారి కన్నులను పొడువజూచెను. ఈ ఉద్దేశముతో సంజయుని రాయబారమునకు పంపెను, కౌరవులు దుర్మార్గు లనియు, పాండవులు

ధర్మపరు లనియు వర్ణించి కురువంశమునకు కళంకము తెచ్చిన కౌరవులను సరిదిద్దుటకు ధర్మరాజు సమర్థుడని, పాండవుల మహాపరాక్రమ సంపద తలచుకొన్నచో భయకంపితుడనగుచున్నాననియు యుద్ధము సర్వానర్థప్రదమనియు, ధర్మజునకు సోదరులకు అత్యంత ప్రియముగ సంభాషింపుమని చెప్పెను.

"నెయ్యము వాటించి, కడుం
దియ్య మెసగ, నలుక లెల్ల దీఱు నటులుగా
గయ్య మను తలపులోనుగ,
నయ్యమనందనుడు మానునట్టి తెఱగుగన్."

(ఉద్యోగ - ప్రథమ - 271)

ధృతరాష్ట్రుడు చెప్పి పంపిన వర్తమానమంతయు బీరువోకుండ తన వాక్చాతుర్యము అంతయు నుపయోగించి సంజయుడు పలికెను. సంజయుని వాక్చమత్కారమును ధర్మరాజు శ్రీకృష్ణుడు ప్రత్యక్షరము ఖండించి నోరెత్తకుండ పలికిరి. ధృతరాష్ట్రుడు వేసినఎత్తునకు శ్రీకృష్ణుడు అచట లేకున్నచో ధర్మరాజుకూడ చిత్తుగా బంధింపబడెడువాడు. ధృతరాష్ట్రుడు మహా ఘటికుడు. శ్రీకృష్ణుడు రాయబారిగా వచ్చునని సంజయునివలన విని ఎంతయో యోచించి ఒక పన్నుగడ పన్నెను. అతడు విదురుని పిలిచి శ్రీకృష్ణుని లొంగతీసికొనుటకు వివిధ మణిమయ రథములను, యవనాశ్వములను, భద్రసామజములను, రత్నవిభూషణములను, దాసీనివహములను, కృష్ణునకుసమర్పించుడని ఆజ్ఞఇచ్చెను. దీనినిబట్టి దుర్మార్గులు ఇతరులను వంచించుటకు, తమ గుప్పిటలో పెట్టుకొనుటకు ఎన్ని ఎత్తులు వేయుదురో లెక్కలేదు. ఎదుటివారిలోనున్న కామాదికములను రెచ్చగొట్టి తమ స్వార్థము సాధించుకొందురు. దుష్టుల కాపట్యమునకు పడకుండ

తప్పించుకొనుట, ధర్మమార్గములో నడచుట, ధీరమానవులు, పరమేశ్వర భక్తికలవారు మాత్రమే చేయగలరు.

ధృతరాష్ట్రునకు సంజయుడు పాండవుల కడకు రాయబారము వెడలి తిరిగివచ్చి అచట జరిగినసంగతి ఎంతమాత్రము చెప్పక ధృతరాష్ట్రుని చెడామడతిట్టి మరునాడు విషయము తెలిపెదనని వెడలిపోయెను. ధృతరాష్ట్రుడు మనసులో నెవ్వగ పొంది నిద్రపట్టక బాధపడెను. అంత విదురుని రావించి, ధృతరాష్ట్రుడు తనకు హితోపదేశము చేయుమని కోరెను. విదురుడు సూటిగ ప్రశ్నించెను. బలవంతుడుపై నెత్తిన బలహీనుడు, ధనము పోగొట్టుకొన్నవాడు, దొంగతనము చేయ వేచియున్నవాడు, కామాతురుడు, నిద్రలేక బాధ పొందెదరు. వీనిలో ఏది నీమనసులో ప్రవేశించినది ? ఆ సమయమున విదురుడు సర్వమానవ దుఃఖ ప్రశమన కరమగు అమృతోపదేశముచేసెను. పాండవుల పాలు ఇచ్చి ఉభయులు కలసి మెలసి ఉండునట్లు చేయుమని ధృతరాష్ట్రుని నిర్బంధించెను. నియత తపము, ఇంద్రియ నిగ్రహము, బ్రహ్మవిద్య శాంతికి కారణములు. అన్నిటికంటె, శాంతినొసంగు దివ్యమైన ఔషధము, లోభత్యాగమే- అని చిలుకకు చెప్పినట్లు చెప్పెను. ఇన్నిమాటలు ధృతరాష్ట్రునిపట్ల అడవికాచిన వెన్నెలయై ఒక్కమాటతో తన సహజమయిన వక్రిత్వమును ప్రదర్శించుచున్నాడు.

"నీవు చెప్పినమాటలు నిర్మలములు -
నిపుణసమ్మతములు - రాజనీతిమార్గ
బోధకంబులు నైనను, బుద్ధి విడువ
నోప; 'ధర్మో జయతి' యని యుండువాడ."

(ఉద్యోగ - ద్వితీయ - 90)

ఈపద్యములో చివరిపాదములు అతనిస్వభావమును తెలుపు చున్నవి. ఏది ఏమైనను పుత్రునిమాత్రము విడువలేను అనుట అతని అమితమైన పుత్రమమకారమును సూచించుచున్నది. ధృతరాష్ట్రుడు తాను అధర్మముచేయుచు ధర్మమే జయించును అనుట తనప్రక్కనే ధర్మమున్నదని గట్టినమ్మకమున్నట్లు తెలియుచున్నది.

ధృతరాష్ట్రునకు యుద్ధముచేయుట సమ్మతమే. యుద్ధములో భీష్మ, ద్రోణ, కర్ణాది వీరులపై యధికమైన విశ్వాసము కలదు. పైకి మాత్రము పాండవులు మహాబలవంతులనియు, కౌరవులను జయింప శక్తిమంతులనియు భయపడుచున్నట్లు నటించును.

"ధర్మపుత్రున కిక్కడ తలపు భంగి
యెట్టులుండు ? నీసైన్యంబులెల్ల గూడి
యునికి వినియెనే ? యెవ్వరిగోని యతండు
కౌరవులమీద నెత్తి రాగలుగువాడు."

(ఉద్యోగ - ద్వితీయ - 168)

దీనినిబట్టి కౌరవబలము శత్రువులను జయింపగలదని అతనికి గట్టి నమ్మకము.

పాత్రలు బాహ్యాకృతిచేత మంచివారలుగ గోచరించును. కాని ఆ పాత్రలనే క్లిష్టమైన సన్నివేశములలో నుంచినచో ఎట్లు ప్రవర్తింతురో వారి మనస్తత్వము మనకు అవగతమగును. దుశ్శాసనుని అమానుష మగు వధను భీముడుచేసిన విధమును మహాభయానకముగ చిత్రింప బడినది. ఇదివిన్న పిమ్మట ధృతరాష్ట్రుడుపొందిన హృదయావేదనము వర్ణ నాతీతము. "పడుచు లీకలూడ్చి పట్టియాడెడునట్టి పులుగు చందమయ్యె దలప నాయవస్థ యెందు జొచ్చువాడ నీయటమట తీర్ప నెవ్వరింక దిక్కు గలరు." ఒకపక్షిని బాలికలు వినోదార్థముగ పట్టుకొని ఒక్కొకటి దాని ఈకలన్నియు లాగివేసి సంతోషించుచుందురు. పక్షికి

ప్రాణసంకటమైన బాధ కలుగుచున్నది. ప్రస్తుత ధృతరాష్ట్రుని స్థితి అట్టిది. పక్షి ఈకలు దాని దేహమునుండి పుట్టినవి. అట్లే ధృతరాష్ట్రుని తనుజులు, పౌత్రులు ఒకరొకరు హతులగుచుండ అతనికి మర్మభేదక మగు వేదనము కలుగుచున్నది. ఈకలు పోయినపిమ్మట పక్షి నిర్జీవమగు నట్లే పుత్రనాశముచే ధృతరాష్ట్రుడు జీవచ్ఛవమగుట నిక్కము. ఈ పద్యమువలన అంధుడు, అగతికుడైన ధృతరాష్ట్రుని దుర్భరవేదనయు, అతడుచేసిన పాపఫలితము క్రమక్రమముగా అనుభవములోనికి వచ్చుటయు తెలుపుచున్నది. భగవద్గీతలో అత్యుత్కటమైన పాపము చేసినచో మానవుడు ఈలోకములోనే అనుభవింపవలెను. అదియే ధృతరాష్ట్రుడు అనుభవించుచున్నాడు. ఇది కావ్యన్యాయమును పోషించుచున్నది.

శల్య దుర్యోధనుల మరణము విని ధృతరాష్ట్రుడు సంజయునితో ఇట్లనెను :

> "చావరు నొవ్వరు పాండవు
> లేవురు నని నీవు చెప్ప నిప్పలుకులు దుః
> ఖావేశకరములై చే
> తోవృత్తి దహింపబొచ్చె దుర్భరభంగిన్."

(శల్య - ప్రథమ - 14)

ఈ మాటలు ధృతరాష్ట్రుని అశక్తదుర్జనత్వమును చెప్పుచున్నవి. అతని విషపూరితహృదయము, లోకసహజమగు దుర్జన స్వభావము తెలియుచున్నవి.

తనకుమారులతోపాటు పాండవులలో నొక్కరైన కూలి యుండిన ఈ అంధునకు కొంత మనశ్శాంతి కలిగియుండెడిది. పాండవుల కేమాత్రము బాధ కలుగలేదని చెప్పుట అతని హృదయమును మండు

నట్లు చేసినది. దుర్జనులు తమకు ఏదైన కీడు సంభవించినప్పుడు ఇతరు నకు కూడ కీడు కలుగలేదే అని ఈర్ష్య పొందుదురు. ఇట్టి దుష్టలక్ష ణములను బీజములచేతనే ధృతరాష్ట్ర వృక్షము అభివృద్ధి పొందినది. ఉత్తమమానవ లక్షణము తనకేదైన దుఃఖము కలిగినచో నా పగ వానికిగూడ ఇట్టి దుఃఖము కలుగకుండ నుండుగాక అని అనుకొనుట భారతీయ సంప్రదాయము. దీనికి భిన్నమైనది ధృతరాష్ట్రుని ప్రవృత్తి.

ప్రియపుత్రుడైన దుర్యోధనుని మరణానంతరము ధృతరాష్ట్రు నిలో నున్న ఇసుమంత ధైర్యము అడగిపోయినది.

"తనయు లని నందఱుంబడి
రనగా విని పెక్కు పఱియలై పోవక యి
ట్లునికి యరయ వజ్రమయం
బని తలపగ దగుమదీయ మగు హృదయంబున్."

(శల్య - ప్రథమ - 15)

"కన్నులు చీకులై సుతనికాయము బాలవిహారలీలలుం
జెన్నగు ప్రాయ మొంది విలసిల్లు తెఱంగును జూడ గాన కి
ట్లున్నను బంధుకోటి సమయోచితలాలనం బల్కు పల్కులన్
విన్నవి వీను లిప్డు గొఱవిందము జూడినయట్ల పొక్కెడిన్"

(శల్య - ప్రథమ - 16)

ధృతరాష్ట్రుడు, గాంధారి తమ నూరుగురుపుత్రులను పోగొట్టు కొని దిక్కులేక తమను ఇక ఎవ్వరు వచ్చి పలకరింపగలరని ఱాళ్లు కరగునట్లు విలపించిరి. అప్డు ధృతరాష్ట్రుడు తాను మొట్టమొదటి నుండియు చేసిన తప్పులే ఈనాటి అనర్థమునకు కారణమని వగచెను. జీవితమున అనుల్లంఘనీయమైన విషమదశ ప్రాప్తించునపుడు మానవు లకు న్యాయాన్యాయ ధర్మాధర్మ విచక్షణకలుగుట సహజము. మానవ

వుడు అధికారములో నున్నంతవరకు, చేతినిండుగ ధనమున్నంతవరకు, బలమున్నంతవరకు న్యాయమునుగూర్చి, ధర్మమునుగూర్చి ఆలోచించడు. దీనితోపాటు లోభము, వ్యామోహము, పుత్రప్రేమ కలిగి ధర్మమును నిందించుటకు ఒడిగట్టును. మానవుడు చేసినపాపము చేసిన వెంటనే ఫలమొసంగదు. పచ్చికాయ వెంటనే పండగలదా ? ఫలము పక్వమగుటకు కాలము అవసరము. అట్లే మానవుడు చేసిన పాపము బీజమై, మొక్క అయి పండు అయి అనుభవములోనికి వచ్చును. భీష్ముడు, విదురుడు, సంజయుడు చెవినిల్లుకట్టుకొని ధర్మబోధ చేసినను ధృతరాష్ట్రుడు పెడచెవినిపెట్టి ఇప్పుడు చేతులు కాలినతరువాత ఆకులు పట్టుకొనుచున్నాడు.

తల్లిదండ్రులకు తమబిడ్డలపైనుండు ప్రేమ ఇంతింత అనరానిది. ఆ బిడ్డలకు ఒకింత బాధ కలిగినను తల్లిదండ్రులు గిజగిజలాడిపోదురు. అందులో ధృతరాష్ట్రునకు పుత్రులపై నున్న ప్రేమ ఇంతింత అనరానిది. అతని నూర్గురుపుత్రులను ఒక్కరినికూడ మిగులనీయకుండగ భీముడు పొట్టను పెట్టుకొనెను. శతపుత్ర ఘాతకుడైన భీముడనిన ధృతరాష్ట్రునకు ఒడలు మండిపోవును. తనకోపమును తీర్చుకొనుటకు సిద్ధముగానుండెను. పరహృదయ మర్మజ్ఞుడగు శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుని చిత్తములో నున్న వక్రత్వమును గ్రహించి ఇనుప భీముని ముందుంచెను. ధృతరాష్ట్రుడు కోపముతో ఆ ఇనుపభీముని కౌగలించుకొని ముక్కలు ముక్కలు చేసెను. పుత్రశోకముతో ధృతరాష్ట్రుడు సగముచచ్చి యున్నాడు. ఇప్పుడు అతని క్రౌర్యము అశక్త దుర్జనత్వము బట్టబయలు అయినది. ఇక ఏమియు చేయలేక ధృతరాష్ట్రుడు దొంగకు తేలుకుట్టినట్లు ఊరకుండెను.

వ్యాసమహర్షి ధృతరాష్ట్రుని హృదయములోని పాపమును ప్రక్షాళనము చేసికొన్నవిధమును చతురముగ చిత్రించి యున్నాడు.

మొట్టమొదట ధృతరాష్ట్రుడు ఏదో విధముగ పాండవులను దూర
ముగా త్రోలివేసి తనబిడ్డలకు రాజ్యము కట్టబెట్టవలెనని తన దుర్నీతిని
అనుసరించినాడు. పిమ్మట పాండవుల రాజ్యమును అపహరించుటకు
శకుని పన్నిన మాయజూదమునకు సమ్మతినిచ్చినాడు. అతడు కౌరవులే
యుద్ధములో జయించగలరని గట్టిగా నమ్మి యున్నాడు. యుద్ధ ప్రారం
భమున నున్న ధృతరాష్ట్రునిమనస్సునకు యుద్ధమధ్యమునఉన్న ధృత
రాష్ట్రుని మనస్సుకు చాల తేడా కనిపించుచున్నది. పశ్చాత్తాపము
ప్రారంభమైనది. భీష్మ మరణము విన్నంతనే దైవబలము ముందు
మానుషబలము చిల్లిగవ్వకైన పనికిరాదని గ్రహించినాడు.

యుద్ధమునుగూర్చి వినుచున్నంతసేపు ధృతరాష్ట్రుడు "విను
పౌరుషము నిరర్థకము, 2. అనుమానము లేదు దైవమధికము, 3. ధర్మ
మధర్మము నోర్వకున్నె" అని దైవబలమే బలవత్తరమనియు మానవ
బలము బలహీనమైనదనియు అతడు గ్రహించినాడు. తన ఉపేక్షవల
ననే, పుత్రప్రేమవలననే ఈ ఆపద అంతయు చుట్టిముట్టినదని మిక్కిలి
పొక్కినాడు. ధృతరాష్ట్రుని పశ్చాత్తాప దుఃఖము మిన్నుముట్టినది.

స్త్రీపర్వములో యుద్ధరంగమున భర్తృ భ్రాతృ పుత్రాదుల
దేహములపై బడి స్త్రీలు దీనముగా విలపించుచున్నారు. అందు శోకము
సముద్రమైనది. గాంధారి ధృతరాష్ట్రులు తమపుత్రుల శవములనుచూచి
మిగుల దుఃఖించిరి. పాప పరిణామఫలమగు శోకానుభవము ఎల్లరు
పంచుకొనిరి. మహర్షి తప్పుచేసిన ధృతరాష్ట్రునిచేతనే అతని తప్పు
ఒప్పింపచేసి పశ్చాత్తాపమును ప్రకటింపచేయుట కావ్యన్యాయమును
పోషించునదై యున్నది.

"నాశతంబున జేసి యాకౌరవులకు
నాశంబువాటిలుట దెల్లంబు నీకును
జనుగ్రూరు నతిలోభి జ్ఞాతి జన
ద్రోహకరు రాజు జేసితి గురుధరిత్రి
కచ్యుతు చెప్పిన యమలవాక్యంబులు
వినవేరనైతి నాతనయువలని
ఘనతర స్నేహంబునను మొగమోటను
దగియెడు మాటల దరిమి మొత్తి
నాడకుండితి" (ఆశ్రమ - ప్రథమ - 21)

వ్యాసమహర్షి ధృతరాష్ట్రుని పశ్చాత్తాపమును క్రమపరిణామ సుందరముగా భారతములో చిత్రించెను. భారతీయ రాజన్యులు జీవిత సంధ్యాసమయమున యోగివృత్తి అవలంబించి ప్రాణత్యాగము చేయుట కలదు. ధృతరాష్ట్రుడు అరణ్యమునకు వెడలి తపస్సుచేసి కార్చిచ్చున తన శరీరమును వ్రేల్చెను.

## 8. పాండురాజు

వ్యాసమహర్షి అనుగ్రహమున భరతకులరత్నాలంకారుడైన పాండురాజు విచిత్రవీర్యుని భార్యయగు అంబాలికయందు ఉద్భవించి నాడు. క్షత్రియోచితమైన విజిగీష, గురుజనభక్తి, భ్రాతృభక్తి కలిగి పరాక్రమ సౌందర్యముల నిధిగా నతడు విరాజిల్లినాడు. పురాకృత కర్మఫలము, ఎంతదుస్తరమైనదో, ఎటుల అనుభావ్యమో పాండురాజు పాత్ర నిరూపించుచున్నది.

ఉత్తమక్షత్రియోచిత సుగుణరత్నాకరుడై బాల్యమునుండియు, పాండురాజు ప్రతిభాసించెను. అతడు వేదంబులందు ప్రవీణుడై, సర్వ శాస్త్రములందు కౌశలమునార్జించి, అసి కుంత కార్ముకాద్యాయుధ

విద్యలయందు కృతపరిశ్రముడై షోడశకళాపూర్ణుడైన చంద్రునివలె వెలింగెను. జిగీష క్షత్రియులకు నిసర్గము కదా.

అన్నదమ్ముల అనుబంధము పెండ్లిండ్లు చేసికొనుపర్యంతము, మూడుపూవులై ఆరుకాయలు కాయుట సహజము. భార్యలు కాపురమునకు వచ్చినంతనే, రవరవలు ప్రారంభమై ఒకరిపేరు, మరియొకరి చెవిపడినచో, పచ్చగడ్డివేసిన భగ్గున మండును. దానికి అపవాదము పాండురాజు, ధృతరాష్ట్రుల అనుబంధము. పాండురాజు రాజ్యపాలనము చేసినను, జైత్రయాత్రలు చేసినను, గ్రుడ్డివాడైన అన్నయైన ధృతరాష్ట్రుని నెత్తిమీదపెట్టుకొని పూజించెను. భార్యాపుత్రులతో కాపురము చేయుచు జీవితనాటకములో ప్రవేశించినపిమ్మట ఏ అన్నదమ్ములు పూసలలో దారమువలె, తలలో నాలుకవలె, పాలు నీరువలె కలసి మెలసియుందురో ఆ అన్నదమ్ములే లోకారాధ్యులగుదురు. పాండుని భ్రాతృభక్తి, గురుజనభక్తి, సాధుజనానురక్తి, అనాధులయెడ కారుణ్యము సర్వజనారాధ్యములై యున్నవి.

> "పాండురాజు వినయవిధేయత్వంబున ధృతరాష్ట్రున కభిమత కార్యకరణంబున బాంధవులకు ననుకూలత్వంబున సుహృజ్జనులకు బరిశ్రమజ్ఞానంబున విద్వాంసులకు గారుణ్యదానంబున ననాధులకు నభయంకరత్వంబున మహీప్రజలకు సంతోషము చేయుచు."
>
> (ఆది - పంచమ - 43)

పాండురాజునకు పరాక్రమము, సౌందర్యము, రాజ్యపరిపాలనాధికారము, వినయవివేకములను పెంపొందింపచేసినవి. అతనికి రూపలావణ్య విలాసవిభ్రమగుణసంపన్నలైన భార్యలు కుంతీమాద్రులు లభించిరి. అతడు అనవరత, కామానురూప విషయోపభోగములతో తేలియాడెను. పాండురాజు వినోదార్థము వేటకేగి పెక్కుమృగము

లను వేటాడి అజ్ఞానంబున లేడిదంపతులు విహరించుచుండగా ఆడు లేడిని బాణములతో కొట్టెను. తత్ఫలితముగ పాండురాజు శాపోప హతుడయ్యెను.

పాండురాజు వేటకు వెడలి, కిందముడను మునిదంపతులు లేడి ఆకారమును వహించి, మనసిజరాగమున విహరించుచుండగా, వారికి వియోగము కలిగించెను. సప్తవ్యసనములలో వేట ఒకటి. ఏ ఒక వ్యసనమునకు మానవుడు గురియైనను, దాని విషఫలితమును అనుభ వింపవలసినదే. పాండురాజు, ఉత్తమక్షత్రియవంశములో ఉద్భవించి నాడు. వేదశాస్త్రములు గురు శుశ్రూష చేసి అధ్యయనముచేసి వివే కము పొందియున్నాడు. అతనిజీవితము నిత్యకళ్యాణము పచ్చతోరణమై నవవసంతాగమమున వెలుగు ఉద్యానవనమువలె నున్నది. అయ్యును పురాకృత కర్మఫలము అనుభవింపకుండ తప్పించుకొనరాదు కదా!

"ఎట్టి విశిష్టకులంబున
బుట్టియు సదసద్వివేకములు గల్గియు మున్
గట్టిన కర్మఫలంబులు
నెట్టన భోగింపకుండ నేర్తురె మనుజుల్."

(ఆది - పంచమ - 58)

విధి ప్రాబల్యము సూచితము. ప్రారబ్ధము ధనుర్విముక్త శర మనుట సత్యము కదా! మానవుడు మేధాసంపన్నుడగుటచే, పుట్టి నప్పటినుండి, గిట్టువరకు ఏ వ్యాపారము చేసినను, ఇది ధర్మమా? అధర్మమా? అని విచికిత్సచేసి ధర్మకార్యము చేయవలెనని తాత్ప ర్యము. వేట రాజులకు విహితమైనదే. కాని వేటలోకూడ పాటింప వలసిన సామాన్యధర్మములు విశేషధర్మములు కలవు. సామాన్య ధర్మమును, విశేషధర్మము బాధించును కదా.

పాండురాజు ప్రణయ మధుపాత్రలో విషము చిందినట్లయినది. తత్ఫలముగ అతడు వైరాగ్యమువహించి, అమూల్య మణిభూషణము లను, గజాశ్వములను, ధనధాన్యములను దానముచేసి, మమకారాహం కారములను విడిచిపుచ్చి, భార్యాసహితుడై తపోవృత్తిని నవలం బించెను. ఈ వైరాగ్యము అభావముచే కలిగినది. సహజముగ యౌవ నములో విషయోపభోగములన్నియు, తృప్తితీర అనుభవించినపిమ్మట సన్యాసాశ్రమము స్వీకరించినచో వైరాగ్యము వంటబట్టును. పరిస్థితుల ప్రాబల్యముచే వైరాగ్యము స్వీకరించినచో ఒక్కొక్కసారి విషఫలిత ములను ఇచ్చును. అకాల వసంతాగమమైనది. ప్రకృతి అంతయు శృంగారమయమై పొలుపు వహించినది. చారు సువర్ణహాసి, నవచంపక భూషిత, అపూర్వశృంగార విలాసముతో మాద్రి ఆతని సమీపమున మందయానము పచరించినది. అంతలో ఆతని వైరాగ్యము గాలిచేత కొట్టబడిన మబ్బువలె పటాపంచలైనది. చతురాశ్రమములు క్రమ పరి ణామ స్వీకృతములు. లేనియెడల విషమఫలితము లిచ్చును కదా.

పాండురాజు శతశృంగమున, మునులవలన అనపత్యులకు గతి లేదని విని, పరివేదనముపొంది, ఉత్తమసంతానము పొందుడని భార్య లను ప్రోత్సహించెను.

భారతీయ సంస్కృతిలో గృహస్థాశ్రమమునకు వైశిష్ట్యము కలదు. మానవుడు పెండ్లిచేసికొనుట కామోపభోగములను అనుభ వించుటకొరకు కాదనియు వంశోద్ధారకులు, జగదుద్ధరణ సమర్థులగు సత్సంతానము పొందుటయే పరమార్థమని తెలియుచున్నది. పాండు రాజు పాత్రముఖమున పురాకృత కర్మప్రాబల్యము దుస్తరమైనదని నిరూపింపబడినది. యౌవనము, సౌందర్యము, వనితలు, ఐశ్వర్యము చంచలమైన మెఱపులు వంటివి. నిత్యమైనది పరమాత్మయే.

# 9. ద్రోణాచార్యుడు

వ్యాసమహర్షి చిత్రించిన ఆచార్య పంచకములో ద్రోణుడు విశిష్టస్థాన మలంకరించెను. భారతమందలి పాత్రలకు మానవస్వభావము నిసర్గము. ప్రతిపాత్రయు మానవాళికి సందేశము ఒసంగుట విశేషము. ద్వాపరయుగములో ఆచార్యుడు అను పదము ద్రోణునకే అన్వర్థమైనది. ఆ కాలమందలి శూరులందరు ఆచార్యునికి శుశ్రూషచేసి ధనుర్విద్యా విశారదత్వము పొందుటకొరకు అర్రులు సాచిరి. శుక్రాచార్యుని అంశమున ఘృతాచి భరద్వాజ మహర్షులకు ద్రోణు డావిర్భవించెను. వేదమును, ధనుర్వేదమును సమాన ప్రతిపత్తితో అధ్యయనము చేసెను. ఆ మహానుభావుడు అగ్నివేశ, పరశురాముల కడ శుశ్రూషచేసి, అస్త్రశస్త్ర విశారదుడై, భీష్మాది వీరుల పూజకు పాత్రుడై ధనురాచార్యుడై, మహాభారతసమరములో దుర్యోధనుని పక్షమువహించి. సమరాధ్యక్షుడై దుర్నిరీక్ష్య తేజోవిరాజితుడై వెలింగెను. బ్రాహ్మణుడై పుట్టియు కర్కశమైన క్షాత్రధర్మము నవలంబించి, ఏషణత్రయమునకు బానిసయై దుర్మరణము పొందెను.

ద్రుపదుడు, ద్రోణుడు బాల్యమిత్రులై భరద్వాజాశ్రమమున వేదవిద్యను విలువిద్యను అభ్యసించిరి. కాలక్రమమున ద్రుపదుడు పాంచాలదేశమున కభిషిక్తుడయ్యెను. బ్రాహ్మణవంశములో జన్మించిన ద్రోణుడు తపస్సుచేసికొని సత్త్వగుణమభివృద్ధిచేసికొని బ్రహ్మర్షిగా ప్రఖ్యాతి పొందవలసియుండెను. కాని పూర్వజన్మ కృతానుగుణముగ రజస్తమోగుణప్రధానమైన ధనుర్విద్యాసక్తుడై అగ్నివేశునికి శుశ్రూషచేసి ఆగ్నేయాది దివ్యాస్త్రములను పొందెను. ఇది అతని జీవితములో పెద్దమలుపు. అతడు జన్మచే బ్రాహ్మణుడయ్యెను వృత్తిచే క్షాత్రప్రవృత్తికి దాసుడయ్యెను. ఆ మహామహుని జీవితమంతయు తదభిముఖముగ నడచినది.

వేదాంతులు మానవుని సంసారమున బంధించునవి ఏషణ త్రయమందురు. అవి దారైషణ, ధనైషణ, పుత్రైషణ. మానవుడు భార్యను సంపాదించి ఆమెను పోషించుటకొరకు ధనము ఆర్జించుట కొరకు పుత్రులను పోషించుటకొరకు ఎన్నియో అకార్యములు చేయుచు సంసారార్ణవములో మునిగిపోవుచున్నాడు. ధనాశాదూషితుడైన మానవుడు ఎన్నితప్పటడుగులువేయునో ద్రోణుని జీవితముఖమున నిరూపితము. మానవుడు విద్యార్థిగానున్నపుడు నవ్యనవనీత సమాన మైన చిత్తవృత్తితోనుండి జీవితనాటకరంగమున డక్కామొక్కీలు తిన్నపుడు ఆతనిఉదారాశయములు పలుచనగును. పెండ్లిచేసికొని, బిడ్డలనుపొందినపుడు భోగాసక్తి,ఏవిధముగానైనను ధనార్జనము చేయవలె నను పట్టుదల, కన్నబిడ్డలను ఉన్నతస్థానములో పెట్టవలెనను తపన, అభివృద్ధి పొందుచుండును.

వ్యాసుడు మానవులు అర్థకామములకు బానిసలుకాక, వానిని సాధనముగా చేసికొని మోక్షము పొందవలెనని ఉద్ఘోషించెను. కాని మానవులు సాంసారిక భోగాసక్తులై, ధనైషణ. దారైషణ, పుత్రై షణలను బంధములలో చిక్కుకొన్నచో, ఎట్టి విషమఫలితములు సంభ వించునో తెలియజెప్పుటకొరకు ద్రోణుని చిత్రించిరి. పితృపాదులైన భరద్వాజమహర్షి ఆజ్ఞచే ద్రోణుడు కృపాచార్యుని చెలియలు కృపిని పరిణయమాడి, అశ్వత్థామను పడసెను. ఆనాటికి ద్రోణుడు తన భార్యను పోషించుకొనలేని అసమర్థుడై దారిద్ర్యముతో పీడింపబడు చుండెను. ఆయినను అతడు మిక్కిలి మానధనుడగుటచే, ప్రతిగ్ర హము చేయుట పాపమని నిశ్చయించి ధర్మపథమున నుండెను. పరశు రాముడు భూమండలములోని క్షత్రియమండలమును జయించి, బ్రాహ్మ ణులకు ధనదానము చేయుచున్నాడను జనశ్రుతి విని అతనిని కుంభ సంభవుడు దర్శించెను. అప్పటికి భార్గవరామునికడ శస్త్రాస్త్రములు

మాత్రమేయున్నవి. ద్రోణునకు బాల్యమునుండియు ధనుర్వేదము నందు మిక్కిలి అభినివేశముండుటచే ధనములలో, సత్యోత్తమ ధనము శస్త్రాస్త్రములని నిశ్చయించి, పరశురాముని సేవించి, దివ్యాస్త్రం బులు ప్రయోగరహస్యములను పడసెను. ద్రోణుడు ఒకటి తలచిన మరియొకటి జరిగినది. దైవము బలవత్తరముకదా. అతనికి తెలియకయే అతని హృదయములో రజోగుణము ప్రవేశించినది. పుర్విమీద పుట్ట వలె, దారిద్ర్యబాధ నానాటికి ద్రోణుని హృదయమును కాల్చివేయు చున్నది. ఆ సమయములో ద్రోణుల ధార్మికహృదయమును దుష్ప్రతి గ్రహభయమును నన్నయ చక్కగా వర్ణించియున్నాడు.

> "పురుషవిశేషవివేకా
> పరిచయు లగు ధరణిపతులపాలికి బోవం
> బరులందు దుష్ప్రతిగ్రహ
> భర మెదలో రోసి ధర్మపథమున నున్నన్."

(ఆది - పంచమ - 215)

అష్టకష్టములలో దారిద్ర్యము మహాకష్టము. శూద్రకమహాకవి మృచ్ఛకటిక నాటకములో దారిద్ర్యమును ఆరవపాతకముగ చేర్చుట తగునని సముచితముగ చెప్పియున్నాడు.

> "సజ్జం నైవ హి కశ్చి దస్య కురుతే సంభాషతే నాదరా
> త్సంప్రాప్తో గృహ ముత్సవేషు ధనినాం సావజ్ఞ మాలోక్యతే
> దూరా దేవ మహాజనస్య విహర త్యల్పచ్ఛదో లజ్జయా
> మన్యే నిర్ధనతా ప్రకామ మపరం షష్ఠం మహాపాతకమ్."

(మృచ్ఛకటికమ్ - ప్రథమ - 37)

క్లిష్టమైన సన్నివేశములో ద్రోణులు చిక్కుకొనిరి. ధనపతుల బాలురు నిత్యము ఆవుపాలు త్రాగుటచూచి, అశ్వత్థామయును ఆవుపాలు త్రాగెదనని మారటము చేసెను. ఇది చూచినంతనే ద్రోణుని కడుపు తఱుగుకొనిపోయినది. ఆతనిలో మానసికసంఘర్షణ ప్రారంభమైనది. తానా సకలధనుర్వేద రహస్యార్థవిదుఁడు. భార్యయా గౌతమి. ప్రియపుత్రుఁడా అధిక తేజస్వియైన అశ్వత్థామ. ఈ భార్యను పోషించుకొనలేని, ప్రియపుత్రునికి కనీసము ఆవుపాలుకూడ కొనలేని దైన్యావస్థను జూచి తననే తాను నిందించుకొనెను. ధనము ఏవిధముగానైన సంపాదింపవలెనని పట్టుదల నెత్తికెక్కినది. అంతలో బాల్యసఖుడైన ద్రుపదుని మాటలు ఆతని స్మృతిలో తళుక్కుమని మెఱసినవి.

ద్రుపదుఁడు, ద్రోణుఁడు కలసి విద్యాభ్యాసము చేసిరి. ద్రుపదుడు పాంచాలదేశమునకు రాజ్యాధిపత్యమును స్వీకరించుటకు వెళ్ళుచు ప్రియమిత్రునితో ఇట్లు చెప్పెను. "ఏను పాంచాలవిషయంబునకు రాజనయిననాఁడు నాయొద్దకువచ్చునది నా రాజ్యభోగంబులు నీవు నను భవింప నర్హుఁడ" (ఆది - పంచమ - 214)

యాచకుడెంత గొప్పవాడయినను, దాతదృష్టిలో తేలికయే. ద్రోణుడు దుష్ప్రతిగ్రహము చేయలేక, సన్మిత్రుని యాచించినచో, అందున ఒకటిరెండు పాడిఆవులయిన ఈయకపోవునాయని కొండంత ఆశతో ద్రుపదుని సమీపించెను. రాజ్యమదోన్మత్తుడగు ద్రుపదుడు మహారాజునకు పేదబ్రాహ్మణునకు సఖ్యము ఎట్లు పొసగునని ద్రోణుని ఉల్లసమాడెను. మానధనుడగు ద్రోణునకు తలకొట్టివేసినంత పనిఅయినది. అతడు ప్రియమిత్రుడవమానించినందులకు మరింతకలతపొందెను. దీనితో ద్రోణునిలో ధనార్జనాసక్తి, శత్రుప్రతీకారము చేయవలెనను పట్టుదల ఇనుమడించెను. తత్ఫలితముగ బ్రాహ్మణధర్మవ్యతిరేకమైన ధనాశ, భోగాసక్తి, దీర్ఘక్రోధము ఆతనిని బంధించినవి.

"అర్థస్య పురుషోదాసః"

లోకములో ఎంతవారైనను కాంతకు, కాసుకు దాసులే. ధనైషణతో భారద్వాజుడు ఆ ఊరిలో నుండలేక, భార్యను, బిడ్డను అగ్నిహోత్రములను తీసికొని, హస్తినాపురమునకు వచ్చి, అసామాన్య బాణవిద్యా ప్రావీణ్యము ప్రదర్శించి, కురుకుమారాచార్యుడుగా వరింపబడెను. దానితో తన దారిద్ర్యము మటుమాయమైనది. సర్వరాజ్య భోగములు సమృద్ధిగా నమరినవి. కౌరవరాజాస్థానమున భీష్ముని సరసన ద్రోణునకు అత్యున్నతస్థానము లభించినది. ప్రియపుత్రుడైన అశ్వత్థామ రాజరాజునకు కూర్మి సఖుడయ్యెను. ఇంక మిగిలినది శత్రుప్రతీకారము.

భారతీయసంస్కృతిలో గురుశిష్య సంబంధము అత్యంత పవిత్రమైనది. గురువునకుగల స్థానము అనితర సాధారణము. ఆచార్యుడు, గురువు, దేశికుడు, అను పదములు అర్థవంతములైనవి. పరమ పవిత్రములైనవి. ఆచార్యు డనగా తాను వేదమును అధ్యయనము చేసి శిష్యునిచేత చక్కగ అధ్యయనము చేయించువాడు. సంప్రదాయమును శిష్యునిచే గ్రహింపజేయువాడు. గురువనగా గాయత్రీమంత్రము నుపదేశించి శిష్యుని హృదయములోని అజ్ఞానాంధకారమును పారద్రోలి విజ్ఞానసూర్యోదయము కలిగించువాడు.

గురు ర్బ్రహ్మ గురుర్విష్ణు
ర్గురు ర్దేవో మహేశ్వరః
గురు స్సాక్షాత్ పరంబ్రహ్మ
తస్మై శ్రీ గురవే నమః.

మేఘమునకు ఆచార్యునకు సహజౌదార్యము నిసర్గము. మేఘము తనకున్నదంతయు మనకొసంగి అయ్యో, వీరికి నేనేమియు చేయలేకపోతినే అని వెలవెలపోవును. అట్లే ఆచార్యులుకూడ తమదగ్గరనున్న

దంతయు శిష్యులకు ఇచ్చియు తృప్తిపడరు. శ్రీకృష్ణభగవానుడు తన్నాశ్రయించి తననుండి ఏదయిన ఫలము స్వీకరించినవారిని ఉదారులని స్తుతించెను. లోకములో దానముచేసిన దాతను ఉదారుడనుట కలదు. కాని పరమకరుణామూర్తియగు శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో తన అమృతోపదేశమును స్వీకరించిన అర్జునుని ఉదారుడని స్తుతించుట అతని భక్తవాత్సల్యమునకు నిదర్శనము.

జగద్గురువు శ్రీకృష్ణుడు. ఉత్తమశిష్యుడు అర్జునుడు. గురుశిష్యు లనగా శ్రీకృష్ణార్జునులేయని లోకములో రూఢమూలమయిన గౌరవము కలదు. ద్రోణుడు లౌకికలోకమునందలి గురువు. అందున శుక్రాచార్యుని అంశచే పుట్టుటచేతను, మానవసహజమైన బలహీనతను కలిగియుండెను. గురువు తాను ధర్మమును ఆచరించి శిష్యునిచేత ఆచరింపచేయువాడే ఉత్తమగురువు. కాని ద్రోణుడు స్వధర్మమైన బ్రాహ్మణధర్మము నుజ్జగించుట ఆతనిలోని దోషము.

మధుసూదన సరస్వతి భీష్మద్రోణకృపాచార్యులగూర్చి చెప్పిన మాటలు అనుసంధింపతగియున్నవి. భీష్మ ద్రోణకృపాచార్యాదులు గురువులే అయినను, యుద్ధగర్వముచే అవలిప్తులును, అన్యాయముగ రాజ్యమును స్వీకరించిన దుర్యోధనునకు అండగా నుండుటచేతను శిష్యద్రోహముచేయుటచేతను కార్యాకార్య వివేకశూన్యులై న్యాయమార్గమును అతిక్రమించుటచే దోషదూషితులు. అట్టివారిని పరిత్యజించుటయే తగునని శ్రీకృష్ణుడు అర్జునునకు స్పష్టముగా చెప్పెను.

"గురోరప్యవలిప్తస్య కార్యాకార్య మజానతః
ఉత్పథం ప్రతిపన్నస్య పరిత్యాగో విధీయతే."

(మధుసూదన సరస్వతీయము- శ్రీభ శాం. భా. త. భో - 45)

గాంభీర్యము, ఔదార్యము, సౌలభ్యము ఆచార్యుని ప్రధాన లక్షణములు. ద్రోణులు శిష్యులందరిని పరీక్షించి వారివారి సంస్కా-

రానుగుణముగ విద్యోపదేశము చేయుట అతనికే తగియున్నది. ఉత్తమ శిష్యవరణము చేయుటలో అతడు కడునేర్పుకాడు. శిష్యులకు ఎన్నియో అగ్నిపరీక్షలు పెట్టి దానిలో మేలిమిబంగారమువలె ప్రకాశించినవానినే ప్రియశిష్యునిగా స్వీకరించి పుత్ర నిర్విశేషముగా ప్రేమించెను. సమర్థుడైన శిష్యునిచూచి గురువు పొంగిపోవుట సహజము. ఆతడు కన్నబిడ్డయైన అశ్వత్థామకంటె ప్రియశిష్యుడైన అర్జుననే అధికముగా ప్రేమించెను. అర్జుననిపై గురుదేవులకింత అపారమైన శిష్య వాత్సల్యము కలుగుటకు కారణము ఆతని గుణపక్షపాతమే. మరొకటి కాదు.

అర్జునుడు ద్రోణాచార్యుడు బోధింపని బాణవిద్యలో నూతన పద్ధతులు సాధనముచేయుట చూచి అతని అస్త్రవిద్యాభినివేశమునకు ప్రియశిష్యవృత్తికి మిక్కిలి మెచ్చుకొని అతనికి ఇట్లు వాగ్దానమిచ్చెను.

"అతనియస్త్రవిద్యాభియోగమునకు బ్రియశిష్యవృత్తికి బెద్ద
మెచ్చి యన్న ధనుర్ధరు లన్యులు నీకంటె నధికులు గాకుండు
నట్లుగాగ గరపుదు విలువిద్య ఘనముగా నని పల్కె"

(ఆది - పంచమ - 230)

కుంభసంభవుడు "పార్థఏవ ధనుర్ధరః" అనుసూక్తిని సార్థకము చేసెను. ఇట ప్రశ్న ఉదయించును. సర్వశిష్య సమాదరుడైన ద్రోణాచార్యుడు ప్రియశిష్యుడైన ఏకలవ్యుని దక్షిణాంగుష్ఠము గురుదక్షిణగా కోరుట ఏమిన్యాయము ? అని ఆచార్యుని లోకము ఆడిపోసుకొనుచున్నది. ఏకలవ్యునిగురుభక్తి అనుపమానము. సాహిత్య చిరంజీవము. కుంభసంభవుడు స్వార్థముతో ఏకలవ్యుని దక్షిణాంగుష్ఠము గురుదక్షిణగా కోరలేదని భారతమే సాక్ష్యముచెప్పుచున్నది. ప్రియశిష్యుడైన అర్జుననకిచ్చిన వాగ్దానమును పరిపాలించుటకొరకే ఇట్లు చేసెనని చెప్పనగును.

"విలువిద్య నొరులు నీ క
గ్గలముగ లేకుండ నిన్ను గఱపుదు నని మున్
బలరిపుసుతునకు బలికిన
పలుకప్పుడు గురుడు సేసె బరమార్థముగన్"

(ఆది - పంచమ - 245)

ద్రోణాచార్యుల నిందించువారు మరొక ప్రశ్న వేయుచున్నారు. ఆచార్యులు సర్వశిష్యులకు విద్యాప్రదానము సమానముగ చేయవలెను కదా. అయినచో ఆచార్యుడు మహారథికుడు శూరశిఖామణి అయిన కర్ణునకు బ్రహ్మాస్త్రము ఏల బోధింపలేదు ? ఇది ఏమిన్యాయము ? ఈ ప్రశ్నకు సమాధానమున్నది. "ఉత్తములమహిమ నీరుకొలది తామర సుమ్మీ" అట్లే గురువు శిష్యుని చిత్తవృత్తిని, సంస్కారమును, గ్రహణశక్తిని పురస్కరించుకొనియే విద్యను బోధింపవలెను. అట్లుకాక శక్తికిమించి విద్యాబోధనముచేసినను అది అడవికాచిన వెన్నెల అగును. ఒకనాడు కర్ణుడు ద్రోణాచార్యులను దర్శించి తనకు బ్రహ్మాస్త్రమును బోధించుమనియు, దానిసాయమున అర్జునుని జయింపగలననియు, అదియే తనచిరకాల వాంఛితమనియు పలికెను. కర్ణునిహృదయములో నున్న మాత్సర్యమును గ్రహించి భవిష్యత్కాలములో ఇతడు బ్రహ్మాస్త్రమును గ్రహించుట సజ్జనసంహారమునకు ఉత్తమావమానమునకు దోహదము చేయుపని ఆచార్యుడు గుర్తించి బ్రహ్మాస్త్రము కర్ణునకు బోధింపలేదు. ద్రోణాచార్యుడు కన్నబిడ్డయైన అశ్వత్థామకును బ్రహ్మాస్త్రమును ప్రయోగమునుమాత్రమే ఉపదేశించి ఉపసంహారమంత్రమునుమాత్రము బోధింపలేదను విషయమును మరచిపోరాదు. అనగా సాత్త్వికవృత్తిగలవారికి భయంకరాస్త్రములు బోధింపవలయును. సాత్త్వికవృత్తిలేనివారికి భయంకరాస్త్రములు బోధించినచో లోకో

ప్రదవము కలుగునని ఆచార్యుడు చేసికొన్న నిర్ణయము సజ్జన స్తవనీయమై యున్నది.

కుంభజుడు అర్జునునకు బ్రహ్మాస్త్రమును బోధించుటలో ద్రోణునకు స్వార్థము కలదు. ఆచార్యుడు రాజకుమారులందరిని వెంటబెట్టుకొని గంగాస్నానార్థ మరిగెను. నీటిలోనున్న మొసలివచ్చి గురువుగారి చిరుతొడను పట్టుకొన్నది. ఆ మొసలిని విడిపింపుమని శిష్యులకు ఆజ్ఞ ఇచ్చెను. అందరును మొసలిని విడిపింపలేక తెల్లమొగము వైచిరి. లోకైక ధనుర్ధరుడగు అర్జునుడు శబ్దభేదిబాణములతో గురువుగారి ప్రాణములను రక్షించెను. తనప్రాణమును రక్షించిన ప్రియశిష్యునకు బ్రహ్మాస్త్రమును బోధించుటలో దోషమేమియును లేదు. అర్జునుడు సత్త్వగుణప్రధానుడు, జగత్కాళ్యాణసంధాయి అగుటచేతనే ద్రోణుడు ప్రియశిష్యునకు బ్రహ్మాస్త్రమును బోధించెను.

ద్రోణుడు తనకు బద్ధశత్రువైన ద్రుపదుని పుత్రుడైన ధృష్టద్యుమ్నునికి విద్యాబోధనము ఎంతో ఆనందముగ చేసెను.

> "ధృష్టద్యుమ్నంతు పాంచాల మానీయ స్వం నివేశనం
> ఉపాకరోదస్త్రహేతోర్భారద్వాజః ప్రతాపవాన్
> అమోక్షణీయం దైవంహి భావయిత్వా మహామతిః
> తథాసత్కృతవాన్ ద్రోణ ఆత్మకీర్త్యనురక్షణాత్"
>
> (సం. భా - ఆది - అధ్యా 167 - 55 _ 58)

ద్రోణులు తనకు మృత్యుకారణమని తెలిసియు ధృష్టద్యుమ్నునకు విద్యాబోధనము చేయుట ఆతని ఔదార్యమును తెలుపుచున్నది. ఈ సందర్భమున సనాతన భారతీయ గురుసంప్రదాయము నిరూపితమైనది.

> "తనయెఱిగిన యర్థం బోరు
> డనఘా యిది యెట్లు సెప్పుమని యడిగిన జే

ప్పనివాడును సత్యము సె
ప్పనివాడును ఘోరనరకపంకమునఁ బడున్."

(ఆది - ప్రథమ - 137)

జిజ్ఞాసకలవాడు, శాస్త్రము శాస్త్రముకొరకు చదువుకొనువ్యక్తి సమీపించి సందేహగ్రస్తమైన విషయము చెప్పుమని అడిగినపుడు తనకు తెలిసినది దాచకుండ తెలియచెప్పుటయే గురువుయొక్క ప్రధాన కర్తవ్యము. ఉత్తమ గురుశిష్య సంబంధము అనాదికాలమునుండియు వచ్చుచున్నది. బృహస్పతిపుత్రుడైన కచునకు సంజీవని మంత్రము శుక్రాచార్యుడు ఏమాత్రము సందేహించకుండ ఉపదేశించియున్నాడు కదా. అట్లే శుక్రాచార్యుని అంశముతో బుట్టిన ద్రోణుడు ధృష్టద్యుమ్నునకు ధనుర్విద్యాబోధనము చేయుట అత్యంత ప్రశంసాపాత్రము. ఈనాటి గురుశిష్య సంబంధము మనస్సులో పెట్టుకొని ద్రోణాచార్యులను లెక్కకట్టరాదు. ఆ మహానుభావుడు దేశికోత్తముడు. ద్రోణుడు అర్జునుని ప్రియతమ శిష్యునిగ స్వీకరించి తన శత్రువైన ద్రుపదునకు శిష్యునిచే బుద్ధిచెప్పించవలెనని నిశ్చయించెను మహాసభలో తనను అవమానించిన ద్రుపదునిపై ప్రతీకారము చేయునంతవరకు అతడునిద్ర పోలేదు. ఆచార్యుడు శిష్యులెల్లరను రావించి గురుదక్షిణగ ద్రుపదుని జయించి బంధించి తీసికొని రండని ఆజ్ఞ ఇచ్చెను. కౌరవులందరును పాంచాలునిపై దండెత్తి పలాయనము చిత్తగించిరి. అప్పుడు సంక్రందన నందనుడు మహదానందముతో వెడలి ద్రుపదుని బంధించి రథాక్షమున కట్టితెచ్చి గురుదేవుల పాదపద్మములకడ పడవైచెను. ద్రోణుడు తననవమానించిన ద్రుపదుని చూచి నగుచు ఇట్లు ఉల్లసమాడెను,

"ఏ రెవ్వరయ్య ద్రుపద మ
హారాజులె యిట్లు కృపణు లయి పట్టువడన్

వీరికి వలసెనె యహహా మ
హారాజ్యమదాంధకార మది వాసెనొకో."

(ఆది - షష్ఠ - 90)

ఇప్పుడైనా ద్రోణాచార్యుడనగా తెలిసినదా? యని ప్రశ్నించెను. ద్రోణాచార్యుడు బంధింపబడి ప్రియమిత్రుని దైన్యస్థితినిచూచి యెంతయో జాలిపడి ఇట్లనెను.

"ప్రియమిత్రమా, నీకు ప్రాణభయము లేదు. మన మిరువురము ఆశ్రమములో చిన్నానాడు ఆడుకొన్న బాల్యక్రీడలు నేను మరచిపోలేను. ఇప్పుడుకూడ నీ నెయ్యపుతియ్యమును అపేక్షించుచున్నాను. నీవు రాచరికము లేనివాడు రాజమైత్రిని పొందుట అసాధ్యము నన్ను పరిహాసించితివి. అందుచే పాంచాలరాజ్యములో సగభాగము నా ఆధిపత్యము క్రింద ఉండును. మిగిలినది నీ ఆధిపత్యములో ఉండును. నాతో మైత్రీబంధము పెంచుకొని ఉండుము."

ద్రోణుని నియమములను అంగీకరించి ద్రుపదుడు గత్యంతరము లేక బాల్యమైత్రిని పునరుద్ధరించుకొనెను. ఇది వ్యాసభారతములో కలదు. ఎందుచేతనో నన్నయగారీ భాగమును అనువదించలేదు.

"సవైరం మనసాధ్యాత్వా ద్రోణో ద్రుపదమబ్రవీత్
విమృజ్య తరసా రాష్ట్రం పురంతే మృదితం మయా
ప్రాప్యజీవం రిపువశం సఖిపూర్వం కిమిష్యతే
ఏవముక్త్వా ప్రహస్యైనం కించిత్ స పునరబ్రవీత్
మాభైః ప్రాణభయాద్వీర క్షమిణో బ్రాహ్మణావయం."
ఆశ్రమే క్రీడితం యత్తు త్వయా బాల్యే మయాసహ
తేన సంవర్ధిత స్నేహః ప్రీతిశ్చ క్షత్రియర్షభ.

పార్థ యేయం త్వయా సఖ్యం పునరేవ జనాధిప
వరం దదామి తే రాజన్ రాజ్యస్యార్థ మవాప్నుహి
అరాజా కిల నో రాజ్ఞః సఖా భవితుమర్హసి
అతః ప్రియతితం రాజ్యే యజ్ఞసేన మయాతవ
రాజాసి దక్షిణేకూలే భాగీరథ్యాహముత్తరే
సఖాయం మాం విజానీహి పాంచాల యదిమన్యసే
అనాశ్చర్యమిదం బ్రహ్మన్ విక్రాంతేషు మహాత్మసు
ప్రీయేత్వయాహం త్వత్తశ్చ ప్రీతి మిచ్ఛామి శాశ్వతీం
ఏవముక్త స్తతం ద్రోణో మోక్షయామాస భారత"
(సం.భా - ఆది - 138 - శ్లో 66 - 72)

ఈ సన్నివేశములో ద్రోణాచార్యుడు ప్రకటించిన ఔదార్యము బాల్యమైత్రికిచ్చిన ప్రాధాన్యము తప్పుచేసినవానికి పశ్చాత్తాపము కలిగించిన రీతియు, దేశికోత్తముల కీర్తి కింకిణిని సహస్రవిధముల మ్రోయించుచున్నది. ఇన్ని పరీక్షలు చేసి ద్రోణాచార్యుడు సాత్త్వికుడు, అధిక తేజస్వి, జగత్కల్యాణ సంధాయి, లోకోత్తరధానుష్కుడు అని గుర్తించియే అర్జునుని ప్రియశిష్యునిగా వరించెను. గురుమహత్త్వము శిష్యుడు ప్రకటించిన విద్యామహత్త్వమును బట్టి విలువకట్టవలెనను సంప్రదాయము ద్రోణాచార్యుడు సార్థకము చేసెను.

ద్రోణాచార్యుడు కురుకుమారాస్త్రగురుడై దారిద్ర్యము పోగొట్టుకొని పెండ్లిచేసికొన్నందులకు భార్యాపుత్రులను సుఖపెట్టి తాను సౌఖ్యముపొందుటను ఎవ్వరును కాదనరు. కాని అశ్వత్థామ యుక్తవయస్కుడైన పిమ్మట పాండవులు కౌరవులు రాజ్యదాయ భాగము విషయములో వివాదము పొందినపుడు ఆతని ప్రాకుపొద్దు ఒకింతలో వ్రాలగానున్నపుడు సంసారమును విడిచి, వానప్రస్థాశ్రమము స్వీకరించియున్నచో ఆతని జన్మ సార్థకమయ్యెడిది. కాని నియతి అట్లు

చేయనీయలేదు. అంతటితో భారద్వాజుడు తృప్తిపొందియుండలేదు. కౌరవులు పాండవులను వంచించి రాజ్యలక్ష్మిని అపహరించి మహాపతి వ్రత అయిన ద్రౌపదికి మహాసభలో దుష్టచతుష్టయము పరాభవము చేయుచున్నను ద్రోణుని నోటినుండి ఒక్క-మాటయైనను పెగలలేదు. ఇది ఆశ్చర్యము, విషాదము కలిగించును. భారతీయ ధర్మశాస్త్రములో ఏ పరిస్థితిలో బ్రాహ్మణులు అస్త్రము గ్రహింపవలెనో స్పష్టముగ నిర్దేశింపబడియున్నది. ధర్మమునకు నాశము కలుగునపుడు ధర్మ రక్షణార్థము బ్రాహ్మణులు అవశ్యముగ అస్త్రమును స్వీకరింపవలెను. పరశురాముడు, వశిష్ఠుడు బ్రాహ్మణులయ్యును రాజులతో సంబంధము కలిగియున్నను, రాజులను ఆజ్ఞాపించు స్థితిలోనుండిరి. కాని వారు ఎన్న డును రాజుల మాటలకు అడుగులకు మడుగులొత్తుట చేయలేదు. దానికి కారణము వారికి ధర్మముపైగల ప్రత్యయమువలననే. వారు ధనమునకు బానిసలు కాలేదు. ఏనాడు ద్రోణుడు సత్త్వగుణప్రధానమైన భరద్వాజాశ్రమమును వీడి భార్యాపుత్రులను పోషించుటకొరకు భోగములనుభవించుట కొరకు, శత్రుప్రతీకారము చేయుటకొరకు కౌరవ రాజాస్థానమును ఉదరపోషణార్థము ఆశ్రయించెనో ఆనాటినుండి ద్రోణుడు స్వాతంత్ర్యము, ప్రత్యేక వ్యక్తిత్వము కోల్పోయెను. అతడు రాజరాజును ఆజ్ఞాపించవలసిన ఉత్తమవ్యక్తి. కాని ఇపుడు రాజరాజు ఆజ్ఞను శిరసావహించు స్థితిలోపడెను. దీనికి కారణముఅతని ధనాశాదూషితత్వమే. ద్రోణాచార్యులను, చిన్నపెద్ద అను తారతమ్యములేకుండ దుష్టచతుష్టయములో ప్రతి వ్యక్తియు, అనేకపర్యాయములు అవమానించినను, అతడు గుట్టుచప్పుడు కాకుండ మ్రింగివేసెను.

ఉత్తరగోగ్రహణ సందర్భములో భారద్వాజుడు ప్రియశిష్యుడైన అర్జునుని అగ్గించి, అవక్రవిక్రమ దక్షుడైన వానిని కౌరవులు

జయింపలేరని నుడివెను. అమ్మాటలకు రాజరాజు మండిపడి ఆచార్యు లను తీవ్రముగ అధిక్షేపించెను.

"ఆచార్యులైనవారలు కార్యంబు దవ్వులం గనియెడువారు గాన కయ్యంబు తెఱంగు వారల నడుగవలవదు బుద్ధిమంతు లిండ్లకడనుండి భోజనావసరంబుల నాయుధశ్రమసమయంబుల నీతిశాస్త్రగోష్ఠికాలంబుల నుచితాలాపంబులు పలుకుదురుగాని పోట్లాడెడివారు గారు వారింగలనం గలసి నిలువనీక పిఱిందెదెస నిలిపిన మనకు వారు విజయంబు గోరుచుండుట లెస్స ఇంత కంటె గురువునకు అవమానమేమున్నది."

మహాభారతసమరము ద్రోణుడు సర్వసైన్యాధ్యక్షుడుగా ఐదు రోజులు లోక భీకరముగా నడచినది. నాల్గవదినమున అర్జునుడు ద్రోణాచార్యుడు చూచుచుండగా అతనిని కడచి ముందునకు వెడలి శత్రుకాయుధుని, కాంభోజపతిని కూల్చి కౌరవసేనను చీల్చి చెండా డెను. రాజరాజు దీనిని చూచి ఆచార్యులను సమీపించి మండిపడుచు చాల తీవ్రముగ నిందించెను.

"నిను నవలీల దాటి ప్రజనేలకు గోలకు దెచ్చుచున్న య
ర్జును దలయెత్తియైన నటు నూడవు పాండవపక్షపాతి నీ
మనమటు గాన యెప్పుడును మాదెస గప్పు యెలుంగు బాముపై
యునికి యెఱుంగవచ్చె నటు లూఱటగా వరమిచ్చినాడవో"

(ద్రోణ - తృతీయ - 108)

ఆచార్యుడు శిష్యునివలన పొందవలసిన గౌరవము ఇదియా ? దీనికి కారణము ద్రోణాచార్యుల ఏమఱపాటుయమే.

ద్రోణులు దుర్యోధనునితో, ధృతరాష్ట్రునితో, పాండవులతో విగ్రహము పెట్టుకొనుట పాడికాదనియు, పాండవులకు న్యాయముగ పొందవలసిన రాజ్యభాగమిచ్చి ఉభయవంశములు క్షీరోదకవృత్తితో

మెలగునట్లు చేయుమని అనేకవిధముల హితోపదేశము చేసిరి. దుర్యోధనుడు పాండవ పాంచాల విభేదనోపాయముగూర్చి సమాలోచనము చేయుచుండగా పితామహుడు యుక్తియుక్తముగ, హితోపదేశము చేసెను. ఆ సందర్భముననే ఆచార్యుడు కలుగచేసికొని శిష్యునకు హితోపదేశము ధర్మార్థ మధురముగ చేసియున్నాడు.

"పితామహుడయిన భీష్ముడు చెప్పిన హితోపదేశము బహుగుణము, ఉత్తమోత్తమము, పథ్యము. ధర్మము, సాధుసమ్మతమై విపులార్థయుతమై యున్నది. కర్ణశకునుల మాటలనుపట్టుకొని పాండవులతో వైరము పెంచుకొనుట యెంతమాత్రము తగదు. ప్రభువు ధర్మ విశుద్ధవృత్తులను, వయోవృద్ధులను, కుశాగ్రీయబుద్ధులను మధ్యస్థులను, కార్యనిర్ణయ సమర్థులయినవారిని మానమాత్సర్య రహితులను ఆప్తులుగా చేసికొని వారు ఉపదేశించునట్లు ధర్మార్థయుతముగానడచుకొనుట కర్తవ్యము.

అట్లుకాక ధీమాన్యుల ధర్మోపదేశము పెడచెవిని పెట్టినచో భూనాథుడు దాని విషఫలితము అనుభవించుట తథ్యము. దైవబల యుక్తితో నవనవోన్మేష వికాసము పొందుచు ధర్మమును, సత్యమును, తప్పని ధర్మాత్ములయిన శీలసంపన్నులయిన, పాండవుల రాజ్యభాగమును అపహరించుట, వజ్రపాతికయినను సాధ్యమగునా ?" ఈ విధముగా ఆచార్యుడు దుర్యోధనునకు హితోపదేశముచేసి సన్మార్గములో పెట్టుటకు ప్రయత్నించెను.

ద్రోణాచార్యుడు కౌరవరాజాస్థానమున కూర్చుండబెట్టి గౌరవించినందులకు ఎంతయో పొంగిపోయెను. తనను రాజాస్థానగౌరవము కలిగించిన భీష్మునికి జీవితాంతము కృతజ్ఞతాబద్ధుడై అతనినే అనుసరించి జీవించియున్నాడు. అతనితోడనే కష్టసుఖములను అనుభవించినాడు. హితోపదేశము ఇరువురును కలసియే చేసినారు. ద్రోణాచా

ర్యుడు జీవిత సంధ్యాసమయములో కౌరవరాజాస్థానమునుండి తొలగి వానప్రస్థాశ్రమము స్వీకరించి మునివృత్తి అవలంబించినచో అతని జీవితము మరొకవిధముగ నుండి యుండెడిది. కాని భారద్వాజుడు అట్లు చేయలేదు. జీవితాంతము వరకు అతడు క్షత్రియధర్మమునే అనుసరించెను. అతడు కౌరవుల ఉప్పుతిన్నందులకు మహాభారతయుద్ధమున సైన్యాధ్యక్షపదవిని స్వీకరించి తనయావచ్ఛక్తిని ఉపయోగించి యుద్ధముచేసెను అతనికి పాండవులు ధర్మశీలురనియు చిన్నతనము నుండియు అనేకబాధలకు గురియైతిరనియు పాండవులయెడ వాత్సల్యము పుష్కలముగా కలదు. ద్రోణులకు సమర్థుడైన శిష్యులయందు అత్యంత వాత్సల్యము. అందున తాము చెప్పినవిద్య తనకంటె మిన్నగా ప్రదర్శించుటచూచి ఏ గురువు హృదయపూర్వకముగ పొంగిపోవడు ? అదియే ద్రోణాచార్యులు మహాభారతయుద్ధములో చేసినారు. అర్జునుడు, అభిమన్యుడు ప్రదర్శించిన అవక్రవిక్రమముచూచి నిలువెల్ల పులకించిన ఉత్తమఉపాధ్యాయుడు ద్రోణుడు. దానిని ఎంతమాత్రము దాచుకొనలేక ఎవరు ఏమి అనుకొన్నను లెక్కచేయక ప్రియశిష్యుని ప్రస్తుతించియున్నాడు. ఆచార్యుని హృదయసౌకుమార్యము నవ్యనవనీతసమానము. ధర్మరాజు ఒకప్పుడు నిరాయుధుడై ద్రోణునిచేతిలో చిక్కినాడు. ఆ సమయమున ఆచార్యుని హృదయములో దయ పెల్లుబికి ధర్మజునిపై బాణము వేయుటకు చేతులురాక ఊరకుండెను.

"కనుగొని గురు డవ్విభు నే
యను బొడువను జేతులాడ కట పార్శ్వములం
దనచూడ్కి బడినహయరథ
మనుజద్విపసముదయముల మడియించె వెసన్."

(ద్రోణ - తృతీయ - 246)

ద్రోణాచార్యుడు యుద్ధములో పాల్గొనుటకు కారణమున్నది. ఆచార్యుడు బాల్యమునుండియు ధనుర్వేదమును ఎంతయో ఆప్యాయనకరముగ అభ్యసించెను కురుకుమారులెల్లరికి తాను నేర్చిన అస్త్రశస్త్ర వైదుష్యమును బోధించెను. కాని తనజీవితములో తాను నేర్చిన సిద్ధాంతజ్ఞానము ప్రదర్శించు అవకాశము చిక్కలేదు. అదియునుగాక అతడు చిరకాలమునుండియును కౌరవులను ఆశ్రయించుకొని రాజాస్థానములో భీష్మునిసరసన కూర్చుండి విశిష్టగౌరవము పొందుచు అష్టైశ్వర్యములు అనుభవించినాడు. రాజరాజు ప్రియపుత్రుడైన అశ్వత్థామను కూర్మిచెలికానిగా స్వీకరించెను. ద్రోణుడు స్వామిఋణము తీర్చవలసియున్నది. అందుచే ఆచార్యుడు మహాభారతసమరములో సర్వసేనాధిపతిగానుండి కౌరవులకు విజయము సమకూడునట్లు తన యావచ్ఛక్తిని వినియోగించెను. అతడు తనశక్తులన్నిటిని ఏకీకృతముచేసి కౌరవులకు విజయము కట్టబెట్టుటకు కొన్ని అధర్మకార్యములనుకూడ చేసియున్నాడు. ముక్కుపచ్చలారని అభిమన్యుకుమారుని సంహారమునకు ద్రోణుడే ప్రధానమైన కారణము. అతడు ద్విగుణీకృతోత్సాహముతో సైన్యాధిపతియై పాండవసేనలను చీల్చిచెండాడినను శత్రుదుర్భేద్యమైన పద్మవ్యూహాదులు పన్నినను శ్రీకృష్ణార్జునుల బాహుబలము ముందు అతని శక్తియంతయు గడ్డిపోచవలె ఎగిరిపోయినది. దీనికి కారణము దైవబలముముందు మానవబలము నీటిమీద వ్రాతయగును గదా. ఇది ఆచార్యుడు గుర్తించియే యున్నాడు.

ద్రోణుడు వృత్తిధర్మముచే కౌరవులపక్షము వహించియు సమరము చేయుచున్నను, పాండవులు గురుభక్తిసంపన్నులనియు, శీలవంతులనియు, తండ్రిపోయిన నాటినుండి అనేకబాధలకు గురియైరనియు, పాండవులయందు ఆర్ద్రతా, వాత్సల్యములు కలవు. దానితోపాటు ఆచార్యుడు తాను అధర్మపక్షము వహించితిననియు, కౌరవులతో కలసి

పాండవులకు అన్యాయము చేయుచున్నారనియు, బ్రాహ్మణధర్మము ఉజ్జగించి కర్కశమైన క్షాత్రము వహించితిననియు, మునివృత్తి అవలంబించి మోక్షమునకు ప్రయత్నింపక లౌకిక బంధములలో చిక్కుకొంటినని అతడు పశ్చాత్తాపము పొందినాడు. ఇది అతని చరమ జీవితము బోధించుచున్నది. మహాభారత సమరములో ఆచార్యుడు చూచుచుండగనే అర్జునుడు సైంధవుని సంహరించెను. అది దుర్యోధనుడుచూచి కటకటంబడి ఆచార్యుని పాండవపక్షపాతముతో కౌరవసేనను సరిగా సంరక్షించుటలేదనియు ఆతని చిత్తశుద్ధిని శంకించి మిక్కిలి దూషించినాడు. రాజరాజుమాటలు ద్రోణునిహృదయమునకు తీరనిగాయము చేసినవి.

"ఆ సభ నీవును మీ దు
శ్శాసనుండును గర్ణుడును బ్రశస్తచరిత్రో
ద్భాసితు లగు పాండవులకు
జేసినకీ డెల్ల భంగి జెఱుపదె మిమ్మున్"

"అన్ని విధంబులం జఱచియైనను నక్కటికంబు లేక వా
రి న్నెఱి మాలి కానల జరింపగ బంచిన బోయి వచ్చి య
య్యన్నయు దమ్ములుం దమకు నయ్యె సగం బిల వేడి కాన కి
ట్లున్నను వారి మార్కొనుట కోర్చితి నే నొక

బ్రాహ్మణుండనే"

(ద్రోణ - పంచమ - 31, 32)

ఈ మాటను పరిశీలించినచో ద్రోణాచార్యుని పశ్చాత్తాప హృదయము ప్రత్యక్షరములోను ధ్వనించుచున్నది. కౌరవుల దుష్కార్యము లన్నియు, గర్హించి తనదోషమును అంగీకరించుట అతని ఆచార్యపదమును సార్థకముచేయుచున్నది. స్వధర్మమువిడిచి పరధర్మ

మును ఎంతనేర్పుతో నిర్వహించినను మానవుడు దుర్గతినే పొందును. ద్రోణుని స్థితికూడ అట్టిదే.

ద్రోణునకు సాధారణ మానవసహజమైన పుత్రప్రేమ అధికము. ఏకపుత్రుడైన అశ్వత్థామ మరణించెనని ధర్మరాజుపలికిన అసత్యభాషణము విన్నంతనే అతని చిత్తంబు జల్లని చెదరి బెదరెను. అదే తగిన సమయమని విశ్వామిత్రాది మునివరిప్రకరము ధర్మోపదేశము చేసిరి.

> "భారద్వాజా నీవు బ్రాహ్మణుండవు వేదవేదాంగవిదుండవు. నీకు సంగ్రామంబు సేయ ధర్మంబగునే యింతకు మున్న చేసితేనియు జేసితి గాని కాలంబు పూర్ణంబయ్యె గాన నింక నుడుగుట మేలు మామాటలు వట్టి యాయుధంబులు వెట్టి శాంతిం బొందు మని చెప్పి."
>
> (ద్రోణ - పం - 308)

దీనితో ద్రోణాచార్యుడు స్వదోషమును గుర్తించి పశ్చాత్తాపము ప్రకటించి అస్త్రశస్త్రసన్యాసము చేసెను. ధృష్టద్యుమ్నుని చేతిలో ఆచార్యుడు దుర్మరణము పొందెను.

## 10. కృపాచార్యుడు

వ్యాసమహర్షి చిత్రించిన దేశికోత్తములలో కృపాచార్యుడు స్థితప్రజ్ఞావస్థను పొందిన మహానుభావుడు. ఇతడు సంసారములోనున్నను, భవబంధములచే బంధింపబడక పద్మపత్రముపైనున్న జలకణమువలె జీవయాత్ర సాగించిన చిరంజీవి. దురదృష్టవశమున కృపాచార్యుడు కౌరవపక్షము వహించినను, అడుగడుగునను నిస్సంగుడై మెలగుట విశేషము. దుష్టజనసేవ అతనిలోని దోషము.

గౌతమపుత్రుడైన శరద్వంతునకు, జలపదయను అప్సరసకు ఉదయించినవాడు కృపుడు. శంతనుడు శరద్వంతుని పుత్రుని, పుత్రికను

పెద్దచేసి, కృపుడు, కృపి అని పేర్లుపెట్టెను. శరద్వంతుడు పుత్రునకు వేదములను, ధనుర్వేదములను బోధించి, తనంతవానిగా తీర్చిదిద్దెను. కృపాచార్యుడు ధనుర్వేదవిశారదుడై, శాంతచిత్తవృత్తితో ప్రకాశించెను. ఈతడు విరుద్ధగుణములకు సమన్వయము సాధించిన సంయమి.

భీష్ముని ప్రార్థన పురస్కరించికొని కురుకుమారులకు ఆచార్యుడై జీవయాత్ర సాగించియు నిస్సంగుడై, జీవించుట ప్రశంసార్హమైయున్నది. కొంతకాలమునకు తనబావగారైన ద్రోణుడు కౌరవరాజాస్థానమున ధనుర్వేదాచార్యపదవిని స్వీకరించుట తటస్థించినది. దీనితో, కృపాచార్యుని ప్రాధాన్యము ఒకింత తగ్గినది. కృపాచార్యుడు మేఘావృతమైన సూర్యునివలె వెనుకబడెను. అయ్యును అతడు వీసమంతయు మానసిక గ్లాని పొందక పరిస్థితులను అర్థముచేసికొని ద్రోణాచార్యులకు నొసంగవలసిన గౌరవమునిచ్చి మెలగెను. ఒక యొరలో రెండుకత్తులు ఇముడవు. అందున పండితులసంగతి చెప్పవలెనా? కృపాచార్యుని సౌజన్యము పండితులకు మార్గదర్శకమైయున్నది. కృపాచార్యుడు కౌరవుల ఉప్పు తిన్నందులకు జీవితాంతము వారికి సేవచేయుచు ప్రియశిష్యునకు మొగమాటములేకుండ హితోపదేశముచేయుచు, సన్మార్గములో పెట్టుటకు తనశక్తినంతను ఉపయోగించెను. దైవబలము ముందు మానవబలము గడ్డిపోచకుకూడ సరిపోలదని, ధర్మజాదుల సద్గుణములనుగుర్తించి శ్రీకృష్ణునికి అత్యంతాప్తులగు పాండవులతో విగ్రహముపెట్టుకొనుట ఎంతమాత్రము మేలుకాదని హితోపదేశము చేసెను.

ఉత్తరగోగ్రహణసందర్భములో కాంతారనివాస ఖిన్నమతియైన అర్జునుడు ద్విగుణీకృతోత్సాహముతో కౌరవులపై విజృంభించుట చూచి, ద్రోణాచార్యులు శిష్యవాత్సల్యముతో ప్రియశిష్యుని అగ్గించి, కౌరవసేనలో కలిగిన దుర్నిమిత్తములను గుర్తించి, అర్జునుని జయిం

చుట కౌరవులకే కాదు ముక్కంటికైనను వశముకాదని చెప్పెను. అమ్మాటలు విన్నంతనే రాజరాజు మండిపడి గురువుగారిని తీవ్రముగ నుపాలంభించి, అధిక్షేపించెను. కర్ణుడు తనసహజధోరణిలో ప్రియ మిత్రుడైన దుర్యోధనునకు ముఖప్రీతి కలిగించుటకు బీరములు పలికెను. పరిస్థితి చేయిదాటిపోవుచుండుట గమనించి కృపాచార్యుడు కలుగ చేసి కొని అర్జునుడు అసహాయశూరుడై చేసిన పరాక్రమోపేతచర్యలన్నియు పేరుపేరున గుచ్చిచెప్పి అప్పుడు నీశౌర్యము సంతకు వెళ్ళినదా ? అని కర్ణుని నిలదీసి ప్రశ్నించెను.

> "అగు దేశకాలబలయుత
> ముగ జేసిన పోర నర్థములు మోరకులై
> తెగబాఱి తమ్ము నెదిరిని
> వగవక తొడరుటల గీడు వర్తిల్లు దుదిన్."
>
> (విరాట - చతుర్థ - 208)

"అక్కిరీటి ఒక్కడే యని తలచితి వేని ఆ అర్జునుడొక్కడే శక్రాదిసురులతో సంగ్రామమొనర్చి ఖాండవమేర్చినది అతడొక్కడే కదా ? యాదవబలమునంతయు జయించి సుభద్రను సుభద్రముగ నొక్కడై తెచ్చెకదా ? మొన్న మొన్ననే గంధర్వపతిచే బంధితుడైన రాజరాజును విడిపించుట అతడొక్కడే చేసినాడు కదా ? ఆ సందర్భ ములలో నీవు కలవా ? లేవా ? నీవు వృథాగర్వముతో ఏల బీర ములు పలుకుచున్నావు ? అర్జునుని ఎదుర్కొనుటయనగా తేలికయైన విషయము కాదు. అగ్నిలో ఉరుకుట, పాముకి కోరలు పెరుకుట, క్రీడి నెదిరించుట ముక్కంటికైనను వశముకాదు. ఇప్పుడు మనము బ్రతికి బట్టకట్టవలెనన్నచో అందరము కలసి అర్జునునిపై దండయాత్ర చేయు టయే కర్తవ్యము."

ఈ మాటలన్నియు పరిశీలించినచో కృపాచార్యుడు ప్రియశిష్యునకు యుక్తసమయములో హితోపదేశముచేసి, ఉత్తమసహాయుడై ప్రవర్తించెను. ధర్మము, దైవబలముకల పాండవులు విజయము పొందుదురని ధర్మార్థమధురముగా సంభాషించెను.

మహాభారతయుద్ధము పదియేడు దినములు లోకభీకరముగా నడచినది. పరాక్రమమహనీయులైన భీష్మ, ద్రోణ, కర్ణాదులు ఒరిగిరి. దుర్యోధనునికి వెన్నుపోటు పొడిచినట్లయినది. అయ్యవసరంబున కృపార్ద్రచిత్తుడై కృపాచార్యుడు ప్రియశిష్యునితో,ఉభయవంశములకు శ్రేయము చేయగోరి కర్తవ్యోపదేశము చేసియున్నాడు.

"సమరము పూర్వరాజులు చేసియున్నారు. మీబోటి ఉత్తమ క్షత్రియులకది ఉత్తమ ధర్మమే. అయినను, నీకు అడ్డమువచ్చి ఒక మాట చెప్పుచున్నాను. దానిని సావధానముగా విని అది మేలని నీవు భావించినచో అనుసరింపుము. లేనియెడల మానవచ్చును. ప్రస్తుత పరిస్థితి బాగుగా పరిశీలించినచో ఒక అభిప్రాయము కలుగుచున్నది. భీష్ముడు, ధనుర్వేదాచార్యుడైన ద్రోణుడు, మహారథి శూరశిఖామణి అయిన కర్ణుడు, మొదలైన ఆహవధురంధరులందరు పాండవుల భుజశక్తికి బలిఅయిపోయిరి. దీనిని బట్టి దైవబలము ముందు మానుష బలము పూర్తికి కాదుకదా? శ్రీకృష్ణుడు పాండవులను కంటికిరెప్పవలె కాపాడుచుండగా పాండవులదెస మనము తేరిపారి చూడగలమా ?

ద్రోణాచార్యులు, కర్ణుడు, అశ్వత్థామ, నేను, శల్యుడు కలిసి వేయికన్నులతో నీ సేనను, కాపాడుచుండగా, నీ తమ్ములు బాణపరంపరలు కురిపించుచుండగా ఫల్గుణుడు అందరినీ మీటి సైంధవుని ప్రాణాపహరణముచేయుట మానవుడు చేయదగిన పనియేనా? బలవిక్రమధనులందరు నేలకొరిగిన పిమ్మట మనసేన కన్నులు చెడినట్లున్నది. కౌరవసైన్యమంతయు పదునేడు దినములు యుద్ధము చేసిచేసి అలసి

పోయినది. నిష్కారణవైర కారణముగా సమరము వాటిల్లినది. సర్వ రాజన్యులు భరతోత్తములు సమరకారణమున స్వర్గమలంకరించిరి.

ఇపుడైనను దీర్ఘక్రోధమువిడుచుట సముచితము. దీర్ఘక్రోధుడైన పతి కీడు పొందును. రాజు బలవంతుడైనపుడు యుద్ధము చేయవలెను. బలము తగ్గినపుడు సంధిచేసికొనవలెనని రాజనీతికూడ ఆ సందర్భమున వివరించెను.

> "తమకు బలం బెక్కినతఱి
> సముచితమగు విగ్రహంబు శత్రువుల కుత్సా
> హము మీఱినపుడు గర
> వ్యము సంధి యనంగ విందు మార్యులచేతన్."
>
> (శల్య - ప్రథమ - 56)

నీవు మిక్కిలి ఆశపెట్టుకొన్న వారెల్లరును ఎఱిగి కార్యము నిర్ణయించు బాధ్యత నీపైననే యున్నది. తగ సంధిచేసికొనుము. ఆత్మవినాశమునకు ప్రయత్నించుట మహాపాతకమని బుధులు చెప్పచున్నారు. నిన్ను నీవు కాచికొనుట నీపైననే యున్నది. నీవు ఉన్నచో సర్వము సంపన్నమగును. ఆత్మప్రియముకొరకే మానవుడు అన్నియు కోరును. తాను ప్రళయము పొందినచో నిరంతరము తానుచేయు ఉద్యోగమునకు ఫలమేమి? ధర్మరాజుతో సంధిచేసికొన్నచో అతడే నీకు, నీ తమ్ములకు రాజ్యభాగమిచ్చి, వృద్ధుల శుశ్రూషచేయుచు కాలము గడపును. ధర్మరాజుమాట శ్రీకృష్ణార్జున, నకుల, సహదేవులకు శిరోధార్యము.

ఇంత హితోపదేశముచేసి కృపాచార్యుడు తాను యుద్ధమునకు భయపడి యిట్లు చెప్పుటలేదని దుర్యోధనుని హితముకోరియే యిట్లు చెప్పుచున్నానని స్పష్టముగా తెలియచేసెను.

"ఇంత చెప్పఁ టనికి నేనోడి ప్రాణర
క్షణము సేసికొనుట గాదు నీకుఁ
బథ్య మనియు దఱిమి పల్కితి విను విన
వేని నొచ్చి తలచె దిట్టు లగుట."

(శల్య - ప్రథమ - 62)

కృపాచార్యుడు అతిరథోత్తముడై సమరము దుర్యోధనుని పక్షము వహించి చేసెను. సమరారంభమున ధర్మరాజు పాదచారియై వచ్చి, కృపాచార్యులకు నమస్కరించి ఆశీర్వదింపుమని కోరెను. అతడు తాను వధ్యుండు కామి యెఱింగించి గెలువుమని ధర్మజుని దీవించెను. యుద్ధకాలములో భీష్మద్రోణులవలె అతడు పాండవపక్షపాతము ప్రకటింపలేదు. కర్తవ్యమును నిష్ఠతో నాచరించెను.

అశ్వత్థామ సౌప్తికవధకు పూనుకొనగా మేనల్లునితో నిద్రించిన వారిని అందున పసిపాపలనుచంపుట బ్రాహ్మణవంశములోపుట్టిన వారికి ఎంతమాత్రము తగదని హితము గొలిపెను. రాజరాజు ఆజ్ఞానుసారము సౌప్తికవధకు అశ్వత్థామకు తోడ్పడెను. చిరంజీవియైన కృపాచార్యుడు పరిక్షిన్మహారాజునకు గురువై బోధించెను.

కృపాచార్యుడు స్వీయకర్తవ్యమును పరమధర్మముగా భావించి, ఫలాసక్తి లేకుండా నిర్వహించినాడు. అతడు దుష్టజనుల సాంగత్యము పొందుట గర్హింపదగి యున్నది.

కృపాచార్యునిజీవితము మానవాళికి ఒక ఉపదేశము చేయుచున్నది. మానవులు తమకు వేదశాస్త్రములు విధించిన ధర్మమును, నిష్కామ్యముగా అనుసరించినచో అమృతత్వము పొందుదురనియు, దుష్టజనసాంగత్యము ఎంత సాధుశీలులకైనను దుఃఖమును కలిగించునని ధ్వనించుచున్నది.

# 11. భీముడు

భారతవీరాగ్రేసరుడు భీముడు. ధీరత్వము, ప్రతిజ్ఞాపాలనము, ధర్మాభిముఖ్యము, భ్రాతృవాత్సల్యము, వజ్రసారబలము, ప్రచండత్వము, అహంకారము, శత్రునిర్మూలనములో నప్రతిహతమగు ధీర, ప్రతీకార పరాయణత్వములతో ప్రకాశించుచున్నాడు. అందుచే ఆలంకారికులు భీముని ధీరోద్ధతనాయకునిగా పేర్కొనిరి.

మాయలమారితనము, ప్రచండత, చాపల్యము, అహంకారము, ఆత్మశ్లాఘము గలవాడు ధీరోద్ధతుడు. భీముడు ధీరోద్ధతుడయ్యును ధర్మముచే కట్టుబడుట ఎన్నతగియున్నది. భీముడు వాయుదేవుని అంశమున జన్మించుటచే వాయుగతమైన ప్రచండత్వము, మృదుత్వము కలిగి బెట్టిదులకు బెట్టిదుడై, మృదుస్వభావులకు సుకుమారుడై వరలెను. భీమ అను శబ్దమునకు

"బిభేత్యస్మాత్ త్రైలోక్యం భీమః"
ముల్లోకము లితని వలన భయపడును.

(గురు బాల ప్రబోధిక – ప్ర – కాం – పుట – 37)

ఇతడు శత్రుభయంకరుడగుటచే భీముడను పేరు సార్థకమై ఉన్నది. ఉత్తమక్షత్రియలక్షణమైన దుష్టశిక్షణము, శిష్టరక్షణము భీముడు చేసి తనపేరును నిలుపుకొనెను. భీమునిపాత్రముఖమున వ్యాస మహర్షి మధురోదాత్తమైన యుపదేశము చేసియున్నాడు.

భీమునిలో మానవత్వము పుష్కలముగ గోచరించును. ఇతడు వజ్రసారబలవంతుడగుటచే అన్యాయము జరిగినచో సహింపలేకపోవుట, తుందుడుకు స్వభావము, నిర్భయత్వము కొట్టవచ్చినట్లు కన్పించుచున్నవి. ఈ ధీరాగ్రేసరచక్రవర్తి దుష్టరాక్షసులను, దుష్టకాముకపీడితులను, కృతఘ్నులను, పరభార్యాపహారులగు జరాసంధ, బక,

హిడింబ, కిమ్మీర, జటాసుర, కీచకాదులను, దుష్టచతుష్టయములో ప్రధానులైన దుర్యోధన, దుశ్శాసనులను లోకభీకరముగ సంహరించెను. రాజ్యవ్యవస్థ చక్కగ నడచుటకు దండనము ప్రధానాంగము. దుష్టశిక్షణము చేయుట రాజుయొక్క ప్రధానకర్తవ్యము. దీనివలన ధర్మమునెడ భక్తి, అధర్మమునెడ భయము ప్రజలలో కలుగును. అత్యుత్కటమైన పాపము చేసినయెడల తత్ఫలము ఈ లోకములోనే అనుభావ్యమగునని సూచింపబడినది. రాజదండితునకు యమదండనము లేదు.

సంగరంబున జంపుటయు, చచ్చుటయు, ప్రజాపరిపాలనంబును దగిన తెఱంగున దండించుటయును నుత్తమ క్షత్రియధర్మంబులు. ఇవియే భీముడు చేసినాడు.

హిడింబయను రక్కసిమగువ అరణ్యములోనున్న వనజాయత నేత్రుడు, విశాలోరస్కుడగు భీముని లోకోత్తరసౌందర్యమును వీక్షించి మన్మథబాణపీడిత యయ్యెను. ఆ సమయమున కుంతీదేవి, ధర్మజాదులు నిద్రాముద్రితులైరి.

ఆమె మానవాంగనయై అతనిని సమీపించి తన్ను భార్యగా స్వీకరించి ఇష్టోపభోగము లనుభవింపుమని చతురుపాయముల ప్రయోగించెను. అట్టి క్లిష్టసమయములో భీముడు ఇంద్రియ నిగ్రహముతో ధీరాగ్రేసరమూర్తియై ప్రత్యుత్తరము చెప్పెను.

"ఓ బేలా, నేను చెప్పుమాటలు సావధానముగ వినుము. ఎట్టి నీచుడైనను తనమగతనము చెడగ, తనజన్మకాధారమగు మాతృదేవతను, తోబుట్టిన అన్నదమ్ములను గాలికివిడచి మోహముచే క్షణికమగు చపల స్త్రీసుఖము పొందుటను ఇచ్చగించునా ? ఒక రక్కసుడుమాత్రము గాదు, దేవతలు, రాక్షసులు కలసివచ్చినను చీల్చి

చెండాడగలను. అంతేగాని ఇట ప్రియానుజులకు నిద్రాభంగము మాత్రము చేయజాలను."

తరువాత ప్రభంజనసూనుడు హిడింబుని పరిమార్చెను. అప్పుడు మాతృదేవియొక్కయు, అన్నయగు ధర్మజునియొక్కయు ఆజ్ఞను స్వీకరించి హిడింబను పరిణయమాడెను. ఈ సన్నివేశమును పురస్కరించుకొని మానవుడు ధర్మబద్ధమైన అర్థమును, ధర్మబద్ధమైన కామమును సంపాదింపవలెను. ధర్మవిరహితమైన అర్థము ధర్మవిరహితమైనకామము మానవుని అధోగతికి త్రోయును. వ్యాసమహర్షి యథావకాశముగ అర్థకామములకు ప్రజలు బానిసలైనచో ఎన్నియోఅనర్థములు కలుగునని ఆవేదనముపొంది ఇట్లు బ్రతిమాలుచున్నాడు.

"ధర్మే మతిర్భవతువః సతతోత్థితానాం,
సహ్యేక ఏవ పరలోక గతస్య బంధుః
అర్థాః స్త్రియశ్చ నిపుణైరపి సేవ్యమానా
నవ్యాప్తభావ ముపయాన్తి న చ స్థిరత్వమ్."

(సం - భా - ఆది - 2 - అ - 391)

"ఊర్ధ్వబాహు ర్విరౌమ్యేష న హి కశ్చిచ్ఛృణోతి మే
ధర్మాదర్థశ్చ కామశ్చ స ధర్మం కిం న సేవ్యతే"

(సం - భా - శ్లో - అ - 5 - 62)

బిడ్డలారా, మీరు ధర్మమునందే దృఢాధ్యవసాయము కలిగియుండవలెను. ధర్మమే పరలోకమున తోడ్పడుబంధువు. అర్థములును, కామసాధనములును ఎంతనిపుణులు సేవించినను అవి ఆప్తములు కావు. స్థిరములు కావు. కాంతలు మెరపులవంటివారు. ఐశ్వర్యములు రమ్యములే. జీవితము మదవతీకంటె కొనవిరుపువలె బహు చంచలము. అర్థకామములవలన సుఖము కలుగుననుకొనుట భ్రమ. వీనివలన

తృష్ణ పెరుగును. తృష్ణవలన అసుఖము పెరుగును. కామమువలన కలుగుసుఖము, స్వర్గమున లభించుసుఖము ఈరెండును తృష్ణను తుడిచి పెట్టగలిగినచో కలుగుసుఖములో పదాఱవ పాలు కావు."

ఆ మహాత్మునికి ప్రజలపై ఎంతదయ కలిగి ఇట్లు చెప్పుచున్నాడో తెలియవలయును. భీముడు ధర్మబద్ధమైన కామమును అనుసరించి ఉభయలోక సౌఖ్యములను పొందెను. ధర్మాచరణము చేసినచో అప్రయత్నముగ అర్థకామములు సిద్ధించును. ధర్మోపేతమైన కామమే ఉపాదేయము.

ఏకచక్రపురములో పాండవులకు ఆశ్రయమిచ్చిన బ్రాహ్మణునకు బకాసురునివలన ఘోరాపద వచ్చినది. భీముడు కుంతీమహామాత ఆజ్ఞానుగుణముగ బకాసురుని సంహరించి లోకకళ్యాణ మాచరించెను. మానవునకు కృతజ్ఞత మానవత్వమునుకూర్చు ప్రధానలక్షణము. ఈ కృతజ్ఞతాగుణము ప్రకృతిలోనే కలదు. కొబ్బరిమొక్కలను పాతి నీరుపోసి పెంచిన చిన్నఉపకారమునకు వాని జీవితాంతము తత్కృతజ్ఞతా సూచకముగ తేనెవంటి నీరును, పటికిబెల్లమువంటి కొబ్బరి మనకు ఇచ్చుచున్నవి కదా. జీవులలో శ్రేష్ఠుడు ధీమాన్యుడు మానవుడు. అట్టి మానవుడు కృతజ్ఞత ప్రకటింపకపోయినచో దానవుడే. ఉపకారమునకుమించిన ప్రత్యుపకారముచేసి బ్రాహ్మణునికి కాక ఏకచక్రపురవాసులకు మేలు కలిగించెను. ఇదియే ధీరాగ్రేసరుల లక్షణము.

అధర్మము జరిగినచో సులభముగ కోపమువహించుట, శత్రువులకు ప్రతికారము చేయునంతవరకు నిద్రపోవనిస్వభావము భీమునిలో మిక్కుటము. అన్యాయము, అధర్మము జరిగినచో తలవంచుకొని సరిపెట్టుకొనుట అతనికి బొత్తిగకిట్టదు. ఆయా సందర్భములలో ప్రళయ

కాల రుద్రునివంటి భీమునిరూపము పాఠకుల మనోనయనములకు గోచరించునట్లు చిత్రించిన ఘట్టములు కోకొల్లలు. వీనిని పరిశీలించినచో భీముని క్రోధము ధార్మికమైనదనియు అనుదాత్తమనస్కుల నీచక్రోధము కాదనియు చెప్పవచ్చును. దుష్టశిక్షణముచేయు సుక్షత్రియునకు ఉదాత్తక్రోధము నిసర్గభూషణము. భీముడుకూడ తానుకోపము వహించుట తనమానసిక బలహీనతయని గుర్తించుట ప్రస్తుతింపవలసి యున్నది.

భీమ మాతంగము ధర్మపాశబద్ధమైనది. మానవుడు అమృతత్వప్రాప్తిపొందుటకు ఇహలోకము సుఖమయము చేసికొనుటకు ధర్మసేతువును పరిరక్షింపవలెను. సైరంధ్రివేషములోనున్న ద్రౌపదిని కీచకుడు నీచాతినీచముగ విరాటరాజు కొలువులో భర్తలు చూచుచుండగా పరాభవించెను. అదిచూచి భీముడు రెండవ దండధరుని పగిది కీచకునిపై లంఘింప సిద్ధమయ్యెను. ధర్మరాజు గూఢవచనరచనచే తమ్ముని అదుపులో పెట్టెను. కొంతకాలము గడచినపిమ్మట పవనాత్మజుడు చల్లగా కూర్చొని పరమశాంతముగ యోజించి యిట్లనుకొనెను.

"కీచకుడట్లు మీదు పరికింపగ తన్ను బరాభవింపగా
జూచి మహోగ్రకోపవివశుండగు నన్నునుజూచి ధైర్యహే
మాచలుడైన ధర్మసుతు డమ్మెయి వారణసేయకున్న నే
నీచత వాని మత్స్యవిభునిం బరివారము నుగ్గు సేసినన్."

(విరాట - ద్వితీయ - 179)

మానవజీవితములో ప్రాణసంకటమైన పరిస్థితు లెదురైనప్పుడు, ఉప్పుకారములను తిను జనులు కోపముపొందుట సహజము. కాని కోపము ఉచితకాలములో మనముపొంది, దానికి బానిసకాక మన అదుపులో నుంచుకొనుట అవశ్యకర్తవ్యము. కోపముకలిగియు తమ

తప్పు తెలిసికొనుట మహాత్ములలక్షణము. కోపమునకు ఇంధనమగుట అల్పమానవుల లక్షణము. తన కోపమె శత్రువు కదా !

భీముడు సౌగంధికాపహరణార్థము వెడలుచుండెను. అప్పుడు హనుమంతుడు తమ్ముడగు భీముని పరీక్షింపదలచి మార్గ నిరోధముగ మహావృక్షంబులువేసి శయనించెను. భీముడువచ్చి త్రోవ ఇమ్మని అడిగెను. హనుమంతుడు తాను ముదిసినవాడననియు, తోకను ప్రక్కకుపెట్టి వెడలుమనెను. గర్వితుడైనభీముడు మొదట వామకరంబున, పిమ్మట రెండుచేతులతో తుదకు తన యావద్బలము ఉపయోగించి యెత్తలేక మొగ్గతిల్లబడెను. భీముడు పశ్చాత్తాపముపొంది క్షమాభిక్ష వేడెను. సామాన్యముగ మానవునిలో ఆభిజాత్యమదము, ఐశ్వర్యమదము, విద్యామదము ఉండును.

ఇందు ఏమదమునకు వశుడయినను మానవుడు శ్రేయస్సుపొందనేరడు. మదముపొందుట యెంతమాత్రము తగదని సూచితము.

లోకములో భీముడు తిండిపోతు అనియు, బాహుబలము, శత్రుప్రతీకారపరాయణత్వము కలవాడనియు, ఆవేశముఎక్కువ, ఆలోచన తక్కువ, అను అభిప్రాయము లోకములో రూఢమూలముగా నున్నది. అది సరికాదు. అన్నివేళల భీముడు ఆ విధముగా సంచరించలేదు. ఒక్కొక్కసారి అతని సమత, ధైర్యము, రాజకీయపరిజ్ఞానము, హేతువాదపురస్సరమైన బుద్ధిబలము పుష్కలముగా మనలను ఆశ్చర్యాంబుధిలో తేలియాడించును. పాండవులు మహారాజపుత్రులై అష్టైశ్వర్యములతో తులతూగి దురదృష్టవశమున నేడు అరణ్యములో ఆకు, అలము తినుచు నానాకష్టములు అనుభవించుచున్నారు. ఇది మానవతీలలామయయైన ద్రౌపదికి, శత్రువులయందు పగకలిగిన భీమునికి కడుపుమంటగ నున్నది. అంత ద్రౌపదీభీములు ధర్మజుని కడకు మెల్లగ

చేరి తమ్ముల పరాక్రమ ముపయోగించి కౌరవులను సంహరింపచేసి జగత్కళ్యాణము ఆచరింపుమని ప్రబోధించిరి. అదే మంచిసమయము అని భీముడు తన ఉపన్యాసమును ఇట్లు చేసియున్నాడు.

"పితృపితా మహాగతమైన రాజ్యము కౌరవుల పాలుచేసి భీకరారణ్యములలో వ్రతములు సలుపుచు ధర్మము ధర్మమని చెప్పుట తగునా? పాండవులనుండి రాజ్యమును కౌరవులు అపహరించుట సింహమునుండి నక్క మాంసమును గొనుటవంటిది. దుర్మతులను, దుర్జనులను, ధర్మస్థితితో జయింపనగునా ? ధర్మకామములు సాధించుటకు సాధనము అర్థమే. అర్థమే సర్వార్థసాధకము. జగత్తు ధనైకమూలము. అట్టి అర్థము విడిచిన మిత్రులకప్రియంబు, అమిత్రులకు హర్షంబు కలుగును. మునివృత్తి చేకొని ధర్మవు ధర్మవు అని చెప్పుచు, ధర్మమునందే చిత్తము నిలిపియుంచుట న్యాయమా ? పురుషుడు ఎల్లప్పుడు ఏకాంత ధర్మనిరతుడగుట యుక్తమా ? ప్రాణమువిడిచిన శవమును సుఖదుఃఖములు రెండును విడిచిపెట్టును. ధర్మకామములు తఱుగునట్లు ధనము సంపాదించువాడు పతితుడగును. ధనము, ధనముకొఱకే సంపాదించువాడు ఉగ్రవనములో గోరక్షణచేయు కుమతిని పోలును. అర్థకామములకు హాని కలుగునట్లు కామము సేవించువాడు నీరు తక్కువగానున్న చెఱువులో చేపవలె నీటితోసహా హాని పొందును. అర్థము, ధర్మమును సముద్రమేఘములట్లు పరస్పరోదయమ్ములు. అందుచే త్రివర్గమునకు సమప్రాధాన్య మొసంగువాడు సర్వోత్తముడు. భవదాచరితమైన ఈ ధర్మంబర్థకామములకు ఎంతమాత్రము ఉపయోగింపదు. ఉపరి నీకును నీ బాంధవులకును బాధాకరంబు. దాన, యజ్ఞసత్పూజలు కావింప అర్థహీనునకశక్యంబు. జగంబులు ధర్మమయంబులు. ధర్మవునకు మిక్కిలి ఒండెద్దియు లేదు. అయినను అర్థార్థంబుగాని ధర్మవు క్షత్రియులకయుక్తంబు. శత్రువులను జయించుట, ప్రజలకే

భయంబు లేకుండ రక్షించుట, ప్రియముతో పాత్రులకు అర్థమిచ్చుట సుగతికి కారణములు. ఇవి క్షత్రియధర్మములు. వీనిలో నేఒక్కటియు ధనములేకుండ కుదురునా ? కేవల ధర్మాచరణంబు శత్రుజయంబునకు సాధనంబు కాదు. నికృతి పరులయందు నికృతి వలయును. నీవు సమయ ధర్మరక్షణ వ్రతంబుడిగి శత్రువుల జయింప నుద్యోగింపుము" ఈ మాటలన్నియు భీముని రాజకీయచాతుర్యమును, కూలంకషమైన మేధాశక్తిని, విషయమును ప్రతిపాదించు నేర్పును తెలుపుచున్నది.

భీముడు తనప్రియురాలైన ద్రౌపదికోరికకు నెంతటి సాహస చర్యమైనను ఒనర్చును. ఆమెకోర్కెను తీర్చుటకై గంధర్వులతో బోరి సౌగంధికపుష్పమును తెచ్చియిచ్చిన ప్రియసాహసికుడు. ప్రియ పత్నియగు ద్రౌపదిని నీచాతినీచముగ పరాభవించిన దర్పాహంకార భూయిష్ఠుడు, కాముకుడు, దుర్మార్గుడు, సింహబలుడైన కీచకుని, ఉప కీచకులను సమూలముగ మట్టుపెట్టి ప్రియురాలికన్నీరు తుడిచెను.

మహాపతివ్రతలయిన పరభార్యల జోలికి పోయినచో, సింహ బలుడైనను, నీచమరణము పొందునని లోకమునకు చాటిచెప్పెను. దీని వలన అతనికి ప్రభంజన నందనుడను పేరు సార్థకమైనది. సింహబలుడు అసామాన్యుడు. యుద్ధభూములయందు రాజులను ఓడించిన లోక దుర్జయుడు. గంధర్వులవలన లెక్కగొనని భుజగర్వశాలి. సైరంధ్రిచే వాని గుట్టుమట్టులన్నియు తెలిసికొని అసహాయశూరుడై అర్ధరాత్రి మున రహస్యభంగముకాకుండ కీచకుని పీచమడచెను. లోకములో భార్యకు దుఃఖముకలిగినను, భర్తకు దుఃఖముకలిగినను ఒకరికొకరు సాయపడవలెను. భీముడు ప్రియపత్నియగు ద్రౌపదియొక్క కన్నీరు తుడిచి ద్రౌపదీరమణుడని ప్రఖ్యాతిపడసెను. భర్త భార్యయొక్క కన్నీళ్లను తుడుచుట కనీసధర్మము. కలకంఠి కంట కన్నీరొలికిన సిరి యింట ఉండనొల్లదు కదా !

భీముడు తనభార్యయొక్క అవమాన కారణమయిన కీచకుని సంహరించెను. రాబోవు మహాభారతయుద్ధములో ఈవిధముగా దుష్టులను శిక్షింపగలను అని లోకమునకు ప్రబోధము చేసెను.

భీముడు చాల సందర్భములలో నాగ్రహావేశముపొంది మర్యాదాతిక్రమణము చేయుటకు ఒడిగట్టెను. ఇది అన్నగారిపై శ్రీకృష్ణుని మీద, ద్రోణాచార్యునిపై పొంగినది. రజస్వలయై, జారిన ఉత్తరీయము కలదై దుశ్శాసనుచే లాగబడుచున్న ప్రియపత్నియగు ద్రౌపదినిజూచి భీమసేనుడు కోపోద్దీపితుడై యుధిష్ఠిరునితో నిట్లనెను. "ధనవాహన ఆయుధ కవచాదికము, రాజ్యము, మేము, నీవు; శత్రువులచే గపటమున నపహరింపబడితిమి. నీవు సర్వాధిపతివగుటచే నాకా విషయమై కోపమురాలేదు. ద్రౌపదిని పణముగ పెట్టుట వ్యతిక్రమముగ తలచుచున్నాను. సహదేవా! అగ్నినితీసికొనిరమ్ము. ఈ యుధిష్ఠిరుని బాహుదాహము చేసెదను."

దీనినిబట్టి భీమసేనుని శీలము కళంకితమైనది. ఈసందర్భములో బ్రహ్మశ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు నీలకంఠుల వ్యాఖ్య నుదహరించి భీముడు, ధర్మజునియందు భక్తిప్రపత్తులుకలిగిన తమ్ముడని యుక్తియుక్తముగ సమర్థించుట స్తుత్యమై యున్నది.

"బాహూ తే సంప్రధక్ష్యామి సహదేవాఽగ్ని మానయ
తే తవ పుర ఇతి శేషః, సంప్రధక్ష్యామి."

ఇచ్చట "తే" అనుదానికి 'పుర' అని అధ్యాహారముచేసి నీ ఎదుట నా బాహువులను తగులపెట్టుకొనుచున్నాను అను అర్థము నీలకంఠాచార్యునిచే బోధింపబడినది.

ద్రౌపదిని ఒడ్డినపుడుగాని, ఓడినపుడుగాని భీమసేనునకు రానట్టి కోపము దుశ్శాసనుడామెను బట్టికొని పీడించుటవలన వచ్చినదనుట స్పష్టము. ఇప్పుడాకోపమునకు గురికావలసినవాడు దుశ్శాసనుడా?

భీమసేనున కప్పుడు తనబాహుబలమున దుశ్శాసనుని వధింపవలెనని కోపము వచ్చినది. ఆ విషయమై తనకప్పుడు ధర్మజుని అంగీకారము అపేక్షితమైనది. కనుకనే ఆ ద్రౌపదివైపు, ధర్మజునివైపు చూచుచు వచ్చెను. అది లభింపలేదు. అప్పుడీ వీరపత్నికి భరింపరాని ఇంత కష్టము నా కనులయెదుట ప్రాప్తింప పరిహరింపలేని ఈ బాహువులు కాల్పనా ? అని భీమసేనుడు తనచేతులు కాల్చుకొందునని అని యుండును.

ధర్మజునిది ధర్మబలము. అర్జునునిది శస్త్రాస్త్రబలము, భీమునిది బాహుబలము- అని ప్రసిద్ధమైయుండగా బాహుబలము చూపవలసిన భీముడు చూపలేక ధర్మజుని బాహువులకు శిక్షచేయుదుని చెప్పుట యుక్తమా ? అగ్రజునిపై అత్యంతభక్తికలవాడని ప్రతివాదులచే ప్రశంసించబడిన భీమసేనుడు ధర్మజునిచేతులు కాల్చెదనని అర్థము చెప్పుట అత్యంతము అసంగతము. తత్కాలప్రాప్తమై తత్కాల మందుపేక్షానర్హమై తాన విజృంభించినతొలగునదైయున్న దుశ్శాసన దౌర్జన్యమును ఉన్మూలించుటకై సంరంభము కలిగినపుడు తనకభ్య నుజ్ఞ నీయకుండిన యాధర్మజునియెదుట వ్యర్థములైన తనబాహువులు కాల్చుకొనెదనని నట్లుచెప్పుట అత్యంతోపపన్నము. అంత తప్పుమాటా డిన భీముని అర్జునుడు మందలింపలేదు కదా !

(మహాభారత తత్త్వకథనము-పాండవనిందానిరాకరణము-పు 671-672)

ఈ సందర్భమును ఈ విధముగాకూడ సమన్వయింపవచ్చును. ఉత్తమపాత్రలు కొన్ని మానసికబలహీనతలకు లోపడి, పెద్దవారిచే ప్రబోధింపబడి పశ్చాత్తప్తులై నారని వర్ణించుటవలన లోకసంస్కారము కలుగును. క్రోధము అనేక అనర్థములకు మూలము. దానిని శమింప చేయుటయే కర్తవ్యము.

ఈ విధముగ క్రోధము క్షమింపచేయుట మానవుల కర్తవ్యమని సూచితము.

భీమసేనుడు కౌరవకులపాంసనులైన దుశ్శాసనుని, దుర్యోధనుని సంహరించినవిధము మహాభయానకము. ఉత్తమ రాజన్య లక్షణము తీర్ణ ప్రతిజ్ఞుడగుట - శత్రునిర్మూలనము చేసి, ప్రతిజ్ఞా నిర్వహణము నెర వేర్చుకొనుట స్తుతింప తగియున్నది.

అయోనిజ, ఏకవస్త్ర, రజస్వల, అగు పతివ్రతయైన ద్రౌపదీ దేవి కొప్పుపట్టి కురుకులాపశదుడైన దుశ్శాసనుడు కౌరవ మహాసభ కీడ్చి తెచ్చి, ఆమె కట్టిన పుట్టంబు లాగుటచూచి, భీమసేనుడు మండి పడి ప్రళయకాల రుద్రాకారము వహించి, కోపరక్తాంతనయనుడై ఇట్లనెను :

"కురువృద్ధులు, గురువృద్ధబాంధవులు చూచుచుండగా ద్రౌపదిని మదోద్ధురుడై ఇట్లు పరాభవించిన ఖలుడైన దుశ్శాసనుని యుద్ధములో భీకరముగా సంహరించి దుర్యోధనుడు చూచుచుండగా, దుశ్శాసనుని ఉరముచీల్చి రక్తము ఆస్వాదింతును." ఈ ప్రతిజ్ఞను నిర్వహించినవిధము కావ్యన్యాయము. (Poetic Justice) ను పోషిం చునదై యున్నది. కులస్త్రీకి జరిగిన అవాచ్యమగు అవమానము హేతువుగా, జన్మించినక్రోధాగ్ని క్షాత్రస్వరూపుడగు భీమసేనుని హృద యమున పదమూడేండ్లు కుమిలినది. అక్కీచకారాతి బెబ్బులి లేడి కొద మంబొదువుపోలిక దుశ్శాసనుని పొదివి "పూర్వము సభలో కారు కూతలు కూసితివి ఇప్పుడు ఏమి అనగలవో అనుము. మహాబలనంద నుడు, మహోగ్రలోచన ప్రభలతో చూడగ కౌరవసైన్యములు దావాగ్ని విజృంభించుటచూచి, మృగకులము పలాయనము చేసినట్లు కకావికలైనవి.

భీముడు దుశ్శాసనుని శరీరము హేలగా కేల నమర్చి ఆకాశములో బంతివలె త్రిప్పెను. భూమిమీద పడవైచెను. ముంగాలం ద్రొక్కెను. మెడమీద ద్రొక్కెను. అయ్యో తృప్తిపడక ఇట్లను చున్నాడు :

"నరసింహుం డసురేంద్రు వ్రచ్చుకరణి న్రౌద్రం బుదగ్రంబుగా
నుర మత్యుగ్రత జీరి క్రమ్మురుధిర మ్ముల్లాసియై దోయిట
న్వార వారం గొని త్రావు మెచ్చు జవికి న్మేనున్
మొగంబున్ భయం
కర రేఖం బొరయంగ జల్లికొను నక్కారవ్యు జూచుం బోరిన్."

"తల్లి చన్నుల పాలేను ద్రావ నెట్టు
లాననే పలుతెఱగుల తేనియలును,
ఖండశర్కరతోడిదుద్ధంబు లనుభ
వింపబడవే యనియు నింత యింపు గావు."

"అని యెలుగెత్తి పల్కనలినాడు మహోద్ధతి ద్రుళ్లు నార్చు బె
ల్చన భుజ మప్పళించు దమసైనికులున్ మనవారు రక్కసుం
డని వెఱగందు వారు గళితాయుధు లయ్యెడువారు భీతి మూ
ర్ఛను బడువారునై రణవిరామము బొంద మదోత్కటా
కృతిన్."

(కర్ణ - తృతీయ - 214 - 216 - 217)

ఈవిధముగా భీముడు దుశ్శాసనవధ చేసినవిధము మహాభయంకరము. అది చదివినప్పుడే పాఠకులకు ఒడలు జలదరించును. మహాకవి ఈ ఘట్టమును పాఠకుల మనోనయనములకు గోచరించునట్లు చారు భీషణముగా చిత్రించుట రమ్యము.

భీముడు తాను చేసిన మొదటి ప్రతిజ్ఞ తీర్చి పిమ్మట గదాయుద్ధములో దుర్యోధనుని ఊరుభంగముచేసి రాజరాజు శిరముతన్ని తన ప్రతిజ్ఞను నెరవేర్చుకొనెను. భీముడు రాజరాజుయొక్క శిరస్సు తన్న వచ్చునా ? ఇది న్యాయముకాదు అని విమర్శకులలో అభిప్రాయ భేదములు కలవు. మనము దీనిని ఈవిధముగా సమర్థింపవచ్చును. దుర్యోధనుడు, దుశ్శాసనుడు, కర్ణుడు, శకుని దుష్టచతుష్టయము. వీరు ఆతతాయి గణమునకు చెందినవారు. 1. ఇండ్లు కాల్చువారు, 2. విషము పెట్టువారు, 3. శస్త్రపాణులై హింసించువారు, 4. ధనము అపహరించువారు, 5. భూముల నపహరించువారు, 6. భార్య నపహరించువారు ఆతతాయులు - (వశిష్ఠస్మృతి). ఈ ఆతతాయులను ఈవిధముగనే సంహరింపవలెనని ధర్మశాస్త్రములు ఘోషించుచున్నవి.

భీమసేనుడు దుర్యోధనుని తలపై తన్నుటకు హేతువు దుష్టశిక్షణప్రకారములో నదియొకటి నీతిశాస్త్రోక్తమై యుండుటే. నీలకంఠీయములోని యీ శ్లోకములను చూడుడు :

"వామపాణికచోత్పీడా భూమౌ నిక్షేపణం బలాత్
మూర్ధ్ని పాద ప్రహరణం జానునోదరమర్దనమ్
మాలూరాకారయా ముష్ట్యా కపోలే దృఢతాడనమ్
కఫోణిపాతో ఽ ప్యసకృత్ సర్వత స్తలతాడనమ్
తావేన యుద్ధే భ్రమణం మారణం స్మృత మష్టధా
చతుర్భిః క్షత్రియం హన్యా త్పంచభిః క్షతిరియాధమమ్."

(మహాభారత తత్త్వకథనము - పాండవ నిందా నిరాకరణము 687)

వైద్యుడు రోగియొక్క దుష్టాంగమును ఖండించువిధమున భీముడు దుష్టులైన దుశ్శాసన దుర్యోధనులను సంహరించుట ధర్మయుక్తమై యున్నది.

లోకములో నేరముచేసినవారు ఒకొక్కప్పుడు దండనము పొందకుండ తప్పించుకొనవచ్చును. కావ్యములో దోషముచేసినవారు తత్పాప ఫలము ఈలోకములోనే పొందవలెను. ఇది కావ్యన్యాయము. అదియే దుశ్శాసన, దుర్యోధనులు పొందినారు. దీనివలన ప్రజలకు అధర్మము నెడ భయము, ధర్మమునెడ భక్తి కలుగునని వ్యాస మహర్షి ఇంత భయంకరముగా భీమునిచే దుష్టశిక్షణము చేయించినట్లు వర్ణించిరి. ధర్మము ఆశ్రయించినవారిని రక్షించును. అధర్మము ఆశ్రయించినవారిని భ్రమింగును. ఇదియే భారతపరమార్థము. "దుర్యోధనుని వలె సంచరింపకు" అని లోకమునకు ప్రబోధము చేసినాడు.

భీముడు వజ్రసారబలుడు. తిండిపోతు తనము, అహంకారము మొదలైన మానవసహజములైన బలహీనతలను కలిగియు ధర్మబలముచే బంధింపబడుట స్తుతింపదగి యున్నది. భీముడు ధర్మజుని తమ్ముడు.

## 12. అర్జునుడు

వ్యాసమహర్షి ప్రతిభార్ణవమునుండి యుద్భవించిన ఆణిముత్యము అర్జునుడు. ఇంద్రాంశమున భారతాన్వయ దీపకుడు, తేజోనిధి, విద్యాపారగుడు, వినుతవ్యాపారుడు, సౌశీల్యసంశోభితుడు, శ్రీకృష్ణభక్తుడు, కుంతీదేవికడుపు చల్లగపుట్టినఘనభుజుడు అర్జునుడు. ఇంద్రలక్షణములైన సర్వజనపూజ్యత, వ్యాపనశీలమైన తేజస్సు, ప్రవృద్ధమైన కీర్తి, శత్రుమర్దన సమర్థమైన అవక్రపరాక్రమము, గురుహృదయ ప్రమోదావహమైన శుశ్రూష, నిరంతరపరిశ్రమ, కౌశలము, జిజ్ఞాస, ధర్మాభిముఖ్యము పార్థునిలో మూర్తీభవించినవి. భారతపరమార్థము శ్రీకృష్ణార్జున ఉత్తమగుణ కీర్తనము.

నన్నయగారు వ్యాసమహర్షి అల్లారుముద్దుగా పెంచుకొన్న ఉద్యానవనము భారతమనియు అందు పారిజాతవృక్షముయొక్క ఫలము శ్రీకృష్ణార్జునుల ఉత్తమగుణ కీర్తనమనుట మనోహరము. అర్జునా హస్కరుడు సహస్రదీధితులను వెలిగించి జైత్రయాత్రలను చేసిన విధము చారుభీషణము. వాసవాత్మజుని పురుషకారము సర్వజన సమారాధనీయమై యున్నది.

అతడు బాల్యమునుండి లోకైకధనుర్ధరుడు. "పార్థఏవ ధనుర్ధరః" అను ప్రశస్తిపొందు పరమాశయముకలిగి, ధనుర్వేద విశారదుడగు ద్రోణాచార్యుని గురువుగాబడసి, శుశ్రూష, భక్తి, నిరంతర కృషి, ప్రతిభలను మేళవించి జీవితాంతము జైత్రయాత్రచేసిన ధీరాగ్రేసర మూర్తి. మహత్త్వముపొందుటకు ఇవితప్ప సూక్ష్మోపాయములు లేవు. అట్టి అన్యజన దుర్లభమైనపరాక్రమము, జీవితములో విజయము పొందుటకు కారణము భారతమే నొక్కిచెప్పినది.

"భూపనందను లివ్విధంబున భూరిశస్త్ర మహాస్త్ర వి
ద్యోపదేశ పరిగ్రహస్థితి నున్న నందఱ యందు వి
ద్యోపదేశము దుల్యమైనను నుత్తమోత్తముడయ్యె వి
ద్యా పరిశ్రమ కౌశలంబున దండితారి నరుం డిలన్."

(ఆది - పంచమ - 246)

భారతదేశములో నేడు పిశాచమువలె పీడించుచున్న నిరుద్యోగము, దారిద్ర్యము, అవిద్య తొలగించుటకు సర్వరంగములలో సర్వ ప్రజలు అర్జునసములై నవనవోన్మేషమైన పురుషకారముతో ప్రయత్నించుటయే అవశ్యకర్తవ్యము.

అర్జునుడు సకలదివ్యాస్త్ర సంపన్నుడయ్యును, త్రిలోకైకవీరుడయ్యును ధర్మజుని ఆజ్ఞను జవదాటిన సందర్భములేదు. ఇతని భ్రాతృ

భక్తి భరతుని భ్రాతృవాత్సల్యముతో పోల్చనగును. భీముడట్లుకాదు. భీముని స్వభావము దీనికి భిన్నమైనది. ఘోషయాత్ర సందర్భములో అర్జునుడు గంధర్వులతో "పార్థివ ప్రాగ్రసరుండు ధర్మసుతు పనుపు వారా కలంఘ్యము." అనగా మానవుడు ధనబలము, బాహుబలము, అధికారబలమున్నను ధర్మబలమునుమాత్రము వీసమంతయు తక్కువ చేసికొనరాదు. పై చెప్పినవన్ని యున్నను ధర్మము లేకపోయినచో ఆ మానవుని జీవితము నిర్గంధకుసుమము. అర్జునుని భ్రాతృభక్తికిని దుశ్శాసనుని భ్రాతృభక్తికిని హస్తిమశకాంతరము. అర్జునుని భ్రాతృభక్తి సత్యధర్మ సమన్వితమై, నిరంతరకృషియుక్తమై, పరమేశ్వర భక్తితో ఆత్మోద్ధరణమునకు, లోకకళ్యాణమునకు దోహదము చేసినది. దుశ్శాసనుని మూఢభక్తి మాత్సర్యముతో, స్వార్థముతో, ఉత్తమ జనావమానమునకు తుదకు సర్వజన క్షయకరమగు నాశమునకు తోడ్పడినది.

కుంతీసుతమధ్యముడు అరణ్యవాస సమయములో పరమేశ్వరుని, ఇంద్రాది దేవతలను ఆరాధించుచు, భవిష్యత్కాలములో భీష్మాదివీరులను జయించుటకు ఉపయుక్తమైన పాశుపతాది అస్త్రములను సముపార్జించెను. అజ్ఞాతవాసములో బృహన్నలవేషము ధరించి, ఉత్తరకు నాట్యవిద్య నేర్పియు, యుద్ధమునకు వలయుసారథి లేకపోయినను ఉత్తరుని సారథిగా చేసికొని అసహాయశూరుడై భీష్మ, ద్రోణాది వీరులను జయించి భవిష్యద్భారత సంగ్రామములో ఈ విధముగా త్రిలోకవిజయము పొందెదనని చిరకీర్తిని పొందెను. మానవజీవితములో అరణ్య, అజ్ఞాతవాసములు చేయవలసివచ్చును. కష్టములనునవి మానవ జీవితప్రకాశమునకు అత్యావశ్యకములు. దీపము వెలుగు చీకటి యున్నప్పుడే అవగతమగును. అనిర్వేదము తరుగని ధనము. నిత్యో

త్సాహముకలిగి ధీరుడైన మానవుడు కాలకలితములైన సుఖదుఃఖము లకు సమప్రాధాన్యము నొసంగి జీవితప్రయాణము సాగించిన గమ్యస్థానము చేరును. నీటిలోనున్నను నావ నదిలోనున్న నీటిని ఎంత మాత్రము తనలోపలకు రానీయక అది ప్రయాణముచేసి తీరము చేరుట లేదా? మానవుడును అంతే. కీర్తిప్రియత్వము మహాపురుషుల ధ్యేయము.

ఉత్తరగోగ్రహణ సందర్భములో ఉత్తరుడు, బృహన్నలను సామాన్యమానవునిగా తలచి తాను రాజపుత్రుడను, పరాక్రమ సంపన్నుడను అను నీచమైన అహంకారముతో లాఘవభావముతో మాటలాడెను. "ఓ బృహన్నలా వేగముగ రమ్ము! నాకు కౌరవులతో యుద్ధము చేయవలసి వచ్చినది. నీవు రథమునకు సారథివై నా రథమును నడపవలయును. కవచము తొడిగికొని తేరెక్కుము". అమ్మాటలు విని బృహన్నల ఆటపాటలు ప్రదర్శింపవలసిన సమయమున పిల్వబంచిన తగును కాని సంగరము సేతకు సారథియగుమనుట ఉచితమా? ఎల్లెడలనారసి బాహుబలాఢ్యుడైన యొక్కని రథసారథిగా నియోగింపుము అని చెప్పెను. పిమ్మట ఉత్తరుడు కవచము తెప్పించి తొడుగుకొనమనెను. అప్పుడు బృహన్నల దానిని ఇటునటు తారుమారుగా గప్పికొని అచ్చటి అబలాజనులను నవ్వించెను. ఈ ఘట్టములో ఉదాత్తహాస్యము పోషింపబడినది. మానవజీవితమునకు పరిపూర్ణత, పుష్టిచేయు ఔషధము హాస్యము. మానవజీవితములో ఎన్ని కష్టములు వచ్చినను సమస్యలలోపడి సతమతమగుచున్నను నవ్వుకొనినయెడల ఆ కష్టములనెడు మబ్బుతెరలు తొలగిపోవును. వెన్నెల వంటిది నవ్వు. నవ్వలేని మానవునిజీవితము వ్యర్థము. ఉదాత్తహాస్యము మానవునకు చెప్పలేనంతబలము చేకూర్చును. నవ్వి పలువురను కడుపార నవ్వించువాడే ధన్యుడు.

అర్జునుడు, జగన్నాటక సూత్రధారియైన శ్రీకృష్ణుని సారథిగా చేసికొని భీష్మ, ద్రోణ, కర్ణాదివీరులను జయించుటకొఱకు ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమునకు అరుదెంచెను. సుకుమార హృదయుడు బంధుప్రీతిగల అర్జునుడు ఎదుటనున్న అన్నలను, గురువులను తాతలను చంపి నెత్తురుకూడు ఏవిధముగా తినగలను ? అని దుఃఖసంవిగ్న చేతస్కుడై గాండీవము క్రింద పడవైచి చతికిలపడెను. అర్జునుని అకీర్తికరమైన, క్షుద్రమైన హృదయదౌర్బల్యమును, అవివేకాంధకారమును పోగొట్టి విజ్ఞానదీపము వెలిగింప నిశ్చయించి శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతామృతమును వర్షించెను. అర్జునునకు విశ్వరూపమును అనుగ్రహించెను. ఈ సన్నివేశము మానవాళికి చక్కని ప్రబోధము చేయుచున్నది. మానవుడు కర్మవీరుడై అర్జునునివలె జీవితరణక్షేత్రమున విజయము పొందవలెను. మనము జిజ్ఞాసతో, స్వధర్మమును, పరమేశ్వరార్పణ బుద్ధితో నిర్వహించిన చిత్తశుద్ధి కలుగును. అప్పుడు పరమేశ్వర సాక్షాత్కారము పొందు స్థితిఅలవడును. కర్మత్యాగము మోక్షము నీయజాలదు. మానవుడు జీవితమునందుండియే ముక్తి పొందవచ్చును. జీవితమునుండి తరించుటకు మార్గము జీవితమే. అనుష్ఠానపరమైన కర్మయోగమే ధ్యేయమైనది. వృద్ధసేవ, స్వధర్మానుసరణము, నిష్కామబుద్ధి జిజ్ఞాస పెంచుకొన్నచో మానవాళి ఇహపరలోక సౌఖ్యము పొందును. సాధకునకు వలసిన లక్షణములన్నియు అర్జునునిలో పుష్కలముగా నున్నవి. అర్జునునకు, జగన్నాథుడైన శ్రీకృష్ణునియందు అచంచలమైన భక్తిప్రపత్తులు కలవు. తప్పుచేసి పశ్చాత్తాపము పొందు సహృదయతకలదు. అర్జునుడు, శ్రీకృష్ణుని మొట్టమొదట యాదవుడని, సఖుడని, మేనబావయని సహభోజన సల్లాపములు నొనరించి, పెక్కులోకసామాన్య భంగులు చేసితిననియు, అవి అన్నియు తల్లిదండ్రులు బిడ్డలు చేసిన

తప్పులను క్షమించు విధమున క్షమింపమని ప్రార్థించెను. ఆ మహాను భావుడు తన అజ్ఞానసమ్మోహము పోయెనని చెప్పెను.

"మోహతమంబు వాసె దుది ముట్టిన నీదు ప్రపత్తి వీతసం
దేహుడనైతి గాఢపరిదీప్తమహాకృతి గాంచి బోధస
న్నాహనిరామయస్థిరమనః స్థితి బొందితి సర్వలోకని
ర్వాహవినోద నీ విమలవాక్యము చొప్పున నెల్ల జేసెదన్."

(భీష్మ - ప్రథమ - 228)

సామాన్యముగా లోకములో ధనము, అధికారము, సౌంద ర్యము, కౌశలములలో నే యొక్కటి యున్నను మానవునికి మదమును పెంచును. సకలసద్గుణఖనియయ్యును అర్జునుడు గురువునుగాని, అన్నను గాని, తమ్ములనుగాని, బంధుజనులనుగాని తిరస్కరించుట ఎన్నడును చేయలేదు. అన్నియును ఒకయెత్తు. అ మహామహితాత్ముని గురుభక్తి ఒక యెత్తు.

ఆ గురుభక్తి తాత్పర్యము బాల్యములో నెట్లున్నదో జీవిత ములో ప్రవేశించినను ఏమాత్రము తగ్గలేదు. మీదు మిక్కిలి నవ నవోన్మేష వికాసముతో ప్రకాశించుట అర్జునుని విజయ కారణము. పాకశాసనుని, గురువు పెట్టిన అగ్నిపరీక్షలలో మేలిమిబంగారమై ప్రకా శించి అతనివలన బ్రహ్మాస్త్రాది రహస్యములన్నియు గ్రహించి, భక్తి పూర్వకముగా గురుదక్షిణ సమర్పించెను.

ఉత్తరగోగ్రహణమునకు వచ్చినప్పుడు ఆచార్యునకు నమ స్కారబాణములు వేసి, కుశలప్రశ్న చేసి, ప్రదక్షిణము చేసి, ఉత్తరు నితో ద్రోణాచార్యుల శిష్యవాత్సల్యమును ప్రస్తుతించుచున్నాడు.

"సకల కురు కుమార చాపశిక్షాచార్యు
డాజి దుస్సహుడు సాంగవేద

వేది నీతిశాస్త్రవిదుడు దివ్యాస్త్రకో
విదుడు సుజనహితుడు విమలబుద్ధి."
"తన తనయుకంటె నెమ్మన
మున నాకం గూర్చు భావమున గురులకు మా
ర్కొ-నియెదము రాచధర్మం
బున కీడున చేసి యింత పుట్టగ పలసెన్."
(విరాట - పంచమ - 118 - 120)

ఇంతకంటె శిష్యుడొసగు వాక్పుష్పోపహారము గురువునకు ఏమి యుండును ? అర్జునుడు తాము చిరకాలమునుండి అడవులలో ఇడుమలు పడివచ్చితి మనియు, ఈ విపన్నుల యెడ కృపచేయుట లెస్స యనియు గురువుగారిని మనసార ప్రార్థించెను.

సైంధవ వధకు వెడలుచు, తనను, అశ్వత్థామను సమానముగ పెంచిన ఉదార హృదయుడవనియు, సైంధవుని చంపు ప్రతిజ్ఞ నెర వేరునట్లు ఆశీర్వదింపుమని ప్రియశిష్యుడు ఆచార్యుని ప్రార్థించెను. ఒక ప్పుడు అర్జునుడు ద్రోణాచార్యుని అతిక్రమించి కురుసేనలోనికి ప్రవేశిం చెను. అప్పుడు కుంభజుడు శిష్యుని వెంటపడి ముందు తన్ను జయించి సాగుమనెను. అప్పుడుకూడ అర్జునుడు ఒకింతయు కినుక వహింపక ఇట్లనెను :

"గురుడవు గాక పగతుడవె
దురమున గుపితుడగు నిన్నెదుర్కొ-న నా కో
ర్క-రునకు శక్యమే యాపుర
హరున కగుం గాక యనుచు నరుగుచునుండెన్."
(ద్రోణ - తృతీయ - 73)

శ్రీకృష్ణుడు ద్రోణవధకు వేసిన పథకమును అర్జునుడు ఎంత మాత్రము అంగీకరింపలేదు. ఈగురుభక్తియే ద్రోణాచార్యుని బంధించి

పైచినది. ఆచార్యుడు తనపుత్రుడైన అశ్వత్థామకుకూడ బ్రహ్మాస్త్ర రహస్యములను సరిగా చెప్పక పుత్రనిర్విశేషుడైన అర్జునునికి ఎరిగించెను. అదియే అర్జునుని త్రిలోకైక ధనుర్ధరునిగా నొనరించెను. ఆదర్శ శిష్యప్రకృతికి అర్జునుడు మణిదర్పణము.

అర్జునుడు, కోపావేశము పొందిన భీమన్నను అనునయించి, ధర్మజుని అనుసరించునట్లుచేయుటలో చూపిన చాకచక్యము స్తుతింపదగి యున్నది. మూర్ఖావేశముపొందిన భీముడు అన్నగారిచేతులు కాల్తు ననెను. అప్పుడు అర్జునుడు హితోపదేశము చేసి శాంతింపచేసెను.

మహాభారత సంగ్రామానంతరము ధర్మరాజు పెదతండ్రియైన ధృతరాష్ట్రుని మరణించిన బంధుకోటికి శ్రాద్ధకర్మలు విశేషముగా చేయుమని ప్రోత్సహించెను. భీముడు దానికి ఒప్పుకొనక మొరాయించెను. "ఏమేనిం బలుకం జూచినం బీభత్సుండు మెలుపున నతని వారించెను."

అర్జునుని భ్రాతృభక్తి, ధర్మాభిముఖ్యము సర్వజన శిరోధార్యము. అర్జునుడు సమయభంగమైనదని తీర్థయాత్రకు వెడలుటకు సిద్ధపడగా ధర్మజుడు బ్రాహ్మణధేనువును కాపాడినందులకు ధర్మభంగము కాలేదనియు, దానిని ప్రాయశ్చిత్తముచే నివారింపవచ్చునని నచ్చచెప్పెను. అమ్మాటలకు అర్జునుడు అంగీకరింపక ధర్మలోపమునకు ప్రాయశ్చిత్తము చేయ నిశ్చయించెను.

అర్జునుని సంభాషణములన్నియు పరిశీలించినచో శ్రీకృష్ణుని పరతత్త్వము అర్థముచేసికొన్న భక్తుడనియు, ధర్మార్థమధురముగ సంభాషించు మిత, హిత, సత్య, వాక్యకోవిదుడనియు తెలియుచున్నది. క్రియాశూరులు మితభాషులు. భవిష్యద్భారత సంగ్రామములో సాయము నర్థింపపోయిన దుర్యోధనుడు శ్రీకృష్ణుడు పవళించి

యుండగా, అతని తలదగ్గర దుర్యోధనుడును, కాల్కడ సవ్యసాచి వినమ్రులై నిలుచుండిరి. యుద్ధములో నారాయణగోపాలురు ఒకపక్ష మున, శ్రీకృష్ణుడు ఒకపక్షమున ఉందురనియు కోరికొనుమని విజయు నితో చెప్పెను. అర్జునుడు భూరిపరాక్రమ సంపన్నులగు గోపాలుర విడచి శ్రీకృష్ణుని కోరికొనుటలోనే అతని హృదయౌన్నత్యము తెలియు చున్నది. తన్నేల వరికొంటివని శ్రీకృష్ణుడు ప్రశ్నింపగ మందహాస సుందర వదనారవిందుడై ఇట్లు చెప్పెను :

"అనుటయు నాతడు హరి కి
ట్లను నేను రణంబునకు సహాయం బొల్లన్
విను సుప్రసిద్ధుడవు నీ
వని సేసిన పేరు నీక యగు నెప్పాటన్." (ఉద్యో-ప్ర-86)

"నీకెదురై జయంబు గొన రాదట్లగుటం జేసి విజయమూలం బగు నీతోడును వలయు నీవు సమరంబుసేయ కునికియుం బ్రియంబు కావున నిన్నుం గోరికొంటిని." అర్జునునిలో కార్యకౌశలము, శ్రీకృష్ణ భక్తి సమానముగానుండుట అతని అదృష్టము. ఇవియే అతనికి విజయ మును సంపాదించిపెట్టినవి. తదనుగుణముగ విజయుడను పేరు సార్థక మైనది.

శ్రీకృష్ణుడు రాయబారమునకు వెడలుచున్నప్పుడు అర్జునుడు తన అభిప్రాయమును మధురముగ తెలిపెను. "సుజన వత్సలా, మా అన్న చెప్పవలసినదంతయు సవిస్తరముగ చెప్పనే చెప్పియున్నాడు. ఇక నేను చెప్పవలసినది ఏమున్నది? అయినను నేను చెప్పునది ఒక్కటే. మేము, అందరము అరణ్యములో పడిన కష్టములు చూచి నీహృదయము ఎంతయో క్రుంగినది. ధర్మజుని పరాభవించిన ద్రోహులు వధ్యులు కారని ఎవ్వరనగలరు? అయినను మామొదల దుర్యోధనాదులు

చేసిన ఎగ్గులన్నియు చవుటపెట్టిన వి త్తనములవలె అంకురింపలేదు. వారు ఎన్ని చేసినను వారితో సంధిచేసుకొనుటయే ఉభయులకు మేలు. నీవు ప్రారంభించిన పని కీడుపుట్టునే ? ఆపని ఫలించనట్లుండి నీమూలముగ ఫలించును. మానవప్రయత్నము, దైవము కలసినచో ఫలసిద్ధి పొందును.

ఉచితకాల యత్నవిధి, సమగ్రఫలము కూర్చును. ఈరెండును బాగుగా పరిశీలించినచో నీ వినోదములే. ఆ కౌరవమూర్ఖులను ఎట్లయిన ఒప్పించి మాకు వారికి చెరిసగము ఇప్పించి పొందుపొసగి యుండునట్లు చేయుము. అన్నిమాటలేల ? నీవు మమ్ముపిలచి ఇట్లు చేయుము అని ఆజ్ఞాపింపుము. దానికి రెండవమాట మాటాడము. అంతటితో తృప్తిపొందక అర్జునుడు కార్యభారమంతయు శ్రీకృష్ణుని మీదనే పెట్టుట అతని శ్రీకృష్ణభక్తికి పరాకాష్ఠ.

లోకములో పురుషకారము గొప్పదనికొందఱు, దైవము గొప్పదని కొందఱు వాదించుచున్నారు. ఈ రెండును ఆ పరమేశ్వరుని లీలావినోదములే. ఇదియే అర్జునుని వేదాంతము. అదియే భగవద్గీత చేయుచున్న ప్రబోధము.

"కర్మణ్యే వాధికారస్తే, మాఫలేషు కదాచన
మాకర్మఫల హేతుర్భూ, ర్మాతే సంగోఽ స్త్వకర్మణి"
(భగవద్గీత - ద్వితీయ - 47)

కర్మానుగుణమగు బుద్ధినికలిగించి పనిచేయించువాడు, ఫలము నిచ్చువాడు పరమేశ్వరుడే. కర్తృత్వ భోక్తృత్వములను విడచి పరమేశ్వరార్పణ బుద్ధితో కర్మాచరణము చేయవలెను.

అర్జునుడు ప్రతిజ్ఞానిర్వహణము ప్రధానధ్యేయముగ భావించెను. దానికొఱకు తనసర్వస్వము త్యాగముచేసి యున్నాడు. సైంధవ వధ

చేయుట సామాన్యమైన పనికాదు. ప్రియపుత్రుడైన అభిమన్యుని మరణమునకు కారణమైన సైంధవుని లోకభీకరమైన రీతిని సంహరించెను. ఈ సన్నివేశములో శ్రీకృష్ణుని సాయము అర్జునుని పేరు దక్కించినది. ఉత్తమక్షత్రియునకు ప్రఖ్యాతి ప్రతిజ్ఞానిర్వహణవలననే జరుగును.

నరనారాయణులే లోకకళ్యాణార్థమై అర్జున, శ్రీకృష్ణులుగ జన్మించిరి. వారి పరమార్థము ధర్మసంస్థాపనమే. శ్రీకృష్ణుని పరమేశ్వర లక్షణములు, అర్జునునిలో కూడ కలవు. శ్రీకృష్ణుడు అర్జునుని నిమిత్తమాత్రముగా చేసికొని మహాభారత సంగ్రామములో కౌరవులను సంహరింపచేసి దుష్టశిక్షణ కార్యక్రమమును నిరాటంకముగ నెరవేర్చుకొనెను. అర్జునుడు శ్రీకృష్ణుని దివ్యత్వమును గ్రహించిన భక్తుడు. శ్రీకృష్ణపరమాత్మ సంకల్పమును నిర్వహించు భౌతికశక్తి అర్జునుడు. కృష్ణార్జునులసంబంధము మనోదేహముల సంబంధమును బోలినది. యాదవనాశమును వినినంతనే భావిప్రళయము అర్జునునకు గోచరమైనది. మౌసలపర్వములో అర్జునునిలో అత్యంతాశ్చర్యకరమైన పరివర్తనము గోచరించుచున్నది. శ్రీకృష్ణ నిర్యాణముతో అర్జునుని శక్తి, ఉత్సాహము అంతరించినవి. ఉత్తరదిగ్విజయ, పాశుపతాస్త్ర గోగ్రహణ విజయాది ఘట్టములందలి అర్జునుడు వేరు. ఇప్పటి అర్జునుడు వేరు. సైంధవవధ నాడు లోకాతీతము, అద్భుతము, దివ్యము అగు శక్తిసామర్థ్యములను ప్రదర్శించిన అర్జునుడు కేవలము నరుడైనాడు. శాంతిస్థైర్యములు, ఉచితజ్ఞత బంధు ధర్మములు, ప్రజారక్షణభారము, పరిణతమగు జ్ఞానము తత్ఫలమగు నిరాసక్తి అతనిలో కన్పించుచున్నవి. మానవుని జీవిత పరిణామమునకు మూలకందమై, అతని శీల స్వభావ ప్రవర్తనాదులకు హేతువై అనుల్లంఘ్యమై యొసగు సంచిత, కర్మ పరి

పాక ప్రాబల్యము ఎట్టిదో నిరూపించుచున్నది. మణిహారమందలి సూత్రమువలె భారతకథలలో ఆదినుండి అంతమువఱకు ప్రచ్ఛన్నముగా అనుస్యూతమై వచ్చినది. విధి ప్రాబల్యము. సుఖదుఃఖములు, శీతోష్ణములు కాలకలితములు. వానికి ధీరులు ఎంతమాత్రముపొంగరు; క్రుంగరు. పొందవలసిన ఉత్తమస్థితిని పొందుదురు. అర్జునుడు ఉత్తమ కర్మయోగియై విలసిల్లెను.

అర్జునుడు సకలసద్గుణ రత్నాకరుడయ్యెను, ఒక్కొక్కసారి స్వాతిశయముతో మెలగెను. అదియే అతనికి పతనకారణమయ్యెను. ధర్మజుడు అర్జునునిలోనిదోషము చెప్పనే చెప్పియున్నాడు. అర్జునుడు కౌరవులందరిని ఒక్కదినముననే చంపగలనని బీరములు పలికెను. అట్లు చేయకపోవుట దోషము. పలుకు ఒక్కటి, చేత ఒక్కటి అయినది. అంతియేగాక సకలకోదండధరులను గర్హించెను. ఈ దోషము చంద్రుని లోని మచ్చవలె అతనికి అందమునే సమకూర్చినది. అర్జునుడు భగవద్గీతాధర్మము రాశీభూతమైన కర్మయోగి.

"వీడె కృతహస్తు డఖిలాస్త్ర విద్యలందు
వీడె యగ్రగణ్యుడు ధర్మవిదులలోన
వీడె భరతవంశంబెల్ల వెలుగ గుంతి
కడుపు చల్లగా బుట్టిన ఘనభుజుండు."

(ఆది - షష్ఠ - 19)

## 13. నకుల సహదేవులు

మాద్రీదేవి సకలలోక కల్యాణకారులైన అశ్వినీదేవతల నారాధించి నకుల సహదేవులను కవలబిడ్డలను కనెను. వ్యాసమహర్షి ధర్మపాశబద్ధులైన పాండవులను, అధర్మనిరతులైన దుర్యోధనాదులను ప్రతియోగముగ చిత్రించెను. సమర్థులు, సత్పురుషులైన అన్నల ననుస

రించి నకులసహదేవులు జీవిత చారితార్థ్యమును పొందిరి. నకుల సహదేవులు సవతిబిడ్డలైనను, కుంతీదేవి వారిని కన్నబిడ్డలకంటె మిన్నగా ప్రేమించి మించినది. భీమార్జున నకుల సహదేవులు ధర్మరాజును నీడ వలె అనుసరించిరి. పాండవులలో వినుత పరాక్రమము, సత్యనిష్ఠ, యశోభిలాష, కృతజ్ఞత, ధర్మాభిముఖ్యము, శరణాగతత్రాణ పరాయణత్వము అను గుణములు సమానములు. మానవు లెల్లరకు ధర్మమే అవలంబింపదగినదని సూచితము.

"ఇంటగెలిచి, రచ్చ గెలువుము" అనునది తెలుగుదేశపు నానుడి. ధర్మరాజునకు తమ్ములు ఎట్లు వశీకృతులో అట్లే ధర్మము, ధృతి, సత్యము, కారుణ్యము, వశీకృతము అయియున్నవి. ఆ మహామహితాత్మునకు నింక అసాధ్యమైన కార్యమేమి ?

"తమ్ములయట్టుల తనకు వ
శమ్మయి ధర్మువును ధృతియు సత్యము గారు
ణ్యమ్మును నొప్పగ బేర్మి ని
జమ్ముగ మను ధర్మజున కసాధ్యము గలదే."

(ఆది - అష్టమ - 48)

విజయశ్రీ కరగ్రహణము చేయగోరు అన్నదమ్ము లందరకు పాండవుల అన్యోన్యానుబంధము అనుసరణీయము.

నకుల సహదేవులలో సహదేవునకు చురుకైన మాటకారితనము నిసర్గమై యున్నది. ఇతడు భూరిబుద్ధి విస్ఫారత కలవాడు. పాదరసము వంటి బుద్ధిసూక్ష్మత కలవాడు. మాటమీద అంత వేడిగను, వాడిగను అతని నోట వెలువడును. రాజసూయయాగసందర్భమున మూర్ఖుడగు శిశుపాలుడు శ్రీకృష్ణుడు అర్ఘ్యప్రదానమునకు ఎంతమాత్రము

అర్హుడుకాడని, ధర్మజుని ఉపాలంభించెను. పరిస్థితి చేయుదాటు సంకట స్థితి దాపురించెను. శీఘ్రముగ సహదేవుడులేచి శ్రీకృష్ణుడే సర్వవిధ ముల పూజార్హుడని పూర్వపక్షములేని సిద్ధాంతమునుచేసి, "ఎవరు దీనిని వ్యతిరేకింతురో ఆ దుర్జనుల శిరముపై నా పాదము పెట్టెద"నని ధర్మవీరుడై పలికెను.

"ఎడపక యర్ఘ్య మచ్యుతున కిచ్చితి మిచ్చిన దీనికిం దొడం
బడ మని దుర్జనత్వమున బల్కెడు వీరుల మస్తకంబుపై
నిడియెద నంచు దా జరణ మెత్తె సభన్ సహదేవు డట్టిచో
నుడిగి సభాసదుల్ వలుక కుండిరి తద్దయు భీతచిత్తులై."
(సభా - ద్వితీయ - 30)

సహదేవుని మేఘగంభీరమైనవాక్కు శిశుపాలునివంటి మూర్ఖులను నోరెత్తకుండ చేయుటకు తోడ్పడినది. ఇది అతని వాగ్విశారదత్వమును సూచించుచున్నది. నకులసహదేవులు దిగ్విజయ యాత్రలు చేసి, అన్నచే రాజసూయయాగము చేయించి, సకలరాజన్య పూజితులై విరాజిల్లిరి.

శ్రీకృష్ణుడు రాయబారము చేయుటకుముందు పాండవులలో ప్రతివ్యక్తిని ఆహ్వానించి, వారివారి అభిప్రాయములను తెలిసికొనెను. నకులుడు అన్నయైన ధర్మజుని యభిప్రాయమును సమ్మతించెను. ఏ విధముగానైన సంధిచేసి పాండవ కౌరవ వంశములకు శ్రేయము ఒనగూర్పుమని నకులుడు పలికెను. చెడ్డ కౌరవులకడ నుండినచో తాము కూడ క్రౌర్యము వహింపనవసరములేదని నకులుడు చతురముగ పలికెను.

"కడవగ నొకళ్ళు పసరము
నడచిన, నొక్కళులు బెయ్య నడువ వలయునే?

చెడుతెరు వా కౌరవ్యుల
కడ నిలుచుంగాక, మనకు గ్రౌర్యం బేలా ?
(ఉద్యోగ - తృతీయ - 91)

ఒకడు పశువును కొట్టినాడని మఱియొకడు దూడను కొట్టుట యెట్లు అధర్మమో కౌరవులు అధర్మముచేసినను మనము అధర్మము చేయుట తగదని నకులుడు మృదుమధురముగా పలికెను.

సహదేవునకు సూటిగా మాటాడుట పరిపాటి. క్షత్రియోచిత ముగా రాజ్యభాగము సమరమువలననే తెచ్చుకొన నగునని కుండ బ్రద్దలుకొట్టినట్లు చెప్పెను. అతడు దుర్యోధనుని స్వభావమునూచము ట్టుగా పసిగట్టి, తీయనిమాటలకు రాజ్యభాగ మెంతమాత్రము దుర్యో ధనుడు ఈయజాలడనియు, రాజ్యభాగము ఇమ్మని దేవురించుట క్షత్రియులైన తమకు ఎంతమాత్రము తగదని హెచ్చరించెను. సహ దేవుడు తారాజువ్వవలె లేచి దుర్మార్గులైన దుర్యోధనాదులను మార్గ మునకు తెచ్చుటకు దండనముతప్ప అన్యోపాయము లేదని చెప్పెను.

"తుది రాజ్యమ్మునగమ్మునగా - మ్మడవియందుం
బేరు వంచించియుం
బదుమూడేడులు నీవునుం దిరిగి రా పాలీక పోవచ్చునే!
యది గాదే దెగి బంటవై యుఱుము ;
మాయల్ వన్ను నేర్పింక జె
ల్లదు సూనీ కని యాసుయోధనుని యుల్లం బుచ్చిపో
నాడుమీ."
(ఉద్యోగ - తృతీయ - 97)

నకుల సహదేవులలో మానవసహజమైన బలహీనతలు కలవు. అవియే వారి పతనమునకు కారణ మయ్యెను. నకులునకు సౌందర్య

గర్వము, సహదేవునకు తానే ప్రాజ్ఞుడనను గర్వము కలదు. ఏ గర్వమైనను ప్రజలకు తగదని నిరూపితము. పతనమునకు ముందు గర్వముండును. నకుల సహదేవులు ధర్మరాజుయొక్క తమ్ములై ధర్మపథానుసరణశీలురై సద్గతి పొందిరి. మానవులు ధర్మమును ఆలంబనముగా నిడికొన్నచో అదియే వారిని రక్షించును. "ధర్మో రక్షతి రక్షితః"

## 14. దుర్యోధనుడు

వ్యాసమహర్షి దుర్యోధనపాత్రను ధీరోద్ధత నాయకునిగ చిత్రించెను. రాజరాజు అసూయ, క్రోధము, మాత్సర్యము, గర్వము, శత్రు ప్రతీకారకాంక్ష, ఆత్మాభిమానము మూర్తీభవించిన కలి యొక్క అంశము. అతనిలో అచంచలమైన ఆత్మవిశ్వాసము, మిత్రవాత్సల్యము, జననీ జనకభక్తి, భ్రాతృవాత్సల్యము, రాజకార్య సంబంధముకల వ్యక్తులను వశీకృతము చేసికొనుట, స్పర్థ, గుప్తమంత్రాంగము, భూభరణ సమర్థత, జనరంజకత్వము అను సులక్షణములు కలవు. ఈ లక్షణములన్నియు సత్ఫలితము నిచ్చినవా ? సమాజమునకు హాని కలిగించినవా ? అనుదానిని బట్టి ఒకవ్యక్తి సజ్జనుడని, దుర్జనుడని నిర్ణయింప నగును. వ్యాసమహర్షి దుర్యోధనుడు మన్యుమయవృక్షమని తెలిపియున్నాడు. లోక క్షయకరమగు భారతయుద్ధమునకు ప్రధాన కారణము దుర్యోధనుడే. అతడు కలి అంశమునపుట్టి భూభారమును మహాభారతయుద్ధరూపమున తొలగించెను. వ్యాసమహర్షి దుష్టత్వము యొక్క పరాకాష్ఠను దుర్యోధనునిలో నిరూపించెను. 'దుర్యోధనుని వలె సంచరింపకుము' అనునదే లోకమునకు ప్రబోధము. దుర్యోధనుడు ఉద్భవించినపుడు నక్కల అఱపులు రాసభాక్రోశములు, భూకంపములు మొదలైన అరిష్టనిమిత్తములు సూచింపబడినవి.

దుర్యోధనుడనగా ప్రబలమైన మాత్సర్యము, క్రోధము, గర్వము, అసూయ పెనవేసికొన్న మూర్తి. ఈలక్షణములన్నియుకూడిన పునాదిపై దుర్యోధనుని జీవితసౌధము నిర్మింపబడినది. కురుపాండు కుమారులు బాలక్రీడలు పచరించుచుండగా ఆ ఆటలలో అందరికంటె భీముడు బలముతోను, క్రీడాకౌశలములోను మిన్నయై ప్రకాశించెను. కొన్ని సందర్భములలో దుశ్శాసనాదులు బాధింపబడిరి. ఈచిన్న కారణము పురస్కరించుకొని బాలదుర్యోధనుడు శకుని దుశ్శాసనాదులతో ఇట్లు మంతనము చేసెను. "మదోద్ధతుడైన మధ్యముని మాయోపాయమున చంపి, ధర్మజుని బంధించి అపాండవమైన సముద్ర పరివేష్టితమైన ఈ భూమిని అత్యధికకీర్తితో ఏలెదను." ఈ పాపబుద్ధియందు కృతనిశ్చయుడై దుర్యోధనుడు భీమునకు అపాయముచేయ సమకట్టెను. దీనినిబట్టి దుర్యోధనుని హృదయములో బాల్యమునుండియు పాండవులయందు అసూయ, మాత్సర్యము, భీమునిపై పగపెంచుకొని భీముని చంపించుటకు ఎన్నియో అడ్డుదారులు త్రొక్కెను. కాని పరమేశ్వరానుగ్రహము కలిగినపాండవులకు దుర్యోధనుడుచేసిన అపకారములన్నియు మహోపకారములుగ పరిణమించెను. "దుర్యోధనుడు భీమునకుచేసిన యెగ్గులెల్లను గృతఘ్నునకుచేసిన లగ్గులునుంబోలె నిష్ఫలంబులైనవి."

(ఆది - పంచమ - 180)

కుమారాస్త్ర విద్యాప్రదర్శన సందర్భమున అర్జునుడు ద్రోణాచార్యుని అనుమతిపొంది అస్త్రవిద్యాకౌశలము ప్రకటించెను. అర్జునుని ధనుర్విద్యాకౌశలము సకలవీరులను ఆశ్చర్యచకితులొనరించినది. దుర్యోధనునకు అర్జునునిజయించు ప్రతివీరుడు లేడా ? అనునది చిక్కు ప్రశ్న అయినది.

ఇంతలో కర్ణుడు ప్రవేశించి సకలజనాశ్చర్యకరముగ భుజాస్ఫాలనము చేసి అర్జునుడు ప్రకటించిన అస్త్రశస్త్ర విద్యలన్నియు అశ్రమముగ ప్రదర్శించి అందరికన్నులకు మిరుమిట్లుగొలిపెను. అది చూచి దుర్యోధనుడు దీర్ఘనిశ్వాసమువిడచి కర్ణుని ఒక్కసారి ఆలింగనము చేసికొని ఇట్లనెను :

"నాతో బద్ధసఖ్యుడవై, నాకును బాంధవులకు హితంబుచేసి నా రాజ్యభోగంబులను నీవు నుపయోగింపుము. (ఆది - షష్ఠ - 35)

కర్ణార్జునుల ద్వంద్వయుద్ధ సమయమున దుర్యోధనాదులు కర్ణుని పక్షము నవలంబించి ఉత్సాహవాక్యములను పలుకుచుండిరి. అంతలో కృపాచార్యుడు లేచి ఈ అర్జునుడు కుంతి పాండురాజుల నందనుడు. కర్ణుని కులమును, తల్లిదండ్రులను చెప్పి అర్హుడవైనచో అర్జునునితో యుద్ధముచేయవచ్చునని ప్రశ్నించెను. ఆ ప్రశ్నకు ప్రత్యుత్తరము చెప్పలేక కర్ణుడు తలవంచుకొనెను. దుర్యోధనుడు వెంటనే అతని పక్షము వహించి అంగరాజ్య మిచ్చి పట్టాభిషేకముచేసి క్షత్రియగౌరవమును ఒసంగెను. కర్ణుడు ఆనాటినుండి దుర్యోధనుని బహిఃప్రాణముగ, అంతరంగిక మిత్రుడుగ తన జీవితాంతము మెలగెను. ఈ కర్ణదుర్యోధనుల మైత్రి శ్రీకృష్ణార్జునుల మైత్రివంటిది కాదు. దీనికి మాత్సర్యము పునాది. దుర్యోధనునకు అర్జునుడనిన మిగుల భయము. కర్ణుడు మిత్రుడగుటచే ఆ భయము తొలగినది. దానికి నిదర్శనము అతని మాటలనే ఉదహరింపనగును.

"వినుత ధనుర్విద్యావిదు
ఘను గర్ణు సహాయు బడసి కౌరవవిభు డ
ర్జునువలని భయము సెడి యు
మ్మనజే యినిడి నిద్రవోయెముదితాత్ముండై" (ఆది-షష్ఠ-63)

ఆంగ్లములో ఒక సూక్తి కలదు. 'Fear is the root cause of all evil.

ఆ భయముతోడనే దుర్యోధనుడు పాండవులను సంహరించు టకు అనేకవిధముల ప్రయత్నించెను. దుర్యోధనకర్ణుల మైత్రి ద్రోహ చింతకలిగి లోకమునకు అనర్థము కలిగించెను.

దుర్యోధనుడు బాల్యమునుండియు రాజ్యమును తనచేత చిక్కిం చుకొనుటకు ఎన్ని యోకుట్రలు పన్నెను. అతడు తండ్రితో ఇట్లను చున్నాడు :

"నాయనా ! మనకమంగళము నాపాదించు వాక్యములెన్ని యో నేను పౌరులనుండి వింటిని. వారునిన్ను ధిక్కరింపబూనుకొన్నారు. భీష్మునిగూడ దూలనాడజొచ్చిరి. పాండురాజునే సింహాసనముపై నుంచదలచినారు. ఇక భీష్ముడందమా ? అతడు దన ప్రతిజ్ఞ నెన్నటికిని వదలడు కనుక నతడు రాజ్యమును ముట్టడు. ఇక దుఃఖము గలుగబోవున దెవ్వరికి ? మాకుమాత్రమే ! పాండురాజు సర్వవిధముల సమర్థుడు. నీవు హీనాంగుడవు. అందుచే రాజ్యమతనికి సంక్రమించి తీరును. అతని పిదప యుధిష్ఠిరుడు రాజగును. అతని యనంతర మతనిసంతానము. మఱి మాగతి ? నీ సుతుడైన దుర్యోధనునకు రాజ్యము లేదు. వాని వంశమునకు లేదు. నీకు వాటిల్లినయాపద నీతో మాత్రమే పోలేదు. మా సంతానముల కందఱకును ననువర్తించును. మేము లోకులదృష్టిలో నిరంతరము నీచులమై బ్రతుకవలసినదే ! ఇతరుల దయపై నాధార పడిన బ్రతుకు, మరణానంతరము హీనలోకములు, ఇవేమాకు ప్రాప్య ములు. నీసంతానమున కిట్టిస్థితిబట్టకుండ నీవు జాగ్రత్తవహింపవల యును. ఎట్లైనను నీకు రాజ్యముదక్కినచో మాకును దక్కును."

ఇది దుర్యోధనుని కపటమైన విచారధార. ఇట్లు దుర్యోధనుడు పాండ వుల పరాక్రమము, శీలసంపదచూచి కన్నుకుట్టి బాధపడుచుండగా ధృతరాష్ట్రుడు ధర్మరాజునకు యౌవరాజ్య పట్టాభిషేకముచేయుట అతనికి మరింత బాధకలిగించినది.

బాలుడైన దుర్యోధనుడు వయస్సునకుమించిన దురాలోచనలు మనస్సులో నిండ నింపుకొనుటచే పతనము చేతులార తెచ్చికొనెను. అంతటితో ఆగక రహస్యముగా అతడు పురోచనునిచే వారణావతమున లక్క ఇల్లు నిర్మింపచేసి అందు పాండవులు నిద్రించియున్నపుడు నిప్పంటించి పాండవుల మరణవార్త తనకు హృదయప్రమోదముగ తెలుపుమని అడిగెను. ఇంతకంటె కూటనీతి, దుర్మార్గము ఏమున్నది ? పురోచనుడు ఈపథకము సఫలము చేసినచో దుర్యోధనుని రాజ్యభోగము లన్నియు అతనికే దక్కునని ప్రలోభము పెట్టెను. ఏవ్యక్తిలో ఏబల హీనత ఉన్నదో దానిని చక్కగపసికట్టి స్వకార్యానుగుణముగ ఉపయోగించుకొను నేర్పు అతనిలో పుష్కలముగా నున్నది.

"ఈ కార్యసిద్ధి యగుడును
నీకతమున నఖిలదారుణీరాజ్యము నా
కేకాధిష్ఠిత మగు నిది
నీకును నిత్యోపభోగనిలయము కాదే."

(ఆది - షష్ఠ - 141)

దుర్యోధను డనగా అసూయామూర్తి. అసూయ అనగా గుణమునందు దోషము చూచుట. "ఈర్ష్య - ఈర్ష్యతీతి ఈర్ష్యా - ఓర్వలేకుండుట - పరుల సంపదను చూచి సహింపలేకుండుట."

"గుణేషు సత్స్వపి పరేషు దోషారోపః గుణేష్వపి" - మంచి గుణములు కలిగియున్నను చెడుగుణములను ఆరోపించుట.

(అమరము - ప్ర - కాం - 156 పేజి)

ఈలక్షణములన్నియు దుర్యోధనునిలో పుష్కలముగా నున్నవి. మయసభలో పాండవుల సభాలక్ష్మిసిచూచి అతని హృదయము భగ్గున మండిపోయినది. కందుతోకూడిన బంగారమువలె, అతని

మనస్సు మనస్తాపముతో నిండిపోయినది. అతడే తన మనస్తాపమును మేనమామ అయిన శకునితో చెప్పుచూ ఇట్లనెను :

"అతులపరాక్రమార్జితను లైనధనంబుల పేర్మిజేసి యు
న్నత మగుచున్న పాండునరనాథతనూజులలక్ష్మి నా కస
మ్మత మయి సూ వెలింగె విను మాతుల ! మానధనాఢ్యు
డైన భూ
పతి సహియింపనోపునె సపత్నుల వృద్ధియు నాత్మహానియున్."

"ఏమి సేయుదము పాండవులలక్ష్మి యెవ్విధంబున మన కపహ
రించి కొనవగునని దుర్యోధనునకు శకుని యిట్లనియె."

(సభా - ద్వితీయ - 98 - 99)

ధృతరాష్ట్రుడు కౌటిల్యముతో పాండవులను ఖాండవప్రస్థమునకు పంపి అర్ధరాజ్యమును తనకొడుకులకు కట్టబెట్టెను. అయినను దుర్యోధనుడు తృప్తి పడలేదు. తక్కినదానిని కూడ తనదిగా చేసికొనుటయే ఆతని ధ్యేయము. అందుచే ఈ మాయ జూదమను నెపముతో పాండవుల రాజ్యలక్ష్మిని అపహరించుటయే అతని పరమాశయము. తండ్రియైన ధృతరాష్ట్రునకు తనపై అధికమైన ప్రేమకలదని దుర్యోధనునకు తెలియును. దానిని అడ్డముగాచేసికొని దుర్యోధనుడు శకునితో కలసి తండ్రిదగ్గరకుపోయి ఈ మాయ జూదమునకు అంగీకరింపుమనియు లేనియెడల అగ్నిలోపడి ప్రాణత్యాగము చేయగలననియు జంకించెను. ఇది యాతని మొండి పట్టుదల.

శ్రీకృష్ణుడు దుర్యోధనుడు రోషమయమూర్తియని వ్యాఖ్యానించెను. ఇది దుర్యోధనునిపట్ల అన్వర్థము. క్రోధమే వానినిపట్టి ఆడించినది. ఆ కోపము 'త్రాచుపాము పగవంటిది'. తన స్వభావానుగుణముగ అత డురగకేతనమును స్వీకరించెను. ఆ క్రోధమునకు వశుడై

అతడు ఎన్ని ఘోరములు, అత్యాచారములు చేసెనో లెక్కలేదు. మయుడు నిర్మించిన నిర్మలస్ఫటిక శిలానిర్మితంబై శశిప్రకాశంబై వివిధ రత్నప్రభాభాసురంబైన సభలో దుర్యోధనుడు ప్రవేశించెను. అందు తారాడుచు అతడుపడిన తికమకలు "హా నీలబద్ధ స్నిగ్ధమణి స్థలంబు నందు జలబుద్ధింజేసి పరిధానోత్కర్షణంబు చేసి విమలశిలాతలబుద్ధి నుదక పరిపూర్ణంబయిన వాపిజొచ్చి కట్టినపుట్టంబు దడియం దెళ్లిన నన్నుంజూచి వృకోదరుండు నగియె దానినంతయు నెఱింగి ధర్మరాజ చోదితులయిన కింకరులు నాకుం బరిధానంబులు దెచ్చియిచ్చిరి. మఱియు వివృతద్వారంబు గవాటఘటితం బని చొరనొల్లక కవాట ఘటితంబు వివృతంబుగా వగచి చొరంబోయి తత్కవాట స్ఫటికశిలా ఘట్టిత లలాటుండనైన నన్నుంజూచి యనేక సహస్రవిలాసినీపరివృత మయి యున్న ద్రౌపది నగియె నంత నకులసహదేవులు పఱతెంచి యిదె వాకిలి యిటవచ్చునది యని నన్నుం దోడ్కొనిపోయి రట్టి సభాప్రలం భంబు నాకు హృదయశల్యంబయి యున్నది."

(సభా - ద్వితీయ - 140)

మయసభలో నున్నవారందరు దుర్యోధనునివంటి ఆభిజాత్య సంపన్నులే. దుర్యోధనుడు పొందిన తబ్బిబ్బులను చూచిన ఎవ్వారికైనను నవ్వువచ్చును. పాండవులతో ద్రౌపదియు నవ్వినది. ఆనవ్వులో దురుద్దేశము లేదు. నవ్వినంతమాత్రముచే దుర్యోధనుడు పగబట్టిన కోడెత్రాచుపామువలె సంచరించెను. ఈ నవ్వు ఒక్కటియే కారణము కాదు. బాల్యప్రభృతి దుర్యోధనుని హృదయములో పాండవులపై అసూయావృక్షము ఊడలు వేయసాగినది. ఈ రాజసూయయాగసన్ని వేశముతో దుర్యోధనుని అసూయాగ్ని మరింత ప్రజ్వలించినది. విదురుడు పాండవపక్షపాతియని గ్రహించి అతనిని ద్రౌపదిని తీసికొనివచ్చి

తన దాసీలతో కలిపి ఇళ్లను ఊడ్వమని ఆజ్ఞాపించెను. కురుకులాపశదు దుశ్శాసనుని పిలిచి మహాపతివ్రతయైన ద్రౌపదిని ఈడ్చికొని సభకు తెమ్మని గద్దించెను. పాండవధర్మపత్ని పతివ్రత, రజస్వల, ఏకవస్త్ర, రాజసూయావభృథస్నానముచే పవిత్రీకృతమైన శిరోజములపట్టి ద్రౌపదిని తిట్టుచు సభకు ఈడ్చి తెచ్చెను. దీనిని సుయోధనుడు ఎంతయో ఉత్సాహముతో చూచుచుండెను. దీనితో అతనికి పాండవులు చేసిన అవమానమునకు ప్రతికారమైనది. అతనిదృష్టిలో ద్రౌపది బంధకి. ఆమె తన భోగదాసికంటెను తక్కువ. దుష్టదుర్యోధనుడు మహాసభలో తాను రాజపుత్రుడను సభ్యత, సంస్కారము, ధర్మము, ఏమాత్రము ఆలోచింపక ద్రౌపదిని తనతొడపై కూర్చుండుమని సన్న చేసెను.

అంతటితో తృప్తి పొందక దుశ్శాసనుని పిలిచి పాండవులయు ద్రౌపదియొక్క వస్త్రములను అపహరింపుమని గద్దించెను. మిగిలిన ఘట్టములను వదలివేసినను దుర్యోధనుని దుష్టత్వము ఈ సన్నివేశములో పరాకాష్ఠ పొందినది. అందుచేతనే దుర్యోధనుడు దుష్టచతుష్టయములో ప్రథమస్థానము పొందినాడు. ఇంతకంటె మానవుని అనాగరికతకు పరాకాష్ఠ ఏమి? స్త్రీకి మానము ప్రధానాలంకారము. అట్టి మహాపతివ్రతకు తీరని అపచారము చేసియున్నాడు. దీనికి దుర్యోధనుని క్రోధమే ముఖ్యకారణము. ఇదియెంత భయంకరమైనదో నీచాతినీచమైనదో తెలియుచున్నది. ఆ చేష్ట పశువులకు సహితము లజ్జగొలుపునదియైయున్నది. ఈ సందర్భమును పురస్కరించుకొని సరస్వతీపుత్ర శ్రీపుట్టపర్తి నారాయణాచార్యులవారు దుర్యోధనుని నీచత్వము ఖండించియున్నారు. "వస్త్రాపహరణ సన్నివేశమున దుర్యోధనుని మానవత్వ మెప్పుడో మంటగలిసినది. వాని యప్పటి ప్రవర్తనము

పశువులకు లజ్జగొలుపునట్టిది. సామాన్యు డొనర్చునట్టి యపరాధమునే రాజు చేసినప్పుడు సామాన్యునికంటెను వేయి రెట్లధికముగ రాజునకు శిక్ష విధింపవలెను. ఇది ధర్మశాస్త్రకారు లొనర్చిన నియమము. దుర్యోధనుడు ద్రౌపదియెడ నొనర్చిన యపరాధము మహాఘోరమైనది. సామాన్యపౌరు డీయపరాధము నొనర్చినను వానికి విధింపవలసిన శిక్ష మరణదండనమే! అంతకు తక్కువ శిక్షలేదు. మఱి దుర్యోధనున కెట్టి శిక్ష వేయవలెను?" (మహాభారతవిమర్శనము - 178 - 179)

సీతామహాపతివ్రతకు అపరాధముచేసి రావణాసురుడు సమూలముగ నశించెను. దుర్యోధనుడు ద్రౌపదీమాతకు ఘోరాపరాధముచేసి నశించెను. భట్టనారాయణుడనుమహాకవి సంస్కృతములో వేణీసంహార నాటకము రచించి అందు దుర్యోధనుడుచేసిన ద్రౌపదీపరాభవమే కౌరవనాశమునకు అరణి అయినదని ఒక శ్లోకము రచించెను.

"య త్సత్యవ్రతభంగభీరుమనసా యత్నేన మందీకృతం
య ద్విస్మర్తు మపీహితం శమవతా శాన్తిం కుల స్యేచ్ఛతా!
తద్ద్యూతారణిసంభృతం నృపసుతాకేశాంబరాకర్షణైః
క్రోధజ్యోతి రిదం మహ త్కురువనే యౌధిష్ఠిరం జృంభతే!"
(వేణీసంహారము - ప్ర - అం - శ్లో - 24)

ద్యూతమనెడి యరణినుండి ద్రౌపదీకేశాకర్షణ, వస్త్రాకర్షణములను మథనములచే నుద్భవించి, యుధిష్ఠిరుని సత్యవ్రతభంగభీతిచే యత్నముతో నాపబడి, శాంతుడై కురువంశశాంతికాముడై యున్న యుధిష్ఠిరునిచే విస్మరణావస్థకుగూడ తీసికొనిరాబడిన యౌధిష్ఠిరమహాక్రోధాగ్ని కౌరవారణ్యమును కాల్చివేసినది.

దుర్యోధనుడు మాత్సర్యముతో ఘోషయాత్రనెపమున పాండవులను పరిహసించుటకు ద్వైతవనమునకు వెడలెను. అచట పాండవు

లను జయింపలేదు సరికదా గంధర్వులచే ఓడింపబడి భార్యామాత్య పుత్రసహితముగ బంధింపబడెను. అపుడు పరమకరుణామూర్తి యగు ధర్మరాజు తన తమ్ములను పంపి దుర్యోధనుని బంధమోక్షముచేయించి ఇంటికి పంపెను. దీనివలన 'చెరపకురా చెడేవు' అనునది దుర్యోధనునకు వర్తించినది. దానితో దుర్యోధనునికి అవమానముకలిగి, ప్రాణత్యాగముచేయుటకు నిశ్చయించెను. అవమానముమాత్రమే కాదు అతనిలో నిరాశా నిస్పృహాలు ముప్పిరిగొన్నవి. ఇంతవరకు కర్ణుడు అర్జునుని జయింపగలడని కొండంత ఆశతో నున్నాడు. నేడు ఆ కర్ణుడు చిత్రరథునిచే ఓడింపబడి దుర్యోధనుని విడిచిపెట్టి విరథుడై పలాయనము చిత్తగించెను. దీనితో అతనికి మరింత నైరాశ్యముపెరిగి ప్రాయోపవేశము చేయుటకు నిశ్చయించెను. దుర్యోధనుని ఆత్మాభిమానము ఎటులు దెబ్బతిన్నదో అతనిమాటలవలన తెలియుచున్నది.

"నేను స్త్రీలసమక్షములో బంధింపబడి దీనుడనై శత్రుహస్తగతుడనై యుధిష్ఠిరుని వద్దకు తీసికొనిపోబడితిని. ఇంతకంటె దుఃఖమేమున్నది ? ఏపాండవులు నాచే రాజ్యభ్రష్టులై నిరాకరింపబడినారో, ఏ పాండవులకు నేను నిత్య శత్రువునో ఆ పాండవులచేతనే నాకు ప్రాణదానము చేయబడినది. నేను ప్రాయోపవేశంబున ప్రాణపరిత్యాగము చేసెద. మీరందరు దుశ్శాసనుం బురస్కరించుకొని పురంబున కరుగునది. మిత్రులకు ప్రమోదంబును శత్రువులకు నిర్వేదంబును చేయుచు మనునట్టి యేను బోడిమిసెడి పగతురచే శిరస్తాడనంబు చేయంబడి సిగ్గుపడక బంధుజనంబులలోనికి ఏమని యరుగుదు. అంబికేయుంగని యేమని పలుకుదు ? కురువృద్ధులైన భీష్మ బాహ్లీక ఆచార్యులగు కృపద్రోణుల సమ్ముఖంబున ఎట్లు నిలుతు" నని ప్రాయోపవేశంబునకు పూనుకొనెను.

"ఒవ్వనివారల యెదురన
యివ్విధమున భంగపడితి ; నేనింక జనుల్
నవ్వగ నేటిబ్రదుకుగా
నివ్వసుమతి యేలువాడ ? నెట్లు చరింతున్ ?"

(అరణ్య - షష్ఠ - 16)

అపకారులందు ఉపకారబుద్ధికలవారు పాండవులు. దుర్యోధనుడు ఉపకారులందు అపకారబుద్ధి కలవాడు. ధర్మజుని మహోపకారమును దుర్యోధనుడు మహాపకారముగాభావించుట అశక్త దుర్జనత్వము. ఉపకారమును అపకారముగాభావించుట దుర్జన లక్షణమే. పాండవులుచేసిన ఉపకారము దుర్యోధనునిపట్ల వైరోద్దీపకమగుట దుర్జనలక్షణము. దుర్బుద్ధిచేసిన స్వయంకృతాపరాధ దోషఫలము వెంటనే అనుభవించును. అందుచే మానవుడు ఇతరులకు అపకారముచేయక ఉపకారము చేయుటయందే సిద్ధకలిగి యుండవలెనని తాత్పర్యము.

అభిమానధనుడైన దుర్యోధనుడు శత్రువులతోపోరాడి మరణింపవలెను కాని శత్రువులకు లొంగిపోకూడదని నిశ్చయించెను. అతడు పాండవులకు భయపడినట్లు ఏ కోణమున కనిపింపడు. తలవంచుట అన్నది అతని స్వభావములో లేదు. రావణాసురుడు, దుర్యోధనుడు ఒక కోవలోనివాడు. ఇన్ని అవగుణములున్నను దుర్యోధనునిలో మెచ్చుకొనదగిన గుణములు లేకపోలేదు. నిర్భీకత, పట్టుదల, ఆత్మ విశ్వాసము, ఇతరులను తనకార్యమునకు అనుగుణముగ త్రిప్పుకొను నేర్పు కలవు. శ్రీకృష్ణుడు రాయబారమునకు ఏతెంచగా దుర్యోధనుడు తన సహజధోరణిలో ఇట్లనెను. "కృష్ణా! సంగ్రామరంగమున మేము మరణించినను నాకు బాధలేదు. క్షత్రియులకది ధర్మమే. ధీరుడైన క్షత్రియుడెన్నడును శత్రువులకు లొంగరాదు. వాడు మరణించినను వీరమరణము పొందవలెను. ఉదాత్తముగా బ్రతుకుటయే మానవ

వుని పౌరుషము. వాడు మహావృక్షస్కంధము వంటివాడు. కష్టములకు తునిగిపోవచ్చునేగాని వంగిపోవుట మాత్రము కల్ల. నాతండ్రి భీతుడై పాండవుల అర్ధరాజ్యమును తెలియక పంచియిచ్చెను. కాని మ కక్కన నావి కలుగువరకు దానిని వారికీయను. ధృతరాష్ట్రుడు బ్రతికియున్నంత వరకు రాజ్యవిభాగముయొక్క ప్రశ్నయే లేదు. సర్వభూమండలమునకు ధృతరాష్ట్రుడే చక్రవర్తి. మా నాయనకు తెలియక అర్ధరాజ్యము ఇచ్చినాడు. నేనపుడు బాలుడను. ఇపుడు రాజ్యమునకు వారసత్వ ములో పెద్దవాడనైతిని. సూదిమొనమోపినంత భూమి కూడ పాండ వులకు ఒసంగును.

"ఏమును వారు బంచికొని యేలుట గల్గదు పల్కు కుండు మిం
కేమియు వాడిసూదిమొన యించుక మోపినయంతమాత్రయున్
భూమి యొసర్చి పాండునృపపుత్రుల కిత్తునె యెవ్వరైన సం
గ్రామమునన్ జయంబుగొని రాజ్యము సేయుట నిశ్చయించితిన్"
(ఉద్యోగ - తృతీయ - 363)

ఇది అతని పట్టుదల. కుతర్కము, లోభకాంక్ష ఇవి అన్నియు కలసి అతనిని పతనోన్ముఖునిచేసినవి. ఈ పట్టుదల సత్కార్యమునకు వినియోగించినచో ఎంతయో బాగుండెడిది. దుర్యోధనుని మొండిపట్టు దల లోభము సమాజనాశమునకు దారితీసి తుదకు కౌరవవంశనాశము నకు దోహదము చేసినవి. అందుచే దుర్యోధనుని పట్టుదల యెంతగొప్ప దైనను నింద్యమైనదే.

దుర్యోధనుడు పాండవులపై స్పర్థతో కొన్ని మంచిపనులు చేసి నాడు. ధర్మరాజు రాజసూయయాగము చేసెనని తాను కూడ పేరు దెచ్చుకొనుటకై విష్ణుయాగము చేసెను. ఈ వితరణమునకు కారణము స్పర్థయే. దుర్యోధనుడు దుర్వాసమహామునికి ఆతిథ్యముఒసగి అతని కెం తయో ముదము కలిగించెను. అతడు దూర్వాసమునీశ్వరుని పదివేల

మంది శిష్యులతో పాండవులకడకు వెడలి వారిఆతిథ్యమును స్వీకరింపు మని కోరెను. దీనియొక్క ముఖ్యప్రయోజనము దుర్వాసకోపాగ్నికి పాండవులను ఇంధనముగా చేయుటయే.

దుర్యోధనుడు శత్రువులయెడ ఇంతమాత్సర్యము వహించినను ప్రజలయెడమాత్రము అపారమైన ఆదరము ప్రకటించెను. ఆ ఆదరము కూడ ప్రయోజనాపేక్షతో కూడినది. ధర్మశీలమైనదికాదు. పాండవుల కన్నను తానుమిన్నయని జనులు తలంచుటకొరకే ఇట్లు ప్రవర్తించెను. పాండవులపై నున్న మాత్సర్యముతో అతని సద్గుణములు దూషిత మైనవి.

> "తొల్లి పాండురాజు రాజై గుణంబులం బ్రజానురాగంబు వడయుటంజేసి యెల్లవారును ధర్మరాజురాజ్యంబ వలతురు దాని నెఱింగియ కాదె యేను నిత్యదానసమ్మానంబులం బ్రకృతిజనంబులకు సంతోషంబు సేయుచు నుండుదు."
>
> (ఆది - షష్ఠ - 129)

దుర్యోధనుని రాజనీతి చతురమైనది. అసామాన్యమైనది. పర పక్షములోనున్న వీరులను తనప్రక్కకు ఎట్లుత్రిప్పుకొనవలెనో అతనికి తెలిసినట్లు మరొకరికి తెలియదు. కర్ణుని తనమైత్రీబంధముతో కట్టి వేసెను. కర్ణుడు దుర్యోధనుని బహిఃప్రాణము. భీష్ముడు, సేనావిభా గముచేయు సందర్భములో కర్ణుని అర్ధరథునిగాచేసి తూలనాడెను. అందులకు కర్ణుడుకోపించి భీష్ముడు మరణించువరకు తాను ఆయుధము ముట్టనని ప్రతిజ్ఞ చేసెను. మరొకడైనచో ఇట్టి క్లిష్టసమయములో ధైర్యమును కోల్పోయిఉండెడివాడు. దుర్యోధనుడు అణుమాత్రము చలించలేదు. ఇది యెంతయో మెచ్చతగియున్నది. కౌరవవీరులలో ప్రతిక్షణము కలహశీలము ప్రత్యక్షమగుచుండును. శత్రువులపై తమ పరాక్రమము చూపుటమాని తమలోతామే దొమ్ములాడుకొని చచ్చె దరా ? యన్న సందేహము కలుగును. అట్టి క్లిష్టసమయములలో

దుర్యోధనుడు బుద్ధికుశలతతో మాటనేర్పుతో వారిని శాంతపరచి కర్తవ్యపరాయణులుగా చేయును. దుర్యోధనుడు కౌరవవీరుల హృదయము లందు విశిష్ట స్థానమలంకరించెను. దీనికి నిదర్శనము మహాభారత యుద్ధములో దుర్యోధనునిపై ఈగవాలకుండ తమప్రాణములను కురువీరులు తృణప్రాయముగా నెంచి పోరాడిరి. నకులసహదేవుల మేనమామ శల్యుడు. అతడు పాండవులకు యుద్ధములో సహాయము చేయవలెనని వచ్చుచుండెను. అది కనిపెట్టి దుర్యోధనుడు శల్యుడువచ్చు మార్గములో అతని సేనలకు పరివారమునకు సకలసౌఖ్యములనుఏర్పాటు చేసి తాను రహస్యముగ తెరచాటున నుండెను. అల్పసంతోషియగు శల్యుడు ఆ సేవకు మిగుల సంతోషించి ఎవరు ఈవిధముగా మాసేనలను మమ్ము గౌరవించిరో తెలుపుడు అనియు, వారికి కోరినవరము ఈయగలవాడనని చెప్పెను. అంత దుర్యోధనుడు ప్రవేశించి శల్యునితో చతురముగ ఇట్లు సంభాషించెను.

"సత్యసరస్వతి వగు; మహా
చిత్యవిశారదము నీదుచిత్తము, నియమా
దాత్త్యంబు మెఱయ నాకు న
మాత్యుడవై పూని నడుపు మత్సైన్యంబున్."
(ఉద్యోగ - ప్రథమ - 95)

ఈ దుర్యోధనుని రాజనీతి, ధైర్యము శ్రీకృష్ణునికూడ ఆశ్చర్యచకితుని ఒనరించినవి.

దుర్యోధనుడు మానధనాఢ్యుడు. తత్కారణముగ అతడు అంగబలమును, అర్థబలమును, నానాటికి పెంపొందించుకొని వానిపై అధికమైన విశ్వాసము పొందియుండెను. ధర్మబలము, దైవబలములమీద అతనికి చీమంత విశ్వాసము లేదు. దానికి అహంకారము అడ్డు వ

నది. దుర్యోధనుడు మహాభారతసంగ్రామములో శ్రీకృష్ణుని సాయ మర్థించుటకు ద్వారకానగరమునకు ఏతెంచెను. కౌరవాధినాథుడు తన స్వభావానుగుణముగ శ్రీకృష్ణుడు శయనించిన శయ్యా తలయంపి దిక్కున ఠీవిగా కూర్చుండెను. శ్రీకృష్ణుడు సైన్యవిభాగము చేయుచు పదివేవ్వుర గోపాలురను ఒకభాగముగను, తాను ఒకభాగముగను పంపకము చేసెను. బాలుడయ్యును, సార్థకనాముడైన విజయుడు శ్రీకృష్ణుని వరించెను. ఇది అర్జునుని శ్రీకృష్ణభక్తికి ప్రబల నిదర్శనము. దుర్యోధనుడు గోపాలురను తనపక్షముగ స్వీకరించి పాండవులను ఏనాడో జయించితినని విఱ్ఱవీగెను.

> "దాని కాత్మ బొంగి ధార్తరాష్ట్రుడు వారి
> నపహరించికొనినయట్ల కాగ
> దలచి, చెన్నుమీఱి బలముల గైకొని
> చనియె ప్రీతి రాముసదనమునకు."

(ఉద్యోగ - ప్రథమ - 77)

పైపెచ్చు శ్రీకృష్ణుడు పాండవపక్షములోనున్నను అతడు నిరాయుధుడై ఉన్నందులకు ఎంతయో దుర్యోధనుడు సంతసించెను. మానవబలము బలవత్తరమని నమ్మినవాడు దుర్యోధనుడు. పరిశీలింపగా దైవబలము, మానవబలముకంటె బలవత్తరము కదా!

దుర్యోధనుడు ధర్మాత్ములైన పాండవులను బలహీనులుగను, వారియొక్క క్షమాది సద్గుణములు దుర్గుణములుగను చేతకానితనముగను జమకట్టి వారిని పెక్కు ఇడుముల పాలుచేసినాడు. రాజ్యమదోన్మత్తుడై గురువులను వృద్ధులను ధర్మమును నిందించెను. అతడు కర్ణ శకునులచేతిలో కీలుబొమ్మయై చేయని అకార్యము లేదు. కూయని కారుకూత లేదు. దుర్యోధనుడు తండ్రిదగ్గర స్వపక్షకవీరులను మాటి

మాటికి అగ్గించుచు శత్రువులను తృణప్రాయముగ తిరస్కరించుచు మాటాడెను.

"గద నాతో సరి మూడులోకముల నే గానం జలంబెత్తి యు
న్మదు డాభీముడు నన్నని౦ దొడరిన, న్వ్రజ్రప్రహారంబు బె
ట్టిదమై తాకిన గూలుపర్వతముమాడ్కి౦ గుంభినిం గూల ౖవ్రే
సెద; నాకోర్కి గదా గదారణము - వచ్చెం బెద్దకాలంబునన్!
అతడు వడిన, వెండి యాసేన గోల్తల
సేయు నొకడు లేమి సిద్ధ; మింత
యెఱిగి వెఱచి కాదె యేనూళ్లు తైనను
దమకు జాలు ననియె ధర్మసుతుడు!"

(ఉద్యోగ - ద్వితీయ - 218 - 219)

పాండవులు తమ సమయానుసారము అరణ్య అజ్ఞాతవాసములు చేయుట దిక్కులేనితనముగా జమకట్టెను. "వారికి నాకుంబోలె మహాను భావంబు గలిగిన బదుమూడువత్సరంబు లబ్బంగి నిడుములం బడుదురె?"

(ఉద్యోగ - ద్వితీయ - 262)

ధర్మము, ఉభయవంశముల శ్రేయస్సును పురస్కరించుకొని విదుర భీష్మ ద్రోణ కృప సంజయాదులు అతడు విన్నను వినకపోయి నను పాండవులతో విగ్రహము పాడికాదనియు సంధిచేసికొని క్షీరో దక గతి కలసి మెలగుడనియు నూరిపోసిరి. ఆ మాటలను దుర్యో ధనుడు ఎంతమాత్రము మనస్సులో పట్టించుకొనక వారిని తృణీకరించుట వారిహృదయములకు తీరనివ్యథ కలిగించునట్లు పరుషముగ మాటాడిన ఘట్టములు కోకొల్లలు. పూజ్యపూజా వ్యతిక్రమము, ధర్మవ్యతిక్ర మము, వాక్పారుష్యము, ఆత్మస్తుతి, పరనింద అను దోషములే దుర్యో ధనుని పతనమునకు కారణమయ్యెను.

శకునితో జూదమాడించి పాండవుల రాజ్యశ్రీని అపహరించుటకు దుర్యోధనుడు సమకట్టెను. అంత ధర్మబుద్ధియైన విదురుడు లేచి పాండవుల ఐశ్వర్యమును వంచనతో అపహరించుటచూచి నిన్ను "ఛీ" అనరా? అని నిలదీసి ప్రశ్నించెను. అద్దానికి క్రోధసంరక్తలోచనుడై దుర్యోధను ఇట్లనియె :

"పరుల గుణంబులు పలుమాఱు గీర్తింతు
పక్షంబ పలుకుదు పాండవులకు
ధార్తరాష్ట్రుల సంతతంబు నిందింతువు
కుడిచిన చోటికిగూర్పవెపుడు
నుత్సంగతలమున నుగ్రవిషోరగం
బున్నట్లు నీవు మాయొద్ద నునికి
పరులసంపద నుపాయబలంబునఁ
గొనుట భూపతులకు గుణము కాదె
అడుగకయును గర్జమది యిష్టుడై చెప్ప,
నతనికాడ దగినయదియ నన్ను
నిట్టునట్టు ననగ నేల నీయిమ్ముల,
నుండు బుద్ధి సెప్పకుండు మాకు."

(సభా - ద్వితీయ - 188)

ఇట్లు విదురుని సచివశక్తి దుర్యోధనుని అహంకారము ముందు గాలికి ఎగిరిపోయినది. దానివలన కౌరవవంశమునకు లోకమునకు తీరని ఉపద్రవము కలిగినది.

ఒకదినమున అర్జునుడు ద్రోణాచార్యుని గడచి కృతవర్మని శ్రుతాయుధుని, కాంభోజపతిని, మొదలగు బహుయోధుల ప్రాణములను పీల్చి విజృంభించెను. దానితో దుర్యోధనునికి మతిపోయి కోపము ఇనుమడించి ఆచార్యుని సమీపించి తీవ్రముగ నిందించెను.

"నిను నమ్మి యొండువలనికి
జనక జయద్రథుడు నిలిచె సైన్యముతో నా
తని జంపెడు దేనియపూ
సినకత్తివిగాక మానిసివే యూహింపన్."

(ద్రోణ - తృతీయ - 108)

ఇవి గురువును సైన్యాధ్యక్షుని వయోవృద్ధుని అనవలసిన మాట లేనా ? ఈవిధముగా దుర్యోధనుడు భీష్ముని ద్రోణుని, కృపుని అశ్వత్థామను పెక్కుసారులు నిందించి వారికి మానసికక్లేశమును గలిగించెను. దుర్యోధనుని పరాజయమునకు ఇది దోహదము ఒనర్చినది. పూజ్యపూజా వ్యతిక్రమము శ్రేయఃప్రతిబంధకము గదా. తిక్కన మహాకవి శల్య మరణానంతరము దుర్యోధనుని స్థితినివర్ణించి పూర్వపు ఔన్నత్యమునకు ఈనాటి దైన్యమునకుగల తారతమ్యమును చిత్రించి యున్నాడు. రాజరాజు ఏకాదశాక్షౌహిణి సేనలకు ప్రభువు. ద్రోణ, భీష్మ, కృప, కర్ణాది ధనుర్విద్యా వరిష్ఠులచే కంటికి రెప్పగా చూడబడిన మహారాజపుత్రుడు. ఈనాడు ఏకాకియై అసూయాక్రోధములు తాలోత్తాలముగ విజృంభించగ మిక్కిలిభయముతో గుజ్జుముదిగి గదాకలిత భుజుడై ఊరిబయటనున్న ఒకమడుగులో దిక్కులేక తలదాచుకొనుటకు పోవుచుండెను. అంత సంజయుడు ఆ దుర్యోధనుని చూడవలసిన దుస్థితి ఏర్పడినది. అది సంజయుడు ఈవిధముగా తెలుపుచున్నాడు.

"అతని గాంచితి నత డశ్రు లడర నడలు
చూడ్కి నామోము చక్కగా జూడ కోర
వోవ జూచుచు దీనత బొంది యునికి
గని మనంబున శోకంబు గదుర నేను."

"ఒక్కింతసేపు పలుకు వెలువరింపజాలక యూరకుండి మెట్ట
కేల కెలుంగు దెచ్చుకొని"

(శల్య - ద్వితీయ - 9)

పరిస్థితులు మానవుని నెంత క్రిందకు దిగజార్చునో ఈ ఘట్టము తెలుపుచున్నది. ఇట్టివానినిబట్టియే "ఓడలు బండ్లగును" అను సామెత కలిగినది. వ్యాసమహర్షి కాలము మహాశక్తిమంతమైనదనియు, సుఖ దుఃఖములు శీతోష్ణములు, హానివృద్ధులు, కీర్త్యపకీర్తులు, కాలకలిత ములు అని మొట్టమొదటనే చెప్పియున్నాడు. దుర్యోధన పాత్రముఖ మున మానవులు కాలకలితములైన సుఖదుఃఖములకు బానిసలుకాక తెలియవలసిన జ్ఞానమునుపొంది మోక్ష పురుషార్థమును సాధించుటయే అవశ్యకర్తవ్యమని నిరూపించెను.

దుర్యోధనునికి రెండుసారులు వైరాగ్యము కలిగినది. అది సహజముగా వచ్చినది కాదు. అతని ఆశాతంతువు తెగిపోవుటచే వచ్చి నది. ఇట్టి వైరాగ్యము మంచిదికాదు. గంధర్వులచే దుర్యోధనుడు భార్యా మాత్య సహితముగా బంధింపబడెను. పరమకరుణామూర్తులగు పాండవులు దుర్యోధనుని విడిపించిరి. ఇది యాతనికి తీరని దుఃఖము కలిగించి ప్రాయోపవేశమునకు పురికొల్పెను. అంత రాక్షసులు దుర్యో ధనుని పాతాళలోకమునకు తీసికొనిపోయి మహాభారతయుద్ధములో దుర్యోధనుడే గెలుచును అనియు కర్ణుడు అర్జునుని సంహరింపగల డనియు ధైర్యము నూరిపోసిరి. వెంటనే దుర్యోధనుడు తన ప్రాయోప వేశమును మానుకొని హస్తినకువచ్చి ద్విగుణీకృతోత్సాహముతో పాండవులపై కత్తికట్టెను. మహాభారతయుద్ధములో అతని తొంబది తొమ్మండ్రు తమ్ములు చనిపోయి అతడు ఏకాకిగా నిలిచెను. అపుడు వైరాగ్యముపూని కసితో ధర్మజునితో ఇట్లనుచున్నాడు.

"ఏనింక సమర మొల్లను,
హీనాయక నీక యుర్వి నిచ్చితి శాంతిం
గానకు జని వల్కలపరి,
ధానుడ నై తప మొనర్చెదను మునుల కడన్.

ఓడి వచ్చినాడ నుద్ధతి నా కేల
యుడుకు మాని నీవ యుర్వి యేలు
గుజ్జములును నేనుగులు లేనిబయలునీ
తలనె కట్టికొనుము ధర్మతనయ."

(శల్య - ద్వితీయ - 71 - 72)

దుర్యోధనుని కోపము ఎంత భీకరమైనదో తెలుపుచున్నది. దుర్యోధనుడు యుద్ధములో తన తమ్ములందరు మరణించినపిమ్మట వల్కలములుపూని అరణ్యములో తపముచేయగలనని చెప్పుట అతని నైచ్యమును తెలుపుచున్నది. దీనినే శ్మశాన వైరాగ్యమందురు. మానవుడు తనశరీరములో జవసత్వములు ఉన్నంతవరకు చేత ధన మున్నంతవరకు తన అధికారము సాగుచున్నంతవరకు వైరాగ్యమును గూర్చి ధర్మాధర్మములనుగూర్చి ఒక్కనిముషమైనను ఆలోచింపడు. తనశరీరములో జవసత్త్వములు ఉడిగిన పిమ్మట ధర్మమునుగూర్చి వైరాగ్యమును పొందును. ఇది అంత మంచిదికాదు. మానవుడు బాల్యములో క్రీడాసక్తుడగును. యౌవనములో తరుణీసక్తుడగును. వార్ధక్యములో రోగగ్రస్తుడగును. అపుడు వైరాగ్యమునుగూర్చి ప్రయ తించినను ఫలితము సున్న. అందుచే మానవుడు జన్మించిన నాటినుండి మరణించువరకు ధర్మము అను ఊతకఱ్ఱను పట్టుకొన్నచో అది మన లను గమ్యస్థానమును చేర్చగలదు. శ్మశానవైరాగ్యము, పురాణవైరా గ్యము మానవునకు నిజమైన మానసికపరివర్తనము కలిగింపనేరవు.

దుర్యోధనుడు భీముని జయించవలెనని తీవ్రమైన పట్టుదలతో పదమూడు సంవత్సరములు గదాయుద్ధకౌశలమును సంపాదించెను. దానికొరకు నిరంతరము సాధనచేసెను. అతడు ప్రాణముల నొసంగుట కైనను తెగించి భీమునిపై విజృంభించెను. భీముడు దుర్యోధనుని కౌశ

లమునకు తట్టుకొనలేకపోయెను. రాజరాజుయొక్క పరాక్రమము జగదీశ్వరుడైన శ్రీకృష్ణుని కలవరపరచినది. శ్రీకృష్ణుడు ధర్మయుద్ధమున దుర్యోధనుని జయించుట అరుదని చెప్పెను.

> "లావు గలిగి మొక్కలమ్మున గీచకా
> రాతి సొచ్చి ధార్తరాష్ట్రు వెరవు
> వలన నొచ్చుచున్నవాడు గావున ధర్మ
> సంగరమున నరిది జయము గొనుట."

(శల్య - ద్వితీయ - 270)

వ్యాసభగవానుడు దుర్యోధనుని అలౌకిక ధైర్యమును వేయి విధములవర్ణించి సహృదయులకు పులకాంకురప్రకరములు కలిగించెను. దుర్యోధనుని సైన్యములన్నియు నుడిసినవి. భీష్మ, ద్రోణ కర్ణాది వీరులు నశించిరి. అతడు ఏకాకిగా నిలచెను. ధర్మరాజు తమలో ఏ ఒక్కరితోనైననుపోగి జయింపుమనియెను. దుర్యోధనుడు తన ఉదాత్తతకు తక్కువకాకుండ మెలగెను. వృకోదరుడే తనకు తగినవాడని నిశ్చయించెను. గదాధారియై దుర్యోధనుడు కృతాంతునివలె పాదచారియై వెడలుచుండ అతని మొక్కవోని ధైర్యమునుచూచి ప్రస్తుతించిరి. భీముడు దుర్యోధనుని గదతో ఊరుభంగము ఒనర్చెను. అప్పుడును అతని ధైర్యము చలింపలేదు. శ్రీకృష్ణుడును విభ్రాంతుడయ్యెను. భీముడు నేలమీదపడిన రాజరాజుయొక్క శిరమును తన్నెను. శ్రీకృష్ణుడు పరిహసించెను. దీనికి దుర్యోధనుడు సహింపలేక ప్రత్యుత్తరము చెప్పెను. ప్రాణసంకటసమయములోకూడ ధైర్యము విడవక పోవుట దుర్యోధనునికిమాత్రమే చెల్లినది. అసామాన్యధైర్యము తలచుకొన్నచో సామాన్యులకు భయము కలిగించును.

> "చదివితి నెల్ల వేదములు జన్నము లొప్పగ జేసితిన్ రమా
> స్పద మగువృత్తి బొల్చి నరపాలకు లెల్లను గొల్వ గంటి దు

ర్మదరిపుగాఢగర్వ పరిమర్దన కేళి యొనర్చితిం దగం
దుది నని మిత్రబాంధవులతో త్రిదివంబున కేను బొప్పదే."

(శల్య - ద్వితీయ - 329)

భీమసేన గదాఘాతమున ఊరుభంగముతో నేలబడిన దుర్యోధనుని నిందించుచు, భీమసేను నభినందించుచున్న పాంచాలులతో శ్రీకృష్ణభగవానునిచూచి దుర్యోధనుడు ఈవిధముగా పరుషోక్తు లాడెను.

"ఓ కృష్ణా! గదాయుద్ధములో అధర్మముచే నన్ను బడ గొట్టించితివి. నీకు లజ్జలేదా? ఊరుభంగము జేయునట్లు భీమునకు జ్ఞాపకముగా పార్థునకు నీవు చెప్పినది నేనెరుగనా? ఋజుమార్గమున యుద్ధముచేయు మా పక్షములోని వేలకొలది వీరులను అనేక కపటో పాయములచే వధింపజేసిన నీకు లజ్జలేదు. దయ లేదు. శిఖండిని పుర స్కరించుకొని భీష్మపితామహుని పడగొట్టించితివి. 'అశ్వత్థామ హతః' అని పలికించి ద్రోణాచార్యునివే శస్త్రసన్యాసము చేయించి తివి. అది నే నెరుగనా? ఆ ద్రోణాచార్యుని పడగొట్టు ఈ ధృష్ట ద్యుమ్న ఘాతకుని నీవు వారింపవైతివి. స్వధర్మనిష్ఠులమైన మేమును, మా పక్షమువారును అపూజ్యుడవైన నీచే కపటమార్గమున బడగొట్ట బడినాము."

లోకములో భీముడు అధర్మముగ దుర్యోధనుని నాభికి క్రింద భాగమున కొట్టినాడని వాదోపవాదములు కలవు. ఆ వాదముల నన్ని టిని శ్రీకృష్ణుడు ఖండించియున్నాడు. భీముడు దుర్యోధనుని ఈ విధ ముగ సంహరించుట విశేషధర్మమని శ్రీకృష్ణుడనుడివెను. "మాయావీ మాయయా వధ్యః" కపటులను పడగొట్టుటకు కపటముగూడ నాశ్రయ ణీయమే. భీమసేన ప్రతిజ్ఞనుబట్టియు, మైత్రేయశాపమునుబట్టియు, జరుప

బడిన దుర్యోధనోరుభంగములో శ్రీకృష్ణుని అన్యాయమేమున్నది.
"నీవు భీముని బాములం గఱపించియు. విషంబిడియు, నీటం ద్రోచియుం
బలుమాఱుం జంప దెగితివి గొంతియు గొడుకు లేవురును నిద్రించు
సమయంబున జతుగృహంబు దహించితివి. ధర్మోత్తరచరిత్రుండగు
నజాతశత్రుసంపదల గపటద్యూతంబున నపహరించి రంత నిలువం బోక
యాజ్ఞసేని నేకవస్త్రరజస్వలం గొలువు లోపల భంగపెట్టి తాప్రౌఢ
నిన్ను నిట్టి దురవస్థకు దేరం దగియుండనట్లు పోయి సమయంబు నడపి
నీ చేసిన సకలదుష్కృతంబులు సహించిన యుష్మండ వాగ్రజుండు
వనుప నేను బుడమిపా లడుగవచ్చిన నీ నేరనైతి నీనేరమి నిట్లైతి భవ
దీయం బగు లోభంబునం బాపనిశ్చయంబున మదంబున శాంతచిత్తు
లగు శాంతనవ ద్రోణులకుం బ్రాణహాని వాటిల్లె వినుము ద్రుపదుని
తపోయజ్ఞ ప్రభావంబుల నదియ పనిగ జనియించిన శిఖండి ధృష్టద్యు
మ్ను లాభీష్మగురుల మరణంబులకు గారణంబులుగాక తక్కుదురే?
పెక్కండ్ర తోడం బోరి డస్సిన సాత్యకిం జంపువాడైన భూరిశ్రవుం
జంప కుందుమే యనేక ప్రౌఢ యోధులొక్కరుని బాలు సౌభద్రుం
బొదివి చంపినం బూనినపూన్కి నిఖిలోపాయంబుల నెఱపక పుణ్యాత్మ
మైన పాంచాలి నరణ్యంబునం బరిభవించిన పాపాత్ము సైంధవునిబ్రదికి
పోవిడిచి యర్జునుండగ్నిం బ్రవేశించునే యిన్నితిపరుల చరిత్రంబులు
నిర్మలంబులు ఘోషయాత్ర నిన్ను గంధర్వులు పట్టుకొని పోవునప్పుడు
నీవారెల్లం బాఱిన నర్జునుండు నిన్ను విడిపించుట యెఱుంగవే గాంగేయ
కుంభజకర్ణాశ్వత్థామకృపు లుద్దామ సమగ్రసైన్యంబులతోడ నడవ
నీవు విరటుని గోవులం బట్టికొని పోవుచోట మీ రందరు తన సమ్మో
హనాస్త్రంబున మూర్ఛితులైన సమయంబున అర్జునుడు నిన్నుగాచుట
యెఱుంగరాదె నీ వాపాదించిన పాపంబులకెల్ల మూలంబైన కర్ణు నర
దంబు ధరణిం గ్రుంగిన గవ్వడి వానినేయ కేల కాచికొని యుండు
నుండె నేనియు భూసురశాపంబున నట్లైన రథంబునకు నిష్కృతిగలుగునే

కావున నన్నిచు సమయించుట సముచితంబు యుధిష్ఠిరుండు శల్యుం దెగటార్చిన తెఱంగొప్పు నొప్పదని యుగ్గడింపక మేలు సేసితి పాండు నందనులు పుట్టినంతనుండి నేడు దుదిగా నీయెడ ధర్మవిరోధం బాచ రింపరు కురుకులంబునకు గుద్దలిగాని దుర్ద్యూతంబు నీవ తొడరితి దాన నింతలు వుట్టె బవనతనయుండు వట్టినప్రతిన యెరుంగవె గద నూరు భంగంబు సేయుదునని పలికి పిడికిటం బొడుచునే యవియెల్లను వృథా జల్పంబు లూరకుండు." (శల్య - ద్వితీయ - 328)

శ్రీకృష్ణుని ప్రశ్నలకు దుర్యోధనుడే బదులు పలుకలేకపోయెను. ఇక దుర్యోధన పక్షపాతులు చెప్పు వాదమునకు ఏమి బలముండును? దుర్యోధనుడు చేసిన పాపములకు ప్రతిఫలము అనుభవించినాడు.

వ్యాసమహర్షి క్రోధము, మాత్సర్యము, మహాత్వాకాంక్ష, అధమవృత్తి కలిగిన దుర్యోధనుని దుష్టత్వమును బహుధా ప్రపంచించి ఉన్నాడు. మానవుని అధఃపాతాళమునకు త్రొక్కివేయు దుష్టలక్షణము లన్నియు ఒక రాజపురుషునిలో రాశీభూతమగుట ఎంతప్రమాదకరమో వ్యాఖ్యానించెను. అలౌకిక ధైర్యము, రాజనీతి, ప్రజారంజకకత్వము, నిర్భీకత, పట్టుదల మొదలైనవన్నియు దుష్టఫలము నొసంగినవి. ధర్మము, న్యాయము, సంస్కృతి వీని ప్రాథమికములైన విలువలను దుర్యోధనుడు నాశ మొనర్చెను. భారతకాలమున దుష్టుడైన దుర్యోధన రాజు కారణముగా రాజ్యసంస్థ పతనము చెందినది. దుర్యోధనుడు అక్షరాల కలియొక్క అవతారము.

వ్యాసమహర్షి కావ్యన్యాయము చక్కగ పోషించెను. దుర్యోధనుడు చేసిన పాపములకు, ఘోరకృత్యములకు, ధర్మశాస్త్రకర్తలు నుడివినట్లు వడ్డీతో పాపఫలము అనుభవించినాడు. మానవుడు అత్యుత్కటమైన పాపముకాని, పుణ్యముకాని చేసినచో దాని ఫలము ఈ

జన్మయందే అనుభవించును. అదియే దుర్యోధనుడు పొందినాడు. దీని మూలముగ ప్రజలకు పాపాచరణమునెడ భయము, ధర్మపక్షపాతము, న్యాయాన్యాయవిచక్షణ అలవడును. దుర్యోధనుని ద్రోహముల కారణముగ కౌరవవంశ మంతయు నామరూపములులేకుండ నశించినది. కౌరవవీరులభార్యలు భర్తలుమరణించుటచే తీవ్రవేదనము పొందిరి. పచ్చపచ్చగానుండు సంసారములన్నియు దుర్యోధనుని కన్నులయెదుటనే కాలిపోయినవి. కౌరవ కాంతల శోకము మిన్నుముట్టినది.

క్రోధము మాత్సర్యము, అసూయాది దుర్గుణములతో దుర్యోధనుడు కౌరవవంశ నాశమునకు హేతుభూతుడయ్యెను. దుర్యోధనుని కారణముగ కౌరవవంశము నామరూపములులేకుండ నశించినది. ఒకడు చేసిన పాపమునకు ఎల్లరు ఫలితము అనుభవింపవలసినదే.

> "ప్రల్లదుడైన యొక్క కులపాంసను చేసినదాన దక్కులం
> బెల్లను దూషితం బగుట యేమి యపూర్వము."
>
> (ఆది - ప్రథమ - 125)

## 15. దుశ్శాసనుడు

దుష్టచతుష్టయములో దుశ్శాసను డొకడు. పాపాసక్తి, నిర్లజ్జ, మూఢమైనభక్తి, యుక్తాయుక్త వివేకరాహిత్యము మొదలైన లక్షణములు ఇతనిలో కలవు. భీమార్జున నకులసహదేవులు అన్నయందు ధర్మమందు భక్తిప్రపత్తులు కలిగి ఇహలోకములో సౌఖ్యమును పరలోకములో ఉత్తమగతిని పొందిరి. దుశ్శాసనాదులు అన్నయైన దుర్యోధనునియందు మూఢమైన భక్తి, అధర్మాసక్తి కలిగి లోకోపద్రవమును కలిగించి కీడుపొందిరి. ధర్మాసక్తి విశ్వశ్రేయఃప్రదము. అధర్మాసక్తి లోకానర్థదాయకమని నిరూపించబడినది.

దుశ్శాసనుడంత బాలిశుడు లోకములో మరొకడుండడు. అది దున్నపోతుస్వభావము. అన్నతోపాటు దుశ్శాసనుడును, పాండవులపై నిష్కారణముగా అసూయాద్వేషములను పెంచుకొని వారికి కీడు చేయుటలో అన్నకు తోడ్పడినాడు. అతడు అస్వతంత్రుడు. తెగిన గాలిపటమువంటి స్వభావము అతనిది. అన్నపిలిచి ద్రౌపదిని సభకు తీసికొనిరమ్మని నియోగించెను. నియోగించినదే తడవుగా అతడు అంతఃపురికేగెను. ఆ మహామాత "రజస్వలను, సభకువచ్చు స్థితిలో తాను లేన"ని కడుదీనముగా పలికెను. ఆ నిర్దయాత్ముడు పాపనిరతుడు కండశావరములో ఈరీతిగా పలికెను.

"నీ వేక వస్త్రవైతేమి విగతవస్త్రవైతేమి నిన్నెట్లుం దోడ్కొనిపోదునని బలాత్కారంబున."

"ఆవనజాననం గురుకులాపశదుండు గడంగి రాజసూ
యావభృథంబునందు వసుధామరమంత్రపవిత్రవారిధా
రావళి జేసి పావనము లైన శిరోజములం దెమల్చి పా
పావహుఁడీడ్చి తెచ్చె సభకందఱు సంభ్రమమంది చూడగన్."
(సభా - ద్వితీయ - 215, 216)

తుదకు ఆమెవలువలను ఒలుచుటకుకూడ సిగ్గుపడని మహాధూర్తుడు. దుశ్శాసనుడు సద్గర్హితుడు. కురుకులాపశదుడు. ఇంతకంటె మహాఘోర మేమున్నది. దుర్యోధనునిక్రోధము దుశ్శాసనుని ముఖమున తీర్చుకొనబడినది. అతనిచేష్ట దుర్యోధనునితమ్మునకు సరిపడినదై యున్నది.

దుశ్శాసనుడు ఒకసందర్భములో పాండవులను పాపులని దూషించినాడు. పాపపుణ్యములసంగతి ఉచ్చరించుటకుకూడ అధికారములేని దుశ్శాసనుడు ఇట్లుమాట్లాడుట తగియున్నది. పాపులైనవారికి అభిజాత్యమదము, ధనమదము, అధికారమదము పెరుగును. తిరిగి, తిరిగి వారు

పాపములనే చేయుచు నరకములో మునిగిపోవుదురు. దుశ్శాసనుడు కూడ అట్లే అయినాడు.

మహాభారతసమరములో దుశ్శాసనహంతకుని, దండధరునివలె భీముడు సంహరించి తగినశాస్తి చేసినాడు. దుశ్శాసనసంహారము మహాభయానకముగా అత్యంత బీభత్సముగా తిక్కనార్యుడు చిత్రించియున్నాడు. దుశ్శాసనునివంటి దుర్మార్గులు పరులభార్యలకు మహాపతివ్రతలకు అపరాధము చేసినచో ఈవిధముగనే నీచమరణము పొందగలరని దుశ్శాసన సంహారము నిరూపించుచున్నది. దుశ్శాసనుడు అక్షరాల దుర్యోధనుని తమ్ముడే.

## 16. కర్ణుడు

భారతకథలో నత్యంత ప్రాధాన్యమువహించినవ్యక్తి కర్ణుడు. ఇతడు భారత యుద్ధమునకు సూత్రధారి. పాండవ కౌరవులమధ్య ద్వేషాగ్ని ప్రజ్వరిల్లచేసియున్నాడు. శ్రీకృష్ణుని తరువాత ఎన్నతగినవాడు కర్ణుడు. దుర్యోధనుని కలియంశము, ధృతరాష్ట్రుని కౌటిల్యము, శకుని కాపట్యము, కర్ణుని ఉత్సాహశక్తి కలసి మహాభారత సంగ్రామముగ పరిణమించినది. కర్ణుడులేనిదే భారతమేమిటి అను సామెత కలదు. అందుచేతనే భారత కథ యంతయు కర్ణునొదలనే యున్నదను లోకోక్తి ప్రచురమైనది. అసామాన్య శౌర్యము, అలౌకిక దాన శూరత్వము, సమయజ్ఞత, నిర్మలాంతరంగము, గుణగ్రహణ పారీణత, స్వామిభక్తి, కష్టసహిష్ణుత యనునవి అతని గుణములు. అహంకారము, స్వాతిశయము అమిత మైన మహత్వాకాంక్ష, స్వార్థపరత్వము, మాత్సర్యము, ఆత్మస్తుతి పరాయణత్వము అనునవి అతని అవగుణములు. అన్నిటికంటె విధి అతనియెడల క్రూరమైనది. ఎన్ని మంచిగుణము లున్నను, అవి దుర్గుణములచే గ్రసింపబడి, తుదకు కారణముచెప్పలేని నాశము పొందెను.

అదియే కర్ణునిజీవితము మానవులకు బోధించుచున్నది. వ్యక్తియొక్క మంచిచెడ్డలు ఆ వ్యక్తివలన సమాజమునకు ఏ మేలుకలిగినది, ఏ కీడు కలిగినది అనునది పరిశీలింపవలెను. అతని చేష్టలు భావములు, ఉత్తములను పరాభవించుటకు, సకలజన క్షయకారణమగు యుద్ధమునకు దారి తీసినవి.

సంప్రదాయపువిలువలను, భావములను మెచ్చనివారుకొందరు కర్ణుని ఉదాత్తునిచేసి చిత్రింతురు. ఉదాహరణము 'దానవీరశూరకర్ణ' సినిమా. ఈపక్షమువారు ఆధునికభావములను మనసులోపెట్టుకొని లోకగర్హితులైన దుర్యోధనాదులను లోకోత్తరవ్యక్తులుగ జిత్రింప జూతురు. ఇదియొక వితండమార్గము.

వ్యాసమహర్షి చిత్రించిన సంక్లిష్టపాత్రలలో కర్ణుడు ఒకడు. లోకములో కర్ణుడు సద్గుణరాశియనియు, దానవీరుడనియు, ఉత్తమ మిత్రుడనియు, అవక్రపరాక్రమవంతుడనియు, స్వామిభక్తిమహితుడనియు ఆతనికి పట్టాభిషేకముచేయు వర్గము కలదు. మరొక వర్గము వారు అహంకారము, మాత్సర్యము, మహత్వాకాంక్షలకు నిలయమనియు, ద్రౌపది పరాభవమునకు, ఘోషయాత్రకు మూలకారణమనియు, కౌరవ కుల ధూమకేతువనియు నిందించువారును కలరు. ఈ రెండు వాదములు పాక్షికముగ సత్యములు. వేదవ్యాసమహర్షి వాణిలోని ఆంతర్యము గుర్తించినపుడే మనకు కర్ణుని యథార్థస్వరూపము తెలియును. అతనిచరిత్రలో కొన్నిఘట్టములనుమాత్రమే చదివి నిర్ణయమునకు వచ్చుట సముచితముకాదు.

కర్ణుడు తల్లిదండ్రులనుండి బుద్ధికుశలత, సౌందర్యము, దుర్నిరీక్ష్యమైన పరాక్రమములను పుణికి పుచ్చుకొనెను. భారతమహావీర మణిహారములో అపూర్వమణి కర్ణుడు. ఆ మహామహితాత్ముడు అనేక

ఘట్టములలో లోకోత్తరపరాక్రమము దుర్నిరీక్ష్య తేజ సంపదను ప్రకటించెను. కుమారాస్త్ర విద్యాప్రదర్శనములో అర్జునుడు ప్రదర్శించిన అస్త్ర, శస్త్రవిద్యలన్నియు అశ్రమమున ప్రదర్శించి కురువీరులకు ఆశ్చర్యము కలిగించెను. ద్రుపదునిపై దండెత్తి ఆ రాజులందరిని పాదాక్రాంతులుగ చేసికొనెను. ఆ మహావీరుడు పరాక్రమపణముగ చిత్రాంగదుని పుత్రికను తెచ్చి అనుంగు చెలికాడగు దుర్యోధనునకు ప్రణయేశ్వరిగా సమర్పించెను. కౌరవ రాజ్య సింహాసనమునకు కర్ణుని బాహుబలమే రక్ష. కర్ణుడు సహస్రకిరణునివలె తనపరాక్రమ దీధితులతో దేదీప్యమానుడై శ్రీకృష్ణార్జునులను చలింపచేసెను.

"పట్టపగలింటి సూర్యుని పగిది కర్ణు
డుగ్రమూర్తియై వెలుగుచునున్నవాడు;
మనరథంబిప్డు, మాధవ మరలనిమ్ము
బ్రతికియుండిన శుభములు వడయవచ్చు."

(కర్ణ - తృతీయ - 18)

దానము పేరు చెప్పినంతనే భారతీయుల మనసులో ప్రత్యక్షమగు మహాదాత కర్ణుడు. ఆ దానవీరుడు ప్రాణాధికముగ ప్రేమించిన గుణము దానము. అది ఒక్కొక్కసారి ప్రాణాపాయమును తెచ్చినది. అయినను దానిని కర్ణుడు ఎన్నివిషమపరిస్థితులలో చిక్కుకొన్నను విడిచిపెట్టలేదు. బంగారము అగ్నితప్తమైనపుడే దానివిలువ తెలియును. కర్ణుని దానశూరత అనేకాగ్నిపరీక్షల నెదుర్కొనెను. కర్ణార్జునుల వైరము జగత్ప్రసిద్ధము. ఇంద్రుడు తనప్రియపుత్రుడు సమరములో విజయము పొందవలెనని, కర్ణునిలోని దానగుణమును ఆధారముగ చేసికొని అతని కవచకుండలములను దానమడుగ వచ్చెను. ఇది గ్రహించి సూర్యుడు ప్రియపుత్రుడైన కర్ణునిసమీపించి ఈదానము చేయుటవలన భవిష్యత్కాలములో ఆపద సిద్ధించుననియు, దానము చేయవలదని చెవినిల్లు కట్టుకొని పోరెను. అయినను కర్ణుడు తనగుణమును విడువలేదు.

"భూసురకోటి వేఁడుటయు బోఁడిగ బ్రాణము లైన నీగి నా
బాస; దినేశ! లోకమున బ్రస్ఫుట మింతయు; నట్లు గావునన్
వాసవు డట్టి నన్నడుగవచ్చు బ్రియంపడి; నాకు నొక్క బ్రా
తే? సురలోకవందిత! మదిం గవచంబును గుండలంబులున్?"

"జగముల నెల్లను నిండిన
పొగడిత గడు వెలితి సేసి, పొల్ల యొడలికై
తగువే జన్మవ్రత మిటు
దిగ విడువగ నేడు నాకు? త్రిభువనదీపా!"

(అరణ్య - సప్తమ - 290, 291)

మానవుడు తనకున్న దానిలో దానము చేయుటవలన దైవీ గుణము పెంపొందించుకొనును. ఒక్కొక్కసారి ప్రాణమునుకూడ తృణ ప్రాయముగ త్యాగము చేయవలసివచ్చును. ఈ త్యాగమువలన ఈ లోకములో కీర్తి పరలోకములో ఉత్తమగతి పొందును. కీర్తి చాల దొడ్డది.

"కీర్తియ యిచ్చు బుణ్యగతి గీర్తియ తల్లియు బోలెబ్రోచు; స
త్కీర్తియ యాయువున్ సిరియు; గీర్తివిహీనుడ చూ శవంబు; దు
ష్కీర్తికి నెల్లచేటులును గిట్టి హరించు ననండె తొల్లి భ
క్తార్తిహరుండు నా బరగు నంబుజసూతి జగద్ధితంబుగన్."

(అరణ్య - సప్తమ - 294)

కర్ణుడు బ్రాహ్మణుల కోరికను నెరవేర్చుట, శరణాగతులను రక్షించుట, స్త్రీ ద్విజవృద్ధబాలాతురులు మొదలైనవారిని రక్షించుట తన వ్రతమని చెప్పెను. మానవునకు ధ్యేయము కీర్తి. అది దానము వలన కలుగును. త్యాగమే అమృతత్వము కలిగించునని ఉపనిషద్వాణి. కర్ణుని దానశీలమును చూచి, దేవతలు, జయజయధ్వనులు చేసిరి.

పర్వతము లున్నంతవరకు, నదులు ప్రవహించుచున్నంతవరకు కర్ణుని త్యాగశీలము, జగత్కర్ణములకు విందుచేయును.

కర్ణుని గుణమణులలో ప్రభుభక్తి చాలదొడ్డది. తన సర్వస్వమును రాజరాజు యశశ్శ్రీకి, రాజ్యశ్రీలకే వినిమయము చేసిన మహాదాత.

కర్ణుని సముజ్జ్వల ప్రశంసార్హము ధర్మజుడు చేసిన రాజసూయయాగ సందర్భమున భీముడు కర్ణునిపై దండెత్తెను. మహాభిమానియైన కర్ణుడు కాలము అనుకూలముగ లేదని గ్రహించి పాండవులకు మాండలికుడనాడనని ప్రకటించెను. శ్రీకృష్ణ భీమార్జునులు ఆ కాలములో సకలజగద్భయంకరుడైన జరాసంధుని సంహరించిరి. పాండవులకు యాదవులు. పాంచాలురు తోడ్పడిరి కారాగార విముక్తులైన రాజమండలమంతయు ధర్మజునకు పాదాక్రాంతులైరి. ఇట్టి సమయములో పాండవుల నెదుర్కొనుట యనగా మండుచున్న అగ్నికీలలో శలభమువలె పడుటయని గ్రహించి పట్టుదల విడచి కర్ణుడు తలవంచుకొనెను.

మహాభారత సంగ్రామములో కౌరవ సైన్యాధ్యక్షుడైన భీష్ముడు అంపశయ్య నలంకరించెను, ఇక కౌరవసేనకు ఎవరిని అధ్యక్షుడు చేసిన బాగుండునను ప్రశ్న ముదయించినది. దుర్యోధనుని ప్రియమిత్రుడు కర్ణుడు సేనాధిపతిగ నుండిన మంచిదని గుసగుసలు బయలుదేరినవి ఆ పరిస్థితియంతయు గమనించి భీష్ముని తరువాత సైన్యాధిపత్యము స్వీకరించవలసిన వ్యక్తి వయోవృద్ధుడై యుండవలెననియు, రాజరాజు ఆశయమును నెరవేర్చువాడై యుండవలెననియు, కౌరవబలమును ఒక్కమాటమీాద నడిపించువాడై యుండువాడు ఆవశ్యకమని గుర్తించి కర్ణుడు స్వార్థత్యాగము చేసి కురుకుమారులకు ఆచార్యుడైన ద్రోణాచార్యుడే సేనాధిపతిగ నుండవలెనని సజ్జన స్తవనీయముగ నిర్ణయము చేసెను.

ద్రోణాచార్యుడు ముచ్చటకు ఒక్కసారికూడ కర్ణుని ప్రశంసించ లేదు. సరికదా అదను చిక్కినప్పుడు తీవ్రముగ ఉపాలంభించెను. అయి నను కర్ణుడు గుణగ్రహణపారీణుడై ఆచార్యునకు సముచితమైన గౌర వము నొసంగి రాజరాజుయొక్క శ్రేయస్సునకు ప్రాధాన్య మొసం గెను. లోకోత్తర ధానుష్కుడైన భీష్ముడు సర్వజన భయంకరముగ యుద్ధముచేసి అంపశయ్య నలంకరించెను. అత్తరి కర్ణుడు తన్ను భీష్ముడు అర్ధరథునిగాచేసి పలువురి యెదుట పరాభవించినను మనస్సులో పెట్టు కొనక ఆ పితామహుని సమీపించి అతని పాదములకు భక్తిపూర్వక ముగా నమస్కరించి తన్ను వాత్సల్యదృష్టితో చూడమని ప్రార్థించెను. ఇది కర్ణుని సౌజన్యమునకు పరాకాష్ఠ. అదే మంచి సమయమని పితా మహుడు కర్ణుని దగ్గరకుతీసికొని ప్రేమమీర ఆలింగనముచేసికొని కర్ణుడు కుంతిపుత్రుడే అనియు శ్రీకృష్ణుని, అర్జునుని జయించుట దుస్తరమనియు హితోపదేశము చేసెను. అప్పుడు కర్ణుడు కౌరవుల యొక్క స్థితిని, పాండవులయొక్క స్థితిని అర్థముచేసికొని ఇట్లు సంభా షించెను.

"వారు మహాబలుల్ హరియు వారికి బ్రాపు కలండు వారలన్
బోర జయింపరామియును బుద్ధి నెఱుంగుదు నైన గౌరవ
ప్మోరమణుండు సేయు తగుమన్నన లెల్ల దలంచి చూచినన్
భూరి వివేక యే విడిచి పోవుట ధర్మమె వీర కర్మమే."

"దైవాధీనము సర్వమున్ మనమతిం దప్పింపగా వచ్చునే
నీ వింకన్ నను నొండు పల్కక పరానీకంబుపై బంపు మ
త్సేవా ధర్మము నిర్వహించెద బలోత్సేకంబు లోకంబునం
భావింపన్ విహరించెదన్ మురరిపుం బార్థుం దలంకించెదన్."

(భీష్మ - తృతీయ - 448, 451)

ఈ మాటలనుబట్టి కర్ణుడు కౌరవులు ఓడిపోవుట తథ్యమని గ్రహించినాడనియు విధి బలవత్తరమైనదని గ్రహించి తన సేవాధర్మము ఎంతమాత్రము మానలేనని చెప్పుట ఎంతయు నెన్నదగి యున్నది.

కర్ణుని స్వామిభక్తి అచంచలమైనది. తన సర్వస్వము రాజరాజు కొఱకు త్యాగము చేసెను. ఎన్నియో దురదృష్టపరంపరలు వెన్నాడినను ఆ మహారాజు ఉప్పు, పులుసు తిన్నందులకు ఆ ఋణమును శరీరములో ప్రాణమున్నంతవరకు తీర్చుకొనుటకే ప్రయత్నించెను.

"అనుదినంబును నంత కంతకు బెరిగెడియధిపతిమన్నన యప్పు దీర్ప నర్జును నోర్చెద నసిలోన." (విరాట - చతుర్థ - 205)

కర్ణుడు ఆయా సందర్భములలో శత్రువులలోని గుణములను సయితము మెచ్చుకొని ఆనందించిన సహృదయుడు. శ్రీకృష్ణుడు రాయబారము చేసినపిమ్మట రహస్యముగా కర్ణునితో అతని జన్మ వృత్తాంతమంతయు చెప్పి పాండవులతో చేరుమని చెప్పెను. ఆ సమయమున కర్ణుడు తన అనుంగుతమ్ముడైన ధర్మజుని ఇట్లు ప్రశంసించుచున్నాడు :

"ధర్మతనయుండు దాను నా తమ్ముడగుట,
యెఱిగెనేనియు సామ్రాజ్య మేలపూను
నట్టిధార్మికు డాధిపత్యంబు జేయు,
వలవదే శాశ్వతంబుగ వసుధకెల్ల."

(ఉద్యోగ - చతుర్థ - 44)

కర్ణుడు శ్రీకృష్ణునితో ధర్మజునికి ఈ రహస్యము తెలియనీయ వలదని ప్రార్థించెను. కర్ణుని దయనీయమైన మరణమును చూచినప్పుడు సహృదయుని కన్నులు చెమ్మగిల్లును. దుఃదృష్టమెంతిగ వెన్నాడి నాశము కలిగించినదే అని వేడి నిట్టూర్పు విడువని వారుండరు. ఆ మహాను

భావుని ఎన్నివిధముల దురదృష్టపరంపర క్రుంగ తీసినదో నారద మహర్షి శాంతిపర్వములో తెలియజెప్పినాడు.

"వినుము నరేంద్ర విప్రుడలివెన్ జమదగ్నిసుతుండు శాపమి
చ్చె నమరభర్త వంచనము సేసె వరంబని కోరి కుంతి మా
న్చె నలుక భీష్ము డర్ధరథు జేసి యడంచె గలంచె మద్రరా
జనుదిత మాడి శౌరి విధి యయ్యె నరుం డని జంపె గర్ణునిన్."

(శాంతి - ప్రథమ - 35)

దురదృష్టము కర్ణునిజీవితముతో చెలగాటమాడినది. తుదకాతనిని కాటువేసినది. 1. కుంతీదేవి కని గంగలో పడవేసి అతనికి తెలియవలసిన సమయములో జన్మరహస్యమును చెప్పలేదు. దానివలన కర్ణుడు తల్లిచేసిన పాపమునకు సూతకులజుడని సంఘముచే నెన్నియో అవమానములు పొందెను. 2. బ్రాహ్మణుడు కోపించి శాపమిచ్చెను. 3. పరశురాముడు యుక్తసమయములో బ్రహ్మాస్త్రము కర్ణునకు ప్రతిభాసింపకుండ శాపమిచ్చెను. 4. ఇంద్రుడు కపటబ్రాహ్మణ వేషము వేసికొనివచ్చి కర్ణుని కవచకుండలముల నపహరించెను. 5. కుంతీదేవి పాండవులు కర్ణుని తమ్ములేనని చెప్పి అతనికి అర్జునుడుతప్ప మిగిలిన పాండవులు చేతికిచిక్కినను చంపవలదని వాగ్దానము చేయించినది. 6. భీష్ముడు మహాభిమానియైన కర్ణుని అర్ధరథుడని యవమానించెను. 7. శ్రీకృష్ణుడు కర్ణుని తేజోవధ చేసెను. 8. శల్యుడు సారథ్యము చేయుచు కర్ణుడు కాకి యనియు అర్జునుడు రాజహంస యనియు అతనిని జయించుట కర్ణునికి ఎంతమాత్రము శక్యముకాదనిచెప్పుచు వెన్నుపోటు పొడిచెను. ఇన్ని దురదృష్టములు వెన్నాడినను మొక్కవోని ధైర్యముతో అచంచల స్వామిభక్తితో కర్ణుడు మనినది, మరణించినది రాజరాజు కొఱకే. ఇవి తలచుకొన్నచో ఎంత పాషాణహృదయునకైనను కర్ణునిపట్ల సానుభూతి కల్గును.

కర్ణుని వధ్యదినము సమీపించినది. రాధేయుని కన్నైదుట అతని ప్రియపుత్రుని అర్జునుడు సంహరించెను. పుత్రశోకముతో కర్ణునిహృదయము పరితప్తమైనది. శాపప్రభావమున కర్ణుని రథచక్రములు భూమిలోనికి క్రుంగిపోయినవి. పరశురాముడు బోధించిన బ్రహ్మాస్త్రము అక్కరకు రాలేదు. అప్పుడు కర్ణుడు అప్రతీకారంబులగు రోషవిషాదంబుల కన్నీరొలుక రథంబు డిగ్గి అర్జునునితో ఇట్లు వీరధర్మమును ఉపదేశించెను : "ఈచక్రము నెత్తువరకును కొంత ఆగుము. నీవు రథస్థుడవు. నేను భూమిస్థుడను. బ్రాహ్మణుని వధింపరాదు. అంజలి ఘటించినవానితో పోరరాదు. శరణాగతులను వధింపరాదు. ఆయుధము లేనివానిని, చంపకూడదు. బాణములు లేనివానిని భ్రష్టకవచుని, ఆయుధములు భగ్నమైనవానిని చంపరాదని యుద్ధనియమము. మహాధానుష్కుడవైన అర్జునా, నేను నీకు వెఱచుట లేదు. కృష్ణునకు అసలే భయపడుట లేదు." శ్రీకృష్ణుడు ప్రోత్సాహించి అర్జునునిచే విరథుడు, భూమిస్థుడు, నిరాయుధుడైన కర్ణుని సంహరింపచేసెను. ఈ సందర్భము పురస్కరించుకొని సహృదయులకు కర్ణునిపై ఎంతయొ సానుభూతి కలుగును. ఇది ఒక్కటే కర్ణునిశీలమును నిర్ణయించుటకు పనికిరాదు. పూర్వోక్తమైన, లోకోత్తరసద్గుణ సంశోభితుడైన కర్ణుడు లోకమునకు ఉపద్రవముగా మారుట దైవదుర్విపాకము. ఇట్టి ఉదాత్త చరిత్రుడు జగదపకారకుడై రాష్ట్రమును నిర్మూలించుటకు ఒడిగట్టెను.

స్వార్థము, అహంకారము, మాత్సర్యము, అసూయ, మహత్త్వాకాంక్ష, ఇవి అతని సర్వసద్గుణములను మ్రింగివేసెను.

సహృదయులు వ్యాసమహర్షి కర్ణపాత్రను చిత్రించిన విధమును ఆసాంతము పరిశీలించిన అతని శీలము తెలియును. స్వార్థము కర్ణునిలో ఏపరిస్థితులలో బీజమై దుష్టవృక్షమై వృద్ధిపొందినచో భారతములో

సహజముగ చిత్రింపబడినది. కురుకుమారులెల్లరు ద్రోణాచార్యులకడ విద్యాభ్యాసము ప్రారంభించిరి. విద్యార్థిదశలోనే రెండుపక్షములుగ విడిపోయి యుధిష్ఠిరుని ధర్మాభిముఖ్యము, సమయజ్ఞత, గాంభీర్యము, భీముని వజ్రసారబలము, పార్థుని ధనుర్విద్యా విశారదత్వము, నకులుని సౌందర్యవినయములు, సహదేవుని ఖడ్గచాతుర్యము అందఱిని మెప్పించినది. ద్రోణాచార్యుడు అర్జునుని పుత్రనిర్విశేషముగ ప్రేమించి "పార్థఏవ ధనుర్ధరః" అనునట్లు ఉపదేశము వర్షించెను. పాండవుల పక్షము ఒకటి; అర్జునునికంటె అస్త్రవిద్యలో తక్కువవారు, అతని ఆధిపత్యము సమ్మతింపనివారు, అసామర్థ్యము, అసూయాద్వేషములు కలిగి ఏర్పడిన పక్షమునకు నాయకుడు దుర్యోధనుడు. ఆ సమయముననే కర్ణుడు విద్యాలయమున ప్రవేశించెను అన్నివిధముల కర్ణుడు సమర్థుడే. కాని అతనిజన్మ హీనమైనది. తత్కారణముగ క్షత్రియకుమారులతో సమానమైన గౌరవము లభించుటలేదని గూఢపరితాపము పొందుచున్నాడు. ఈపరితాపము అతని హృదయమును మండించుచున్నది. ఈభావము అతనిలో స్వాతిశయము పెంపొందింపచేసినది. అయినచో సమాజము తన్నేల అవమానింపవలయును ? అనునది అతనిని బాధించినది. అతనిజన్మకు కర్ణుడు ఎట్లుబాధ్యుడు ?

ఇంతలో కుమారాస్త్ర విద్యాప్రదర్శనము ఏర్పాటు చేయబడినది. అందు అర్జునుడు సకలజనులు మెచ్చునట్లు అస్త్ర శస్త్ర విద్యలను ప్రదర్శించెను. అంతలో కర్ణుడు ప్రవేశించి నిజభుజాస్ఫాలనము సకల జన భయంకరముగ చేసెను. అందరికన్నులు కర్ణునిపై బడినవి. ఆశ్చర్య చకితులైరి. ఆ సమయమున కర్ణుని ప్రవేశమును నన్నయగారు చారు భీషణముగ వర్ణించి ఉన్నారు.

"సాలప్రాంశు నిజోజ్జ్వలత్కవచు శశ్వత్కుండలోద్భాసితున్
బాలార్క ప్రతిమున్ శరాసనధరున్ బద్ధోగ్రనిస్త్రింశు శౌ

ర్యాలంకారు సువర్ణ వర్ణు ఘను గర్ణాఖ్యున్ జగత్కర్ణ పూ
ర్ణాలోలద్గుణు జూచి చూపఱు ప్రభూతాశ్చర్యులై
రచ్చటన్."

"కర్ణుండును జనుల నందఱ నదల్చి చొత్తెంచి రంగమధ్యంబున నిలిచి కలయంజూచి కృపద్రోణాచార్యులకు నమస్కరించి సజలజలధర ధ్వానగంభీరవచనంబుల నర్జును నాక్షేపించి యిట్లనియె."

"నీవ కడునేర్పుకాడవు
గావలవదు నీని గొన్ని గఱచితి మేమున్
నీ విద్యలెల్ల జూపుదు
మే వీరుల నూచి మేలు మే లని పొగడన్."
(ఆది - షష్ఠా - 31, 32, 33)

కర్ణుడు అర్జునుని ద్వంద్వయుద్ధమునకు ఆహ్వానించెను. అంత కృపాచార్యుడు రంగభంగమగునని భయపడి కర్ణుని ఒక ప్రశ్న చేసెను. "ఈ అర్జునుడు కురుకులజుడు, కుంతీ పాండురాజుల పుత్రుడు. ఇతనితో రణము చేయదలచితివేని నీదు వంశమును తల్లిని, తండ్రిని చెప్పి యుద్ధము చేయవచ్చును." ఈ మాటలు కర్ణుని హృదయములో బాకుతో గ్రుచ్చినట్లు అయ్యెను. అతడు చేయునదిలేక వర్షధారలచే పరిక్లిన్నమైన అంబుజము భంగి సిగ్గుతో తల వంచుకొనెను. భీముడు సహజమైన ధోరణితో ఉత్తమ క్షత్రియ ప్రవరోపయోగ్యమైన రాజ్యము నీకెట్లు అర్హమగును? మంత్రపూతమైన పురోడాశము కుక్కకు అర్హమగునా? ఇది ఆతనికి పుండుపై కారము చల్లినట్లు అయినది. అతనిలో ప్రతికారబుద్ధి ప్రజ్వరిల్ల చేసినది. అన్ని శక్తులను సంపాదింప అందరికంటె అగ్రేసరుడు కావలెనను భావము పొటమరించినది. విద్యాలయములో ప్రవేశించినప్పటినుండి పార్థుని ధనుర్విద్యా లాఘవము కర్ణుని నేత్రములకు మిరుమిట్లు గొల్పినది. ఏమైనను ధను

ర్విద్య యందు అర్జునుని మించవలెనను భావము కర్ణునిలో రూఢమూల మైనది. ఇంతలో దుర్యోధనుడు అర్జునుని జయించగల వీరునికొఱకు ఎదురు చూచుచున్నాడు. ఆతనికి ఇంత కాలమునకు కర్ణుడు లభ్యమై నాడు. రాజరాజు అతనిని చేరదీసి అంగరాజ్యమిచ్చి పట్టాభిషేకము చేసి కర్ణుని పేరు నిలబెట్టినాడు.

అర్జునుడు తన కన్న అస్త్రవిద్యలో అగ్రేసరుడు. ఆ మహాను భావుని దగ్గర బ్రహ్మాస్త్రమున్నది. తనదగ్గరది లేదు. కర్ణుడు ద్రోణా చార్యుని సమీపించి బ్రహ్మాస్త్రమును ప్రయోగోపసంహారములతో ఉపదేశింపు మనియు, ఆ బ్రహ్మాస్త్రముతో అర్జునుని జయించుట తన ధ్యేయమని చెప్పెను. కర్ణునకు అర్జునునిపై అకారణమైన మాత్సర్య మున్నదని చెప్పుటకు తగిన సాక్ష్యములు కలవు.

1. నారదమహర్షి ధర్మజునితో ఇట్లనెను :

"నీ నేర్పు భీము లావు నరుని పెలుబల్మి ఆతనికీ హరికి గలుగు చెలిమిగని తద్దవగ బొందు చిత్తమెరియ నకుల సహదేవ నయ శాస్త్ర కళావేదిత్వమునకు జను లనురాగాధికులై గొనియాడుటకునాతడు మనసు చేవ్వడం చింతిల్లును. అది తదీయ స్వభావం బట్లుగాక దైవఘటనంబు నట్టిద యమ్మాత్సర్యంబున నక్కర్ణుండు మీ యెడ నీసు కలవాడయి దుర్యోధను గూడికొనియె."

(శాంతి - ప్రథమ – 16, 17, 18)

ద్రోణాచార్యులకు కర్ణునకు అర్జునునిపై అకారణమాత్సర్యము రుచింపలేదు. పైగా ఆచార్యులు అర్జునుని పుత్రనిర్విశేషునిగా ప్రేమిం చుచున్నారు. ఏదియో మిషతో కర్ణుని త్రోసిపుచ్చదలచి, వ్రతసమ న్వితు భూసురుడు కాని నిరుపమాన తపస్సంపన్నుడైన నృపతి కాని బ్రహ్మాస్త్రము పొందుటకు అర్హుడని కర్ణునకా అర్హత లేదని త్రోసి

పుచ్చెను. ద్రోణునిమాటలు కర్ణునిహృదయములో మరింతపగను పెంచి నది. దీనితో అర్జునునిపైన గురువుగారిపైన ద్వేషము ఇబ్బడి ముబ్బడి అయినది. ఇక బ్రహ్మాస్త్రము ఎట్లయినను సంపాదింపవలెనని మొండి పట్టుదలతో పరశురాముని చేరి శుశ్రూష చేసెను. అచట అసత్యమాడు టచే పరశురాముడు శపించెను. కర్ణుడు బ్రాహ్మణుని హోమధేనువును పొరపాటున సంహరించుటచే యుద్ధసమయములో అతనిరథము భూమిలో క్రుంగిపోయినది. కర్ణునకు పరశురామునిపై అమితమైనభక్తి తాత్పర్యములు కలవు. కర్ణుని ఇంద్రియనిగ్రహము, సేవాభావము, విద్యాకౌశలము మెచ్చుకొని బ్రహ్మాస్త్రమును ఉపదేశించెను. కర్ణుడు అస్త్రలోభముచే అసత్యమును పలికెను. అతడనుసరించిన మార్గము దోషదూషితము. అందుచే పరశురాముడుకోపించి యుద్ధకాలమునందు బ్రహ్మాస్త్రము భాసింపదని శపించెను. కర్ణునియొక్క అభిశప్త విద్యా ధ్యయనము లోకమునకు చక్కని ప్రబోధము చేయుచున్నది. కర్ణుడనేక కష్టములుపడి విద్యలు అధ్యయనము చేసెను. కాని అతని ఉద్దేశ్యము పవిత్రము కాదు. విద్యయందలి ప్రేమచే గురువులకు శుశ్రూష చేయ లేదు. నిర్మలమైన కీర్తికొఱకు గురువులను సేవించలేదు. కర్ణుడు విద్య లభ్యసించుటకు కారణము మాత్సర్యము. అకారణద్వేషము. అర్జునుని నాశనము చేయవలెనన్న భయంకరమైన తలంపు. ఇవి అన్నియు అతని మనస్సులో కలిగినవి. దానిఫలమేమనగా కర్ణుని విద్యలన్నియు శాప దష్టములయ్యెను. కర్ణుడు విద్య విద్యకొఱకే నేర్చుకొనలేదు. అర్జునుని నాశనము చేయవలెనను తలంపు అతనినిపట్టి పీడించినది. అర్జునునిపై ఈస్పర్ధలేకున్న కర్ణునకు ద్రోణాచార్యులు తప్పక బ్రహ్మాస్త్రమిచ్చి యుండును. అంతవరకు ఎందులకు ? ద్రోణాచార్యుడు ధృష్టద్యుమ్నుడు తనమృత్యువని ఎఱింగియు అతనికి ధనుర్విద్యా రహస్యములను ఉపదే

శించెను. కర్ణుడు కాపట్యము ననుసరించెను. దానిఫలము అతని జ్ఞాన మంతయు నాశమునకు హేతుభూతమయ్యెను. దీనితో తానే గొప్ప వాడనను స్వాతిశయము పెరిగెను. అగ్నికి వాయువుతోడైనట్లు అహంకారము తోడైనది.

శ్రీకృష్ణార్జున మైత్రివలె కర్ణదుర్యోధన మైత్రి ఆదర్శప్రాయమైనది కాదు. అది స్వార్థమునకు, మాత్సర్యమునకు, ఉత్తమావమానమునకు హేతువగుట శోచనీయము. కుమారాస్త్ర విద్యాప్రదర్శనమున అర్జునుడు చూపిన అస్త్రశస్త్రాది విద్యలన్నింటిని కర్ణుడు అశ్రమముగా ప్రదర్శించెను. కర్ణుడు అర్జునుని జయింపవలెనను ఊహతో ద్వంద్వ యుద్ధమునకు నాహ్వానించెను. అప్పుడు కృపాచార్యుడు కర్ణుని వంశమును, తలిదండ్రులనుగూర్చి గుచ్చి గుచ్చి ప్రశ్నించెను. మహాసభలో తలకొట్టి వేసినంత అవమానము కలిగి కర్ణుడు తలవంచుకొనెను. ఇది దుర్యోధనునకు వెదకబోయిన తీగ కాలికి తగిలినట్లయినది. దుర్యోధనుని హృదయములో ఆశాకిరణ ముదయించినది. కర్ణుని అస్త్రవిద్యాకౌశల్యము దుర్యోధనుని కన్నులను చకచ్చకిత మొనరించినది. రాజరాజునకు కర్ణుని అండగాగొని అర్జునుని అడ్డులేకుండ ఎదిరింపవచ్చునను భావము కలిగినది. వెంటనే దుర్యోధనుడు కృపాచార్యునకు తగిన ప్రత్యుత్తరము చెప్పి కర్ణునకు అంగరాజ్యమిచ్చి జగజ్జేగీయమానముగా పట్టాభిషేక మొనరించెను. దీనితో అధఃపతితుడైన కర్ణుడు క్షత్రియుడై ప్రకాశించెను. కర్ణుని తండ్రి అయిన అతిరథుడు వచ్చి, ప్రియపుత్రుని బిగియార ఆలింగనము చేసికొని కర్ణునిపొగడెను. కర్ణుడు అభిషేకార్ద్రమైన శిరస్సువంచి తండ్రికి భక్తితో ప్రణామము చేసెను. భీముడు కర్ణుడు సూతపుత్రుడని గ్రహించి అపహాస్యము చేసెను. దీనితో దుర్యోధనుని కోపము పెచ్చుపెరిగినది. అతడు కర్ణుని తనవెంట తీసికొనిపోయి క్షత్రియులలో మాణిక్యముగా నొనర్చునని పట్టుపట్టి

సామాజిక ప్రతిష్ఠను కర్ణునకు ఒసంగెను. దీనితో కర్ణునిహృదయము కృతజ్ఞతతో నిండిపోయినది. ఆ దినమునుండి కర్ణ దుర్యోధనులమైత్రి అభేద్యమైనది. దానితోపాటు కాలకూటము కూడ పుట్టినది. దుర్యోధనుడు కర్ణుని తనవెంట నిడుకొని "దానుం దమ్ములును గర్ణుని గౌగలించుకొని నాతో బద్ధసఖ్యుండయి నాకును బాంధవులకును హితంబు చేసి నా రాజ్యభోగంబులను నీవు నుపయోగింపుము."

ఈ మైత్రి పొందిన పిమ్మట దుర్యోధనుని స్థితిలో మార్పు వచ్చినది.

దుర్యోధనునకు అర్జునుడనిన భయము కలదు. ఇక కర్ణునికి అర్జునుడనిన కెంతయో మాత్సర్యము. అందుచే తుల్యభావములు కలిగిన కర్ణ, దుర్యోధనులు మిత్రులగుట తటస్థించినది, ఈ యుభయుల మైత్రి స్వార్థపూరితమై జగత్ప్రళయ కారణమైనది. లోకానర్థప్రదమైన మైత్రి ఎంతగొప్పదైనను నింద్యమైనదే.

కర్ణుడు దుర్యోధనుని పక్షము వహించుటలో స్వార్థము లేకపోలేదు. అతనిలో కృతజ్ఞతభావము కంటె స్వాతిశయము తన మాటయే నెగ్గవలెనను మొండిపట్టుదల గలవు. లోకములో ఒక్కొక్కరు తమ మాటయే నెగ్గవలయును. తన చేయిపై చేయిగ నుండవలెనని ఆరాటపడు వారు లేకపోలేదు. ఆ కోవకుచెందినవాడు కర్ణుడు. పాండవపక్షములో అర్జునుడు ధనుర్ధరులలో తనకంటె అధికుడు, భీముడు మహాభిమాని. ఇట్టివారిలో తాను చేరినచో అందరిలో ఒకడుగా నుండవలసి వచ్చును. అంతయు తానే అనునది కుదురదు. పాండవులలో శ్రీకృష్ణునకు ఉన్న పలుకుబడి ఇంతింత అనరాదు. అందుచే ఆత్మప్రతిష్ఠకొఱకు తనమాటయే చెల్లుటకొఱకు కర్ణుడు దుర్యోధనుని పక్షము అవలంబించెను. దుర్యోధనుడు కర్ణుని ముఖమున పాండవులపై కసితీర్చుకొననెంచి తన ప్రియమిత్రునిగా వరించెను. ఆతడు కురురాజు ప్రతిష్ఠ పెరుగుకొలది తనపలుకుబడి హెచ్చునని గ్రహించి రాజరాజు ప్రసన్నుడగు

టకు ఎన్నియో చేయకూడని పనులు చేసెను. దుర్యోధనుని సామర్థ్యము పెరుగుకొలది కర్ణుని పలుకుబడి కూడ మించుచున్నది. దుర్దైవము క్రీడచే కర్ణునకు తాను కుంతీపుత్రుడను విషయము సకాలములో కుంతీదేవి చెప్పలేదు.

కర్ణుడు తనమాట చెల్లుటకొఱకు, స్వాతిశయము ప్రకాశింప చేయుటకొఱకు నీచసాంగత్యముచేసి నీచాతినీచ కార్యములు చేయుటకుకూడ ఏమాత్రము జంకలేదు. దీనికి ప్రధానోదాహరణము కర్ణుని ప్రవర్తన ద్యూతసమయములో కడు నింద్యమైయున్నది. ఈబలహీనతచే అతడు యుక్తాయుక్త జ్ఞానము, ధర్మాధర్మ విచక్షణ కోల్పోయెను. మహాపతివ్రత అయిన ద్రౌపదికి మహాసభలో భర్తలసమక్షములో అందునను వస్త్రాపహరణము జరుగనగునా ? ఇది కర్ణుడు అంగీకరింపవచ్చునా ! ద్రౌపది సామాన్య స్త్రీ కాదు. పాండవ ధర్మపత్ని. మహాసామ్రాజ్ఞి. రాజసూయయాగ సందర్భమున సార్వభౌమ సింహాసనము నధిష్ఠించినది. ఉపరి శ్రీకృష్ణుని చెలియలు. శకుని మాయద్యూతములో ధర్మజుని ఓడించి అతని సకల ఐశ్వర్యములను వంచనచే కౌరవ హస్తగతమొనర్చెను. ధారుణి రాజ్యమదంబున దుర్యోధనుడు కన్నుమిన్ను గానక ద్రౌపదిని దాసీగా పిలచెను. ఆ మహాపతివ్రతను సభలోనికి ఈడ్చుకొనిరమ్మని ఆజ్ఞాపించెను. సభలో విదురుడు వెక్కివెక్కి ఏడ్చుచున్నాడు. భీష్ముడు మిగులపరితపించి తలవంచుకొనెను. ద్రోణాచార్యుడు వణకిపోవుచున్నాడు. కాని దుర్యోధనుడు కర్ణుడు శకుని మహానందముతో కులుకుచున్నారు. దీనికి కారణముగలదు. ద్రౌపదీ స్వయంవరమున కర్ణునకు అవమానమయ్యెను. ఆబాధ కర్ణుని మనస్సులో బాణమువలె నాటుకొన్నది. దానికి ప్రతీకారమయినదని కర్ణుడు చంకలు చరచుచున్నాడు. ఆ నిండుసభలో ఆ మహామాతకు

జరుగు అవమానమునడ్డుకొని ఎవ్వరును ఆపుచేయులేదు. ద్రౌపది సభా మధ్యమున నిలబడి క్రోధ, రోషములు దైన్యములు ముప్పిరికొనగా తాను ధర్మవిజితనా ? అధర్మవిజితనా ? అని పేరుపేరున ప్రశ్నించినది? అత్తరి దుర్యోధనుని తమ్ముడు వికర్ణుడు విభీషణునివోలె ధర్మార్థ మధురముగా ద్రౌపది అధర్మవిజితయని నిర్ణయము చేసెను. అంత దుష్టుడైన కర్ణుడు దుర్యోధనునికి ప్రీతికలిగించుటకై వికర్ణుని ఇట్లు గర్హించెను.

"ఎల్లవారు నెఱుగ నొల్లని ధర్మువు,
బేల నీకు జెప్పనేల వలసె
జిఱుత వాని కింత తఱుసంటి పలుకులు
సన్నె వృద్ధజనములున్నచోట."

(సభా - ద్వితీయ - 228)

"నీవు ద్రౌపది నధర్మవిజిత యని పలికితి సభాసదులెల్ల నెఱుంగ ధర్మరాజుండు దన సర్వస్వమ్ము నొడ్డి యోటువడినప్పు డిది వానికి వెలి గాదు గావున ధర్మవిజితయ యిట్లు గానినాడు పాండవు లిందఱును దీనివిజితగా నేల యొడంబడుదురు మఱి యేకవస్త్రయై యున్న దీని సభకుం దోడ్కొని వచ్చుట ధర్మువుగా దంటి భార్యకు దైవవిహితుం డయిన భర్త యొక్కరుండ యిది యనేక భర్తృక గావున బంధకి యనంబడు నిట్టిదాని విగతవస్త్రం జేసి తెచ్చిన ధర్మవిరోధంబు లేదు"

(సభా - ద్వితీయ - 229)

ఇంతకంటె దుష్టత్వమునకు పరాకాష్ఠ యేమున్నది ? మిగిలిన వన్నియు అక్కరలేదు. ఈ ఒక్క మహాపాపమే కర్ణుని మాడ్చివేయ జాలును. హత్య చేయువానికంటె హత్యకు తగిన పథకమువేసి యిచ్చు వాడు మహాదోషి. మన ధర్మశాస్త్రములప్రకారము పాపము చేయు

వాడు, ప్రోత్సహించువాడు, అనుమోదకుడు దండనార్హులే. ఇదియే కర్ణుని నాశమునకు మూలకారణము. కర్ణుని స్వాతిశయము, అహంకారము, మాత్సర్యము, నీచత్వము, ఈఘట్టములో మిన్నుముట్టినవి. అంతటితో తృప్తి పొందలేదు. కర్ణుడు ఇట్లనుచున్నాడు :

"తరుణి యేవురకంటె నొక్కరుడ భర్త,
యగుట లగ్గు జూదంబున నాలినోటు
వడనివానిగా దగుభర్త బడయుమింక,
ననుచు రాధేయుడుల్లసమాడెనంత."

(సభా - ద్వితీయ - 245)

ఈ మాటలన్నపిదప దుర్యోధనుడు యుక్తాయుక్త వివేక జ్ఞాన శూన్యుడై ద్రౌపదిని తన ఊరుతలంబున ఎక్కగా రమ్మని సన్న చేసెను. ఈ పాపము లన్నియు నెచ్చటికి పోవును ? ఆ పాపములే కర్ణుని రణరంగమున కట్టికుడిపినవి.

కర్ణుడు దుర్యోధనుడు తనప్రియమిత్రుడైన నాటినుండి తనఘనత అతనికి అర్థమగుటకొఱకు ఎంతయో ఆరాటపడెను. తుదకు దుర్యోధనుని తనగుప్పిటలో పెట్టుకొని యథేచ్ఛగా సంచరించెను. భీష్మ ద్రోణాదులను అదను చిక్కినప్పుడెల్ల తోటకూరలోని పురుగులవలె అత్యంత తిరస్కారముగా నిందించిన ఘట్టములు భారతములో కోకొల్లలు. ఈ విధముగా రాజ్యాంగవ్యవస్థ బుద్ధిమంతులు, ధర్మజ్ఞులగువారి చేతిలో నుండి జారి దుష్టులచేతిలోపడుట దేశముయొక్క దురదృష్టము.

పాండవపాంచాల విభేదనోపాయముగూర్చి ధృతరాష్ట్రుని సమక్షములో చర్చించుచుండిరి. భీష్మద్రోణులు పాండవులను ఆహ్వానించి యథోచితముగా సత్కరించుట ధర్మయుక్తమని హితోపదేశము చేసిరి. అమ్మాటలు విని కర్ణుడు మండిపడి

"ముదుసళులు దమ కిమ్ముగా జదివికొండ్రు
గాక పతులకు హిత మగు కర్జమేల
యొలసి చెప్పరు రహితుల గలపికొనుట
ధర్మనని రిది నయవిరుద్ధంబు గాదె."

"మంత్రులు దమతమ బుద్ధిదోషంబుల నెట్లునుం బలుకుదురు వారల సాధుత్వంబును నసాధుత్వంబును నెఱుంగవలయు నెట్లనిన దొల్లి నితంతువను మగధరాజు వికలేంద్రియ వర్గుండయి శ్వాసమాత్రంబు తక్క రాజ్యతంత్రంబు నం దసమర్థుండై యున్న నాతనిమంత్రి యేకప్రధానుండయి రాజ్యతంత్రంబెల్ల దనవశంబ యగుటం జేసి వానినవమానించి తదీయ రాజ్యవిభవంబెల్ల జేకొనియె వాడును విక్రమహీనుండయి రాజ్యంబు గోల్పడియెం గావున మంత్రుల హితులవోలె నుండి యహితం బాచరింతురు మీ యిద్దఱపలుకులు మాకుంజూడ నహితంబులు."

(ఆది- అష్టమ - 38, 39)

ఇంతవరకు దుర్యోధనునకు భీష్మ, ద్రోణ, విదురులపై ఒకింత గౌరవమున్నది. దీనితో అతనిలో అదికూడ నశించినది. దుర్యోధనుడు అనవలసిన మాటలను కర్ణునిచే పలికించినట్లు గోచరించుచున్నది.

కర్ణుడు దుర్యోధనుని ఘోషయాత్రకు ప్రేరేపించుట అతని హృదయనైచ్యమును తెలుపుచున్నది. లోకములో ఇతరులు కష్టపడుచుండగా వారికి ఉపకారము చేసి కన్నీళ్ళు తుడిచి ఆనందించుట ఉత్తముల స్వభావము. ఈ కర్ణప్రవర్తన దానికభిన్నమై యున్నది. ఇతరులు బాధపడుచుండగా ఇంకను యేడిపించి పుండుమీద కారముచల్లినట్లుచేసి ఆనందించుట "ఇయాగో" వంటి వారికి చెల్లును. ఇదియే కర్ణుడు చేసినది. ఒక ఉదయమున కర్ణుడు దుర్యోధనుని సమీపించి ఘోషయాత్రకు బీజము వేయుచున్నాడు.

"ధనధాన్య పుత్రబాంధవ
జనలాభంబులను దలప సరిగావు సుఖం
బున దాను దనరి, శత్రులు
ఘనతర దుఃఖముల నుండ గని యలరుటకున్."

(అరణ్య - పంచమ - 348)

కురుపాండవుల మధ్య ద్వేషాగ్ని రగులకొల్పి ప్రజ్వరిల్ల చేసిన వాడు కర్ణుడు. కర్ణుని చేతిలో దుర్యోధనుడు కీలుబొమ్మ. చాల సందర్భ ములలో యుద్ధము యుద్ధమని రణభేరి తానే ప్రయోగించెను. ఇతని మాటల ముందర మహామంత్రి విదురుని మాటలు, భీష్ముని హితబోధ, ఆచార్యుని అనునయ వాక్యములు గడ్డిపరకవలె గాలికి ఎగిరిపోయెను. పాండవులకు అర్ధరాజ్య మిచ్చినచో తనకు పెద్దరికము ఎక్కడిది? తాను జీవితాంతము అనామకుడై బ్రతుకవలెను. కీర్త్యాశ వదలుకొన వలెను. భారత మహాసంగ్రామము రేపి దానితో పాండవులను వధించి శాశ్వతముగ కీర్తిశిఖరము ఎక్కవలెను. తన స్వాతిశయము నెగ్గుటకు భారతయుద్ధమే శరణ్యము. దీనికొఱకు కులనాశమునకు అంగీకరించెను.

కర్ణుని ఆత్మశ్లాఘ ఒక్కొక్కసారి వెఱ్ఱితలలు వేసినది. అప హాస్యభాజనమైనది. అది తన ప్రియమిత్రుడైన దుర్యోధనుని మనస్సు నకు ఆనందము కలిగించుటకొఱకే ఈ ఆత్మస్తుతి పరాయణత్వము అను బాక ఊదెను. ఘోషయాత్ర సందర్భములో కర్ణుడు శత్రువులచే ఓడింపబడి విరథుడై పలాయనము చిత్తగించెను. దుర్యోధనుడు తన శత్రువులు గంధర్వుల చేతినుండి విడిపించుటచే ఎంతయో బాధపడెను. అది మగడు కొట్టినందులకు కాదు, తోడికోడలు దెప్పినందులకు అన్న ట్లున్నది. గత్యంతరము లేక దుర్యోధనుడు ప్రాయోపవేశమునకు సంసిద్ధు డయ్యెను. అప్పుడు కర్ణుడు దుర్యోధనునితో ఇట్లు చెప్పెను :

“నీకు అర్జునునిగూర్చి ఎంతయో భయము కలదు. మహాభారత సంగ్రామములో అతనిని అశ్రమముగా చంపగల” నని ఆయుధమంటి ప్రతిజ్ఞ చేసెను.

మహాభారత సమరములో కర్ణునిరథము భూమిలోనికి క్రుంగిన పుడు ఆయుధము చేతియందు లేనివానిని, శరణాగతుని, అంజలి ఘటించినవానిని సంహరించుట రణధర్మము కాదని ధర్మపన్నములు వర్ణించెను. లోకములో మానవుడు తనశరీరములో యౌవనమున్నంతవరకు అధికారము చెల్లినంతవరకు తనమాటకు అడ్డులేనంతవరకు ధర్మమును గూర్చి న్యాయాన్యాయములగూర్చి పట్టించుకొనడు కాలముకలసిరాక తాను వేసికొన్న పథకమంతయు భగ్నమైనప్పుడు జీవితములో బోర్లా పడినప్పుడు ధర్మముసంగతి గుర్తునకు వచ్చును. శ్రీకృష్ణుడు ఆ సమయములో దుష్టచతుష్టయము చేసిన అధర్మములన్నియు తెలియజెప్పి ఆ సందర్భములో ధర్మమెక్కడికి పోయినదని నిలదీసి ప్రశ్నించెను.

“కొంతియు నందఱు కొడుకులు సుప్తులై
యుండంగ లక్కయిల్ మండ జేసి
కపటంపుజూదంబు ఘటియించి ధర్మాత్ము
డగు ధర్మసుతు సిరి యపహరించి
యంత బోవక ద్రుపదాత్మజ దెచ్చి స
భాస్థలి నమ్మోయి భంగపఱచి;
యమ్మహాత్ముల జంప నడవికి ఘోషయా
త్రావిధి నెపమున దాడి వెట్టి;
బాలు నభిమన్యు నొక్కని బహురథికుల
బనిచి చంపించె మీ సుయోధనుడు దలప
గాని, యిప్పాపముల కాదికర్త వీవ;
యన్ని యెడలను నీపాడి యెందు బోయె?”

(కర్ణ- తృతీయ- 356)

కర్ణుడు చేసిన, చేయించిన పాపములే అతనిని రణరంగమున కట్టికుపినవి.

కర్ణుడు దైవోపహతుడు. దురదృష్టవంతుడు. నియతి చేతిలో అతని జీవితమంతయు వికృత క్రీడ యైనది. దేవతలు కన్యాగర్భము భారత సంగ్రామమునకు మూలబీజమై క్షత్రియకులములన్నిటినీ బూడిద చేయుగాక అని భావించిరి. ఆ ఉద్దేశ్యము సాధింపబడుటకు కర్ణుడు జన్మించెను. తదనుగుణముగ అతనికి దివ్యఅస్త్రములు ప్రాప్తించినవి. వీరులకు యుద్ధమరణము గాని ఉత్తమలోకప్రాప్తి కలిగింపదు. అందు చేతనే దైవము అప్రతిహతమగుశక్తిచే కర్ణునిచే మహాభారత సంగ్రామము ప్రేరేపించినది. కర్ణుడు సద్గుణముల, దుర్గుణముల ప్రోవు. ఈగుణములకు కలిగిన భీకర సంఘర్షణమే కర్ణుని జీవితము.

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యుల వారు తమ 'మహాభారత విమర్శనము' అను గ్రంథమున వ్యాసమహర్షి కర్ణ పాత్రమును ఏయుద్దేశ్యముతో చిత్రించెనో సాకల్యముగ చర్చించియున్నారు.

"ఒకవ్యక్తియొక్క గొప్పతనమును గాని, తక్కువతనమునుగాని యాతని వ్యక్తిగతములైన మంచి చెడుగుణములపైననే యాధారపడి నట్లు గానరాదు. ఎవనిజీవితముచే మానవులకు హితము సేకూరునో శాశ్వతములైన నీతిమూల్యములు సంరక్షింపబడునో యదియే గొప్ప జీవితము. అందుకు విరుద్ధమైన బ్రతుకు వైయక్తికముగ నది యెంత గొప్పదైనను దానికంత వెలలేదు. కాని యతిమానుషమైన ఆశక్తియే వైయక్తికమైన మహాత్త్వాకాంక్షకు, స్వార్థమునకు అంగమైనచో, అది భయంకర పరిణామమునకు దారితీయును. మానవులకు కళ్యాణమును కలిగించుటకు మారు జాతినే ధ్వంసమొనర్చును. ఈపరిణామమునకు ప్రతీకయే కర్ణుడు."

(మహాభారతము విమర్శనము – 230 పేజి)

దీర్ఘదర్శియై, ప్రతిభావంతుడై, ఋషికవి యొనర్చు వ్యక్తిచిత్ర ములలో కొన్ని శాశ్వతసందేశములు మూర్తీభవించి యుండును. భారతమున కర్ణుని చిత్రణము కేవలము వ్యర్థముగాదు. నాశకరమైన కర్ణునిజీవితముతో నొక శాశ్వతసందేశమును మహర్షి లోకమున కొసం గెను. ఆసందేశ మేమి ? ఒకానొక పురుషుడు హిమాచలము వంటి యున్నతుడే యగుగాక, వానియందు అహంకారము, స్వాతిశయము లేకెత్తినచో వాని సమస్తశక్తులు లోకకళ్యాణకములుగాక, వినాశ కరములే అగును.

(మహాభారత విమర్శనము - పుట 324)

# 17 శకుని

దుర్యోధనుని మేనమామ శకుని. శకుని, గాంధారి ఏకగర్భ సంజాతులు. అయినను శకుని విషఫలము. గాంధారి అమృతఫలము. దుర్మార్గ, కాపట్యములకు నిలయము. దుష్టసచివ వ్యవస్థకు ప్రతీక. దుర్యోధనుని సర్వకార్యక్రమములు శకుని ప్రేరణమువలననే జరిగినవి. కుత్సిత కితవుడై జూదములో పరేంగితజ్ఞుడై విజయము సాధించువిధ మున సజ్జనులగు పాండవుల జీవితముతో జూదమాడి దుఃఖ సముద్ర ములో ముంచిన జిత్తులమారి ఇతడు. పాండవులు జగదీశ్వరుడైన శ్రీకృష్ణుని ఆశ్రయించి శ్రమలకు పాల్పడినను జయలక్ష్మిని చేపట్టిరి. దుష్టుల సాంగత్యము తాత్కాలికముగ నల్పలాభమును చేకూర్చినను, శాశ్వతనష్టమును, లోకోపద్రవమును కలిగించునని శకుని చరిత్ర వెల్ల డించుచున్నది. శకుని రోషమయతరువునకు కొమ్మయనుట తగి యున్నది.

దుష్టచతుష్టయమును పరిశీలించినచో, తుల్యమైన భావములు, ఆశయములు కలవారుగ గోచరింతురు. కౌటిల్యముయొక్క ప్రతి

రూపము శకుని. దానినుండి పుట్టినవి తీయని పలుకు, పరేంగితజ్ఞత, ఎదుటివానిని తన గుప్పిటలో పెట్టుకొను నేర్పు. స్వకీయ దుష్టలక్షణ సామ్యముండుటచేతనే దుర్యోధనునకు శకుని మార్గోపదేష్టయైనాడు. దుర్యోధనుడు బాల్యమునుండియు పాండవులపై అసూయా ద్వేషములు పెంచుకొన్నందున భీముని సంహరించుటకు చేసిన కుట్రలలో శకుని తోడ్పాటు కూడ నున్నది,

శకుని అక్షవిద్యాతిదక్షుడు. దుర్యోధనుడు ధర్మజుని రాజసూయయాగమునకు వెడలి పాండవుల ఐశ్వర్యమును చూచి అసూయాగ్ని తప్తుడయ్యెను. అదియే మంచి సమయమని శకుని మేనల్లుని వెన్ను తట్టి దుఃఖకారణమును ప్రశ్నించెను. అంత దుర్యోధనుడు "పాండవుల లక్ష్మి యెవ్విధంబున మన కపహరించుకొన నగును?" అని ప్రశ్నించెను. శకుని మేనల్లుని వెంటబెట్టుకొని ధృతరాష్ట్రుని సమక్షములో పాండవుల ఐశ్వర్యము అపహరించుటకు సులభోపాయము ధర్మరాజును మాయజూదములో ఓడించుట యని చెప్పెను. "భానుప్రభులగు పాండుమహీనాథాత్మజులలక్ష్మి యెల్లను నీకున్ నే నపహరించి యిత్తు" "ధర్మతనయుండు జూదంబునకు బ్రియుండుగాని యందుల యుక్తి-వం బెఱుంగం డే నక్షవిద్యయం దతిదక్షుండ నాతని నశ్రమంబున నోడించి తదీయ రాజ్య విభూతి నీకిచ్చెద వగవ కుండుమని" పలికెను.

ధర్మరాజునకు జూదమాడవలెనని వాంఛలేకపోయినను శకుని తనవచోనైపుణ్యముచే అతనిలోని మాత్సర్యమును రెచ్చగొట్టెను. కపటద్యూతమువలన పాండవపరాజయము, ద్రౌపదీపరాభవము, అన్నదమ్ములలో కలహము, వంశనాశము, ప్రజానాశము మొదలగు అనర్థములు దాపురించినవి. కుటిలమార్గ సంచారులైన కత్సిత కితవులతో

జూదమాడినచో ఎట్టి సజ్జనుడైనను అర్థధర్మ వివర్జితుడగునని ధ్వనితము.

శకుని పాండవుల ధర్మనిరతిని అర్థముచేసికొనియు, సందర్భానుగుణముగ పొగడినను సత్యధర్మములపై అతనికి హృదయపూర్వకమైన గౌరవమెంత మాత్రము లేదు. ఇది కుటిలరాజనీతిలోని భాగమే. ఎవరికి కీడు తలంచెనో వారిచే బంధవిమోచితుడై మేలుపొందినందుకు మానధనాఢ్యుడైన సుయోధనుడు ప్రాయోపవేశమునకు సమకట్టెను. ఆ సందర్భమున శకునిసమీపించి పాండవులను ప్రశంసించి వారిరాజ్యము వారికిచ్చుట న్యాయమని బోధించెను. ఈ శత్రుజన ప్రశంస దుర్యోధనునకు పుండుపై కారము చల్లినట్లుండునని తలచి చేసినాడు. దుర్యోధనుని మనస్తంత్రిని ప్రయోగించి చూచుటకే శకుని ఇట్లు చేసెను. ధృతరాష్ట్రుడే గూఢమైన చిత్తవృత్తికలవాడుగా గోచరించును. ఇతనికంటె మించినవాడు శకుని. శకుని పాండవుల సత్యధర్మములను గూర్చి ధర్మోపన్యాసము చేసినను వారిరాజ్యభాగము ఇప్పించుటకు దుర్యోధనుని సమ్మతింపజేసినాడా ? అదియును తనకెంత మాత్రము కిట్టదనియే చెప్పవచ్చును.

నక్కజిత్తులమారియైన శకునికి బుద్ధిబలమున్నంత బాహుబలము లేదు. అతడు సమరములోను మాయలనే పన్నెను. అర్జునుడు శకుని పన్నిన మాయలన్నిటిని పటాపంచలగునట్లు చేసి బాణములతో అతని శరీరమంతయు గ్రుచ్చి వెనుచూపునట్లు చేసెను. సహదేవుడు దుర్యోధనుని సమక్షములో కురుకులమునకు ధూమకేతువు జిత్తులమారియైన శకుని కంఠమును కోసివేసెను. దుష్టశకునివంటివారు తాము జీవించి ఉండగనే అత్యుత్కటమైన పాపమునకు ప్రతిఫలము ఇచ్చుటనే పొందుదురని శకునివధ నిరూపించినది. దుష్టుడైన శకునిని నమ్మికొని దుర్యోధనుడు సమూలముగ నశించెను. మానవులు దుష్టులను దూర

ముగా నుంచుకొని కామజములైన వ్యసనములకు దూరముగా నున్న వుడే ఉభయలోకసౌఖ్యము పొందుదురని సూచితమైనది.

# 18. శల్యుడు

వ్యాసమహర్షి శల్య, శకునులను ప్రతియోగముగ చిత్రించెను. "మాతులః సర్వఘాతుకః" అను నానుడి ఇరువురకు అన్వర్థమై యున్నది. ఈతని తోబుట్టువు మాద్రియే పాండురాజు భార్య. ఆభిజాత్యమదము, పొగడ్తకు లొంగిపోవుట, చిత్తశుద్ధిలేని కార్యనిర్వాహణము, శ్రీకృష్ణునితో ప్రతిభటత్వము వహించుట ఇతనిలోని దుర్గుణములు. మేనల్లురైన పాండవులయెడ సానుభూతి కలిగియుండుటయే ఆతనిలోని సుగుణము.

మానవహృదయము మహాసముద్రము. ఆ సముద్రములో ఆణిముత్యములతో పాటు లోకోపద్రవములైన మకర తిమింగలాదులును కలవు. పరిస్థితుల ప్రాబల్యము, విధి అనుల్లంఘ్యమైనది అని నిరూపించుటకు వ్యాసమహర్షి భారతములో నిరూపించియున్నాడు. పాండవులు అరణ్యవాసముచేసి అజ్ఞాతవాసమును ముగించుకొని ఉపప్లావ్యము నందున్నారని విని వారిని ఓదార్చి భావిభారత సంగ్రామములో తన చేతనైనంత సాయముచేయు తలంపుతో సైన్యమును వెంటబెట్టుకొని వచ్చుచుండెను. అది కనిపెట్టి దుర్యోధనుడు శల్యునిసేనకు వలసిన సమస్త సౌకర్యములు సమకూర్చెను. అల్పసంతోషియైన శల్యుడు ఈ సౌకర్యములకు ఎంతయు ఆనందముపొంది ఈ సౌకర్యమును చేసిన వారెవ్వరో తెలుపుడు వారికి వరము లిత్తునని పలికెను. అచటనే గూఢముగా నున్న దుర్యోధనుడు ప్రత్యక్షమై శల్యుని భారత సంగ్రామములో తనపక్షమున సైన్యాధిపత్యమును వహింపుమని కోరెను. శల్యుడు గత్యంతరము లేక అంగీకరించెను. అతడనుకొన్నది ఒకటి,

జరిగినది ఒకటి. దీనినిబట్టి శల్యుడు భోగప్రియుడనియు, పొగడ్తకు లొంగిపోవు బలహీనుడనియు తెలియుచున్నది. విధియొక్క దుస్తరత్వముకూడ నిరూపించబడినది.

శల్యుడు పాండవులకడకు వెడలి జరిగిన వృత్తాంతమంతయు తెలిపి పాండవులు విధిచేత వంచితులై అనేక కష్టములు, అనుభవించినందుకు ఎంతయో నగచి వారిని ఓదార్చెను. ఆ సందర్భముననే నహుషకథనుచెప్పి అచిరకాలములో పాండవులు పూర్వైశ్వర్యమును పొందగలరనిచెప్పెను. దీర్ఘదర్శియైనధర్మరాజు భారతయుద్ధములో అర్జునునికి ప్రతిద్వంద్విగా యుద్ధముచేయుచున్నప్పుడు కర్ణునికి సారథ్యము చేయుచు నిరుత్సాహము నూరిపోయుచు, అర్జునుని విజయమునకు తోడ్పడుమని కోరెను. దానికి శల్యుడు అంగీకరించెను. శల్యుడు ఇంతకుమునుపు దుర్యోధనునకు వాగ్దానము చేసి, మరుక్షణములో దానికి వ్యతిరేకముగా ప్రవర్తించుట తగునా ? అను ప్రశ్న ఉదయించును. మాయావిని, మాయతో జయింపవలెను అను కూటనీతిని శల్యుడు దుర్యోధనునిపట్ల ప్రయోగించినాడని సమాధానము.

శల్యునకు ఆభిజాత్యమదము కలదు. దర్పము ఎవరికిఉన్నను అది సర్వానర్థప్రదము. పొగడ్తకు ఉబ్బిపోవు బలహీనత శల్యునకు కలదు. అతడు తనకంటె తక్కువవాడయిన సూతజునికి సారథ్యము వహించుట కెంతమాత్రము సమ్మతింపలేదు. శల్యుని బలహీనత గుర్తించి దుర్యోధనుడు అతనిని తనవశము చేసికొనుటకు తననైపుణ్యమంతయు ప్రదర్శించెను. దుర్యోధనుడు శల్యుని మునగచెట్టు ఎక్కించినతోడనే మద్రపతి తనను శ్రీకృష్ణునకంటె అధికుడని అగ్గించినందులకు ఉబ్బి తబ్బిబ్బయ్యెను.

"నను గృష్ణుకంటె నధికుం
డని యిమ్మనుజేంద్రకోటి యాకర్ణింపం

గొనియాడితి విమలయశో,
ఘను డగుకర్ణునకు రథము గడపెద నధిపా."

(కర్ణ - ప్రథమ - 253)

అతడు పొగడ్త కుబ్బిపోయి, శ్రీకృష్ణునితో ప్రతిభటత్వమును కోరి కర్ణుని రథసారథ్యమునకు అంగీకరించెను. పొగడ్త చేయుటవలన ఆనందించు వ్యక్తి, పొగడ్త చేయువాడు ఇరువురు నష్టపోవుదురు అను నది శల్యదుర్యోధనులపట్ల సార్థకమైనది.

సమరము ప్రారంభమైనదే తడవుగా కర్ణుడు ఆత్మస్తుతికి శ్రీకారము చుట్టినాడు. వెంటనే శల్యుడు కర్ణుని నిందించుటకు అర్జునుని పొగడుటకు పూనుకొనెను. శ్రీకృష్ణుడు ఉత్సాహ వాక్యములు పలికి అర్జునకు విజయలక్ష్మి కరగ్రహణము చేయించగా శల్యుడు కర్ణుని వెన్నుపోటు పొడిచి ఆతని వధ తన చేతిమీదుగ చేయించినాడు. శ్రీకృష్ణ సారథ్యమునకు శల్యసారథ్యమునకు హస్తిమశకాంతరమున్నది. కార్యము చేయుటయందు చిత్తశుద్ధి లేనివారిపై గురుతరబాధ్యత పెట్టినచో ఈ విధముగా విషఫలితము నొసంగునని శల్యసారథ్యము నిరూపించుచున్నది.

కర్ణ మరణానంతరము శల్యుడు కౌరవ సైన్యాధిపతియై పాండవ సేనపై విజృంభించెను. జగన్నాటక సూత్రధారియైన శ్రీకృష్ణుడు శల్యునికి ఎదురుగ ధర్మజుని నిలిపినాడు. ధర్మజుని శక్తిదెబ్బకు శల్యుడు మరణించెను. ముఖస్తుతికి లొంగిపోవుట, చిత్తశుద్ధిలేనివారిపై బాధ్యతాయుతమైన కార్యము పెట్టుటవలన, ఉభయపక్షములకు కీడును, తుదకు ఆత్మనాశము అపకీర్తి కలుగునని శల్యపాత్ర నిరూపించుచున్నది. శల్యసారథ్యముచేయు వ్యక్తులు ఈనాటికి మనకు కనిపింతురు. మానవులు అట్టి శల్యసారథ్యప్రవృత్తిగల వారిని దూరముగా నుంచుకొన్నపుడే ఉభయలోక సౌఖ్యము పొందుదురని సూచితము.

# 19. అశ్వత్థామ

అశ్వత్థామ ద్రోణాచార్యుని ఏకైకపుత్రుడు. మూర్ఖావేశము, క్రౌర్యము, క్రోధము, శత్రుప్రతీకారపరాయణత్వము, పితృభక్తి, స్వామిభక్తి, మిత్రవాత్సల్యము మూర్తీభవించిన మూర్తియే అశ్వత్థామ. అతడు ఉత్తమ బ్రాహ్మణవంశములో పుట్టినను అందున ధనుర్వేదాచార్యుడైన ద్రోణునికి కృపికి పుట్టినను, ఆ సంస్కారము ఏ మాత్రములేని కర్కశహృదయునిగా గోచరించును. వ్యక్తులమహత్త్వమునకు తల్లిదండ్రులు ఎంతమాత్రము బాధ్యులు కారు. అది వారి పూర్వజన్మ సుకృతానుగుణముగా సంక్రమించును. అశ్వత్థామపాత్రను పరిశీలించినచో, ఇతడా గురువు కడుపున పుట్టినవాడు ? అను లాఘవ భావము కలుగును. ఇన్ని దుర్గుణములతో పాటు ఆతని గురుభక్తి, స్వామిభక్తి; మిత్రభక్తి, అతనిపై మనకు సానుభూతి కలిగించుచున్నవి. ఉత్తమ వంశజుడు కామక్రోధములకు బానిస అయినచో ఎట్టి ఘోరములు చేయునో, ఎంత భ్రష్టత్వము పొందునో అశ్వత్థామ పాత్రవలన నిరూపితము. ఆవేశపరులగు క్రోధపరాయణులకు భయంకర రాస్త్రములు బోధించినచో కలుగు విషఫలితములు ఇతని ప్రవర్తన వలన తెలియుచున్నవి.

అశ్వత్థామ తాను ఆచార్య పుత్రుడనియు శిష్యులందరికంటె తానే అధికుడననియు, శిష్యులందరికంటె తండ్రిపై అధికారము తనకే కలదనియు అహంకార స్వాతిశయములు పెంచుకొనెను. దీనికి తోడు విద్యాలయములో చేరినంతనే ఆతనికి దుర్యోధనాదులతో అభేద్యమయిన మైత్రీబంధ మేర్పడినది. అశ్వత్థామ, దుర్యోధనులు, తుల్య గుణములు కలవారగుటచేతనే మిత్రులగుట తటస్థించినది.

అర్జునుడు విద్యాభ్యాసకాలములో ప్రతిదినము అస్త్రశస్త్రవిద్యా పరిణతిచే నిరంతర కృషిచే సర్వశిష్యులలో సర్వశ్రేష్ఠుడై ప్రతిభా సించుట దుర్యోధనునితోపాటు అశ్వత్థామకు అసూయాకారణమైనది. తదనుగుణముగా అశ్వత్థామ రహస్యముగా అన్నసాధకుని పిలిచి, అర్జునునకు ఎన్నండును అంధకారమున అన్నము పెట్టవలదని ఆజ్ఞాపించెను.

ధనమును, విద్యయును, వంశంబును, దుర్మతులకు మదవివర్ధమానమగును. అదియే అశ్వత్థామపట్ల సిద్ధించినది. బ్రహ్మాస్త్రము, తండ్రి నుండి పొందవలెనను చాపల్యమున్నను, కాని అతనికి దానికి తగిన అర్హత, సౌజన్యము బ్రాహ్మణోచితమైన ఇంద్రియ నిగ్రహము, జగత్ కళ్యాణకాంక్ష లేవు. ఆచార్యుడు ప్రియపుత్రుని చాపల్యమును, అయోగ్యతను గుర్తించియే, బ్రహ్మాస్త్రము ప్రయోగించుట ఉపదేశించి, ఉపసంహారమంత్రము ఉపదేశింపలేదు. దీనినిబట్టి అశ్వత్థామ అయోగ్యత తండ్రికి మొట్టమొదటినుండి తెలియును. ఈ విషయము శ్రీకృష్ణుడు తెలిపియున్నాడు.

> "సకలపృథివియు దహింప జాలునట్టి బ్రహ్మశిరోనామకం బను దివ్యాస్త్రం బశ్వత్థామకు ద్రోణు డిచ్చె బ్రియాతిశయంబున విద్యచ్చునకు నొసంగె నశ్వత్థామ విద్యచ్చుతోడిమత్సరంబున దదీయబలనైపుణ్యంబునకు నసహ్యంబు పడుటబదంపడి యెఱింగి పాండవులపై వీడు దీనిం బ్రయోగింపకుండవలయు నని తలంచి యమ్మహాసీయసాధనంబు మనుష్యులపై బ్రయోగించు కొలది గా కుని కియుం గలదు గావున సర్వధర్మవిదుండైన యగ్గురుం డొక్కనా డస్త్రవిషయ సంభాషణ సమయంబున నతనితో నిట్లనియె."

"మనుజులపై బ్రహ్మశిరం
బను నస్త్రం బేసితేని నశుభం బొలయున్
విను మెన్ని యాపదలు వ
చ్చిన నపరోపాయములన చెఱుపుము పుత్రా."

"అని చెప్పి మనోగతం బవశంబై నాలుకకు వచ్చిన నీ డెట్లును సజ్జనులవృత్తంబున బ్రవర్తిల్లెడునే యని యతండు విన నుగ్గడించె దానికి నశ్వత్థామ విషాదంబున గుందియుండుగాని యుగ్గురుని చెప్పినట్లు సదుపదేశకరణనిష్ఠుండుగాడు."

(సౌప్తిక - ద్వితీయ - 44, 45, 46)

దురభిమానము, ఆవేశము, క్రోధము, అసహనములు అతనిని పట్టి బొమ్మవలె ఆడించినవి. ఒకప్పుడు అశ్వత్థామ తనకు శ్రీకృష్ణు నకు గల అంతరము గుర్తింపలేక, శ్రీకృష్ణుని సమీపించి బ్రహ్మ శిరోనామకాస్త్రము తాను ఇచ్చెదననియు, ప్రతిఫలముగ తనకు సుదర్శనాయుధము నొసంగుమని కోరెను. ఆ సుదర్శనాయుధ మును అశ్వత్థామ కనీస మెత్తజాలక మొగ్గతిలపడెను. అంతటితో తృప్తినొందక ఆతడు శ్రీకృష్ణుని తనతో సంగరముచేయుమని సవాలు చేసెను. అది ఆతని అవివేకమునకు దురహంకారమునకు, దుస్సాహస మునకు పరాకాష్ఠ.

అశ్వత్థామలో దుర్గుణములతోపాటు అచంచల పితృభక్తి, స్వామిభక్తి, మిత్రవాత్సల్యము ఉన్నవి. అవి అతనియెడ మనకు సాను భూతి కలిగించుచున్నవి. ఆవేశపరుల చిత్తవృత్తి చిత్రాతిచిత్రము. ఒక క్షణములో అవి లోకానర్థమునకు దారి తీయును. మరుసటి క్షణ ములో ఆవ్యక్తియేనా ? ఇతడు అను ఆశ్చర్యము కలుగును. అశ్వ త్థామ తనకెంత నష్టముకలిగినను పట్టించుకొనలేదు. తాను మనసార ఆరాధించిన పితృపాదులకు ప్రియమిత్రునిపై ఉగ్రవాలుటకూడ

సహింపలేడు. మహాభారత సమరములో ధృష్టద్యుమ్నుడు తన కట్టెదుట శరాసన గురుడు, వయోవృద్ధుడు అగు ద్రోణాచార్యుల కంఠము ఖండించుటచూచి అశ్వత్థామ పొందిన ఆవేదనము, క్రోధము ఇంతింత అనరానివి.

"చావులు లేవె యెందు ననిఁ జచ్చుట యెప్పుడె యిట్లులోకసం
భావితు నమ్మహాత్ముఁ దల పట్టి నొకండను వాఁడిమాట యు
మ్మొ్మ వడిఁదాకి చిత్తమున కార్తి యొనర్ప సహింపరాదు గా
కే విన నుక్కివాడెఱుగఁడే నను నిమ్మెయి భంగపెట్టునే."

(ద్రోణ - పంచమ - 335)

"నాదివ్యాస్త్రంబులు బా
హాదర్పము నింక గాల్పనా గురు డాజిం
దా దిక్కుమాలి పగతుని
చే దైన్యము బొందెనకట యిసీ యే మందున్."

(ద్రోణ - పంచమ - 336)

అశ్వత్థామ దివ్యాస్త్రవిశారదుడై బాహుబలము కలిగినను, తాను చూచుచుండగా శత్రునుచే, తనతండ్రి దిక్కుమాలిన మరణము పొందినందులకు నితాంత చింతాక్రాంతుడై, తనజన్మ కాల్పనా అని వాపోయెను. అతని దురాగ్రహము మిన్నుముట్టినది. యుక్తాయుక్త వివేకశూన్యుడై, శ్రీకృష్ణసహితులైన పాండవులెల్లరను పరిమార్తునని ఘోరప్రతిజ్ఞ చేసెను. దుర్యోధన ప్రియమిత్రుడైన అశ్వత్థామ రాజరాజునకు, ప్రియము కలిగింపదలచి, నారాయణాస్త్రము, ఆగ్నేయాస్త్రము పాండవులపై, ప్రయోగింపగా వ్యర్థమయ్యెను. అశ్వత్థామ, ప్రతిజ్ఞయు, అస్త్రశస్త్రబలమును, అధర్మావిలమగుటచే, నిష్ప్రయోజనములైనవి. క్రోధమునకు ఫలితము మనోవేదనము అని సూచితము.

అశ్వత్థామ అత్యుత్కట భావావేగి. రాజరాజు, దుర్యోధనుడు ఏకాదశాక్షౌహిణి సేన కలిగియు, భీష్మ ద్రోణ, కృప కర్ణాదులువంటి అతిరథులు, కన్నాకువలె రక్షించినను, భీమునిచే, ఊరుభంగము పొంది శిరస్తాడనము చేయబడి, దైన్యస్థితిలోనుండెను. ప్రియమిత్రుని దైన్యావస్థనుచూచి అశ్వత్థామ ఎంతయో విలపించెను.

పితృపాదులైన ద్రోణులు నీచమరణము పొందుటకు, ప్రియమిత్రుడైన దుర్యోధనునకు తీరనిపరాభవము కలుగుటకు, అతడు ఎంతయో చింతించెను. తత్ఫలముగ అతనిలో క్రోధాగ్ని ప్రజ్వరిల్లినది. నిద్రపోలేదు. కామక్రోధములు రెండును భీకరశత్రువులు. నరకద్వారములు. ఎంతటిపనినైన చేయింప సమర్థములు.

శత్రుప్రతీకార పరాయణుడై, గురునందనుడు క్రోధాతిశయంబున నిదురబోవక అర్ధరాత్రివేళ, మఱ్ఱిచెట్టుక్రింద కూర్చుండి శత్రుసంహారణోపాయమునుగూర్చి యోజించుచుండెను. అంతలో గుడ్లగూబ వచ్చి కాకిపిల్లలను పొట్టనుపెట్టుకొనెను. ఇదిచూచిన అశ్వత్థామ తానును శత్రువులను ఈవిధముగా సంహరించుటకు నిశ్చయించెను. కృపాచార్యుడు మేనల్లునకు ఇది అకార్యమనియు, అధర్మమనియు, నిద్రించినవారు మరణించినవారితో సమానమనియు; బ్రాహ్మణవంశములో పుట్టి, ఇట్టి అధర్మము చేయుట యెంతమాత్రము తగదని, హేతుపూర్వకముగా ప్రబోధించెను. కృపునిమాటలు అతనికి ఎంతమాత్రము రుచింపలేదు. అతడు తానుచేయునది దోషభూయిష్ఠమని తెలిసియు, మూర్ఖవృత్తితో అధర్మమునకు ఒడిగట్టుట క్షమించరాని తప్పిదము. జన్మచేత బ్రాహ్మణుడయ్యును అతనిలో ఏకోశమున ఆర్ద్రత లేదు. ప్రతిపదమున అతని క్రౌర్యచిత్తవృత్తి, పాషాణహృదయము వ్యక్తమగుచున్నవి.

"శాంతుండు గానివిప్రుండును దేజస్విగాని రాజును దక్షుండుగాని వైశ్యుండును ద్రివర్ణానుకూలుండు గానిశూద్రుండును నిందంబడుదు రది యట్లుండె నేనును విప్రకులంబునందు జనపూజితంబైన వంశంబు నందు జనియించి భాగ్యహీనతవలన రాజోచితధర్మం బనుష్ఠించితి నడుమ నానిష్ఠ వదలి విప్రధర్మంబు మహనీయంబైన నది యాచరించు వాడనగుట నామదికిం జూడ మేలై యుండ దదియుంగాక."

(సౌప్తిక - ప్రథమ - 48)

'మేటి విల్లును, దివ్యాస్త్రకోటిని ధరించి, సమరాంగణమున ప్రకాశించు నాతండ్రిని ఒకడు సంహరించెను. అదిచూచి శత్రువు జీవించియుండగా, నేను ఏవిధముగా తలెత్తుకొని తిరుగగలను? శరజాల పటిష్ఠతతో, నాశత్రువులను కొందఱిని చంపుదును. కొందఱిని కంఠ ములు తుంతును. భూమిని రక్తముతో అభిషేకము చేసెదను.'

బ్రాహ్మణవంశములో పుట్టియు, అశ్వత్థామ ఆ ధర్మమును ఉజ్జ గించుటయేగాక నీచముగా అధర్మమని తెలిసియు, మూర్ఖుడై, మొండి పట్టుదలతో ప్రవర్తించుట అతనిలోని దోషము.

ఎంతక్రూరుడైనను, అధర్మము, అన్యాయము చేయుచున్నపుడు మానవుడు మానసికసంఘర్షణము పొందుట సహజము. అంతర్వాణి ప్రబోధము ననుసరించి తనచరిత్రను చక్కదిద్దుకొన్నచో ఆ మానవుడు ఉత్తమగతిని పొందును. అట్లుగాక ఆ ప్రబోధమును ఎంతమాత్రము లెక్కచేయక ధర్మసేతువును భజించినచో, నరకమును పొందును. అశ్వత్థామ తనప్రతిజ్ఞను నెరవేర్చుకొనుటకు పాండవశిబిరమునకు వెడలుచుండెను. పరమశివుడు మహాభూతాకృతి వహించి అతనిని ఎదు ర్కొనెను. అశ్వత్థామ శరములు, అస్త్రములు అన్నియు ఆ భూతా కృతి ముందు బెండుపోయెను. ఆ భూతముయొక్క సర్వావయవములలో

భీకర విష్ణురూపములు ప్రత్యక్షమైనవి. అపుడు అశ్వత్థామ మేనమామ చెప్పిన హితోపదేశము పెడచెవిని పెట్టినందులకు ఇట్టి దుస్థితి కలిగిన దని యెంతయో పశ్చాత్తాపము పొందెను.

ఈ పశ్చాత్తాపము శ్మశాన వైరాగ్యమువంటి దైనది. అతడు మూర్ఖావేశముతో అధర్మమునే చేయుటకు నిశ్చయించెను. తుదకు అశ్వత్థామ శత్రుప్రతికారము చేయుటకొఱకు, శివునికి ఆత్మోప హారము ఇచ్చుటకు తెగించెను. మానవుడు పరమేశ్వరారాధన ఉత్తమ గతి పొందుటకు, మోక్షము పొందుటకు చేయవలెను. మాత్సర్య ముతో పరుల కపకారముచేయు నీచబుద్ధితో పరమేశ్వరారాధనము చేసినచో నీచగతి పొందుట తథ్యము. అశ్వత్థామ అదియే పొందెను.

రాక్షసావేశమునకు, క్షుద్రమైన పరాక్రమము అగ్నికి వాయువు వలె, తోడైనది. దాన అశ్వత్థామ నిద్రాముద్రితులైన ధృష్టద్యు మ్నుని, ఉపపాండవులను గొంతుకలు నరికి అమానుషముగా చంపెను. అశ్వత్థామ బ్రాహ్మణోచితముకాని దీర్ఘక్రోధము వహించుటచే పత నము పొందినాడు.

క్రూరకర్ముడు, కపట ధార్మికుడైన అశ్వత్థామ తన ప్రాణమును రక్షించుకొనుటకొఱకు, వ్యాసమునీశ్వరుని ఆశ్రమమునకు వెడలి తాపసి యయ్యెను. ప్రళయకాల రుద్రుడైన భీముడు తనపై విజృంభించుట చూచి, అతనితో యుద్ధము చేయజాలక, అశ్వత్థామ బ్రహ్మశిరోనామ కాస్త్రము అపాండవము కావలెనని ప్రయోగించెను. అర్జునుడు తనను, తనసోదరులను కాపాడుకొనుటకు, బ్రహ్మాస్త్రము ప్రయోగించుచు, గురునందనునకు కీడు కలుగకుండవలెనని ప్రార్థించెను. ఇది అశ్వత్థామ, అర్జునులకు కల తారతమ్యము. అర్జునుడు ప్రియశిష్యుడు అగుటకు, అశ్వత్థామ ప్రియపుత్రుడైనను ప్రియశిష్యుడు కాకపోవుటకు కారణ మిదియే.

వ్యాసమహర్షి, శ్రీకృష్ణుడు వేయివిధముల పాండవేయగర్భము లలో ఒకదానినైనను మిగులునట్లు చేయుమని అశ్వత్థామకు హితోప దేశము చేసిరి. ఆ పాపాత్ముడు అ మాటలను తిరస్కరించెను. జగ దీశ్వరుడైన శ్రీకృష్ణుడు ఉత్తరాగర్భమును రక్షించెను. అశ్వత్థామ, రాక్షసావేశమునకు నీచ పరాక్రమమునకు తగిన ప్రతిఫలము పొందెను. గత్యంతరము లేక అతడే తన శిరోరత్నమును పెకలించి భీమున కొసం గెను.

అశ్వత్థామ చేసిన అత్యుత్కటమైన పాపమునకు ప్రాయశ్చిత్త ముగా, తగిన శిక్షను శ్రీకృష్ణుడే విధించెను.

"బాలఘాతివగు నీకు నశనంబు దుర్లభంబై సహాయరహితుం డవై దుర్గంధరక్తంబున నంగంబు దిగ్ధంబగుచుండ మూడు వేలేండ్లు దిరుగుము."

(సౌప్తిక- ద్వితీయ- 86)

అశ్వత్థామ కామక్రోధములకు బానిసయై ఇహలోకమందే నరకము పొందెను. మాత్సర్యము ఎంత పరాభూతమగునో, అంతకంటె ద్విగుణీకృత వేగముతో, పెంపొంది తుదకు దుర్గతికి హేతుభూతమగు నని అశ్వత్థామ పాత్రముఖమున నిరూపితము.

## 20. కుంతీమహాదేవి

వాల్మీకిమహర్షి రామాయణకావ్యములో సీతామహామాతను చిత్రించి భారతీయుల కారాధ్య దైవతముగా ప్రసాదించెను. జగదేక మాత జానకీదేవి. వ్యాసమహర్షియు భారతామ్నాయములో స్త్రీ మనస్తత్త్వమును భారతీయ మహిళామణి స్వరూపస్వభావములను నిక్షే పించి కుంతీమాతను వీరమాతగా రూపొందించెను. స్త్రీ జీవితదశలో

కన్యగ, భార్యగ, తల్లిగ, అత్తగ ఎంత ధర్మోదాత్తముగా ప్రవర్తించి నదో సాంగోపాంగముగ ఆవిష్కరించెను. భాస, కాళిదాస, భవభూతులు వాల్మీకివ్యాసుల అడుగుజాడలలో నడిచి స్త్రీస్వభావమును భారతీయమహిళామ తల్లియొక్క వైశిష్ట్యము నిరూపించిరి. సంస్కృత కవీశ్వరులతో దీటుగ కవిత్రయము కవులును పాత్రచిత్రణము చేయుట సహృదయ హృదయంగమము.

కుంతీదేవి శుద్ధ సత్త్వతమో మిశ్రితమైన రాజసము మూర్తీభవించినది. కుంతీదేవి వినయాభిమానవివేక సౌజన్యాది సదమల గుణరత్న విభూషితగా ప్రసిద్ధి బడసినది. స్త్రీలకు కష్టసహిష్ణుత, అతిథి సేవాతత్పరత, సౌశీల్యము, మాతృహృదయము పెట్టని ఆభరణములు. కుంతీదేవి మొట్టమొదటిపేరు పృథ. ఆమె యాదవకుల విభుడయిన శూరుని జ్యేష్ఠతనూజ. శూరుడు తన మేనత్త కుమారుడయిన కుంతి భోజునకు బిడ్డలు లేకపోవుటచే పృథను పుత్రికగా పెంపకమునకు ఇచ్చెను. ఆమె బాల్యమునుండియు అతిథి, అభ్యాగతులకు సేవచేయుచు ఇష్టాన్నప్రదానము చేయుచు వారి ఆశీస్సులు పొందినది. కుంతి, ఎవని పేరు చెప్పినంతమాత్రముననే భయభ్రాంతులగుదురో అట్టి సులభకోపి అయిన దుర్వాసోమునీశ్వరుని ఆరాధించి ఆతని హృదయమునుచూరగొన్నది. సర్వసీమంతినులకు కుంతి అతిథిసేవ, వినయము, మార్గదర్శకములు.

లౌకికజగత్తున పురుషులకంటె వనితలజీవితములో క్లిష్టాతిక్లిష్టమైన పరిస్థితుల ఎదుర్కొనవలసి వచ్చుచుండును. అప్పుడు సమస్యలను పరిష్కరించుటకు ధీరోదాత్తత, ధర్మాభిముఖ్యము అత్యంతావశ్యకములు. కన్యగానుండగా కుంతివిషమ పరిస్థితులను ఎదుర్కొనిఅపూర్వ ధైర్యము ప్రకటించినది. కుంతీదేవి కన్యకగానుండ సూర్యప్రసాదమున కర్ణుని ప్రసవించి గంగ కర్పించినది. దీనిని పురస్కరించుకొని కుంతిని

ఆడిపోసికొనువారు లెక్కకు మిక్కుటము. కర్ణ జన్మవృత్తాంతముతో విధి క్రీడలాడినది. కుంతీదేవి అప్పుడున్న పరిస్థితిని మనము ఒకింత సానుభూతితో అర్థము చేసికొన్నచో ఆమెకు న్యాయము కలుగును. ఆ మహామాత పరులఇంటిలో కీలుబొమ్మవలె స్వాతంత్ర్యము లేక జీవించుచున్నది. పెండ్లి కాకుండ పుట్టినబిడ్డను తీసికొని ఇంటికివెడలి సంఘముతో పోరాడుశక్తి ఆమెకులేదు. అయ్యును బాలభాస్కరునివంటి మోమందము కలవాడును, బోసినవ్వులు ఒలకపోయు చిట్టిపాపాయిని గంగలో విడిచిపెట్టుటకు ఆ మహామాత హృదయము ఎంతయో కుందినది.

"ఏల యమ్ముని నాకు నిచ్చె నిమ్మంత్ర మిమ్మంత్రిశక్తి యే
నెఱుగంగ వేఁడి
యేల పుత్త్రికు గోరి యెంతయు భక్తి నిను దలంచితి బ్రీతి
నినుడును నాకు
నేల సద్యోగర్భ మిచ్చె గుమారుడేల యప్పుడ యుదయించె
నింకెట్టు
లీలోకపరివాదమే నుడిగింతు నింతకు నింతయు నెఱుగరె
జనులు."

(ఆది - పంచమ - 28)

"ఈ బాలునెత్తుకొని యింటికి జన్న నన్నున్
నా బంధు లందఱు మనంబున నేమనా రె
ట్లీ బాలు సూర్యనిభు నిట్టుల డించి పోవం
గా బుద్ధి పుట్టు నని కన్య మనంబులోనన్."

(ఆది - పంచమ - 29)

విధియొక్క బలవత్తరత్వము సూచించుటకొఱకే కుంతి ఇట్లు చేసినదని సూచితము. కర్మయొక్కఫలము అవశ్యము జీవి అనుభవించి తీరవలసిందే.

40

కుంతీదేవి సహపత్నియగు మాద్రీదేవిని అనుంగు సోదరివలె ప్రేమించి గౌరవించినది. మాద్రిభర్తతో సహగమనము చేయుచు తన గారాబపు బిడ్డలను కుంతీదేవి చల్లనిచేతిలో పెట్టి కన్నుమూసినది. దీనినిబట్టి మాద్రికి పృథపై ఎంత విశ్వాసమున్నదో తెలియుచున్నది. నకులసహదేవులను కుంతి తనబిడ్డలకంటె మిన్నగా చూచుచు కంటికి రెప్పవలె కాపాడినది. ఆ చల్లనితల్లికి కడగొట్టుకొడుకైన సహదేవుడన్న పంచప్రాణములు. పాండవులు అరణ్యవాసమున కరుగుచున్నపుడు కుంతి కోడలికి సహదేవుని ఇల్లడపెట్టుచు పలికినమాటలు ఆమె మాతృహృదయమును వెలార్చుచున్నవి.

"అన్న సహదేవ ! నీవును,
నన్నలతో నరిగెదయ్య యట యడవుల కీ
వున్నను సుతు లందఱు నిం,
దున్నట్టుల నాకు జిత్త మూఱడియుండున్."

(సభా - ద్వితీయ - 288)

కన్నప్రేమకంటె పెంచినప్రేమ చాలదొడ్డది. తిక్కనగారు కుంతీదేవికి సహదేవునియందు ఎంత వాత్సల్యమున్నదో ప్రతిపద మధురముగ వర్ణించియున్నారు.

"కడు పసిబిడ్డ పీ వొకటి గాదవునా నెఱుంగడు ముందరె
వ్వ్యెడ నొకపాటెఱుంగ డెద వెంతయు గోమల మెప్పుడైననే
గుడువగ బిల్తు గాని తనకుం గల యాకటి ప్రాద్దెఱుంగ డీ
కొడుకిటు పోకకున్ మనము గుందెడు నిన్ గని

యూఱడిల్లెడున్."

(విరాట - ద్వితీయ - 213)

అల్లె మల్లెల చల్లదనముకంటె మంచిగంధముకంటె ముత్యములకంటె చంద్రుమామ వెన్నెలకంటె తల్లిప్రేమ తీయనిది, చల్లనయి

నది కదా ! ఆశ్రమవాసమునకు గాంధారీ ధృతరాష్ట్రులు వెడలిపోవు చుండిరి. సమయజ్ఞయగు కుంతీదేవి ఆ వృద్ధదంపతులను అనుగమించి వెడలుచున్నది, కొంతకాలమునకు ధర్మరాజాదులు గాంధారీ ధృత రాష్ట్ర కుంతులను సందర్శించుటకొరకు అరణ్యమునకు వెడలిరి. అప్పుడు సహదేవుడు అన్నలకంటె ముందుగ పరుగెత్తుకొని ఆవుదూడ తనతల్లిని చేరువిధమున కుంతీమాతను సమీపించి ఆమెపాదములకు నమస్కరించి సుఃఖించెను. ప్రియపుత్రునిస్థితిని చూచినంతనే ఆ చల్లనితల్లి కన్నులు కన్నీళ్లతో నిండిపోయినవి. ఆమె కౌరవులనుకూడ తనపుత్రులవలెనే ప్రేమించినది.

"తన్ను దనతమ్ములను నా
కన్నగొడుకులట్ల తలతుగాని, విభేదం
బెన్నడు నామది లేమికి
వెన్నుడ ! దైవంబు సాక్షి ! వినుము పలికెదన్."

(ఉద్యోగ - తృతీయ - 193)

పాండు పట్టమహిషికి పరోపకార పరాయణత్వము బ్రాహ్మణ భక్తి, కృతజ్ఞతా గుణము, పుత్రుల పరాక్రమమును, ధర్మమును రక్షించుటకు వినియోగించుట ప్రశంసార్హము. తమ కుపకారియైన ఏక చక్రపురమునందలి బ్రాహ్మణుని ఇంటినుండి ఆర్తధ్వని విన్నంతనే ఆ మహామాత ఎంతయో తల్లడిల్లినది. ఆ వీరమాత పుత్రులను ధర్మ సంరక్షకులుగా తీర్చిదిద్దుట ఎన్నదగియున్నది. కుంతీదేవి ప్రియపుత్రు డయిన భీముని పరోపకారియైన బ్రాహ్మణునకు ప్రియము చేయు మనెను.

"కృత మెరుగుట పుణ్యము స
న్మతి దానికి సమము చేత మధ్యము మఱి త

తత్కృతమున కగ్గలముగ స
తత్కృతి సేయుట యుత్తమంబు కృతబుద్ధులకున్."
(ఆది - షష్ఠ 244)

సమరోత్సాహియైన భీమునిచూచి ధర్మరాజు తల్లిని సమీపించి ఇతరులకొరకు తమ బిడ్డలను, అందున భీమునివంటి సత్పుత్రుని రాక్షసునికి బలిగా ఈయవచ్చునా అని నిలదీసి ప్రశ్నించెను. ఆ తల్లి భీమునిపరాక్రమము వజ్రసారబలము అర్థము చేసికొన్న దొడ్డ యిల్లాలు. ధర్మజుని ప్రశ్నకు తగునట్లు సమాధానము చెప్పుచున్నది.

"వజ్రికాయుండు వజ్రధరు నయిన నోర్వనోపునట్టి సమర్థుం డారక్కసు నశ్రమంబున జంపి యిందుల బ్రాహ్మణులబాధ యుడుచుం బవనతనయు నుద్దేశించి సంతాపింపవలవదు మనకు సుఖనివాసంబు సేసి పరమోపకారియైన యీ బ్రాహ్మణునకు బ్రత్యుపకారంబు సేయ సమకూరె." (ఆది - షష్ఠ - 285)

ఆ సందర్భములో ఉత్తమ క్షత్రియధర్మము ధర్మజునకు సాకల్యముగా ప్రబోధించినది. "ఉత్తమక్షత్రియుండొరుల దుఃఖంబులు దలగంగ బుట్టిన ధర్మశీలుడు" అనెను.

కుంతీదేవి కారుణ్యబుద్ధి, బ్రాహ్మణభక్తి, ధర్మనిత్యత, సర్వమానవ శిరోధార్యమై యున్నవి.

వాల్మీకి, వ్యాస, భాస, కాళిదాసాది మహాకవీశ్వరులు తమ కావ్యములలో స్త్రీ స్వభావమును, ధ్యేయమును రూపొందించిరి. అది మనసులో నుంచుకొని తిక్కనార్యుడు తెనుగుభారతములో స్త్రీ జీవిత దశలయందు కన్నెను, మాతను, ప్రత్యేక శిల్పముగ ప్రకటించి యున్నాడు. ఆ మాతృమూర్తి చిత్రణమునకు ఉద్యోగపర్వము ఉజ్జ్వల మణిదర్పణము. తల్లి తాను బాధపడినను లెక్కచేయదు.

బిడ్డకు ఒకింత కష్టము కలిగినను ఆమె సహింప నోపదు. శ్రీకృష్ణుడు రాయబారమునకు హస్తినాపురమునకు వచ్చి మొట్టమొదట మేనత్తను సందర్శించెను. అపుడు వారిరువురికి జరిగిన సంభాషణము చతురముగా సాగినది. అందు కుంతీదేవి మాతృహృదయము, వీరమాతృత్వము ప్రత్యక్షరమున ధ్వనించుచున్నవి. "ఓ జగన్నాథ! పాండవులు నీ శిక్షణలో పెరిగి నీతిమంతులు, పుణ్యపరులు శూరులై అష్టైశ్వర్యములతో తులతూగవలసినవారు నేడు అరణ్యములో ఇడుమలు పడుచు ఎట్లున్నారు? నేను ఇచ్చట ఉన్నానన్న మాటయేగాని నా మనసంతయు పుత్రులపైననే ఉన్నది. నేను వడ్డింపగ ఇంపార గుడిచి, మెత్తని సెజ్జ నిద్రించి, మంగళతూర్య నినాదములతో మేల్కాంచునట్టివారు అరణ్యములో కందమూలములు తినుచు, భయంకర మృగగర్జనలు వినుచున్నారా?

"తండ్రిలేని ప్రజలు, దల్లిని బాసి పె
ద్దయును గాల మివ్విధమున బడిరి
భంగపాటు దుఃఖపాటును సంకట
పాటు గలిగె విరటుపాల బిదప."

(ఉద్యోగ - తృతీయ - 184)

కుంతియొక్క సౌజన్యము అతిశయించినది. ఆమె కొడుకులకంటె కోడలిని మిన్నగా ప్రేమించి మించినది. కుటుంబములో అందరిని అర్థముచేసికొని వారిని యథోచితముగా గౌరవించి వారి అభిప్రాయములను అవసరమైనపుడు తీసికొని గౌరవించుటయే పెద్దలయొక్క లక్షణము. ఆమె నడవడి అత్తలజాతికి ఒరవడి దిద్దినది. ఆమెదృష్టిలో పంచపాండవులు ఒక యెత్తు, కోడలగు ద్రౌపది ఒక ఎత్తు. ఆ మహాసాధ్వికి జరిగిన పరాభవము తనకు కలిగినట్లు కుంతీదేవి షాక్కి పొరలినది.

"కొడుకులకంటె నయ్యనుగు కోడలి కెక్కుడు గూర్తు; కోడలుం గొడుకులు సేయుభక్తి, కట కోటిమడుంగులు భక్తి నాకు నె ప్పుడు దగ జేయుచుండు, నది పుణ్యచరిత్ర కులాగ్రగణ్య క్రొ త్తడి సకలంబుజూడ సభదైన్యము బొందుట సూచి పొక్కితిన్"
(ఉద్యోగ - తృతీయ - 187)

అత్త కోడలిని కొడుకులకంటె ఎక్కువగా ప్రేమించినపుడే, ఆమె జీవితము సుఖమయ మగును. అత్తరికము ఒక కళగా నిరూపించిన మహిళా లలామ కుంతీదేవి.

ఇచట కుంతీమహామాత ఏపుత్రునకు ఎట్లు సందేశమంపవలెనో అట్లు పంపినది. నిప్పులు వేడిమి చెడిన ఎవ్వరును లెక్క చేయరు. నిప్పునకు సహజమైన దాహకశక్తి, తేజమున్నపుడే లోకులు గౌరవింతురు. సహజమైన శక్తి లేకపోయినచో అందరు కాళ్ళతో త్రొక్కి వేయుదురు. క్షత్రియుడు నిప్పువలె నుండవలెననుట చతురము. అన్నివేళల మృదుత్వము పనికిరాదు. ధర్మరాజు యుద్ధమునకు సంసిద్ధత చూపిన కాని కౌరవులు లొంగిరారని భావము. మొట్టమొదటనే మెత్తపడరాదు. ఇది ధర్మజుని కార్యోన్ముఖుని చేయుటకు చెప్పినది. ఇక భీమార్జునులను యుద్ధమునకు పురికొల్పవలెను. రాచకూతురు వీరమాతకావలయునని కొడుకులను కాంచును. అట్టి వీరపురుషులుగా ప్రవర్తింపవలసిన తరుణము ఆసన్నమైనదని హెచ్చరించినది. అట్లు చేయకపోయినచో భీమార్జునులను పురుషులనరని తెగవేసి చెప్పినది. తనకు వీరమాతఅను పేరు సార్థకమగునట్లు మెలగుడని భీమార్జునులను పురికొల్పినది. పాండురాజు పుత్రులు తండ్రికి తగిన పుత్రులని పేరుపొందునట్లు యుద్ధమునకు నడుము కట్టుడని ప్రబోధించినది. మాద్రీదేవి ఇపుడు లేకపోవుటచే నకుల సహదేవులను తానే పెంచి పెద్దచేయుటచే వారి బాధ్యతకూడ

తానే వహించి హితోపదేశము చేసినది. క్షత్రియులు భుజబలమున జీవించుటయే ధర్మమని నొక్కి చెప్పినది. మెత్తబడుట నింద్యమని చెప్పినది. ఈ విషయములో కోడలైన ద్రౌపదితో సముచితముగా కార్యాలోచన చేసి రాజ్యభాగము సంపాదించువరకు నిద్రపోవలదని కుమారులను హెచ్చరించినది. ప్రస్తుత కర్తవ్యము సమరమే. ఇందు ఆమె సంభాషణాకుశలత్వము, పుత్రులను కార్యోన్ముఖులుగా చేయు నైపుణ్యము, వీరధర్మనిష్ఠ, సమయజ్ఞత, వ్యక్తమగుచున్నవి. ఆమె కొడుకులను ప్రోత్సహింపవలసినంతవరకు ప్రోత్సహించి మిగిలినభారము కోడలిపై పెట్టుట ఆమె నెరజాణతనమును సూచించుచున్నది. కుటుంబములో సమస్య రేకెత్తినపుడు ఆ కుటుంబ సభ్యులందరికి సమప్రాధాన్య మొసంగుట వారి వారి అభిప్రాయములను సేకరించుట ధర్మమార్గములో నడిపించుట తల్లిదండ్రుల కర్తవ్యము. తండ్రిలేడు కనుక ఆతని బాధ్యతకూడ తానే వహించి కుమారులకు ఉత్తమ వీరమాతవలె హితోపదేశము చేసినది. చానమ్మ ఖడ్గతిక్కనను సమరమునకు పంపిన వృత్తాంతము, తిక్కనార్యుడు స్వయముగా తనకాలములో చూచి యున్నాడు. ఆ ఖడ్గతిక్కన వంశమునకు చెందిన మన తిక్కనార్యుడు కుంతీదేవి వృత్తాంతమును ఆంధ్రవీరనారీమణి వృత్తాంతముగ తీర్చి దిదుట ప్రసుతింపదగియున్నది.

ఇంత హితోపదేశము చేసియు కుంతీ మహాదేవి తన బిడ్డలకు విజయము, సౌఖ్యము, లోకశ్రేయము, నొసగూర్చుభారము శ్రీకృష్ణునిపైననే ఉన్నదని ఆ పరమేశ్వరుని శరణాగతిని వేడుకొన్నది. దీనివలన ఆమె అచంచల దైవభక్తి తెలియుచున్నది. మానవుడు తాను చేయవలసిన పురుషకారమంతయు నూటికి నూరుపాళ్లు చేసి ఫలమొసంగు భారము దైవముపై నిడుటయే కర్తవ్యమని బోధించినది.

"అన విని మోహము విచ్చుచు మురారికి నిట్లను గుంతి, పాండునందనులకు దండ్రియును గురువు దైవము నారయ నీవ కావె ! నీ మనమున ధర్మమున్ హితము మంచిగ జూచి విధించినట్ల చేసి నెగడువారు గాక; నిను జేరిన నాపద లొంద నేర్చునే !"

(ఉద్యోగ - తృతీయ - 207)

"వారలక యేల మాధవ !
కౌరవులకు మఱియు నీజగంబుల కెల్లం
జేరుగడ నీవ; నీపలు
కారయ వేదంబ కాదె యఖిలంబునకున్."

(ఉద్యోగ - తృతీయ - 208)

కుంతీదేవి శ్రీకృష్ణుని పరతత్త్వము అర్థము చేసికొన్న దొడ్డ యిల్లాలు. మానవులందరు అశాశ్వతమైన ఈ ప్రపంచమును విసర్జించి, పరమేశ్వర, పాదపద్మ సమారాధనము చేయుటయే ధ్యేయమని, నిరూపించినది.

కుంతీదేవి ఎట్టఎదుట, కన్నకొడుకులలో పరస్పరము వివాదము రేకెత్తి ఒకరి కుత్తుక ఒకరు నరకుకొనుటకు సిద్ధమయిరి. అది చూచి ఆమె ఎంతయోవగచి, కొడుకులమధ్య సఖ్యత సమకూర్చుటకు, బహుధా ప్రయత్నించినది. ఆమె కర్ణునికి పుట్టువు తెలిపి కయ్యంపు కడక మాను నట్లు చేయ నిశ్చయించినది. అత్యంతధీరయై ఆమె కర్ణుడు గంగా స్నానమునకై వచ్చు ప్రదేశమునకు వెడలి జపము పూర్తియగువరకు అతనివెనుకనే కూర్చుండెను. పాండు పట్టమహిషి ఆగమనకారణము ప్రశ్నించి, నమస్కరించెను. అపుడు ఆమె ఇట్లని చెప్పినది.

"కొడుకు గుణ్ణా ! నీవు సూతాన్వయములో పుట్టలేదు. నేను కుంతి భోజునింట కన్యగానుండగా సూర్యదేవుడు అనుగ్రహించి నిన్ను

ప్రసాదించియున్నాడు. నీవు పాండునందనుడవే. అట్టి నీవు ఇతరులను కొలువవలసిన అగత్యమేమి ? ధర్మరాజాదులగు నీ తమ్ములకు ధార్త రాష్ట్రులకు నీవే ప్రభువై ఈ లోకమును పాలింపుము." అని పలికెను. కర్ణుడు తాను ఇంతవరకు దుర్యోధనుని ఉప్పు పులుసు తిని యుద్ధసమయమున ఎట్లు వదలి రాగలనని సూటిగా ప్రశ్నించెను. యుద్ధములో ధర్మజ, భీమ, నకుల, సహదేవులను ఏమియు చేయనని మాటయిచ్చెను. ఆ మహాత్మురాలు చేసిన ప్రయత్న మంతయు వ్యర్థమయినదని నితాంత చింతాక్రాంత అయినది.

మహాభారత సమరము పూర్తి అయినది. ధర్మరాజు హస్తినాపుర సింహాసనము నధిరోహించెను. కుంతి ఇంతవరకు కౌరవుల పంచ నుండి పాలలోపడిన బల్లివలె అనేక కష్టనిష్ఠురములు అనుభవించినది. ఇపుడు పుత్రులు రాజ్యపాలనము చేయుచుండగా ఆమె కొడుకులను కోడండ్రను మనుమలను చూచుకొనుచు హాయిగా కాలక్షేపము చేయవచ్చును. కాని ఆమె అట్లు చేయలేదు. ఆమె కర్ణునకు చేసిన అన్యాయము ఆమె హృదయమును ప్రతిక్షణము కోసివేసినది. పాండవులు తన తమ్ములేయని కర్ణునిహృదయములో ఆరనిచిచ్చు రేపినది. తన కారణముగా కర్ణుడు ఎన్నియో అవమానములకు గురి అయ్యెను. ఇవి అన్నియు ఆమె కన్నులయెదుట జరుగుట చూచుటవలన ఆమె గుండె వేయిపరియలుగా చీల్చివేయుచున్నది. ఆమె కర్ణ జన్మరహస్య వృత్తాంతము మహాభారత సమరము పూర్తియగువరకు, మృతవీరులకు తర్పణములు వదలువరకు, చిచ్చు కొంగున మూటకట్టుకొన్న విధమున ఎదలో దాచుకొన్నది. ధర్మరాజాదులు మృతవీరులందరికి యథోచితముగా నివాపాంజలి ఒసంగు కాలము ఆసన్నమయినది. పాండవులు కర్ణునిమాట స్మరించలేదు. అంత కుంతి హృదయములో దాచుకొన్న

అగ్నిపర్వతము బ్రద్దలైనది. కన్యగా నుండగా ఆమె తప్పటడుగు వేయుటచే అర్జునుడు కర్ణుని తన సోదరుని సంహరించుచుండగా చూడ వలసిన క్లిష్టపరిస్థితి ఏర్పడినది. ఆమె కర్ణునకుచేసిన అన్యాయము అనేక విధముల పేర్కొని బిట్టు విలపించినది. పుత్రులే ఒండొరులు గర్భశత్రుత్వము వహించుట విధియొక్క క్రీడ. కుంతీదేవి గాంధారీధృతరాష్ట్రులతో ఆశ్రమవాసమునకు వెడలుచు ధర్మరాజు ఆమెను ఎంత నివారించినను మానక ఇట్లన్నది.

"నీవేమియు నరకుము సహ
దేవుని నేమఱక యరయు దినకరసుతునిన్
భావమున దలపు మేనా
దేవసమునిపుట్టు వడచితిం గపటమునన్."

"అది పాపము దానికి నా
మది నెప్పుడు వగతు విమలమానస యక్కీ
డు దొలంగునట్లుగా స
త్పదార్థదానములు చేయు తాత్పర్యమునన్."

"అవ్విధమున గర్ణు డాఱడి బోయిన
నాదు మానసంబు పోదు నాఱు
పటియలై తలంప బలుఱాత జేసిన
వారు గాగ వలయు వంశపర్య."

(ఆశ్రమ - ప్రథమ - 152, 153, 154)

ఇంతకంటె జీవి చేసిన పాపమునకు శిక్ష ఏమున్నది. పశ్చాత్తాపమే మానవుని హృదయములోని పాపపంకమును క్షాళనము చేయగలదు.

కవికులగురువయిన కాళిదాస మహాకవి మానవాళికి ఆశ్రమ ధర్మములను ధర్మార్థమధురముగా సూచించియున్నాడు. శైశవమందు

విద్యాభ్యాసము, యౌవనములో విషయోపభోగములు, వార్ధక్యములో మునివృత్తి నిర్వహించి తుదకు యోగియై తనువును పరమేశ్వరునిలో లీనము చేయవలెను. ఇది భారతీయ మహర్షుల ఉదాత్త భావన. కుంతీదేవి ప్రాయము ప్రొద్దు ఒకింతలో వ్రాలగానున్న సమయములో కన్నబిడ్డలను సమస్త భోగములను తృణప్రాయముగ త్యాగముచేసి, వృద్ధులైన గాంధారీధృతరాష్ట్రులకు అరణ్యములో సేవచేసికొనుచు ఆత్మార్పణముచేసిన మహిళాలలామ. వీరపుత్రి, వీరపత్ని, వీరమాత, వీరవనిత యామె.

## 21. మాద్రి

పాండురాజుయొక్క ప్రియపత్ని మాద్రి. ఆమెయు కుంతీదేవి వలె భర్తను ప్రేమించి మించినది. ఆమె సపత్ని అనురాగమును చూరగొన్న దొడ్డయిల్లాలు. స్త్రీ సహజమైన సంతానకాంక్షతో, అశ్వనీదేవతల నారాధించి నకుల సహదేవులను బిడ్డలను బడసినది. ఆమె భర్తృవాల్లభ్యముపొంది భర్తతో సహగమన మాచరించిన భారతీయ మహిళామణి.

మాద్రి సత్సుతులకొరకు ప్రయత్నించిన ఉత్తమ స్త్రీ. ఉత్తమ సంతానము తల్లిదండ్రులను ఉద్ధరించుటకు, లోకోద్ధరణము చేయుటకు సమర్థము కదా. ఆమె కుంతి అనుమతితో అశ్వనీదేవతల నారాధించి నకులసహదేవులను పడసినది.

సర్వభూత సమ్మోహనమైన వసంతాగమనమున, మాద్రీ సౌందర్యము పాండురాజు హృదయమును ముగ్ధమోహనముగ ఆకర్షించినది. మాద్రి తనభర్తకు శాపమున్నదని తెలిసియు, భర్తృమనోరంజనము చేసినది. అది పాండురాజు పంచత్వమునకు కారణమైనది. అది వయస్సుయొక్క యౌవనముయొక్క దోషము.

మాద్రిదేవి తనతప్పును తెలిసికొని ప్రియపుత్రులను కుంతి చేతిలో ఇల్లడబెట్టి భర్తతో సహగమనము చేసి సకల సీమంతినులకు మార్గదర్శకమై ప్రవర్తించినది. ఉత్తమ స్త్రీకి పతిభక్తియే పరమాభరణమని నిరూపించినది. మాద్రి పాండురాజునకు తగినభార్య.

## 22. గాంధారి

వ్యాసమహర్షి భారతామ్నాయములో పురుషపాత్రలను స్త్రీ పాత్రలను సజీవముగ, క్రమపరిణామ రమణీయముగ చిత్రించి ప్రసాదించియున్నాడు. ఆ పాత్రలు మానవత్వ శోభితములగుట విశేషము. పారాశర్య వాక్యమంజరీ సౌరభము ప్రత్యక్షరములో పరిమళించు చున్నది. మహామనీషి వ్యాసుడు పురుషపాత్రలకంటె స్త్రీ పాత్రలచే మితముగ ప్రియముగ, హితముగ సంభాషింపచేయును. ప్రియవక్తృత్వము ప్రమదలకు పెట్టని భూషణము. ఉత్తమ భారతీయ మహిళను చిత్రించుటయే అతని పరమాశయము. గాంధారి గురుసారధీరబుద్ధి. ఆమె పతివ్రతాశిరోమణి, మహాభాగ, సత్యవచన, మహామాత, ధర్మశీల, సత్యధర్మ నిష్ఠాపరురాలు. గాంధారి సౌశీల్య సౌగంధ్యము సహృదయుల ఆమోదము నందినట్టిది. ఈ మహామాత ఎదుర్కొన్న క్లిష్టాతిక్లిష్టమైన ప్రాణసంకట స్థితి ఎవరును ఏకాలములోను అనుభవించలేదు. అయినను గాంధారి దుర్యోధనకృత పాపఫలము ననుభవింపవలసివచ్చినది.

సుబల రాజాత్మజ కన్యకగా నుండగనే తను మనోధైర్యము, పితృభక్తి, సత్యధర్మములకొఱకు ఉదాత్త త్యాగము చేసి సకల స్త్రీ జన సీమంతినియై విరాజిల్లినది. సుబలుడు, భీష్ముడు పంపిన వృద్ధ బ్రాహ్మణులచే కురుకుల దీపకుడైన ధృతరాష్ట్రుని గుణగణములు విని

ఆ రాజునకు గాంధారి నిచ్చితి ననెను. అంతలో అంతఃపురములో బయట బంధువులలో గాంధారి చెవుల బడునట్లు గుసగుసలు రేగినవి.

"అంగములలోన మేలుత్తమాంగ మందు
నుత్తమంబులు గన్నుల యుర్విజనుల
కట్టికన్నులు లే వను టంతెకాక
యుత్తముడు గాడె, సద్గుణయుక్తి నతడు."

(ఆది. పంచమ- 11)

సర్వేంద్రియములలో శిరస్సు ఉత్తమాంగము. అందున కన్నులుత్తమోత్తమములు. అంధత్వమంత దుఃఖము వేరొకటి లేదు. జీవితమంతయు పరులపై ఆధారపడి జీవింపవలయును. గాంధారి తానా రాజపుత్రి. సౌందర్యమా భువనమోహనము. దేనికికొదువ లేదు. అయినను గాంధారి అంధత్వము వలని కష్టనిష్ఠురములన్నియు తెలిసియు, బంధువులందరు చెవిసిల్లు కట్టుకొని పోరుచున్నను ఎంతమాత్రము లెక్కచేయక ధృతరాష్ట్రుడే తన పతియని వీరనారివోలె పలికెను.

"వారి పలుకులు విని గాంధారి ధృతరాష్ట్రునకు బితృవచన దత్తగా దన్ను నిశ్చయించి నాకు బతి యమ్మహీపతియ కాని యొరుల నొల్లనని పరమ పతివ్రత పరపురుషసందర్శనంబు పరిహరించి తన పతి కనుగుణంబుగా నేత్రపట్టంబు గట్టికొని" పెండ్లియాడినది.

ఈసన్నివేశము పరిశీలించినచో గాంధారి పితృభక్తి పతిభక్తి అనన్యసామాన్యమని తెలియగలదు. స్త్రీ పరపురుష సందర్శన వర్జనము చేసినపుడే పతివ్రత యగును. భర్త అంధుడైనను, ధనవంతుడైనను, నిర్ధనుడైనను పరమేశ్వరునిగా భావించి పూజించుటకంటె పరమోత్కృష్ట ధర్మము లేదని భారతీయుల విశ్వాసము. ఉత్తమపురుషులు పరభార్యలను కన్నెత్తిచూచుటకూడ మహాపాతకమని కాళిదాసు ఒక చోట పేర్కొనియున్నాడు. "అనిర్వర్ణ్యం పరకళత్రమ్". అధర్మాభిరతు

లగు తనపుత్రులు భవిష్యత్కాలములో చేయు అధర్మములను చూడ లేక నేత్రపట్టము కట్టికొన్నదని చెప్పినను తప్పులేదు. అది ఒప్పే యగును. పూర్వము చెప్పిన ధర్మములన్నియు కేవలము స్త్రీలకు మాత్రమే పరిమితమా ? అను ప్రశ్న కలుగును. దానికి సమాధానము మహర్షి ఇచ్చినాడు. పురుషులు యథేచ్ఛగా తమ ఇచ్ఛవచ్చినట్లు తమనే దైవముగా నమ్ముకొన్నవారిని, దురదృష్టముచే అవయవ లోపము పొందిన భార్యలను విడిచిపెట్టరాదని సూచించియున్నాడు. పరిశీలించినచో రాజ్యలోభము, అమితపుత్రప్రేమ, అధర్మ పక్ష పాతములను గ్రుడ్డితనము కలవాడు ధృతరాష్ట్రుడే. గాంధారిమాత్రము జీవితాంతము భర్త, పుత్రుడు అను మమతలేక సత్యధర్మములను పాలించుటచేతనే ఆమెకు గురుసారథీగబుద్ధి యనిపేరు సార్థకమయ్యెను.

కుంతీదేవికి ముందు ధర్మనందనుడు జన్మించెను. అప్పటికి గాంధారికూడ గర్భవతియగుటచే తనకు పుత్రుడు కలుగలేదని అసూయాగ్రస్తయై ఉదరతాడనము చేసుకొన్నదట. ఇది స్త్రీసహజ మైన అసూయ అని చెప్పవగును. మాతృత్వములేని స్త్రీ నిర్గంధ కుసు మమువంటిది. స్త్రీలకు మాతృత్వము సదా అపేక్షితము. గాంధారి మొట్టమొదట అసూయాది మానవసహజములైన బలహీనతలకు బానిసయయ్యెను గురుసారథీరబుద్ధియై ప్రశాంత చిత్తమును అలవరచు కొని మనస్సులోని పాశవిక భావములను ప్రక్షాళనము చేసికొని ధర్మ శీలముతో మెలగి సర్వజనుల అభినందనములను పొందుచున్నది. అందు చేతనే ఆమె జగన్మాత.

దుష్టచతుష్టయము కుట్రపన్ని శకునిచే మాయజూద మాడించి పాండవుల సర్వైశ్వర్యము లపహరించి, పతివ్రత, కురువంశగుణోత్తర, భూపాలవల్లభాజనదీపిక అగు పాండవ ధర్మపత్నిని పరాభవించి, ఉత్త

ములు, శీలసంపన్నులగు పాండవులను నీచాతినీచముగ వాక్శరములతో పీడించుచున్నను, ధృతరాష్ట్రుడు చూచియుచూడని వాని వోలె, రాజ్యాశతో, పుత్రప్రేమతో అధర్మమార్గమవలంబించుట చూచి, గాంధారి మిగుల పరితాపమొంది భర్తకు హితోపదేశము చేసినది.

"అథాబ్రవీ న్మహారాజ ధృతరాష్ట్రం జనేశ్వరమ్,
పుత్రహార్దా ద్ధర్మయుక్తా గాంధారీ శోకకర్శితా,
జాతే దుర్యోధనే క్షత్తామహామతి రభాషత,
నీయతాం పరలోకాయ సాధ్వయం కులపాంసనః
వ్యనదజ్జాత మాత్రోహి గోమాయురివ భారత,
అంతో నూనం కులస్యాస్య తన్నిబోధత భారత
మానిమజ్జీః స్వదోషేణ మహాప్సు త్వం హి భారత,
మా బాలానామశిష్టానామభిమంస్థామతిం ప్రభో
మాకులస్య క్షయే ఘోరే కారణం త్వం భవిష్యసి,
బద్ధం సేతుం కోనుభింద్యాద్ధమేచ్ఛాంతం చ పావకమ్
శమే స్థితాన్ కోను పార్థాన్ కోపయే ద్భరతర్షభ,
స్మరంతం త్వా మాజమీఢం స్మారయిష్యామ్యహం పునః
శాస్త్రం నశాస్తి దుర్బుద్ధిం శ్రేయసే చేతరాయ చ,
న వై వృద్ధో బాలమతి ర్భవే ద్రాజన్ కథంచన
త్వన్నేత్రా స్సంతు తే పుత్రా మా త్వాందీర్ణాః ప్రహాసిషుః
తస్మాదయం మద్వంచనా త్త్యజ్యతాం కులపాంసనః
తథా తేనకృతం రాజన్ పుత్రస్నేహన్నరాధిప,
తస్యప్రాప్తం ఫలం విద్ధి కులాంతకరణాయ యత్."
(సం - సభాపర్వం - 1 - 8 శ్లో)

"నీవే పుత్రులకు మంచిమార్గము చూపవలెను నీవు వారిని నాశ మొనర్పరాదు. దుర్యోధనుని నవమాసములు మోసి కంటిని

తల్లినైన నేనే స్పష్టముగా చెప్పుచున్నాను. వాడు కులమునకు అగ్గి వంటి వాడు. ఈ దుర్మార్గుని దుశ్చేష్టలను నివారింపవలసిన తరుణ మాసన్నమైనది ఇప్పు డుపేక్షించితివో కౌరవవంశ నాశమునకు నీవే బాధ్యుడవు అగుదువు". ఇంతకంటె గాంధారి ఏమి మాటాడ గలదు. ధర్మశీల యగుటచేతనే కుండబద్దలు కొట్టినట్లు ధర్మమును సూటిగ చెప్పినది. తెలుగుభారతములో గాంధారి ద్రౌపదీపరాభవ వృత్తాంతము అంతయు నెరింగి విదురుం తోడ్కొని ధృతరాష్ట్రు కడకు బోయి పాండవ పరాజయంబును, ద్రౌపది పరిభవంబును దుర్నిమి త్తోత్పత్తియు చెప్పినది.

దుర్యోధనుడు కులస్త్రీలను అవమానించెను. ధర్మ ముల్లంఘించెను. రాష్ట్ర క్షేమమునకై ధృతరాష్ట్రుడు పుత్రుని త్యజింపవలెను. భారతదేశములో పుత్రులకంటె రాజునకు ధర్మమే ఆరాధ్యమైనది. పూర్వరాజన్యులు ధర్మముకొరకు భార్యను పుత్రులను తృణప్రాయముగ త్యాగము చేసిరి. పుత్రలోభముతో రాష్ట్రమునకు నష్టము కలిగింప నెంచిన, ధృతరాష్ట్రుడు నిందార్హుడు. తండ్రికంటె తల్లికి సంతాన ముపై ప్రేమ అధికము. కాని గాంధారి ధృతరాష్ట్రునికంటె మెలకువ వహించి మంత్రివోలె భర్తకు హితోపదేశము చేసినది. ఆమెయే నిజమైన పతివ్రత. అధర్మమార్గమున పడినభర్తను సన్మార్గమునకు త్రిప్పుటకు ప్రయత్నింపకపోయినచో ఆమె బ్రతుకేందులకు ? ఇట్లే పుత్రప్రేమకు ధర్మాచరణమునకు సంఘర్షణ తటస్థించినపుడు ఆ మహా మాత సత్యధర్మముల కత్యంత ప్రాధాన్యమిచ్చి ప్రమదోత్తమయై విరాజిల్లినది. ఆ మాతృమూర్తి ఏవిధముగనైనను పుత్రుని సన్మార్గ ములో పెట్టుటకు బహుధా కృషిచేసినది. మన్యుమూర్తియైన దుర్యో ధనునకు పాండవులతోడి విగ్రహము పాడికాదని శ్రీకృష్ణుడు

ధృతరాష్ట్రుడు, భీష్మద్రోణులు హితోపదేశము చేసిరి. శ్రీకృష్ణుడు రాయబారము చేయుటకు వచ్చునాటికి గాంధారి తన ధార్మికదృష్టిని ద్విగుణీకృతముగ పెంపొందించుకొని భర్తకుకూడ హితవుచెప్పుటలో ఏమాత్రము వెనుకంజవేయలేదు. ఆమె మనోధైర్యము శ్రీకృష్ణ వేద వ్యాస భీష్మాది మహర్షులకు సహితము ఆశ్చర్యము కలిగించినది. ధర్మా ధర్మ నిర్ణయములో ఆమెకు ఆమెయే సాటి.

ధృతరాష్ట్రుడు గాంధారితో దుర్యోధనుడు తనమాటను పూచికపుల్లవలె త్రోసివేయుచున్నాడని చెప్పెను. అంత గాంధారి దుర్యోధనుని సమీపించి ఇట్లు చెప్పెను. ధర్మంబును నీతియును చుట్టరికంబును నిజశక్తియు బ్రతుకుతెరువును సహాయంబును కొలది మాత్రమే. కులజన చిత్తప్రకారంబును పాండుపుత్రుల బలపరాక్రమంబులు తెలియునట్లుగా తెలుంగు వడ చెప్పి, బుజ్జగించి కినిసియు, అనేకవిధముల నచ్చచెప్ప ప్రయత్నించినది. గాంధారియొక్క సత్య ధర్మనిష్ఠ ఉత్తరోత్తర రమణీయముగ జ్యోతివలె ప్రకాశించినది. భారత సంగ్రామమునకు సన్నద్ధుడై రాజరాజు మాతృదేవి చరణ సరోజములకు భక్తితో నమస్కరించి సంగ్రామములో జయము కలుగునట్లు ఆశీర్వాదింపుమని కోరెను. అట్టి క్లిష్టపరిస్థితిలోకూడ పుత్ర ప్రేమయను లోభమునకు బానిస కాక త్రిలోకములు త్రికాలములు మెచ్చునట్లు "ధర్మమున్న చోట జయము తథ్యము" అని చెప్పినది. ఇచట ఒక సందేహముదయించును. తల్లి తనరక్తమును పంచుకొనిపుట్టిన పుత్రుని నాశనము కోరుట లోకవిరుద్ధము కదా! ఈ సందేహమునకు ఆ మహామాతయే ధర్మార్థయుక్తముగ ప్రత్యుత్తరము చెప్పినది.

"జూదము నప్పుడు సర్వజనంబులుచూచి భయంపడి యిప్పని యి
మ్మేదిని సేనలకుం గురుకోటికి మృత్యువు గాని నిజం బలతిం

బో దని యాడరె యమ్మెయి నాదగుబుద్ధికి
దోచినసత్యము దా
మోదర పాటిలదే కొడుకంచు బ్రియోక్తులు వల్కిన
బెంపు సెడున్."
(స్త్రీ - ద్వితీయ - 31)

"వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి" అన్న మాటలు గాంధారిపట్ల అర్థవంతములు. ధర్మ పుత్రప్రేమలలో ఏది అధికము? గాంధారివంటి ఉత్తమ మహిళ ధర్మమునే ప్రధానముగ స్వీకరించినది. మానవులకు ధర్మము తరువాతనే మిగిలినవి ఆరాధ్యములని నొక్కి చెప్పినది. స్త్రీలకు గురుసార, ధీరబుద్ధి సమస్యలను పరిష్కరించుపట్ల అవసరమని సూచితము.

గాంధారీదేవికి తనపుత్రులనియు, అన్యపుత్రులనియు భేదభావము లేదు. భారత యుద్ధములో కౌరవ సంహారానంతరము శ్రీకృష్ణుడు పాండవులను వెంటబెట్టుకొని గాంధారీ ధృతరాష్ట్రులకు నమస్కరింప చేయవలెనని తీసికొనివెళ్లెను. పుత్ర శోకతప్తయైన గాంధారి వ్యామోహము పొంది పాండవులను శపింప నుద్యుక్తురాలు కాగా వ్యాస మహర్షి ధర్మప్రబోధము చేసెను.

గాంధారి పుత్రశోకముతో వ్యామోహముపొంది తన తప్పును తెలిసికొని కౌంతేయులు నాకు గౌరవింపదగినవారనియు, దుష్టాత్మకు లగు తనపుత్రులు తమ దుష్టత్వముచేతనే నాశమైనారని అంగీకరించి నది. ఆ మహామాతకు స్వ పర భేదము లేదు. స్త్రీలలో ముఖ్యముగా అందరిని కన్నబిడ్డలవలె చూచు ఉదాత్తహృదయము ఉండుట ప్రశం సకు పాత్రమై యున్నది. అట్టి తల్లులు జగన్మాతలై పూజ పొందు దురు. నవ వైధవ్యముతో కన్నీరు మున్నీరుగా నేడ్చుచున్న ప్రియ

పుత్రికయైన దుస్సలను చూచి గాంధారి ఎట్లు వగచినదో ఉత్తర దుస్థితిని చూచి అట్లే నితాంత దుఃఖము పొందినది.

అష్టకష్టములలో పుత్రశోకము అత్యంత కష్టమైనది. తల్లికి గర్భశోకమువంటి కష్టము మరొకటి లేదు. పుత్రశోకము గాంధారియందు మూర్తీభవించినది. ఎట్టి రాతిగుండెకలవాని కైనను స్త్రీపర్వము చదివినచో హృదయము శోకముతో నిండిపోవును. లోకములో ఒకబిడ్డ మరణించినచో మాతృహృదయము పొందు వేదన ఇంతింత అనరానిది. అందులో గాంధారి దుర్యోధనాదులను నూరుగురు పుత్రులను కని వారిని ప్రాణాధికముగా పెంచుకొని వారికి పెండ్లిండ్లుచేసి భార్యలతో అష్టైశ్వర్యములను అనుభవించుట చూచి వృద్ధులై వారిని ఊతకోలగా నిడుకొని జీవింపనెంచుచుండగా వారందరు సమూలముగ భీమ క్రోధాగ్నికి ఇంధనముకాగా గాంధారి మాతృహృదయము ఎంత కుందినదో యోజించిన ఒడలు జలదరించును. ఆమె తనకు నమస్కరింప వచ్చిన భీముని దీనాతిదీనముగా ప్రశ్నించినది.

"అంధులకు నూతకోలగా నకట యొకని,
నైన నిలుపక నూర్వుర నదయవృత్తి
మిరింగితం దెవ్వడేనియు మీకు నెగ్గు,
లాచరింపనివాడు లేడయ్యెనయ్య."

(స్త్రీ - ప్రథమ - 170)

"ఒక్కరుని నీవు సంపక,
తక్కిన నంతటనె ప్రతిన దప్పనె విభవం
బెక్కగ మీాయన్న నతం,
డొక్కటి రాజ్యంబు సేయ నీడె కుమారా."

(స్త్రీ - ప్రథమ - 171)

ఇవి మాటలా ? ఆమె హృదయము పుత్రశోకతప్తమై వెలువడిన ఈటెలు. ప్రత్యక్షరము ఆ తల్లిపొందిన దుఃఖాతిశయము తెలుపుచు సహృదయుల గుండెలు పిండుచున్నది. పుట్టెడుశోకముతో తానున్నను పుత్రశోకమున పొగులుచు, నెండ దాకివందిన తీగ చందమున నున్న ద్రౌపదిని సముచితముగ నోదార్చుట ఆ మహామాత యొక్క ఉదాత్తహృదయము తెలియచేయుచున్నది.

"పుత్రి యిట్లగునమ్మ శోకము బొంది కుందుచు నున్న నీ
గాత్ర మొండొకకీడు పాటిలి కందు బాండుతనూభవుల్
పుత్రవర్గము గన్నచో నెద భూరితాపము బొందుదుం
బౌత్రహీనత బడ్డ గొంతికి బాయ నేర్చునె నెవ్వగల్."

(స్త్రీ - ప్రథమ - 183)

"విను నే నిట్టూరార్చెద,
నను వీవూరార్ప వలదె నాసీ తెఱగుల్
విను మొక్కరూప మన కే,
మన గలదు విధాత క్రూరుడై పఱుపంగన్."

(స్త్రీ - ప్రథమ - 184)

గాంధారి తాను దుఃఖములో మునిగియున్నను కోడలైన ద్రౌపది దుఃఖమును తనదుఃఖముగా భావించి సానుభూతి వహించి ద్రౌపదిని ఓదార్చుట గాంధారివంటి ఉత్తమ నారీరత్నమునకే చెల్లినది. పరదుఃఖమును చూచి ఓర్వలేనివారే సజ్జనులు. సత్త్వగుణ ప్రధానులైన మహాపురుషుల చరిత్ర మానవాళికి మార్గదర్శక సూత్రములను బోధించును.

ఆ మహామాత శ్రీకృష్ణుని వెంటబెట్టుకొని యుద్ధరంగమున కరుదెంచినది. యుద్ధరంగమున భర్తృ భ్రాతృ పుత్రాదుల మృతదేహ

ములపై బడి దీనముగా విలపించు స్త్రీల ఆక్రందనములు మిన్నుముట్టి నవి. శోకము సముద్రరూపమున ప్రత్యక్షమైనది. పుత్రశోకము గాంధారియందు మూర్తీభవించినది. తనపుత్రుల పూర్వౌన్నత్యమును, ప్రస్తుత దయనీయ స్థితినిచూచి కన్నీరు మున్నీరుగా ఏడ్చినది. దుర్యోధనుని కళేబరము ఆమె కంటబడుటతోడనే ఆ తల్లి మొదలునరికిన అరటిచెట్టువలె మూర్ఛబడినది.

"ఈతడు రణంబున నెత్తి చనుచుండియును నెంతయును
భక్తిగని నాకుం
బ్రీతిమెసగం బలికి ప్రేమ మొలయం బొగడి పెద్దయు
వినీతినిరతుండై
చేతులు మొగిడ్చి జయసిద్ధియుగ దీవన విశిష్టదయ నిమ్మనిన
ధర్మం
బేతల ననూన మగు నిద్ధజయ మాతలకు నెట్లయిన
సిద్ధమగు నంటిన్."
(స్త్రీ - ద్వితీయ - 29)

జూదమున దుర్యోధనుడు చేసిన దుర్మార్గమునుచూచి కౌరవ కోటికి మృత్యువగునని జనులు ఘోషించిరి. నామనస్సులో అట్టి భావమే కలిగినది. కొడుకని ప్రియోక్తులుపలికిన పెంపుపోవును కదా ! నేను చెప్పినప్రకారము నింద పొందక మహావీరునివలె సమరముచేసి పరలోకసౌఖ్యము పొందినాడు. ఈరాజు భీమ కంఠీరవముచే సంహరింపబడెను.

"విదురుడు దండ్రియు దనకుం,
బదివేలవిధముల జెప్ప బాటింపడు దు

ర్మదమున దగిమెదుబుద్ధులు
విధి మూడినమర్త్యుడేల విను నుచితోక్తుల్."
(స్త్రీ - ద్వితీయ 40)

గాంధారి పిమ్మట దుశ్శాసనుని కళేబరమును చూచి, ఇతడు పూర్వము మహాసభలోనికి, ద్రుపదపుత్రి నీడ్చి తెచ్చియున్నాడు. తత్ పాపఫలముగ దుశ్శాసనుడు మహాభీలభుజుడగు భీము గదాహతిచే భూమిమీద పడి అతనిచే క్రొన్నెత్తురు త్రాగబడియున్నాడు. పిమ్మట శకుని శరీరమును చూచి కౌరవులకు పాండవులకు వైరాగ్నిని ప్రజ్వలింపచేసినవాడు ఈతడే అని వాపోయినది.

గాంధారి తన దుఃఖమును మాత్రమే గాక కౌరవ పాండవ వనితాజనముల హృదయగత దుఃఖమునకు ప్రతినిధియై వెలువరించినది. కురువంశమున ప్రతివ్యక్తికి కలిగిన దుఃఖమును ఆ వంశములో వృద్ధ యగు గాంధారికి చెందుట సముచితమై యున్నది. సమరాంగణమున తమ ఆత్మీయుల కళేబరములను చూచి హృదయ విదారకముగ విచారించు కురుకాంతల ఒక్కొక్కరినే శ్రీకృష్ణునకు చూపి తన హృదయమును చిత్రహింస చేయు ఆవేదనమును వజ్ర హృదయమును కూడ చీల్చివేయునట్లు తెలిపినది. దుర్యోధనుడు చేసిన పాపమునకు కురు కాంతలలో బాలవృద్ధ తరుణులందరు అనుభవించిన దుఃఖమునుచూచి ఆమె వికలమతియై శ్రీకృష్ణుని శపించినది.

ఈసన్నివేశములను వ్యాసమహర్షి మానవులకు పరమోత్కృష్టమైన ఉపదేశము చేయుటకనుగుణముగ తీర్చిదిద్దెను. పాపుల హృదయములు మాత్రమేగాక పుణ్యవంతుల హృదయములుకూడ ఇట్టివిధమున తప్తమైనప్పుడే లోకమునకు న్యాయ, ధర్మములగూర్చి స్మృతి కొంత కలుగగలదు. ఒకడొనర్చిన పాపమువలన సంఘమున అనేకులు నశింతు

రను ప్రకృతి సత్యము హృదయములో నాటుకొనినప్పుడే పాపభీతి అంకురించును. ఇట్లు లోకమున పాపభీతియు, అసత్యాధర్మ పరాఙ్ముఖత్వమును గలిగినచో ధర్మసంస్థాపనమున కవకాశమేర్పడును. ఈ మహోద్దేశముతో స్త్రీ పర్వముత్కట శోకపూరితముగా రచింపబడినది. భారతేతివృత్తముతో సంబంధించిన గాంధారీ ధృతరాష్ట్రులు దుర్యోధనాది వీరుల కాంతలు వారితో సంబంధములేని ముగ్ధ, నవవధువు అయిన ఉత్తరకూడ కౌరవస్త్రీలతో సమానముగ సమదుఃఖభాగినియైనది. ధర్మజుని ద్యూత ప్రవర్తనమువలనను ధృతరాష్ట్రుని ఉపేక్షవలనను సంభవించిన అనర్థమును ద్రౌపదీ గాంధారులు అనుభవించిరి. పాప పరిణామరూపమగు యుద్ధఫలము ననుభవించుచున్న లోకము స్త్రీరూపమున భగవంతునిగూర్చి మొరపెట్టుకొన్న విధమున గాంధారీవిలాపము ఒప్పుచున్నది. కావ్యన్యాయము కూడ చక్కగ పోషింపబడినది. అత్యుత్కటమైన పాపము చేసినవారు దాని ఫలము ఈ లోకమున అనుభవించి తీరవలెను. సంఘమున జరుగు పాపములకు సంఘమంతయు బాధ్యత వహించక తప్పదు. దక్షులైనవారు పాపాచరణమునెడ ఔదాసీన్యము వహించుటకూడ పాపమునకొక విధముగ దోహదము చేయుటయే. ఈవిషయమును శ్రీకృష్ణుడు "సారపుధర్మమున్ విమల సత్యము బాపము చేత బొంకుచే" అను పద్యమున చెప్పెను.

ప్రత్యక్ష పాప ప్రవర్తకులే కాక పాపమును ప్రతిఘటింపలేక ఉపేక్షించిన దక్షులు కూడ పాప ఫలము అనుభవింపక తప్పదని సారాంశము. గాంధారి ద్రౌపది మొదలైన స్త్రీలందరు పాప ఫలము అనుభవించిరి. సామాన్యముగ ప్రజలు ఈ సత్యమును గుర్తెరుగక నిర్దోషులు బాధ చెందుట గాంచి దైవమును నిందింతురు. అందువల

ననే గాంధారి తనకోడండ్రకు కలిగిన దుఃఖముతోను పుత్రశోకముతోను తప్తమై శ్రీకృష్ణుని శపించినది. వ్యామోహమెట్లు వివేకమును నశింప చేయునో తెలుపబడినది. గాంధారి, ద్రౌపది పరాభవమును తాను కలుగచేసికొని నివారించలేదను విషయము ఆమె గుర్తింపలేదు. గాంధారిచేత దుర్యోధనాదుల అధర్మమును న్యాయనిర్ణేతవలె ఖండింప చేయుట ధర్మము బలవత్తరమైనదనియు ధర్మజాదుల ధర్మప్రవర్తనమే వారిని కాపాడినదనియు చెప్పించుట ఎంతయు తగియున్నది. తల్లి బిడ్డలను ప్రాణాధికముగ ప్రేమింపవలయును దానితోపాటు వారిలోని లోపములను చక్కదిద్ది వారిని ధర్మమార్గమున నడిపింపవలసిన అవసరము ఎంతయు తల్లికి కలదని నిరూపితము. లేనియెడల దాని ప్రతిఫలము పుత్రులలోపాటు తల్లిదండ్రులుకూడ అనుభవింపవలయును. జీవులు చేయు శుభాశుభ కర్మల ఫలము పొందుట అపరిహార్యము. శంకర భగవత్పాదులు రాజరాజేశ్వరిని ప్రశంసించుచు "కుపుత్రో జాయేత క్వచి దపి కుమాతా నభవతి" ఈ వాక్యము గాంధారిపట్ల అన్వర్థము. గాంధారి భారతీయ మహిళామణి.

## 23. ద్రౌపది

వ్యాసమహర్షి ద్రౌపదిని వీరపత్నిగా చిత్రించెను. ప్రపంచ మహేతిహాసము లన్నియు స్త్రీ నిమిత్తముగ జరిగినవి. సీతామహాసాధ్వి కారణముగ రావణసంహారము, ద్రౌపదీపరాభవ కారణముగ కౌరవ నాశము జరిగినది. సమాజములో కలుగు సంఘర్షణలకు స్త్రీలకు జరుగు అవమానములు, వ్యక్తులలో ఆవేశమును ఎంతపెంచునో, భీకరప్రతిజ్ఞల నెట్లు చేయించగలవో, దోషులనెట్లు దహింపగలవో, కనీవినీ ఎరుగని దారుణ పరిణామమునకెట్లు దోహదము చేయునో ద్రౌపదీపరాభవము

నిరూపించినది. సృష్టిస్థితి లయములను మూడుశక్తులు ముప్పేటగానున్న మూర్తులే మహిళలు. భారతమహేతిహాసమునకు ద్రౌపది నాయిక. కథయంతయు ఆ మూలశక్తి కేంద్రముగా చేసికొని నడచినది.

ద్రౌపది సామాన్య మానవ భామిని కాదనియు, ఆమె జన్మకు మహాపరమార్థ మున్నదనియు, అనేకసందర్భములలో మహర్షి సూచించియే యున్నాడు. నాలాయిస్త్రైన ఇంద్రసేన మౌద్గల్యుని అనుగ్రహమువలన ద్రుపదునకు యజ్ఞకుండమున లభించినది. ఆమె పరమ పతివ్రత, తపస్విని, పాండవధర్మపత్ని, ధర్మరత, అయోనిజ అని ప్రస్తుతింపబడినది.

"కులపవిత్ర సితేతరోత్పలకోమలామలవర్ణ యు
త్పలసుగంధి లసన్మహోత్పలపత్రనేత్ర యరాళకుం
తలవిభాసిని దివ్య తేజము దాల్చి యొక్క కుమారి త
జ్జ్వలనకుండమునందుబుట్టె బ్రసన్నమూర్తిముదంబుతోన్."

(ఆది - సప్తమ - 20)

ద్రౌపది పరాక్రమ సంపన్నులైన ద్రుపదునింట జన్మించి, భువనైక వీరులగు పాండవులను భర్తలుగా బడసి, ధర్మజునిరాజసూయమున సామ్రాజ్ఞీపదము నధిష్ఠించి ప్రతివింధ్యాదిపుత్రులకు మాతయై, ఆభిజాత్యము, సౌందర్యము, సంపద, ఉదాత్తగాంభీర్యము, ఆత్మాభిమానములతో వెలుగొంది, భారతీయమహిళామణిగా ప్రతిభాసించినది. ఆమె సర్వశుభ లక్షణ లక్షితాంగి. అయినను ఆమె ఏమాత్రమును గర్వమును పొందక సత్యధర్మ పరాయణయై ప్రవర్తించుట స్తుతింపదగి యున్నది.

జ్ఞాతులొడ్డిన మాయజూదపుటురులలో ధర్మజుడుచిక్కి రాజ్య సర్వస్వము ఓడిపోవుటచే కురుకులాపశదుడైన దుశ్శాసనుడు ఆమెను

మహాజన సమక్షమున పరాభవించెను. దుర్యోధనుడు ద్రౌపదిని తన తొడ నెక్కరమ్మని సంజ్ఞ చేసెను. సైంధవుడు, కీచకుడు మొదలైన వారు ఆమెను నీచాతినీచముగా పరాభవించిరి. ఈ కష్టములనన్నింటినీ ఆమె భూమాతవంటి సహనముతో నోర్చినదే కాని సత్యధర్మములను వీసమంతయు వీడలేదు. ద్రౌపదీమహాసాధ్వియొక్క కష్టసహిష్ణుత్వము, అచంచల పతిభక్తి, ధర్మపరాయణత్వము, ఆమె జీవిత విజయసౌధమునకు సోపానములైనవి. ఈ సద్గుణములు స్త్రీలకందరకు అనుసరణీయములు. ఈ అభిప్రాయము ద్రౌపదియే సత్యభామకు పతివ్రతా ధర్మమును ఉపదేశించుచు, ఇట్లు పలికినది.

"కరము దుఃఖపడిన గాని యొక్కింత సౌ
ఖ్యంబు ధర్మగతియు గలుగ దెందు
జూడు మబల భర్తృశుశ్రూషఫలము సం
తత శుభంబు నంద ధర్మ వొదవు."

(అరణ్య - పంచమ - 315)

"గృహిణీ గృహముచ్యతే" ఇంటి గౌరవమంతయు ఇల్లాలిపై ఆధారపడియున్నది. గృహిణి భర్తయొక్క ఆదాయమును మనసులో నుంచుకొని వృథావ్యయము తగ్గించి, సదనమును శాంతి సదనముగా రూపొందించు కళాకౌశలము కలిగియుండవలెను. స్త్రీ జీవితదశలలో అత్తవారింటిలోనుండు దశ ఆమె జీవితములో నవవసంతమును కలిగింపచేయును. అది అత్యంత ప్రధానమైన దశ. అంతవరకు పుట్టింటిలో నున్న స్త్రీ పరిణయానంతరము అత్తింటికి వెడలి ఆ వాతావరణమునకు అనుకూలముగా తన్ను తాను మలచుకొనుటలోనే ఆమె నేర్పున్నది. ఇదియే జీవితవిజయమునకు మొట్టమొదటి సోపానము. సామాన్యముగా స్త్రీలకు పుట్టింటివారు అత్యంత ప్రేమపాత్రులగుట భర్తతరపున

వచ్చినవారు సరులుగాతోచుట సహజము. దీనివలన అనేకములైన అనర్థములు కలుగును. ద్రౌపది అత్తవారింటిలో నుండి అత్తయొక్క పొగడ్తపొందిన గొప్ప కోడలు. ఆమె అతిథులను అభ్యాగతులను, పేదసాదలను కన్నతల్లివలె ప్రేమించుటచేతనే ఆమె మాతృహృదయము జాలువారి ఆమె గౌరవము ద్విగుణీకృతమగును. ద్రౌపది మహాసాధ్వియొక్క సేవాతాత్పర్యము దుర్యోధనుని అసూయకుకూడ పాత్రమైనది.

"జన్నంబు చూడంగ సకలభూపుల
నుండివచ్చిన రాజన్యవరుల నవని
సురులను వైశ్యుల శూద్రుల నాత్మీయ
బంధు సుహృద్వీర భట నియోగ
జనులను పేదల సాధుల నిత్యంబు
దాన పరీక్షించి తగ వెలింగి
యన్నంబు దయబెట్టి యందఱు గుడిచిన
దనుమధ్య యర్ధరాత్రంబు నపుడుగాని
కుడువ దట్టి కమలాక్షి ద్రౌపది ... "

(సభా - ద్వితీయ - 116)

సంసార రథమునకు భార్యాభర్తలు గుఱ్ఱములవంటివారు. ఇరువురు ఒకరినొకరు అర్థము చేసికొని కలసి మెలసి ప్రవర్తించినపుడే ఆ సంసార రథము ఒడుదుడుకులు లేకుండ పయనించి గమ్యస్థానము చేరును. కుటుంబముయొక్క బాధ్యత సముచితముగ భార్య స్వీకరించినపుడే ఆ కుటుంబముయొక్క ప్రతిష్ఠ, నిత్యాభ్యుదయము ఇనుమడించును. ద్రోవది, అత్తను, పతులను, ఇంటికివచ్చిన చుట్టపక్కములను ఆదరించి అత్తయగు కుంతీమహాదేవిని సేవించిన విధము,

"అఖండభాండాగారపూరితంబులైన యగుణ్యమణికనకాది వస్తువులును, ప్రతిదినవిహితంబు లయిన యాయ వ్యయంబులు నా యెఱుంగని యవియు లేవు గోపాలజనంబులు దుదిగా గల సకల భృత్యజనంబుల జీవితంబుల నరసి యేన నడపుదుం బరమయశోధను లగు పాండునందనులు నిజకుటుంబ భారంబు సర్వంబు నాయంద సమర్పించి, తారు నిర్భరులై యిష్ట విహారంబుల నుండుదు రే నెల్ల వెంటల నప్రమత్తనై వర్తింతు."

(అరణ్య - పంచమ - 307)

ధర్మవిశారదయై ద్రౌపదివేసిన ప్రశ్నలు ఆజన్మయోగి, సత్యవ్రతుడు, బ్రహ్మజ్ఞాని, అయినభీష్మునకే చిక్కుముడియైనది. ధర్మసంబంధమైన పరిజ్ఞానము పురుషులకెంత అవసరమో స్త్రీలకు అందున రాజపుత్రికలకు ఆవశ్యకముగా అంతే అవసరము.

మహాపతివ్రతకు పరాభవము తలపెట్టుటవలన ఎన్నిసంఘర్షణలు ఎంతమంది వ్యక్తులలో ఆవేశములు - దానిమూలమున సంఘ, కుల, నాశమునకు ఎట్లు దారితీయునో సభా సర్వవృత్తాంతము నిరూపించినది. భీష్మ, ద్రోణాదులు తమ కట్టెదుట జరుగరాని అధర్మము జరుగుచుండగా కూటికొరకు నోరెత్తక ఊరకుండుటకంటె అన్యాయమేమున్నది ? అధర్మమని వారు ఎంతమాత్రము నిరూపించలేదు. ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడై పుత్రప్రేమ పాశములో బంధితుడై దుర్యోధనుని అకార్యములు చూచియు గర్హించకపోవుటచే ఎన్నియో ఉపద్రవములు కలిగినవి. వీనికన్నిటికి మూలకారణము ద్రౌపదీపరాభవమే. ద్రౌపదీ పరాభవమనెడి అరణియే కౌరవవంశారణ్యమును సమూలముగా నాశము చేసినదని భట్టనారాయణుడు చెప్పినమాట అక్షరాల సత్యము.

పరాక్రమ నిధియైన ద్రుపదుని పుత్రికయై, జగన్నాథుడైన శ్రీకృష్ణుని సోదరియై సుభద్రకంటె గౌరవము పొందినదై పాండవ ధర్మపత్ని కౌరవులచే పరాభవింపబడి దిక్కులేక అల్లాడి శ్రీకృష్ణునిచే కాపాడబడినది. ఇట దైవముయొక్క దుర్విపాకము సూచితము. ద్రౌపది భయార్తయై ఆర్తజన శరణ్యుడైన జగన్నాథుని శరణు వేడినది. ఆపత్ సముద్రములో మునిగియున్నవారికి తీరము చేరుటకు శ్రీకృష్ణపాదాంబుజ ధ్యానమను నౌక అధిరోహించుట కర్తవ్యమని తెలియ చెప్పినది.

> "మహాపదలకుం బరిహారణంబు హరిస్మరణంబనియని తన
> హృదయ పుండరీకంబునం బుండరీకాక్షు నిక్షేపించుకొనెను."
> (విరాట - ద్వితీయ - 107)

ద్రౌపదీసాధ్వి, ప్రవర్తనము భారతీయగృహిణులకెల్ల మార్గదర్శకమైయున్నది. ఆధునికులు స్త్రీలకు హక్కులు, వ్యక్తిత్వము లేకుండ పురుషులు అణచిపెట్టినారనియు అనాదికాలమునుండియు స్త్రీ పురుషులుచేయు అన్యాయమునకు బలిపశువగుచున్నదనియు ప్రచారము చేయుచున్నారు. స్త్రీ భర్తకు, అత్తకు, ఆడుబిడ్డలకు, మరదులకు, సేవచేయవలసిన సేవకురాలనియు, బిడ్డలనుకను యంత్రమనియు వంటయింటిలో గొడ్డువలె చాకిరీచేయు ఒక వ్యక్తిత్వములేని కీలుబొమ్మగా భారతీయస్త్రీ యున్నదని చాలమంది చెప్పుచున్నారు. వ్యాసమహర్షి చిత్రించిన స్త్రీరత్నములను పరిశీలించినచో పైన పేర్కొన్నప్రచారము సత్యదూరమని తేటతెల్లమగును. ఆర్షమునీశ్వరుల దృక్పథములో పతివ్రతయనగా పతిమాట ధర్మమైనను అధర్మమైనను వంతపాడుచు, గంగిరెద్దువలె తలయూపుచు అస్వతంత్రురాలు మాత్రము కాదు. భారతీయ గృహస్థాశ్రమవ్యవస్థ అత్యంత పవిత్ర

మైనది. భార్యాభర్తలకు అందు సమప్రాధాన్యము కలదు. భర్త ఎక్కువ, భార్య తక్కువ, అనునది మనము కల్పించుకొన్నదే. తీగకు వీణకు; లతకు వృక్షమునకు; రథమునకు చక్రమునకు; పుష్పమునకు పరిమళమునకు కల మధురాతి మధుర సంబంధమే భార్యా - భర్తల సంబంధము. జీవితమహానాటకమున సమస్యలు, కష్టములు, దుఃఖములు, సంతతము ఎదురగును. అట్టి క్లిష్ట సమయమున భర్తకు చేదోడు వాదోడుగానుండి నీడవలె అనుసరించుచు భర్తకు హితోపదేశము చేయుచు అతనిని అధర్మకృత్యములనుండి చతురముగా మరలించుచు ధర్మప్రవణ హృదయునిగా, తీర్చు ఉత్తమవ్యక్తియే భార్య. సంసార రథమును ఒడుదుడుకులు లేకుండగా నడపించునదియే పతివ్రత. ఆయా సందర్భములలో భార్య మంత్రివోలె భర్తకు ధర్మాధర్మనిర్ణయము చేయుటలో తోడ్పడవలెను. ఇదియే ద్రౌపది చేసెను.

ఆమె ఆదిగర్భేశ్వరి మహాసామ్రాజ్ఞి అయ్యును సకల సీమంతినీ మణిగా ప్రఖ్యాతి వహించెను. ఆ ఇల్లాలు దురదృష్టవశమున భర్తలతో అరణ్యవాస సమయమున అజ్ఞాతవాసమున ఎన్నియో కష్టములతో అలమటించెను. ఆమె మానవతీలలామ అగుటచే పూర్వవైభవ స్మరణ చేసికొని, ప్రస్తుత కష్టములలోని భర్తల దైన్యస్థితికి ఎంతయో కుమిలినది. ఆ వీరనారీమణి భర్తలకు శత్రుసంహారము చేయప్రోత్స హించినది. అరణ్యవాస సమయములో ఆమె ధర్మజునితో మహోప న్యాసము చేసినది. "ధృతరాష్ట్రుడు కొడుకుమాట విని క్రూరుడై పాపబుద్ధితో మీరాజ్యవైభవమును అపహరించి అరణ్యమునకు పాల ద్రోలెను. ఆ పాషాణహృదయుడు పుత్రుని దుష్కార్యమును ఖండించి చక్కదిద్దలేదు. నీతమ్ములైన పాండవులు మహాపరాక్రమ సంపన్ను లయినను దుఃఖసముద్రములో మునిగిపోవుటచూచి ఊరకుండుట న్యాయమా ? పుట్టిననాటినుండి అపకారమే వృత్తిగా కల్గిన కౌరవులను

నిగ్రహింపచేయుట అవశ్యకర్తవ్యము. క్షమా తేజంబులను ఆయా కాలానుగుణముగా ప్రయోగింపనేరని రాజునకు శ్రేయస్సుగూడదు. క్షమ అన్నివేళలందు తగదు. ఇది తేజస్సు కనువైన సమయము. దుర్మదులగు దుర్యోధనాదులను, నీతమ్ములచే సంహరించుటకు ఆజ్ఞఇమ్ము."

ఆమె ఉత్సాహ పూరితమైన వాక్యములు భర్తృప్రేమను వీర నారీధర్మమును నిరూపించుచున్నది. ధర్మరాజు సమచిత్తముతో ఆమె మాటలన్నియు విని ఇది తేజస్సుకు ఉచితమైన సమయము కాదనియు అట్లు చేసినచో ప్రతిజ్ఞాభంగమగుననియు నెమ్మదిగా చెప్పెను. ద్రౌపది తన మాటలను భర్త పూచికపుల్లవలె తీసివేయుచున్నాడను స్త్రీ సహజమైన కోపముతో హేతుపూర్వకముగా ప్రశ్నించెను.

"ధర్మదూరులైన ధృతరాష్ట్రులందు ధర్మ మేమిచేయును? వధింపవలసినవారిని వధించుటయే కర్తవ్యము. ఆర్యులకు హీనతయు, అనార్యులకు ఉన్నతియు కలిగినది. అనార్యులైన శత్రువులు చుట్టములా? ఆర్యులు శత్రువులా? పురుషకారము, విధి, అనువానిలో పురుషకారమత్యధిక ప్రధానమైనది. దైవమానుషములు కర్మఫల ప్రాప్తికి నిమిత్తము. పురుషులు అర్థసిద్ధిని నిర్ణయించి కర్మంబునందు కృతోత్సాహులు కావలెను. అట్టివానికి దైవము సాయపడి కర్మసిద్ధి కావించును. ఉత్సాహవంతుడు నువ్వులందు తైలము కాష్టములందున్న అగ్ని ఉపాయపూర్వకముగా యత్నించి పొందును. ఏ పనియు చేయకయే ఫలితము సిద్ధించునా?"

"కడు నిమ్నగా దున్ని బీజములు సల్లి కర్షకుం డున్న
దడయక వర్షంబు గురిసి కావించు దత్ఫలసిద్ధి
నడుమ బర్జన్యు డనుగ్రహింపనినా డేమి సేయు?
గడగి చేయం గలదానికి సేయునుగాక కర్షకుడు"

(అరణ్య - ప్రథమ - 235)

కర్మఫలంబులు దైవమానుషసిద్ధంబులు అయినను పురుషో త్సాహ సముపార్జితంబులయిన సుస్థిరంబులయి సురక్షితంబులయి వర్తిల్లు ననీహామానుడయి దైవపరుం డయినవాడు నీరిలోని యాన పాత్రంబునుంబోలె నవసన్నుం డగుం గావున గర్మఫలసిద్ధి నిశ్చయించి యుత్సాహవంతుండ వయి నీమనుజల పరాక్రింబునం బరుల జయించి మనయందలి యర్థికృతత్వం బపనయింపుము. ఈమహోపన్యాసము పరి శీలించినచో, ద్రౌపది అసామాన్యవనితామణియనియు, రాజనీతి, ధర్మాధర్మవిచక్షణ, సంభాషణాచాతుర్యము కల వీరపత్నియని చెప్ప కయే చెప్పుచున్నది. పురుషుని ఆంతరంగిక జీవితము, బాహ్యజీవిత మును ప్రభావితము చేయునది ఉత్తమభార్య.

అస్మద్గురుదేవులు ఆచార్య జోగారావు "మహాకవిమార్గము" అను గ్రంథములో వ్యాసమహర్షి చిత్రించిన ద్రౌపదికి, తిక్కన్న గారు తీర్చిదిద్దిన తెలుగు ఆడబడుచు అయిన ద్రౌపదికిని కల తార తమ్యము వివరించిన విధము హృదయంగమము.

తిక్కనార్యుడు సైరంధ్రివేషములోనున్న ద్రౌపది గడుసుతన ముతో, నీచకీచకుని పరిత్రాణము చేసినవిధము నాటకీయముగా చిత్రిం చిరి. ఆమె ఉపాయముగా అపాయమును తప్పించుకొనెను. చతురు పాయములను కీచకునిపై ఉపయోగించినది.

"నాయున్న బాము దలపవ
యీయెడ లీచీర యిట్టి యేవపు జందం
బోయన్న మదనవికృతిం
జేయు ననుట యెంతయును నిషిద్ధము గాదే."

(విరాట - ద్వితీయ - 49 )

"చనునె యిమ్మాటలాడ సజ్జనుల కాదు
బుట్టువులతోడ నీవును బుట్టినాడ

నట్లుగాకయు హీనవంశాభిజాత
నై పతివ్రత నగు నన్ను నడుగదగునె."
(విరాట - ద్వితీయ - 50)

చిన్నపద్యములో ఎన్నియో భావములు ఇముడునట్లు చేయుట మహాకవికి మాత్రమే సాధ్యము. ఆమె ప్రవర్తన ఎట్లు గడుసుగా నున్నదో, పలుకుబడికూడ అంత వేడిగను, వాడిగను సాగినది. తుదకు ఆమె ఒరదూసిన కరవాలమువంటి సమాసముతో కీచకుని, భర్తల పరాక్రమమును పేర్కొని జంకించినది.

పతుల ఎదుట నీచకీచకుడు విరాటరాజు సభలో సైరంధ్రీవేష ములోనున్న ద్రౌపదిని పరాభవించెను. విరాటరాజు "కిం" అనకుం డుట ఆ వీరనారీమణి కోపాగ్ని ప్రజ్వరిల్లజేసినది. ధర్మలోపము జరుగు టకు ఆమె ఎంతమాత్రము చలింపక సూటిగా ప్రశ్నించినది.

"ఈ నరపతి ఆస్థానమున ధర్మమును కుత్తుక నొక్కుచుండగా నొకరైనను న్యాయము, ధర్మము చెప్పువారు లేరా? ఇందరుచూచు చుండగా నిమ్మోయి పతివ్రతను, పరమసాధ్విని, అనిందితశీలను నీచ కీచకుడు ఏస్త్రీలకు, ఏ యుగమునందును చేయనట్లు పరాభవింపగా ఒక్కనికైనను కృపకలుగలేదా? అధర్మమును నివారించుశక్తి, దోషిని దండించు శక్తి లేదా?"

ఈవిధముగా ద్రౌపదికొలువులో నిలబడి వీరనారీమణివలె సంభాషించుటచూచి ధర్మరాజు ఆమెను నాట్యాసక్తితో పోల్చెను. అందులకు తోకత్రొక్కిన ఆడత్రాచు పామువలె

"నాదువల్లభుండు నటుడింత నిక్కంబు
పెద్దవారి యట్ల పిన్నవారు

గాన బహులవిధమ కాక యే శైలూషి
గా ననంగరాదు కంకభట్ట."

"అట్లగుటంజేసి నాకు నాట్యంబును బరిచితంబ మత్పతిశైలూ
షుండ కాడు కితవుండునుం గావున జూదరియాలికి గఱువ
చందం బెక్కడియది?"

(విరాట - ద్వితీయ - 152, 153)

అని పలికినది.

ఇంత తీవ్రముగా వేడిగ వాడిగ సమయోచితముగా, మాటాడ గలిగిన శక్తి ఆత్మ ప్రత్యయముగల ద్రౌపదికే చెల్లినది. అవమాన భారముతో నిండిన ద్రౌపది మెల్లగా మహానసమునకు పోయి వాయు పుత్రుని ప్రబోధించి శత్రుప్రతీకారము చేయించుకొన్న నేర్పు అన్య కాంతాదుర్లభము. కీచకుని రహస్యముగా భీమునిచే సంహరింపచేయు నాటకమునకు ఆమెయే పథకము వేసినది. శత్రుజనసంహారము చేయు టకు సర్వమును సుసంపన్నముచేసి కీచకుని నర్తనశాలకు వచ్చునట్లు అంగీకరింపచేసినది. ద్రౌపదియే కీచకుని మానసికముగా సంహరించి కాయికముగా భీమునిచే సంహరింపచేసినది. ఆమె మంత్రశక్తి కిది చక్కని ఉదాహరణము. పరాభవింపబడిన అభిమానవతి వీరపత్ని ఏమి చేయవలెనో ఎట్లు చేయవలెనో చేసి చూపించినది.

ద్రౌపది తాత్కాలికోద్రేకముచే ధర్మజుని నిందించినను, తరు వాత పశ్చాత్తాపము పొంది, ధర్మజుని మహిమను, భీమార్జునులపూర్వౌ న్నత్యమును ప్రస్తుతదైన్యస్థితికి కల తారతమ్యమును చూపి తన దుఃఖము ప్రవిపోసినది ఆమె తనకు కలిగిన దుఃఖమున కంటె ప్రియభర్తలకు కలిగిన దైన్యమునకు మిక్కిలి పొక్కి పొరలినది.

కుంతీ, ద్రౌపదుల అనుబంధము సకల సీమంతినీమణులకు మార్గ దర్శకము. అత్తా, కోడండ్రు అనగా కుంతీ, ద్రౌపదులనుచెప్ప మరొక

రిని చెప్పవలెను. ఆమె తన గోడు ఆర్చు, తీర్చువాడగు భీమునకు విన్నవించుచు

"గొంతికి నంత వెఱవ నీ
కంత వెఱవ దైవమునకు నంత వెఱవ న
త్యంతకలుషాత్మ విరటుని
కాంతకు నే వెఱతు బనులు కావించునెడన్."

"పని వంప గాని యొకతకు
బని సేయ నెఱుంగ నన్ను బని గొనునెడ బాం
డుని యగ్రమహిషి కొంకుచు
బని గఱపెడు చందమునన పనుచు నెఱుంగవే."

(విరాట - ద్వితీయ - 185, 219)

ద్రౌపదికి అత్తగారన్న అంత వెఱపు లేదట. అవును తమవిధి తాము నిర్వహించుకొనువారు ఎవరికిని భయపడనక్కరలేదు. గడుసు అత్తగారు కనుక కుంతి పని నేర్పెడు విధమున ద్రౌపదిని పనిగొనునట. అట్లని అత్తకు ఆమె సేవచేయుట మానలేదు. ఈమాటలు కుంతిని గూర్చి ద్రౌపది ఆమె పరోక్షములో చెప్పుట ద్రౌపదియొక్క సౌజన్యమును తెలుపుచున్నది. కుంతీదేవియు ద్రౌపదిని కన్నబిడ్డవలె గౌరవించి ఆమెకు కలిగిన పరాభవములన్నియు తనకే కలిగినట్లు బాధపడినది. ఆమె శ్రీకృష్ణునితో ద్రౌపదినిగూర్చి

"కొడుకులకంటె నయ్యనుగుగోడలి కెక్కుడు గూర్తు" అను పద్యము గమనార్హము.

(ఉద్యోగ - తృతీయ - 187)

ద్రౌపది తాను కుంతిమహాసాధ్వి కోడలననియు, కుంతీదేవి ద్రౌపది తనకు ప్రీతిపాత్రమైన కోడలని, చెప్పుకొనుట ఆ ఉభయుల

సాఫల్యము తెలుపుచున్నది. లోకములో అత్తాకోడండ్రకు, వైమనస్య ముండుట సహజము. దీనికి అపవాదము కుంతీ ద్రౌపదులు.

ద్రౌపది కార్యశూరత, సంభాషణాచాతుర్యము, విరుద్ధకార్యము సాధించుకొను నేర్పు, భీముని మెప్పుపొందినవి. ఆనాడు నరకాసుర సంహారము శ్రీకృష్ణుడు సత్యభామ సాయమున చేసినవిధమున భీముడు ద్రౌపది సహాయుడై కీచక సంహారముచేసెను. తిక్కన్నగారు ద్రౌపది చేష్టాముఖమున పతివ్రతలజోలికి పోయిన నీచకీచకుల గతి ఇట్లగును సుమాయని హెచ్చరికచేయుచు, ద్రౌపదిచేసిన చేష్టలను చలన చిత్రములోవలె చిత్రించినారు.

"చూచుచు జేరి వ్రేల్మిడుచుచుం దలయూచి విలక్షచిత్తయై
యూచపలాక్షి ముక్కుపయి నంగుళముం గదియించి దీనికై
కీచక యింత సేసితి సుఖత్వము బొందుదుగాక యింక న
ట్లేచిన నిట్లుగా కుడుగునే యనుచున్ వెఱగందు చుండగన్."

(విరాట - ద్వితీయ - 356)

ప్రియనాయకుడైన భీముని ధైర్యమహిమను నిర్వికారతను ఉత్సాహమును, మహాబలమును, ఉత్తమనాయకత్వమును, సముచితముగా ప్రస్తుతించినది. పూర్వము "దుర్వారోద్యమ బాహువిక్రమ నిర్మథన విద్యాపారగుల్ మత్పతుల్" అన్నమాటను సార్థకము చేసికొన్న వీరపత్నియే ద్రౌపది. మత్స్యదేశమున దుశ్చారిత్రుడగు కీచకుని తొలగింపచేసి సుందరీమణులైన పతివ్రతల పాతివ్రత్యమునకు ఆమె రక్ష కలిగించినది. భీముని కీచకవధకు నాయకునిగా వహించి విరుద్ధ కార్యమును సంఘటింపచేసికొని ద్రౌపదీ రమణునిగా భావించు కొనుటలో ద్రౌపదికి ద్రౌపదియే సాటి.

శ్రీకృష్ణుడు రాయబారమునకు హస్తినాపురమునకు వెడలు చున్నపుడు ధర్మజాదులు తమతమ అభిప్రాయములు ప్రకటించి, శాంతి

మంత్రములు వల్లించిరి. ద్రౌపది తనమనసులోనున్న ఆవేదన ఉండబట్ట లేక తాను పూర్వము పడిన భంగపాట్లన్నియు హృదయవిదారకముగా వివరించి తన వీరపత్నీధర్మమును సార్థకము చేసికొనెను. ఇచట ఆమె ప్రదర్శించిన వాక్చాతుర్యము పాండవుల అభిప్రాయమును గౌరవించుచున్నట్లు కన్పించి సంధిపొసగకుండ చేసి శత్రుప్రతీకారముచేయుటకు, భర్తలను ప్రోత్సహించినవిధము క్షత్రియకాంతయైన ద్రౌపదికే తగియున్నది. ధర్మనందనుని పలుకును విన్నంతనే ఆమెహృదయము కుత కుతమని ఉడికిపోయెను. మోమున దైన్యము ఆవరించి కోపముతో శౌరితో నిట్లనెను.

"ఒకవేళ దుర్యోధనుడు సైన్యముతో యుద్ధమునకువచ్చి మీదపడినను పాండవులు పోటునకిచ్చగింతురోకో? పోదురో కానలకు? ముందు తేల్చుకొని పిమ్మటనే సంధికిపొమ్మని శ్రీకృష్ణుని హెచ్చరించినది. ద్రౌపది తన పుట్టింటి గౌరవము మెట్టినింటి గౌరవము విశదీకరించి నీవు సుభద్రకంటె మిన్నగా గౌరవించు నన్ను నీ సోదరి యిట్లు నీచాతినీచముగా అవమానించినను నీవు ఔదాసీన్యము వహించుట పాడియా? అని గ్రుచ్చిగ్రుచ్చి ప్రశ్నించెను. ఆ మానవతీలలామ తన మనసులోనున్న ఆవేదనము కోపము అణచుకొనలేక బంధురమైన క్రొమ్ముడి గ్రమ్మన విడ్చి, వెండ్రుకలను వలచేతబూని, అసితచ్ఛవి బొల్చు మహాభుజంగమువలె విలసిల్లి వీరపత్నివలె సంభాషించినది. ఈ వెంట్రుకలు పట్టి ఈడ్చిన దుశ్శాసనుని తనువు ముక్కముక్కలై పోయిన కాని, రాజరాజు పీనుగు తాను ధర్మరాజు చూడకపోయినచో భీముని గద, అర్జునుని గాండీవము, కాల్పనాయని తెగవేసి చెప్పినది. కాళికా శక్తియై గర్జించి, భర్తలను వీరులుగా ప్రోత్సహించిన వీరనారీమణి

ద్రౌపది. ఈ ఘట్టమును తిక్కనార్యుడు శిల్పకళాశోభితముగా చిత్రించి తన కావించినసృష్టి అన్యులకు చేతకాదన్నట్లు వినిర్మించెను.

"వరమున బుట్టితిన్, భరతవంశము జొచ్చితి; నందు బాండుభూ
వరునకు గోడలైతి ; జనవంద్యుల బొందితి ; నీతివిక్రమ
స్థిరు లగు పుత్రులం బడసితిన్, సహజన్ముల బ్రాపు గాంచితిన్
సరసిజనాభ యిన్నిట బ్రశస్తికి నెక్కిన దాన నెంతయున్."

"నీవు సుభద్రకంటె గడు నెయ్యము గారవముం దలిర్ప సం
భావన సేయు ; దిట్టి నను - బంకజనాభ! యొకండు రాజసూ
యావభృథంబునందు శుచియై వెనుపొందిన వేణి వట్టి, యీ
యేవురు సూడగా సభకు నీడ్చె గులాంగన నిట్లొనర్తురే ?"

"ద్రోవది బంధురం బయిన కొమ్ముడి గ్రమ్మన విడ్చి,
వెండు్రికల్
దా వలచేత బూని యసితచ్ఛవి బొల్చు మహాభుజంగమో
నా విలసిల్లి వ్రేలగ మనంబున బొంగు విషాదరోషముల్
గావగ లేక బాష్పములు గ్రమ్మగ దిగ్గనలేచి యార్తయై."

గోవిందు ముందటంబెట్టి యిట్లనియె.
"ఇవి దుస్ససేను వ్రేళ్లం
దవిలి సగము ద్రెవ్విపోయి దక్కినయవి; కౌ
రవులకడ దీఱుమాటల
యవసరమున దలపవలయు నచ్యుత! వీనిన్."

(ఉద్యోగ - తృతీయ - 108, 110, 112, 114)

"ఈ వెంట్రుకలు పట్టి యీడ్చిన యీ చేయి
దొలుతగా బోరిలో దున్న సేను
తను వింత లింతలు దునియమై చెదరి రూ
పఱి యున్న గని యడుకాఱు గాక
యలుపాల బొనుపడు పట్టి చిచ్చై యిది
పెనుగద పట్టిన భీమసేను
బాహుబలంబును బాటించి గాండీవ
మను నొక విల్లెప్పుడును వహించు
కఱ్ఱి విక్రమంబు గాల్పనే? యిట్లు బ
న్నములు పడిన ధర్మనందనుండు
నేను రాజరాజు పీనుంగు గన్నార
గాన బడయమైతి మేని కృష్ణ!"

(ఉద్యోగ - తృతీయ - 117)

వ్యాసమహర్షి చిత్రించిన ద్రౌపది ఒకఅడుగు ముందునకువైచి ధర్మజాగులు యుద్ధమునకు పూనుకొనకపోయినచో వీరమాతయగు తానే తనపుత్రులచే శత్రుసంహారము చేయించగలనని స్పష్టముగా చెప్పినది. ఆమె మాటాడిన మాటలన్నియు వీరపత్ని వీరమాతయొక్క లక్షణములతో నలరారుచున్నవి.

ద్రౌపది పరాభవాగ్ని దుశ్శాసనసంహారముతో, దుర్యోధనుని ఊరుభంగముతో చల్లారినది. కాని ఆమెను కష్టములు విడిచిపెట్టలేదు. ఆ మహాసాధ్వి కష్టములను చిచ్చును రక్కసతాల్మితో సహించినది. మహాభారత సమరాంతమున ద్రౌపదీమాత పుత్రశోకముతో భ్రాతృ మరణముతో పొక్కిపొరలినది. ప్రియపుత్రులను అశ్వత్థామ పొట్టను పెట్టుకొనుట చూచి గర్భశోకముతో కుమిలిపోయినది. అష్టకష్టములలో

పుత్రశోకము మహాకష్టము. ముద్దులు మూటకట్టు అభిమన్యుకుమారుడు లేకపోయినను తనప్రియపుత్రులనైనను చూచుకొని జీవింతమన్న ఆ ఆశయుకూడ అడుగంటినది. ఆమెలో క్రోధాగ్ని మరల ప్రజ్వరిల్లినది. ఆమె ధర్మజునితో భీముని నియోగించి బాలఘాతియగు అశ్వత్థామను హతమారునట్లు చేయుటకు ఆజ్ఞ యిమ్మనెను. అట్లు కాకపోయినచో తాను ప్రాయోపవేశము చేసి అసువులను విడిచిపెట్టెదనని కసలి పలికినది. ధర్మజుడు తనసహజమైనధోరణిలో శాంతిమంత్రములను వల్లించెను. ఆ మనస్విని స్తోత్రప్రియుడైన ప్రియభర్తయైన భీముని యథోచితముగా పొగడి అశ్వత్థామను జయింపచేసి అతని శిరోరత్నము తీసికొని ధర్మరాజుచే తనకేశపాశమునందు అలంకరింపచేయించుకొని శాంతించినది.

పోతనార్యుడు ఈ సన్నివేశములో ద్రౌపది మాతృహృదయము జాలువారునట్లు చిత్రించెను. ద్రౌపది తనవలెనే ద్రోణునిభార్య పుత్రశోకముతో బాధపడకూడదని భావించినది. ద్రోణునిభార్యకు భర్త లేడు. ఇప్పుడు పుత్రుడుకూడ లేకపోయినచో ఆమె కడుపుకోతకు అంతములేదని భావించి పిడికిలిపోటుతో అశ్వత్థామను చంపెదనన్న భీమునికి అడ్డువెళ్ళి ద్రౌపది రక్షించినది. ద్రౌపది ఉదాత్తమాతృహృదయము ఇందు ప్రత్యక్షరములతో ధ్వనించుచున్నది.

"ద్రోణునితో శిఖింబడక ద్రోణకుటుంబినియున్నదింట న
క్షీణ తనూజశోక వివశీకృతనై విలపించుభంగి నీ
ద్రౌణి దెరల్చి తెచ్చుటకు దైన్యమునొందుచు నెంతపొక్కెనో
ప్రాణవియుక్తుడైన నతిపాపము బ్రాహ్మణహింసమాన రే !"

(భాగ. - ప్ర - 164)

ఆమె అశ్వత్థామ క్రౌర్యమును నిందించుచు నీవు పుత్రాకృతినున్న ద్రోణుడవనియు నీ చిత్తములో ఒకింతయైన కరుణలేక శిష్య

సుతులను చంపుట పాడియా ? నాపుత్రులు నీమీదకు దండయాత్రకు రాలేదనియు భూసురవంశములో బుట్టియు అందున ధనురాచార్యుడైన ద్రోణుని కడుపునబుట్టి నీవు రాక్షసమైనబుద్ధితో నిద్రితులైన శిశుహత్యచేయుట ధర్మమగునా ? అని మెత్తగా మందలించినది. ఇది ద్రౌపదీమాతకు తగియున్నది.

వ్యాసమహర్షి ద్రౌపదీపాత్రమును వీరపత్నిగా వీరమాతగా భారతీయమహిళామణిగా చిత్రించెను.



# ౫. ఉపాఖ్యానములు

"అమితాఖ్యానక శాఖలం బొలిచి వేదార్థముల చ్ఛాయమై
సుమహద్వర్గ చతుష్కపుష్పవితతిన్ శోభిల్లి కృష్ణార్జునో
త్తమ నానాగుణకీర్తనార్థ ఫలమై ద్వైపాయనోద్యాన జా
త మహాభారత పారిజాత మమరున్ ధాత్రీసురప్రార్థ్యమై"

ఆఖ్యాన, ఉపాఖ్యానము అనునవి సమానార్థకములని భావింపబడుచున్నవి. కాని వీనికి భేదము కలదని తెలియుచున్నది.

ఆఖ్యాన నిర్వచనము : "స్వయం దృష్టార్థ కథనం ప్రాహు
రాఖ్యానకం బుధాః"

(కావ్యాలంకార సంగ్రహము సన్నిధానమువారి వ్యాఖ్య పుట 262)

ఆఖ్యానమనగా కవి తాను స్వయముగా చూచినదానిని చెప్పుట.

ఉపాఖ్యాన నిర్వచనము :

"శ్రుతస్యార్థస్య కథన ముపాఖ్యానం ప్రచక్షతే"

(కావ్యాలంకార సంగ్రహము సన్నిధానమువారి వ్యాఖ్య పుట 262)

ఉపాఖ్యానమనగా ఇతరులవలన విన్నదానిని చెప్పుట.

ఉపాఖ్యానములు అనగా ప్రధానకథలో వచ్చు చిన్నకథయని చెప్పవచ్చును. భారతీయ సంస్కృతి నిధానమగు వేద వాఙ్మయములో నర్థవాదము, విధి, నిషేధములను బలపఱచుటకొఱకు వర్ణింపబడిన ఉపాఖ్యానములు కలవు. హరిశ్చంద్రకథ ఋగ్వేదములో కలదు. దేవాసుర యుద్ధము, వృత్రాసుర వధ, భారద్వాజ మహర్షి కథ మొదలైనవి యజుర్వేదములో కలవు.

భారతమందలి ప్రధానకథయగు కౌరవపాండవుల వృత్తాంతమెంత బహుళప్రచారమందినదో, నలోపాఖ్యానము, శకుంతలోపాఖ్యానము, కపోతధర్మవ్యాధోపాఖ్యానాదులు అంత ప్రజాదరణ పాత్రములగుట జగద్విదితము. ఈ కథలు ధర్మవీరులకు, ఋషీశ్వరులకు, వేదములకు,

మానవమనస్తత్త్వమునకు సంబంధించి యున్నవి. కావ్యతత్త్వజ్ఞులు చెప్పిన రసపరిపోషణము, సజీవపాత్రచిత్రణము కథాకథన నైపుణ్యము, వర్ణనా ప్రావీణ్యము, ధర్మ ధ్వని అను సత్కావ్యలక్షణములతో నల రారుచు సహృదయ హృదయంగమములగుట ఉపాఖ్యానములవిశిష్టత. ప్రత్యుపాఖ్యానము ఒకస్వతంత్ర కావ్యమువలె ప్రతిభాసించుచున్నది. భారతములో ప్రధాన కథాపోషకములుగ నీ ఉపాఖ్యానములు నడచి నవి. అవి ప్రధాన కథాపురుషుల చిత్తమును సంస్కరించి కర్తవ్యో న్ముఖులుగా చేయుటకు రచింపబడినవి. ఈ ఉపాఖ్యాన బాహుళ్యము బట్టియే భారతము ఇంత విస్తృతి పొందినది. ఈ ఉపాఖ్యానముల పర మార్థమునుగూర్చి శ్రీ కేతవరపు రామకోటి శాస్త్రిగారి అభిప్రాయము అనుసంధింప తగియున్నది.

"'భారతములోని కొన్ని కథాసంవాదములు పశుపక్ష్యాదు లాధారముగా ప్రవర్తించినవి. కుక్కుర నీచత్వముం దెలుపు కథ, మూషిక మార్జాలసంవాదము, కపోతాఖ్యానము, నాడీజంఘుని కథ- ఈ మొదలైనవన్నియు నట్టివి. మరికొన్ని దేవతలు, పూర్వరాజన్యులు మునులు, ఆధారముగా నడచినవి. బృహస్పతి మనుసంవాదము, ఇంద్ర ప్రహ్లాద సంవాదము. జనక పంచశిఖాచార్య సంవాదము. నారద నారా యణ సంవాదము- ఈ మొదలైనవన్నియు నిట్టివి. వీని నిర్మాణ పద్ధతిని పట్టి యీ విధముగా నూహింపవచ్చును. పశుపక్ష్యాదు లాధా రముగా నడచినవాని యాంతర్యము ద్వివిధముగా గనిపించుచున్నది. దుష్టమైన చిత్తలక్షణము నిరూపించు సందర్భమున పురుషనామము లను గ్రహింపక నన్యాపదేశముగా చెప్పదలచుట యొకవిధము. పర మోత్తమమైన ధార్మికబుద్ధి పశుపక్ష్యాదులయందున్నట్లు నిరూపించుట చేత మానవు లావిషయమున కడుశ్రద్ధాళువులు కావలయునన్న యుప

దేశము మరొకవిధము. దేవతలు, మునులు, పూర్వరాజన్యులును నాధారముగా ప్రవర్తించినవి సంప్రదాయమును నిలబెట్టుచున్నవి. ఉపని త్సంప్రదాయమది. ఉపనిషత్తులయందు నచికేతుడు,యముడు,వరుణుడు, భృగువు మొదలైనవారి సంవాదములున్నవి. మరియు పూర్వ విూ విషయమును ఫలానా ఇరువు రీ విధముగా చర్చించుకొనినారనియు, ఒకరి కింకొక రిట్లుపదేశించినారనియు భారతమున చెప్పబడుటవలన ధర్మజుని చిత్తము సంప్రదాయమార్గమున బరమార్థమునందు లగ్న మగుట కెక్కువగా నవకాశము కలిగినది,

(తిక్కన కావ్యశిల్పము - పుట 323, 324)

భారతకర్త భారతదేశములో ప్రచారములో నున్న వేద, ఉపని షత్తులలో ప్రసిద్ధిపొందిన, జానపదులలో విశేషప్రచారము పొందిన సర్వకథారత్నములను భారతమణిహారమున పేర్చికూర్చెను. సర్వభార తీయ కథాసరిత్సాగరము భారతము. ఈకథలలో పాండవుల వంశము నకు చెందిన మూలపురుషులైన శంతన, యయాతి దుష్యంతాది రాజుల కథలు రమణీయముగ వర్ణితములు. వీరగాథలగు నలచరిత్ర, శిబి, శ్రీరామ, షట్చక్రవర్తుల కథలు కమనీయముగ గానము చేయ బడినవి. భారతములో రామాయణము వర్ణించుట ఇతిహాసములో ఇతి హాసము కూర్చుట. భారతీయులకు నిత్యము ఆరాధనీయులగు ఇంద్ర, అగ్ని, సూర్య, యమమృత్యు దేవతలన్నియు భారతకారుని భావనా మృతములో ప్లావితమై మనోహర మహోదాత్తరూపములలో ప్రత్యక్ష మైనవి. భారతాంతర్గతమైన కథలు బుద్ధజాతక కథలలోనికి, ప్రపంచ భాషలలోనికి అనూదితములై సర్వమానవుల హృదయావర్జకములగుట భారతవైశిష్ట్యమును సూచించుచున్నది, కథ యనగా చెవికోసికొనెడి కుతూహలము మానవమనస్తత్వము. దీనినిపసికట్టి కథాముఖమున మానవ

జీవితములో సర్వదశలలో నుపయుక్తమగు ధర్మ, నీతి,తత్త్వాది విషయములను మనోహరముగా మహర్షి ప్రవచించెను.

ప్రధాన కథకు పోషకముగ, ఉపాఖ్యానములను చిత్రించి, వాని మూలమున ఆధ్యాత్మిక తత్త్వమును అభివర్ణించెను.

## ఆధ్యాత్మిక ప్రబోధాత్మకములు

### 1. గౌతమీ లుబ్ధక సర్పమృత్యు సంవాదము :

మహాభారత యుద్ధానంతరము ధర్మపుత్రుడు నిర్వేద నీరవభావ భారుడై తనమూలముగ సోదరుడైన కర్ణుని వధయు, గురుబంధుజనుల వధయునై భూమి రక్తసిక్తమైనదని బాధపడి దుఃఖసముద్రమున మునిగెను. ధర్మజుని మనస్తాపము తొలగించి, అతని మనస్సున వివేక దీపము వెలిగించుటకు భీష్మ పితామహుడు వాత్సల్యముతో నీ కథ చెప్పెను :

గౌతమి యను బ్రాహ్మణియొక్క పుత్రుడు సర్పదష్టుడై మరణించెను. అది చూచి గౌతమి పుత్రవియోగముచే దుఃఖించి విలపించెను. ఆమె దుఃఖప్రవాహమును చూచి జాలిపడి సమీపముననున్న కిరాతుడు అభము, శుభము తెలియని బిడ్డకపకారము చేసిన పామును పట్టికొని కోలతో కొట్టి హింసింప పూనుకొనెను. కథలోపాత్రలన్నియు అనగా యమధర్మరాజు, మృత్యువు మొదలైనవి అన్నియు ప్రవేశించి జీవుల మరణకారణములగూర్చి చర్చించిరి.కథాముఖమున జీవులుచేయు కర్మకనుగుణముగ శుభాశుభములు సంప్రాప్తించునని వ్యాఖ్యానింప బడినది.

జీవుల సుఖదుఃఖములకు మరొకరు కారణము కారు. శరీర మతగా నశించునది యని యర్థము. "జాతస్య మరణం ధ్రువమ్" అనునది సత్యము.

"విను కర్మం బొనరించును
జననము మరణంబు నదియ సౌఖ్యము దుఃఖం
బును గావించుం దనచే
సినదానిం బడక పోవ శివునకు వశమే."

"సకల జనంబులు గర్మము
నకు ననుగుణమైన తెరువునం బోదురు దీ
నికి రోష విషాదము లే
టికి విడువుము పాము సంఘటింపుము శమమున్."

(అనుశాస - ప్రథమ - 34, 39)

ఆత్మ నిత్యము. శరీరము నశించునది. విధివశమునవచ్చిన మేలు కీడులను సమచిత్తమున స్వీకరించుట ఉత్తముల లక్షణము. మూఢులు ఏదైన కీడు కలిగినపుడు మరొకరిని నిందించి సంసార సముద్రములో మునిగెదరు. ముముక్షువు సుఖదుఃఖములను, నిందాస్తుతులను ద్వంద్వా తీతుడై సమచిత్తముతో ఆత్మానుసంధానము చేసికొన్నయెడల పర బ్రహ్మ సాక్షాత్కారము పొందును. జీవుల మరణములకు మృత్యువు సాధనము మాత్రమే. సాధనమును ఎంతమాత్రము నిందించరాదు. వార్తాహరుడు (Postman) మనకు నిత్యము శుభలేఖలను ఒకప్పుడు అశుభలేఖలను ఇచ్చుచున్నాడు. ఆ వార్తలను పంచిపెట్టుటమాత్రమే అతని విధి. లేఖలలోని శుభాశుభములకతడెంత మాత్రము బాధ్యుడు కాడు. ఇది జీవులకుమాత్రమే కాక సూర్యచంద్రాదులుకూడ. కాలము చేతిలో కీలుబొమ్మలే. కాలము మహా శక్తివంతము.

ఈ కథ భారతనాయకుడైన ధర్మజుని హృదయస్థితమైన క్షుద్ర మైన, అనార్యమైన హృదయదౌర్బల్యమును పోగొట్టి హస్తినాపుర సింహాసన మధిష్ఠించుటకు తోడ్పడినది.

## 2. సక్తుప్రస్థుని కథ :

మహాభారతమునందలి ఉపాఖ్యానములలో నిది తలమానికము. వేదాంత గవేషణలో మహాభారతమునగల విశాలదృష్టికి ఈ కథ మూాదల. నకులోపాఖ్యానము ననుసరించి యిది కలిగినది. తిక్కన మహాకవి ఈ ఉపాఖ్యానమును ప్రత్యేక కవితా శిల్పముతో పరమ రమణీయముగ తీర్చిదిద్దెను. మహాభారత సంగ్రామానంతరము శ్రీకృష్ణ వేదవ్యాసుల ఉపదేశానుసారము ధర్మజుడు సర్వజన శ్లాఘాపాత్రముగ అశ్వమేధ మాచరించెను. అంత ఒకముంగిస యజ్ఞశాల కరుదెంచి "ధర్మజుని అశ్వమేధము, సక్తుప్రస్థుని అలఘు ధర్మంబుతో నెంత మాత్రము పోలదు" అనెను. బ్రాహ్మణులెల్లరు విభ్రమాశ్చర్యములు పొంది అధ్వరము కీడు పొందుటకు కారణము గ్రుచ్చిగ్రుచ్చి అడిగిరి. నకులము శ్రోత్రజన విస్మయావహముగ సక్తుప్రస్థునికథ రమ్యముగ చెప్పెను.

పూర్వము సక్తుప్రస్థుడను మహర్షి ఉంఛవృత్తితో జీవించు చుండగా మహాక్షామము దాపురించినది. ప్రజలు తినుటకు పట్టెడు మెతుకులు లేక, త్రాగుటకు గ్రుక్కెడు నీరు లేక మలమల మాడిపోవు చుండిరి. సక్తుప్రస్థుని కుటుంబము ఉపవాసములు చేసి చేసి, ఒక దిన మున ఎంతయో కష్టపడి ఒక కుంచెడు పేలపిండిని సంపాదించి సమాన ముగ పంచుకొని తినుటకు సిద్ధముగా నుండిరి. అంత ఒకపేదబ్రాహ్మ ణుడు ఆకలిమంటచే కడు తూలివచ్చి, ఆహార మర్థించెను. సక్తుప్రస్థుని కుటుంబమంతయు భక్తితో బ్రాహ్మణునకు అతిథి గౌరవమాచరించి, తాము తినబోవు అన్నమును కడుపారపెట్టి పూజించిరి.

ఈ ఉపాఖ్యానము ఆదర్శ గృహస్వామి స్వధర్మ నిర్వహణ విశి ష్టతను నిరూపించుచున్నది. సక్తుప్రస్థుని త్యాగము సార్వభౌముని

త్యాగమునకు ఎంతమాత్రము తీసిపోదు. పవిత్రహృదయమే ధర్మమునకు విలువ కలిగించును. హింసాత్మకమైన పశుయజ్ఞముకంటె తపోయజ్ఞము మేలుతరమని సిద్ధాంతము. భారతీయుల ఉదాత్త భావనలో "అభ్యాగతిః స్వయం విష్ణుః" అనునది. కుటుంబములో ప్రతివ్యక్తియు దివ్యాతిదివ్యమైన త్యాగముచేయుటకు పోటీపడుట వింతలలో వింత. న్యాయార్జితమైన విత్తము, సత్పాత్రునకు, ఉచితమైనకాలములో దానము భక్తిపూర్వకముగ చేయుట ద్విగుణీకృత ఫలప్రదము. ఈ పరమార్థము ఈ పద్యములో వాఖ్యానింపబడినది.

"వినుము ప్రభూత దానములు విశ్రుత యజ్ఞములున్ సధర్మతా
వినుతికి నెక్కఁజాలవు వివేకనిధీ పరిశుద్ధశోభితా
ర్జనమున దెచ్చికొన్నది వరంబగు పాత్రము నర్హకాలముం
గని లఘువస్తువేని నొసగం గను టుజ్జ్వల ధర్మ మారయన్."

(అశ్వమేధ - చతుర్థ - 246)

ఆయా కథాసన్నివేశములలో పాత్రలచే సర్వమానవ శిరోధార్యమైన ఉపదేశములు చేయించెను. భర్తయొక్క ప్రధానకర్తవ్యము భార్యను సంతోషింపచేయుట. అట్లుచేయని యధముడు ఇహలోకములో నిందను, పరలోకములో యమదండనము పొందును.

"స్త్రీ సంతోషించుతెఱం
గాసపడని మనసు గలుగునట్టి యధము డి
చ్చో సడిగను జని యచ్చో
గాసింబడు జముని భటులు గాఱియ వెట్టన్."

(అశ్వమేధ - చతు - 229)

"పతియ చుట్టంబు బక్కంబు బతియ చెలియు
బతియ తల్లియు దండ్రియు బతియ గురువు

బలియు దైవంబు గావున నలనిపని యొ
నర్చుటయు చూవె ధర్మంబు నాతి కరయ."

(అశ్వమేధ - చతుర్థ - 230)

తిక్కనార్యుడు అలతి అలతి పదములలో అనల్పమైనభావమును సర్వజన శిరోధార్యమైన భారతీయ భార్యాభర్తృ సంబంధమాధుర్యము నావిష్కరించెను. సందర్భోచితముగ లోకసహజములైన విషయములు ప్రస్తావించెను. యౌవనములో నున్నవారికి ఆకలి ఎక్కువ. వృద్ధులకు ఆకలి తక్కువ. సంస్కృతములో "బుభుక్షిత ః కిన్నకరోతి పాపమ్" అనుసూక్తి కలదు. ఆకలి ఏపాపము చేయింపదు ? అట్టి క్షుధను జయించిన స్థితప్రజ్ఞుడు సక్తుప్రస్థుడు.

2. రాజనీతి ప్రబోధకాత్మకములైన ఉపాఖ్యానములు :-

శాంతిపర్వములో ధర్మప్రబోధము సర్వతోముఖముగ సాగినది. అందు లౌకికమే ప్రాధాన్యము వహించినది. భీష్ముడు బోధించిన రాజనీతి కుటిలముగానున్నట్లు పైకి కనిపింపవచ్చును. ధర్మసూక్ష్మమును, సందర్భశుద్ధిని పాటింపకపోయినచో అపార్థము కలుగుటకు అవకాశము కలదు. దానికి శ్రీకృష్ణుడు చక్కని పరిష్కారమార్గము సూచించెను.

"ధర్మజునకు నీ చెప్పెడు,
ధర్మస్థితి వాక్యసమితి తాత్పర్యముతో
నిర్మలులై కొనియాడెదు,
ధార్మికులకు నుభయజగ దుదాత్తత కలుగున్."

(శాంతి - ద్వితీయ - 149)

1. గృధ్రజంబుకోపాఖ్యానము:-

అనేకవ్యక్తులు రాజును ఆశ్రయించికొని యుందురు. ఈవ్యక్తులు రాజునకు ఆంతరంగిక మిత్రులవలె కపటవినయము నటించుచు రాజును

తమగుప్పిట పెట్టుకొనుటకు యత్నింతురు. అట్టి క్లిష్టసమయములో ప్రభువు ఎవరిమాటను ప్రమాణముగ స్వీకరింపవలెను ? ఎవరిమాటను తిరస్కరింపవలెను. ఇది చిక్కుసమస్య. రాజు మంత్రుల సమావేశ పఱచి, వారి అభిప్రాయము నెఱింగి, తానుకూడ శతవిధముల యోజించి నిర్ణయము తీసికొనవలెను. శిష్టజన రక్షణము, దుష్టజన శిక్షణములో రాజు ఎంతమాత్రము ఏమరి యుండరాదు. ఇట్టి చిక్కుముడిని విడదీయుటకు అనుసరింపవలసిన విధము బోధించుటకు ఈకథ భీష్ముడు తెలిపెను.

పూర్వము విదిశా పట్టణములో ఒకబాలుడు మృతిపొందగా, ఆ బాలునిశవమును ప్రేతభూమికి కొనిపోయి, తలిదండ్రులు, బంధువులు అమేయ శోకవివశులై విలపించుచుండిరి. అంతలో ఒకగ్రద్దవచ్చి జీవుల అస్థిరత్వమును బోధించి బాలునివిడిచి వెళ్ళుడని హెచ్చరించినది. కొంతసేపటికి ఒకనక్కవచ్చి, వారి దుఃఖమునకు ఎంతయో నొచ్చుకొని విధిని ప్రార్థించి ఈ పున్నమచందమామవంటి బిడ్డను బ్రతికించుకొని ఇంటికి సుఖముగా తీసుకొనివెళ్ళుడని హితోపదేశము చేసినది. వారు శవమును పగలు విడిచినచో గ్రద్దకు చిక్కును. రాత్రి విడిచినచో నక్కకు వశమగును. ఇప్పట్టున గ్రద్దమాటలు వినవలెనా ? నక్కమాటలు వినవలెనా ? అనునది ప్రశ్న. కథ రక్తికట్టుటకు కరుణాకరుడు, భక్తవశంకరుడగు శంకరుడు ప్రత్యక్షమై ఆ బిడ్డను బ్రతికించి ఆ తలిదండ్రులకు ఆమందానందము నొసంగెను.

ప్రభువు సన్నిధానమున ప్రధానపదవులలోనున్న అధికారులు ధీమంతులై, వచోవిశారదులై, తమ తమ కార్యములను ఏవిధముగనైనను రాజుచే సాధించుకొనుటకు తమ ప్రియవక్తృత్వములో, ఎన్నియో ఘోరములు చేయుటకు అమాయకులను శిక్షింపచేయుటకు

ఏమాత్రము వెనుదీయరు. అధికార రోగపూరిత బధిరాంధకళేబరము లగు రాజులు, రాజోద్యోగులగు కొండెగాండ్రమాటలకు బానిసలై సజ్జనులకు అపకారముచేయుట మనము నిత్యము చూచుచున్నాము. అందుచే రాజు అన్నివిషయములను చారచక్షువులచే తెలిసికొని, అవసరమయినచో మారువేషము వేసికొని మంచిచెడ్డలు గుర్తించి రాజకార్యనిర్వహణమాచరింపవలెను. ఆర్తుల కన్నీరు తుడుచుటయే ప్రభువు యొక్క ప్రధానకర్తవ్యము. నిజకార్యార్థులగు కపటుల నేర్పుమాటల లోని కాపట్యము గుర్తించుటకొఱకే గృధ్ర జంబుకోపాఖ్యానముద్దేశితము.

## 3. లౌకికానుబంధ సంబంధులు :

మానవజీవితము అర్థ కామములతో ముడిపడి యున్నది. నిత్యము మనము ఎన్నియో సమస్యలతో, చిక్కుముడులతో సదమదమగుచున్నాము. మానవజీవితములో ఎదుర్కొను సమస్యలకు ధర్మార్థయుక్తమైన పరిష్కారమును భారతము అనేక ఉపాఖ్యానముల ముఖమున తెలిపినది.

### (1) రురుని కథ :

ఆదిపర్వ ప్రారంభమున ఈ కథ చెప్పబడినది. మానవ మనస్తత్త్వమును ప్రధానముగా చేసికొని రచింపబడినది. ఘృతాచి ప్రమతుల పుత్రుడు రురుడు. ఈ భార్గవ ముఖ్యుడు, విశ్వావసువు, మేనకలకు పుట్టిన అలోక సామాన్యరూపగుణోపేతను ప్రమద్వరను చూచి ఆమెను తన హృదయేశ్వరిగా చేసికొనవలెనని నిశ్చయించెను. అంతలో ప్రమద్వర సఖులతో ఆడుకొనుచుండగా పాముచే కఱువబడి ఆమె పంచత్వము నొందెను. రురుడు, విషవ్యపగత ప్రాణయైపడియున్న ప్రమద్వరనుచూచి శోకవ్యాకులిత చిత్తుడై ప్రియ వియోగదుఃఖము

సహింపలేక వనమునకు చని మునీశ్వరులను సందర్శించి తనతపములో కొంత ఒసగి ఆయుర్దాయములో సగము ధారపోసి ప్రమద్వరను పునర్జీవితగా చేసికొని వివాహము చేసికొని ఇష్టోపభోగము లనుభవించెను. ఈకథయందు రసధ్వని చక్కగా పోషింపబడినది. అయోగశృంగారము, వియోగశృంగారము వర్ణింపబడినవి. సాధారణముగ సంయోగానంతరము వియోగము సార్థకమై యుండును. ఇందలి వియోగము విచిత్రమైనది. కరుణరసము హృదయవిదారకముగా వర్ణింపబడినది. కథ నడపుటలోను సాభిప్రాయములైన విశేషణములను ప్రయోగించుటలోను నన్నయమహాకవి చూపిన శిల్పము అనితరసాధారణమైనది. రురునకు ప్రమద్వరపైని ప్రణయము చాలదొడ్డది. ప్రమద్వర, రురునిగృహములో కాలుపెట్టకయే అతని మనఃపీఠము నలంకరించినది. అందుండి ఆమెను తొలగించుటకు అతనికి శక్తి లేక పోయినది. అందుచేతనే రురుడు ప్రమద్వరను "మన్మనో నిలయ" అని సంభావించెను.

ప్రణయమాధుర్య మహత్త్వము చక్కగ వ్యాఖ్యానింపబడినది. పెండ్లి కాకుండగనే ఆ దంపతులు పెంచుకొన్న అనురాగము లోకోత్తరమైనది ప్రమద్వరయందు రురునకు ఇంత అనితరసాధారణమైన ప్రణయముండుటకు కారణము ఆమె ప్రమదోత్తమ అగుటయే. తత్కారణముగా రురుడు తన ఆయుర్దాయములో సగము ప్రీతిపూర్వకముగా త్యాగము చేసెను.

మృతి జీవుల కవిలంఘ్యము. అది మానవుని ఊహకు అందునది కాదు. తపస్సుచే, దానముచే, అధ్యయనముచే మృత్యువును జయించి అమృతత్వము పొందవచ్చునని సూచితము. స్త్రీపురుషుల మనస్తత్త్వమును, ప్రణయ మాధుర్యమును లోకోత్తరముగా చిత్రింపబడుట ఉదాత్తము.

## (2) సుందోపసుందోపాఖ్యానము :-

పాండవులు పెండ్లియాడిన క్రొత్తరోజులు. అంత నారదమహర్షి ఏగుదెంచి ద్రౌపదికారణముగ పాండవులలో భేదము పుట్టకుండ హితోపదేశము చేయుటకే ఈ ఉపాఖ్యానము చెప్పెను. పూర్వము సుందోపసుందులను రాక్షసులు వరదాన గర్వితులై, సకలలోకములను జయించి పుణ్యవంతుల నిత్యనైమిత్తిక కర్మంబులకు విఘ్నము చేయుటకు మునీశ్వరులను ముప్పతిప్పలు పెట్టి మూడుచెరువుల నీళ్ళు త్రాగించిరి. విశ్వగురుడు వారి ఉపద్రవము తొలగింపదలచి తిలోత్తమయను రూపలావణ్యవతిని అచ్చర మచ్చెకంటిని గెంపెను. సుందోపసుందులు ఆ మందయాన పొందుకోరి యొండొరులు పోరి తిలోత్తమ కారణముగ మరణించిరి.

"ఎంతవారలయిన కాంత దాసులే" అను త్యాగయ్యగారి మాటకు ఈకథ చక్కని వ్యాఖ్యానము. ఇంతుల నిమిత్తము ఎంత ధృతిమంతులకైనను భేదము కలుగుట సహజము. సుందోపసుందులమైత్రి ఆ బాల్యప్రభృతి ఎట్లు సంవృద్ధమైనదో తుదకు ఆశ్చర్యకరముగ ఎట్లు భేదమునకు దారితీసినదో చతురముగ తెలుపబడినది.

ఈ సోదరులు ఏకోదరులు, ఒక కంచములో తిని ఒక మంచమున పరుండి సహోదరత్వ, సౌహార్ద్రమును సార్థకము చేసికొన్నవారు. అయ్యు ఒకే స్త్రీయందు బద్ధానురాగులై ఇది నా వల్లభ, ఇది నా హృదయేశ్వరియని భావించి తన్నిమిత్తము భేదముపొంది మరణించిరి. ఇట్టి మానసిక స్థితి లోకములో నాడు, నేడు కనిపించుచున్నది. ప్రపంచములో జరుగు హత్యలు అనేకము. యుద్ధము లనేకము, అసలా మాటకు వచ్చిన మన రామయాణ, మహాభారతములు, పాశ్చాత్యము హేతిహాసము "ఇలియడ్", స్త్రీ నిమిత్తముగా జరిగినవి.

"అన్యోన్య ప్రియ భాషణు
లన్యోన్యహితైషు లసుర లన్యులపోలెన్
మన్యు పరి ప్రేరితులై
యన్యోన్యాభిహతి జనిరి యమపురమునకున్."

(ఆది - అష్టమ - 113)

సంయోగ, వియోగములు విధి ప్రేరితము రాక్షసకామము మృత్యుప్రదమని సూచితము.



# ఐహిక ధర్మోపదేశము

## పురుషార్థములు

ధర్మము :

మానవజీవితమును పరిపాలించునట్టివి, మానవుని పరిణామము నకు సోపానసరణి నిర్మించునట్టివి పురుషార్థములు. అందులకే అంతర్దృష్టులైన అనేకాలంకారికులయొక్కయు దృక్పథము ప్రకారము సర్వ వాఙ్మయము చతుర్వర్గ వ్యుత్పత్తికి నిధానము, నిదానము కావలెను. లోకసంగ్రహార్థము వేదవిభాగము చేసియు, బ్రహ్మసూత్రములను రచించియు, తనివిసనక విషణ్ణుడై నిషణ్ణుడై ఉన్న వేదవ్యాసుని కడకు నారద మహర్షి వచ్చి చేసిన ఉపదేశము ప్రకారము వేదవ్యాసుడు మరియొక సరి క్రొత్త పూనికతో, సర్వమానవ సమాజైక తానమైన ధర్మప్రబోధము చేసి సర్వప్రపంచమును ఒక ధర్మక్షేత్రముగ భగవంతుని కల్యాణమండపముగా తీర్చిదిద్దు నిమిత్తము పంచమవేదమగు, భారతమును పరిథవించెను. భగవద్గీత ఎత్తుగడలో వ్యాసభగవానుడు ఆ ధర్మసూక్ష్మము అద్భుతముగా సూచించెను.

"ధర్మక్షేత్రే కురుక్షేత్రే
సమవేతా యుయుత్సవః
మామకాః పాణ్డవాశ్చైవ
కిమకుర్వత సఞ్జయ.

(భగవద్గీత-ప్రథమ-1)

ధర్మగ్లాని కలుగునప్పుడు తానై భువికవతరింతునన్నాడు భగవంతుడు. మానవుడు ధర్మావలంబిగా నున్నంతకాలము ఆ అవసరము భగవంతునకు లేదు. అతని అవసరము మానవునికి లేదు. అనగా ధర్మమే దైవమనుట.

భారతమునకు నాయకుడు ధర్మజుడు. ధర్మదేవతయొక్క అంశావతారము ఒకసామాన్యునివలె జీవితోపక్రమము చేసి పరిణామక్రమ రమణీయమైన మార్గమున పయనించి, మహామానవుడై ధర్మదేవత యొక్క అంశాంతరమును గుత్తగొన్న విదురుని మహానుభావత తన్ను ఆవహింపగా బహువత్సరములు ధర్మద్రష్టయు మనుమార్గనిష్ఠుడునై ప్రజారంజకముగా పరిపాలించి ధర్మదేవత తోడురాగా చివరికి విశ్వాసమునకు పేరుపడ్డ జంతువురూపములో ధర్మదేవత తన్ను అనుసరింపగా స్వర్గమునకు మహాప్రస్థానము చేసెను. ఆ మహాధార్మికుని పరమాద్భుత కథయిది. గాథ యిది.

"ధర్మోరక్షతి రక్షితః" "యతో ధర్మ స్తతో జయః"

అను సూక్తులకు నిదానమై, సహృదయ హృదయావర్జకత నిమిత్తము కావ్యధర్మియై వెలసిన మహేతిహాసము భారతము. అందుచే దానికి ఎన్నో యోగ్యతలున్నను ప్రప్రథమ యోగ్యతగా "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని" బహుళాంధ్రోక్తిమయపరమేష్ఠి నన్నయ భట్టారకుడు భావించుట విశేషము. ధర్మాద్వైతమే దాని ఆత్మతత్త్వమని బ్రహ్మనిష్ఠుడైన కవిబ్రహ్మ భావించియున్నాడు.

> "కృష్ణద్వైపాయను డర్థిలోకహిత నిష్ఠంబూని కావించె ధ
> ర్మాద్వైత స్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయ
> మున్."

ధర్మ మనగానేమి ?

"ధరతి విశ్వం ధర్మః" "ధారణా ద్ధర్మ మిత్యాహుః" "ధర్మో ధారయతే ప్రజాః"

ధర్మము ప్రజలను ధరించుచున్నది. ప్రజలకు ధర్మము ఒకస్థితిని, గతిని కల్పించుచున్నది ధర్మమను పదమునకు విస్తృతార్థము కలదు.

"కర్తవ్యము, (ఐహికము, ఆముష్మికము) న్యాయము, సత్ప్రవర్తన, శాసనము, మతము, నీతిశాస్త్రనియమము, సముదాచారము, ఐహికము, నైతికము మతసంబంధి) అను వివిధార్థములలో "ధర్మ" మను పదము వాడుకలో నున్నది. "ఋతమునకు" వలెనే ధర్మమునకు కూడ ధరించునది, నిలబెట్టియుంచునది, అనగా విశ్వమును శాసించు చరమ నియమము - అని అర్థము. సత్ప్రవర్తనము అను ధర్మమునకు కర్మసూత్రములతో సంబంధముకలదు. ఉత్తమ వర్తనకు సత్ఫలితము, దౌష్ట్యాచరణమునకు ఉచిత దండనము తప్పకసిద్ధించి తీరునని కర్మ సూత్రము చెప్పెను."

"ధర్మమను మాటకు సాధారణ వ్యవహారములో కర్తవ్యము అనుఅర్థమేకాక ఇంకను విస్తృతార్థము కలదు. ఒక కులమునకు, లేదా రూఢమైన ఆచారమునకుకూడ "ధర్మ" మను వ్యవహారమున్నది. సంఘములోని వివిధవర్గములవారికి గల సాంఘిక కర్తవ్యము అను ఈ అర్థములో ధర్మమునకు ప్రయోజనము సంఘసౌష్ఠవమును కాపాడుట."

(విజ్ఞాన సర్వస్వము - దర్శనములు - పుట 481)

మానవజీవితమునకు ధర్మమున కవినాభావసంబంధ మున్నది. ధర్మరహితమైన మానవజీవితము సంక్షుభితమై దుఃఖమయమగును. జీవకోటిలో మానవుడు ఇతర జీవులకంటె తన వైశిష్ట్యమును, సార్థక్యము నిరూపించుటకొఱకు జ్ఞానవంతుడై మెలగవలెను. ధర్మము అత్యంత సంక్లిష్టమైనది. అతి సూక్ష్మమైనది. ధర్మతత్త్వమును గ్రహించుటకు వేదముల నాశ్రయింపవలెను. "వేదో ధర్మ మూలమ్" వేదోక్తమైన ధర్మము లుత్తమాధికారులకు మాత్రమే యవగతమగును. వేదములు, పురాణములు చెప్పిన ధర్మము సామాన్య ప్రజలకు దురవగాహమైనవి. ఇందు చెప్పబడినధర్మములు అసంఖ్యాకముగ నభివృద్ధి

పొంది స్పష్టత, సమన్వయ దృష్టిలోపించి ఏది ధర్మము, ఏది అధర్మము? తేల్చలేని దుస్థితి సామాన్య ప్రజలలో దాపురించినది. ధర్మము తు. చ. తప్పకుండ తెలిసికొని ధర్మపన్నము లుపన్యసించుటవలన ప్రయోజనము లేదు. ఆ ధర్మము జీవితమున త్రికరణ శుద్ధిగ అవలంబించినపుడే సత్ఫలితము నొసంగును. నిత్యజీవితమున కన్వయించి చిత్రింపబడిన ధర్మము మానవులకు శిరోధార్యమగును. ధర్మచిత్రణము సరసముగ, కాంతా సమ్మితముగా కావ్యముఖమున ఉపదేశించినప్పుడే మానవుడు మనోరంజనము పొందుచు ధర్మస్థిరమతి యగును. మానవ మనస్తత్త్వము అనుకరణ ప్రధానమైనది. వ్యాసమహర్షి ధర్మబోధ చేయుటకొఱకే భారతామ్నాయమును రచించెను.

మహాభారతములో కవిత్వము, రసపోషణము, రాజనీతి, గృహనీత్యాదు లున్నను, వ్యాసమహర్షి ధర్మమునకే యత్యంతప్రాధాన్య మొసంగెను. భారతము ధర్మసారము. ఉభయలోకములలో శ్రేయమును సాధించుధర్మములు భారతములో సాంగోపాంగముగ వర్ణింపబడినవి. ధర్మాచరణము కత్తిమీాద సామువంటిది. ఎన్ని కష్టనష్టములు ఎదురైనను, మనోబలము వీసమంతవీడకుండ ప్రవర్తించు మార్గము ధర్మరాజాదు లుపదేశించుచున్నారు.

సౌలభ్యముకొఱకు ధర్మమును 1. పరమ ధర్మమనియు, 2. అపర ధర్మమనియు వింగడింపవచ్చును. పరమధర్మము మోక్షప్రదాన సమర్థము. అపర ధర్మమనగా ఇహలోకమునకు సంబంధించినది. వ్యక్తిగత ధర్మములు, ఆశ్రమ ధర్మములు మొదలైనవి అపరధర్మముల క్రిందికి చేరును. సర్వధర్మములకు మూలీభూతమైనది, అనుత్తమమైనది మోక్షధర్మము. ఐహిక ధర్మములన్నియు పరమధర్మమునకు సాధనములు కావలెను, వ్యాసమహర్షి ధర్మమర్మజ్ఞుడు. ధర్మరహస్యము

నావిష్కరించుట ధర్మసంకటములను తీర్చుట, ధర్మసూక్ష్మమును నిరూపించుట, సామాన్యమానవులకు అసాధ్యము. సాక్షాద్విష్ణువే వ్యాసుడై ఆవిర్భవించుట చేతనే ఆ మహామనీషికి ధర్మతత్త్వము ప్రత్యక్షమైనది. భారతామ్నాయములో ధర్మస్వరూపులు, ధర్మవేదులు, ధర్మబోధకులు, ధర్మప్రవర్తకులు, ఎందరో మహానుభావులు కలరు. శ్రీకృష్ణుడు, భీష్ముడు, విదురుడు, వ్యాసమహర్షి, భృగుడు, ప్రహ్లాదాదులు ధర్మోపదేశములను పరిఢవించిరి. భారతగ్రంథమునకు "జయేతిహాసమను" పేరుగలదు. జయమనగా ధర్మవిజయము. నాయకుడు ధర్మరాజు. భారత కథామాల ధర్మసూత్ర గ్రథితము. అందలి ప్రతిపుష్పము ధర్మ సురభిళము. మహాభారతమునందు ధర్మము విశ్వరూప ప్రదర్శనమాచరించినది. భారతీయుల రక్తములో ధర్మవిచికిత్స మిళితమైయున్నది. మానవుడు జన్మించినదాది మరణించువరకు సుఖదుఃఖములందు, మానావమానములందు ఇది ధర్మమా? ఇది అధర్మమా? అని ప్రశ్నించుకొని ముందడుగు వేయవలెనని, భారతము సూచించినది.

శ్రీకృష్ణుడు ధర్మరాజునకు నమస్కరించియున్నాడు. భీష్మ తపస్వి, ధర్మరాజునకు శాంతిపర్వములో ధర్మోపదేశము చేయుటకు ముందు "నమో ధర్మాయ మహతే, నమః కృష్ణాయ వేధసే" అని శ్రీకృష్ణునికంటె ముందు ధర్మమునకు నమస్కరించుట గమనార్హమై యున్నది. ధర్మమహత్వ మట్టిది. భారతము ధర్మజ్యోతి

2. అర్థము :- న్యాయముగా నార్జించినధనము మానవులకు ఉభయలోక సౌఖ్యము లొనగూర్చును. దుర్యోధనాదులు వంచనచే, పాండవుల ఐశ్వర్యము నపహరించి తత్ఫలముగా సమూలముగ నశించిరి. దొంగతనము మహాపాతకము. ధనసంగ్రహము కేవలము భోగానుభవము కొరకు చేయరాదు.

"ధనసంగ్రహంబు భోగార్థకృతంబు దుష్టమగుటయు గలదు
యజ్ఞార్థకృతంబైన నదియ నిచ్చెన బ్రహ్మపదము నొంద."

అనేక సందర్భములలో పరధనాపేక్ష మహాపాతకమని చెప్పబడి నది. దుర్గతికిపోవువారి లక్షణములు "పరధనాపేక్ష, పాపానుమోదము, ధర్మద్వేషములు."

3. కామము : ధర్మయుక్తమైన కామము శ్రేయఃప్రదము. అమితకామాసక్తి మరణప్రదము. విచిత్రవీర్యుడు దీని కుదాహరణము. ధర్మరహితమైన కామాసక్తుడగు నీచ కీచకుడు భీముని చేతిలో మరణించెను. హిడింబ, అను రక్కసి మగువ భీముని ప్రేమించి పెండ్లియాడుమని నిర్బంధించెను. ఆ ధీరోదాత్తమూర్తి తల్లిని, సోదరులను రక్షించి వారి అనుమతి పొందినపిమ్మటనే ఆమెను పెండ్లియాడెను. మానవుడు కామమను శత్రువును జయించినపుడే ముక్తిని పొందును.

4. మోక్షము : మానవుడు శాస్త్రవిహితమైన ధర్మము నాచరించుచు, మోక్షముపొందు మార్గము శాంతిపర్వములో సూచితము. ఆధ్యాత్మవిదులు భారతమును వేదాంత రసాయనముగ కీర్తించుటకు ప్రధాన కారణము అది చేయు ఉపదేశము బట్టియే. మోక్షసాధన సామగ్రి అంతయు భారతములో ఓతప్రోతముగా నున్నది. వ్యాసమహర్షి ప్రధాన కథాముఖమున, ఉపకథాముఖమున చతుర్విధ పురుషార్థములలో ఒకదానికి మరొకటి సంఘర్షణ రాకుండ అనుసరించు విధమును పరమరమణీయముగ సూచించెను. త్రివర్గములకు సమ ప్రాధాన్యమిచ్చి మెలగువాడే సర్వవిత్తముడు,

తిక్కనార్యుడు చతుర్విధపురుషార్థములను సాధించు విధముపై ఒకగోష్ఠిని శాంతిపర్వములో నిర్వహించెను. "ఒకదినమున ధర్మరాజు, ధర్మార్థవిదుడైన విదురుని ఆహ్వానించి సోదరులను రావించి ధర్మార్థ

కామంబులలో, ఉత్తమ, మధ్యమ, అధమత్వ నిరూపణము చేయుడని పలికెను. వృద్ధానుపూర్విగా విదురు డిట్లు గోష్ఠిని ప్రారంభించెను.

"ధర్మమువలన ధనము సిద్ధించును. ధనమువలన కామతంత్రము సమకూరును. అందుచే ధర్మము ఉత్తమము, అర్థము మధ్యమము, కామము అధమము" అని చెప్పెను.

అర్జునుడులేచి ధర్మకామవర్తనమునకు మూలము ధనమనియు, వైరాగ్యమువహించి జటాధారణముచేసిన మునీశ్వరులు సహితము ధనమును దేహయాత్రను సాగించుటకొరకు సాధనముగా గ్రహించు చున్నారని చెప్పెను.

అర్జునుని అభిప్రాయమును నకులసహదేవులు బలపరచుచు ఇట్లనిరి.

"సర్వకార్యములు ధనైక మూలములు. అర్థధర్మము లన్యో న్యాశ్రయములు. ఒక పురుషార్థమును పట్టుకొని వ్రేలాడువాడు జగత్తు యొక్క నడవడిని పోజేయును. ధనములేనివానికి కామము అప్రా ప్యము." అని చెప్పిరి.

పవమాననందనుడు సభ్యుల మానసములు ఉల్లాసపల్లవితమగు నట్లు కామ పురుషార్థ మహత్వమును ప్రకటించెను. "వెన్న పాలు, పెరుగులయొక్క సారము. అట్లే కామరసము ధర్మార్థముల సారము. దానిని అధమదృష్టితో చూడరాదు. ఒకవేళ అట్టి తలంపు పట్టుకొని మడికట్టుకొని ఉన్నవాని జీవితము సుఖసంవిధాన బాహ్యమగును. సమస్యాబహుళమైన మానవజీవిత శిశిరములో హృదయేశ్వరియే నవ వసంతోదయమును కూర్చును. అందుచే ధర్మార్థ కామములలో ఒక దానిని మాత్రమే గ్రహించినవాడు అధముడు. ఒకటి మాని వర్తించు వాడు మధ్యముడు. అన్నింటికి సమప్రాధాన్య మొసంగువాడు ఉత్త ముడు" అనెను.

అందరి అభిప్రాయములను సావధానముగ విని ధర్మరాజు తన పేరు సార్థక మగునట్లు తన అభిప్రాయమును ప్రకటించెను. విదురుని వాక్యములు సిద్ధాంతములు. తక్కినవారి మాట లన్నియు కొంతవరకు ఆదరణీయములు. భూతములు జరామరణోపేతములు. అందుచే మానవుడు నిరంతరము మోక్షము పొందుటకు ప్రయత్నించుటయే అనుత్తమమైన ధర్మము. ఈ విధముగా చతుర్విధపురుషార్థములను సాధించు సువర్ణసూత్రమును భారతము పరమరమణీయముగా బోధించినది.

## 2. గార్హస్థ్య ధర్మము

పితృయజ్ఞము : భారతములో సర్వదర్శన సమన్వయము సర్వోత్తమముగా సాగినది. మనుస్మృతి వ్యక్తికి, సంఘమునకు సంబంధించిన విధులను సాకల్యముగా వివరించినది, ఈ స్మృతిలోని శ్లోకములు యథాతథముగా వ్యాసభారతములో కనిపించుచున్నవి. వేద, ధర్మశాస్త్రములను అనుసరించి వ్యాసమహర్షి, గృహస్థాశ్రమమునకు సంబంధించిన ప్రవృత్తియజ్ఞము, నివృత్తియజ్ఞము నిరూపించెను. గృహస్థాశ్రమము ప్రవృత్తిధర్మమునకు, నివృత్తిధర్మమునకు పూలవంతెన వేసినది. కేవల సన్యాసమునకు భారతమందు స్థానము లేదు. భారతకథయంతయు గృహస్థునకే చెప్పబడినది. ఆనుశాసనిక పర్వమునకు గృహస్థే శ్రోత యగుట గమనార్హము. గృహస్థాశ్రమమునకు ఉపయుక్తమగు దైవిక, పైతృక శ్రాద్ధాది విషయములు, గోసువర్ణ దానాదులను దీపధూపనైవేద్యములను తేనెలొలుకు తెలుంగుపలుకులలో తిక్కన పేర్చి కూర్చెను. సర్వాశ్రమములకు సమాశ్రయణీయమైనది గృహస్థాశ్రమము. ముక్తిని పొందుటకు సంసారమును త్యాగము చేయనక్కర లేదు. జనకుడు, ధర్మరాజు, సంసారములో నుండియే జీవన్ముక్తిని పొందిరి. గృహము శాంతికి, ఆనందమునకు ఎట్లు నిలయమో, అట్లే అమృతత్వము పొందుటకు ఉత్తమ ఉపకరణము.

"ప్రజలు తల్లి జెందుపగిది గృహస్థ ధ
ర్మంబు నెల్లయాశ్రమములు జేరి
కాదె జీవనంబు గావించుకొను గృహ
యుక్తు డోషధులకు నొడయుడగుట."

(శాంతి - పంచమ - 312)

గృహస్థాశ్రమము పంచయజ్ఞ సమన్వితము. 1. బ్రహ్మయజ్ఞము 2. దేవయజ్ఞము 3. పితృయజ్ఞము 4. నరయజ్ఞము 5. భూతయజ్ఞము. గృహస్వామి ఈ పంచయజ్ఞములు నిర్వర్తించినచో ఉభయలోక సౌఖ్యములు సులభముగా పొందును. పురుషుడు దేవ, ఋషి, పితృ, మనుష్య ఋణంబులతో పుట్టుచున్నాడు. ఆ పురుషుడు యథాకాల విధులవలన విముక్తి పొందవలెను. అట్లు కాని వానికి పుణ్యలోకములు లేవు. యజ్ఞంబులు చేసి దేవతల ఋణంబును, తపస్స్వాధ్యాయ, బ్రహ్మచర్యవ్రతంబున ఋషుల ఋణమును, శ్రాద్ధపుత్ర లాభంబులచేసి పితరుల ఋణంబును, భూతదయతో మనుష్యుల ఋణంబును బాప వలయును.

ఆధునిక కాలములో చాలమంది పుత్రులు తల్లిదండ్రులు జీవించి యున్నంతవఱకు, వారికి ఇసుమంత అయిన సేవచేయక, వారిని గాలికి వదలివేసి వారు చనిపోయిన పిమ్మట శ్రాద్ధాదులు చేసినచో పుణ్యము పొందవచ్చునని భ్రమపొందుచున్నారు. అది ఎంతయు శోచనీయము. మనకు ఈ కారణశరీరమును ప్రసాదించిన తల్లిదండ్రులు ప్రత్యక్షదైవములు. తల్లి ప్రాణసంకటావస్థ పొంది పుత్రునికని పెంచి పెద్దచేయుటచే మాతృదేవత ప్రప్రథమముగా పూజింపతగియున్నది. అందుచేతనే ఉపనిషత్తులు "మాతృదేవో భవ" అని బోధించినవి. మనలను ఉత్తమ పౌరునిగా తీర్చిదిద్దిన తండ్రియు గురువును, పరమపూజ్యులు. శాంతనవుని మించిన పితృభక్తులు లోకమున ఎక్కడ కలరు ? పితృపాదుల

ఆనందముకొఱకు బ్రహ్మచర్యవ్రతము సకలభోగాస్పదమగు రాజ్య సింహాసనము తృణప్రాయముగా త్యాగముచేసిన మహాత్యాగమూర్తి సత్యవ్రతుడు భీష్ముడు. భారతకారుడు సమాజములోని ప్రతివ్యక్తికి బాధ్యతలను ఖండితముగ నిర్దేశించెను. మరొక మెట్టు ముందునకు వెడలి తల్లిదండ్రులు పంచినపని చేయని పుత్రునకు పితృధనము పొందుటకు అర్హతలేదని స్పష్టముగ చెప్పెను.

"తనయుండు తల్లిదండ్రులు
పనిచిన పని సేయడేని పలుకెడలోఁ జే
కొనడేని వాడు తనయుం
డన బడునే పితృధనమున కర్హుండగునే."

(ఆది - తృతీయ 199)

ఆనుశాసనిక పర్వములో ధర్మశాస్త్రములోచెప్పిన సర్వవిషయములు అనుసంధింపబడినవి. పితృదేవతలకు ఏ పక్షములో, ఏ తిథులందు, ఎట్టివారిని, భోక్తలుగా నియమింపవలెనో ఏ ఏ శాకములను వండవలెనో సాకల్యముగ వర్ణింపబడినది. భారతీయులు పలువురు పుత్రులు కావలెనని కోరుటలో పరమాశయమున్నది. పితృదేవతలు తమ పుత్రులలో ఏ ఒక్కడైనను గయకు వెళ్ళి శ్రాద్ధాది ఉత్తమకర్మలను చేయునను సదాశయముతో బహుసంతానము కోరుదురు.

### దేవయజ్ఞము

ఆర్య ఋషీశ్వరులు మానవాళికి క్షణభంగురమైన జగదశాశ్వతత్వము తెలిపి పరబ్రహ్మమును తెలిసికొనుటకు ఆయా సంస్కారముల ప్రజల కనుగుణముగ మార్గము లుపదేశించిరి. నిర్గుణపరబ్రహ్మమును యోగీశ్వరులు, బ్రహ్మనిష్ఠులు, జితేంద్రియులు, ఋషీశ్వరులు ఆరాధించి మోక్షమును పొందుదురు. ఈ నిర్గుణ పరబ్రహ్మమును తెలిసికొనుట దుర్బలులకు, పతితులకు, అజ్ఞులకు, సామాన్యప్రజలకు దుష్క-

రము. వీరిని ఉద్ధరించుటకొఱకే సగుణారాధనము చెప్పబడినది. విగ్ర హారాధనము నిర్గుణ పరబ్రహ్మమును తెలిసికొనుటకు సోపానమువంటిది. సగుణారాధనమును ఆగమశాస్త్రములు వ్యాపింపచేసినవి.

మానవుడు దేవతలను భజించినచో, తనయొక్క అల్పత్వము, పరమేశ్వరుని మహాత్త్వము అర్థము చేసికొని తన సర్వస్వమును పరమే శ్వరునికి అర్పించును. ఈ భక్తియే శ్రద్ధగా మారును. ఈ శ్రద్ధవలననే మానవునకు చిత్తశుద్ధికలిగి జ్ఞానము అతని మనస్సులో మెరయునని దేవతారాధనము విధించియున్నారు. దేవునికి ఆత్మసమర్పణమువలన మనలోని అహంకారము తొలగును. భగవానుడు వచ్చి మనస్సులో నివసించుటకు మనలోని గర్వము అహంకారము సూక్ష్మమైన వాంఛలు తొలగించుకొనవలెను. మానవునిలో దైవత్వము, అసుర త్వము ఉన్నవి. రాక్షసత్వమును తొలగించుకొని, దైవత్వమును పెంచుకొని హృదయమును స్వచ్ఛమైన అద్దమువలె ఉంచుకొన్నచో మనలోనున్న పరమేశ్వర తత్త్వము మన కనుభూతిలోనికి వచ్చును. మానవునిలోని దైవత్వము పెంచుటకు, మోక్షమును పొందుటకు దేవతలను ఆరాధింపవలెను.

"దేవాన్ భావయతాఽనేన తే దేవా భావయంతు వః
పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ"
(భగవద్గీత- తృతీయ-11)

మానవుడు సర్వకర్మలను పరమేశ్వర ప్రీతికొఱకు చేయవలెను. యజ్ఞమనగా త్యాగము. ప్రతిఫలాపేక్ష లేకుండా చేసిన కర్మ మనలను బంధింపదు. వైదిక దేవతలకై చేయబడిన కర్మలన్నియు ఈశ్వరప్రీతికర ములైన లోకసేవారూపము దాల్చును. దేవతలను హృదయపూర్వక ముగా భజించినచో వారు సంతోషించి మనలకు పరమశ్రేయము సమకూర్తురు. మానవులు, దేవతలు, అన్యోన్యపోషణమువలన పరమ

శ్రేయము పొందుదురు. యజ్ఞదృష్టితో చేయు కర్మలు భగవంతునికే ముదమునిచ్చును. భగవంతుడే యజ్ఞభోక్త. యజ్ఞమే బ్రహ్మస్వరూపము. యజ్ఞమే జీవితధర్మమును, వ్యక్తియును, జగత్తును పరస్పరాధారభూతములై యున్నవి. మానవజీవితమునకు ప్రపంచజీవితమునకు మధ్య నిత్యవినిమయ మున్నది. తనకొఱకే కర్మచేసికొనువాడు వ్యర్థజీవి. మానవులకును, దేవునికిగల పరస్పర సహకారమువలననే జగము ముందునకు నడచుచున్నది. యజ్ఞము దేవతలకు కాదు. సర్వదేవతాస్వరూపియైన ఈశ్వరునకే. యజ్ఞకర్మయును, యజ్ఞద్రవ్యములును కర్తయు భోక్తయు, యజ్ఞగమ్యమును, ఫలితమును సర్వమును బ్రహ్మస్వరూపమే. నదులన్నియు సాగరసంగమములగునట్లు మనము ఆత్మార్పణముతో చేసిన పూజలన్నియు సర్వదేవతాత్మకుడయిన సర్వేశ్వరునకే చేరును. ఆత్మార్పణముతో చేసిన దేవతారాధనము చిత్తశుద్ధికి సహాయపడి తరువాత మోక్షమునకు దారిచూపును.

దేవతారాధన విధానము, పూజకు పాత్రమైన పుష్పములు, దళములు, ధూపదీప నైవేద్యములు వానివలన కలుగు ఫలితములు సాకల్యముగా అనుశాసనిక పర్వములో వివరింపబడినవి. మానవులకు వైవిధ్యముమీద, పేరుమీద మక్కువ ఎక్కువ. అందుచే మానవుల అభిరుచులను బట్టి దేవతలు అనేక నామములను పొందియున్నారు. మానవులు తమ అభీష్టమైన దేవతలను యజ్ఞదృష్టితో పూజించిన చిత్తశుద్ధిగలిగి మోక్షమునకు తోడ్పడునని భారతకారుని అభిప్రాయము.

గృహస్వామి మునుముందు గృహదేవతలను భక్తిశ్రద్ధలతో పూజించి ఉపహారమొసగి ఆహారభక్షణము చేసినచో దానికి అమృతత్వము కలుగును.

"ఉపహార సమర్చకుడగు
సుపురుషు గృహదైవతములు శుభముల గూర్చున్

నృపవర తత్కర్మరహితు
గృపలేక నితాంతవిఫలకృత్యం జేయున్."
(అనుశాసనిక - చతుర్థ - 29)

ఓషధులలో పుష్పవంతములైన వృక్షములు శ్రేష్ఠములు. పుష్పములతో సురపూజ చేసిన మానవులకు మంచి మనసు కలుగును. అందుచేతనే పూవులకు సుమములని పేరు వచ్చినది. నరుల కోరికలను సుమనస్కతతో తీర్చుటచే దేవతలకు సుమనస్కులని పేరు కలిగినది. పరిమళవంతములైనవి, ముళ్లులేనివి, తెల్లనివి అగు పూవులతో పూజించిన దేవతలు ప్రీతిపొందుదురు. పద్మములు, జాజులు, తులసిదళములు, బిల్వదళములు, పరమేశ్వర ప్రీతిప్రదములు. దేవాలయమున శ్మశానమున పుట్టిన పూవులు వివాహాది శుభకార్యములకు పనికిరావు. మనము కోరు ఫలమును బట్టియు, పూజించు దేవతలనుబట్టియు పూవులను నైవేద్యములను ఉపయోగింపవలెను.

గుగ్గిలము, అగరు మొదలగు ధూపములతో పరమేశ్వరార్చనము చేయవలెను. ధూపములలో కర్పూర ధూపము శ్రేష్ఠమైనది. దానివలన దేవతలు పరమతుష్టిపొంది కర్తకు ఆయువును పుష్టిని కలిగింతురు. దేవతారాధన సమయమున ప్రప్రథమమున దీపారాధనము చేసినయెడల తామసభూత రక్షోముఖంబులైన కుత్సితజాతులు మాయమగును. దీపమునకు అన్నిటికంటె ఆవునెయ్యి శ్రేష్ఠమైనది.

ఈ విధముగా సగుణారాధన విధానమంతయు సాంగోపాంగముగ వర్ణింపబడినది. ఈ కార్యకలాపమంతయు మానవుని పరమార్థము సాధించుటకు సాధనము చేయుటకొరకేనని గుర్తింపవలెను. శ్రీకృష్ణభీష్మాది మహానుభావులు కూడ లోకసంగ్రహార్థము కర్మాచరణము చేసియుండిరి.

# 4. విదురనీతి

భారతము ధర్మజ్యోతి. వేదము ధర్మమూలము. వేదప్రతిపాదితమైన ధర్మమంతయు, భారతాంతర్గతమగుటచే భారతమునకు ఆమ్నాయత్వము సిద్ధించినది. వ్యాసమహర్షి నిగూఢ ధర్మరహస్యములను ఆవిష్కరించుటకు, ధర్మసంకటములను తీర్చుటకు భారతరచన చేసియున్నాడు. ఇందు ధర్మబోధకులు, ధర్మప్రవక్తలు, ధర్మగోప్తలు ఎందరో మహానుభావులు. విదురుడు సాక్షాత్తు ధర్మదేవతయొక్క అవతారము. విదురుడు ధృతరాష్ట్రుని నిమిత్తముగా చేసికొని మానవ సంఘము ఎట్లు ప్రవర్తింపవలెనో అమృతోపదేశము అభివర్ణించెను. జీవిత సమస్యలలో చిక్కుకొని, దిక్కుతోచక అటమటించుచు సంసార సముద్రములో మునిగిపోయిన ప్రజలకు సంసార తరణోపాయమును, జీవితమును ఆకులు రాలని పూలువాడని నందనారామము చేసికొను సువర్ణసూత్రము నుపన్యసించెను. ధర్మాధర్మవిదుడు, నయానయజ్ఞుడగు విదురుని వచనామృతము సర్వప్రజల సంతాప ప్రశమన సమర్థము.

ఉత్తమమానవప్రవర్తన నియమావళి :

"జనులకు నొడబాటగు విధ
మున నడచుచు, లోక నింద్యముల నుడుగుచు, మీ
దని యొకనికలిమి కులుకక,
మనుజులతో బొంది పొసగి మను టొప్పు నృపా !"

"పురుషుండు రెండు దెఱగుల
ధర నుత్తము డనగ బరగు దా నెయ్యెడలం
బరుసములు వలుకకునికిని,
దురితంబులు వొరయు పనులు దొలగుట కతనన్."

(ఉద్యోగ - ద్వితీయ - 31, 41)

జనరంజకముగ మానవుడు నడచుకొనుచు, లోకనింద్యము లయిన కార్యముల నుజ్జగించి పరుల కలిమికి ఉలుకక మనుజులతో కలసి మెలసి జీవింపనగును. లోకమున మానవుడు రెండువిధముల ఉత్తము డనబరగును. వాక్పారుష్యమును విడిచిపెట్టుటవలనను, పాపపనులకు దూరముగ నుండుటవలనను పురుషుడు సజ్జనుడని ప్రఖ్యాతిబడయును. ఈ సందర్భములో విదురుడు ఉత్తమపురుషులను సులభముగ సూచించెను. ఏ పురుషుడు అచంచల క్షమామూర్తిగ గోచరించునో అతడే ఉత్తమపురుషుడు. లోకములో క్షమ కలవారిని చేతకానివారిక్రింద జమకట్టుదురు. అయినను ఉత్తమపురుషులు మేలి తోడవుగా క్షమను తాల్తురు. భారతములో ధర్మజుని మించిన ఉత్తమక్షమామూర్తి ఎచ్చట కలడు ? అతని క్షమాగుణమే విజయము పొందుటకు దోహదము చేసినది.

భారతకారుడు రాజధర్మమును కత్తిమీాద సామువంటిదని వర్ణించిచెప్పుచు రాజుకెట్లు బాధ్యతలున్నవో అట్లే ప్రజలకుకూడ కనీసపు ధర్మములున్నవని నిర్దేశించి చెప్పెను. జనులు ఏలినవానిని, దైవమును, భార్యను, బంధులను, సముచితారాధన, సంశీలతతో ప్రీతులను చేయవలెను. ఏ మానవుడు ఇతరులకు అపకారము చేయకలిగియు, సహనముతో నుండునో తాను పేద అయ్యును, తనకున్నదానిలో కొంచెమైనను ఇతరులకు పంచిఇచ్చి వారితో పాటు ఆనందించునో అతడు సుఖపడును. ఆధునిక మానవతావాదులు నేడు సమసమాజ నిర్మాణమునకు ఈసూత్రమే బహుళప్రచారము చేయుచున్నారు.

"చెల్లియుండియు సైరణ చేయు నతడు
పేదవడియును నర్థికి బ్రియముతోడ
దనకు గల భంగి నిచ్చు నతండు - బుణ్య
పురుషు లని చెప్పి రార్యులు గురువరేణ్య."

(ఉద్యోగ - ద్వితీయ - 42)

మానవుడు కృషి చేయుటలో అధికశ్రమకు లెక్కచేయక, అల్ప సౌఖ్యము పొందుట ఆరోగ్యప్రదము. ధనము, విద్య, వంశము, సజ్జనులకు అడకువయును, వినయమును పెంపొందించును. సజ్జనుడు తనను లోకమెంత పొగడినను ఉబ్బక ఇతరులలోని కీడు ఒకించుకయు పరిగణించక కడు మేలొనరించును.

"తను లోకము గొనియాడగ,
విని యుబ్బడు సజ్జనుండు, వెండియు గడుమే
లొనరించు, గీ డొకించుక
యును దనదెస దోపనీక యుడుపుచు వచ్చున్."

(ఉద్యోగ - ద్వితీయ - 48)

తిక్కనమహాకవి ఒక రసవన్మాకందమైన తేటగీతి పద్యములో శుష్కమైన అంకెలలో మహాపరమార్థమును ఇమిడించి మానవ కర్తవ్యమును పరమ రమణీయముగ సూచించెను.

"ఒకటి గాని, రెంటి నిశ్చల యుక్తి జేర్చి,
మూటి నాల్గింట గడు వశ్యములుగ జేసి,
యేనిటిని గెల్చి, యాఱిటి నెఱిగి, యేడు
విడిచి వర్తించువాడు వివేకధనుడు."

(ఉద్యోగ - ద్వితీయ - 37)

మానవుడు వివేకముపొంది సంకల్ప వికల్పములకు బానిసకాక, త్రిగుణాతీతుడై చతుర్విధపురుషార్థములకు సమ ప్రాధాన్యమొసంగి పంచేంద్రియములను జయించి; కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను జయించి; వెలది, జూదము, పానము, వేట, వాక్పారుష్యము, దండపారుష్యము, సొమ్ము(నిష్ప్రయోజనముగ వ్యయము చేయుట అను సప్తవ్యసనములను విడిచి వర్తించువాడే వివేకధనుడు.

సర్వవేదాంతసారము ఈ చిన్నిపద్యములో ఇమడ్చబడెను. సర్వమానవాళికి శిరోధార్యమైన అమృతోపదేశము.

## నడవడి

"తగిన వేషంబు, దను దాన పొగడుకొనమి,
నొచ్చియును గీడు వలుకమి, యిచ్చి వగవ
కునికి, దన కెంత నడపకయున్న, బథము
దప్పకుండుట - నడవడి కొప్పు సేయు."

(ఉద్యోగ - ద్వితీయ - 45)

విదురుడు నిర్వచించుటకు అత్యంత క్లిష్టమైన విషయములను కూడ సర్వజన సులభముగ ఇందు నిర్వచించెను. తగినవేషమును తన్ను తాను పొగడుకొనకుండుట నొచ్చియును కీడు పలుకకుండుట, తనకెంత గడవకపోయినను ధర్మమార్గమును వీడకుండుటయే, నడవడి. నడవడియను సముద్రమును దాటించుటకు మానవుడు సత్యమును ఓడను సాధనముగా చేసికొనవలెను. సకలపుణ్యములలో శ్రేష్ఠతమమైనది ధర్మమార్గానుసరణము. పాడి తప్పకుండ ధనార్జనము చేయుట, న్యాయార్జితమైన విత్తమును పాత్రులకు దానముచేయుట విహితకర్తవ్యము. ఈ సందర్భములో పాత్రునకు దానము చేయకపోవుటచేత ఎంతపాపము కలుగునో అపాత్రులకు దానము చేయుటవలన అంతకంటె ఎక్కువ కీడు కలుగును.

"పాడితప్పకుండ బడయు సొమ్మునకు న
పాత్రములకు నీగి, పాత్రములకు
బెట్టకునికి, యనగ నెట్టన రెండు వి
ధముల గీడు తోడరు ధరణినాథ."

(ఉద్యోగ - ద్వితీయ - 43)

## సంభాషణము

ఆర్య ఋషీశ్వరులు శబ్దబ్రహ్మోపాసనము చేసి అమృతమును పొందిరి. శబ్దమనగా వేదమని అర్థము. మానవుడు మాటను ఆచి తూచి సముచితముగ పలుకవలయును. మనము మాటాడునపుడు ఎదుటివానికి హితమును, ప్రియమును, మనస్సునకు ఉల్లాసము కలుగునట్లు సంభాషింపవలయును. పలుకుబడివలననే చెలిమియు, పగయు, తెలివియు, కలతయు, ధర్మంబును, పాపగతియు, పెంపును, తులువతమును కలుగును.

"చెలిమియు సంభాషణమును,
బలిమి వివాదంబు ద్రోపు బాడియు, దమయం
తలవారి తోన తగు; నధి
కుల హీనులతోడ నైన గొఱగా దధిపా."

(ఉద్యోగ - ద్వితీయ- 46)

"చెలిమియు, బగయును, దెలివియు,
గలుకయు, ధర్మంబు బాపగతియును, బెంపుం
దులువతనంబును వచ్చును
బలుకుబడిన, కాన పొసగ బలుకగవలయున్."

(ఉద్యోగ - ద్వితీయ- 60)

"ఎదిరికి హితమును బ్రియమును
మది కింపును గాగ బలుకు మాటలు పెక్కై
యొదవినను లెస్స, యటుగా
కిది యది యన కూరకునికి యెంతయు నొప్పున్."

(ఉద్యోగ- ద్వితీయ 59)

అందుచే జగద్ధితముకొఱకు, మనము, మనమేలుకొఱకు, హితముగను, మితముగను ప్రియముగను, పరిమితముగను, పథ్యముగ సంభా

పింపవలయును. కత్తితో, గొడ్డలితో కొట్టి రూపుచెడగొట్టిన మోడు కూడ వసంతోదయమున చిగురించి మనకు నేత్రపర్వ మొనర్చును. కాని పలుకులచేత చెడిన కార్యము చక్కబడదు. శరీరమున విరిగిన బాణములను ఉపాయముగ తొలగింపవచ్చును. మనమున నాటిన నిష్ఠుర వాక్యశరములను తొలగింప అసాధ్యము.

ఈ సందర్భములో శాంతిపర్వములో భీష్ముడు ధర్మరాజునకు చెప్పిన హంసగీత అనుసంధింపతగియున్నది. సత్పురుషులు పరమర్మ భేదులైనవనియు, నయవిరహితములైనవనియు, ధర్మకార్య విముఖమైనవనియు భావించి నిష్ఠురములగు పలుకులు పలుకరు. కారణము, అవి సత్యములు కావు. మౌనముచే అనేక ప్రయోజనములు సిద్ధించును. జనము తనను అవమానించినను, నిందించినను మారుపలుకక సైరించిన శాంతాత్ముడు ఆజనులు చేసిన సుకృతము నాచికొనును. కీడు ఆడినచో మేలాడుచు, తాడనముచేసినను దరహాసముతో స్వీకరించుట, స్థితప్రజ్ఞుని లక్షణము. ఒక చెంపపై కొట్టిన మరొక చెంప ఇచ్చిన ఎదుటివ్యక్తిలో పరివర్తనము కలుగుట తథ్యము.

సంభాషణము చతుర్విధము. మానవులకు దానిలోని మంచి సెబ్బరలను పరమ రమణీయముగ విశదమొనర్చెను.

"పలుకక యుండుకంటె దగ బల్కుట మేలు వినుండు సత్యముం
బలుకుట ధర్మమార్గమున బల్కుట సర్వజనప్రియంబుగా
బలుకుట యోలి నెక్కుడగు భంగులు వీని నెఱింగి యొండుమై
బలుకక నాల్గు చందముల బల్కగ మెత్తురు వాని దేవతల్"

(శాంతి - పంచమ - 555)

అసలు మాటలాడకుండగ లోకయాత్ర ఒక నిమిషమైనను గడువదు. అందుచే యుక్తముగ పలుకుట, సత్యముగా పలుకుట, ధర్మ

మార్గమున పలుకుట సర్వ జన ప్రియముగా పలుకుట శ్రేయస్కరము. దీనికంటె విరుద్ధముగ పలుకకుండుటవలన దేవతలు మెత్తురు. అట్టి మానవుని జీవితము ఉభయలోకములలోను సుఖమయము, ఆనంద మయము అగుట తథ్యము. నేడు పరిశీలించినచో ప్రజలలో తగవులు, హత్యలు, ఆవేశకావేషములు, హింస, మానసిక ప్రజ్వలనము వంటి సమస్యలకన్నింటికి మూలము పరుషమైన సంభాషణమే. అందుచే మాటనుబట్టి మనుష్యుని హృదయసంస్కారము విలువ వ్యక్తమగును. పరమేశ్వరుడు మనకు రెండుచెవులు, రెండుకన్నులు, నాలుక ప్రసాదిం చెను. కారణమేమనగా ప్రతివిషయమును రెండుచెవులతో శ్రద్ధగావిని చక్షురక్షర న్యాయముతో దాని తత్త్వమునరసి పరిశీలనా దృక్పథ ముతో చూచి, యుక్తముగా, సత్యముగా, ధర్మమార్గముగా సర్వజన ప్రియముగా, సంభాషించుట సర్వశ్రేయములను కలిగించును. లౌకిక లోకములో నిష్కారణముగ ఏ వ్యక్తినైనను నిందించినచో వానికి తీవ్రమైన కోపమువచ్చి అకార్యము చేయును. పసిపిల్లవాడు ఆడుకొను చుండగ అతనిని బుజ్జగించి చిన్నిపొగడ్త కురిపించినచో ఆ చిట్టి పాపాయి త్రాగు పాలుకూడ మనకు ఇచ్చుట అనుభవపునరుక్తమయిన విషయము. మాటకు అనితరసాధారణమయిన ప్రభావము కలదు. అందుచే కవులు తపస్సుచేసి వాగ్దేవి వదనకమలామోదముతో మధుమధురముగా పలికినారు. మానవులయిన మనము ఆ ఆర్ష కవీశ్వ రుల వాక్కులను అధ్యయనముచేసినచో ఆ మాధుర్యము మనకు కూడ అలవడును.

మితభాషణమువలన సత్యము పోషింపబడును ఆత్మస్తుతి, పర నింద వర్జింపబడును. మనకు లౌకికలోకములో విజయము, ఆరో గ్యము కలుగుటకు మితభాషణమే ఉత్తమౌషధము. కవికుల గురువు

కాళిదాసమహాకవి రఘువంశ మహారాజుల గుణగానము చేయుచు (సత్యాయ మిత భాషిణామ్) అని ప్రస్తుతించియున్నాడు. అదియే మానవులకు శరణ్యము.

## కార్యనిర్వహణ కౌశలము

మానవుడు ఏ కార్యమైనను తనకు ఎదుటివారికి శ్రేయమొన గూర్చునట్లు చేయవలెను. ఒక కార్యము ఫలసిద్ధిపొందునట్లు నిర్వహించుటయు ఒక కళయే. ధర్మార్థవిదుడైన విదురుడు నిర్మలములు, నిపుణ సమ్మతములు, రాజనీతి మార్గ బోధకములైన మాటలను రమణీయముగ నుడివెను. ఆసందర్భములో చెప్పిన పద్యములు ఆణిముత్యముల వంటివి.

"తనియ బండకుండ మును గోసికొన, జవి
చేటు కాదు విత్తుచేటు గలుగు;
బక్వమైన గొనిన, ఫల మించు - జెడదు బీ
జంబు గార్యసిద్ధి చంద మిట్లు."

"మాలకరి పుష్పములు గోయుమాడ్కి దేటి
పువ్వుదేనియ గొనియెడు పోల్కి, నెదురు
గందకుండగ గొనునది కార్యఫలము;
బొగ్గులకు బోలె మొదలంట బొడువ జనదు!"

(ఉద్యోగ - ద్వితీయ - 56, 57)

ఈపద్యములు రెండును త్రైకాలిక సత్యములై, మనోహరములై, లలితభావబంధురములై కార్యనిర్వహణ కౌశలము అలవరచుకొను విధము బోధించుచున్నవి. పండు పండినపిమ్మట కోసికొన్నచో ఆ పండుయొక్క మాధుర్యము మనము ఆస్వాదింపవచ్చును. ఆపిమ్మట అది విత్తనమునకు ఉపయోగించి జగత్తునకు మేలు చేయును. మధు

కీరము మధువును సేకరించినట్లు, మాలకారి పూవులను కోయు మాడ్కి మానవుడు తనకు ఎదుటివారికి ఇసుమంత కీడు కలుగకుండ కార్యమును సాధించుకొనుట ఒక కళ. అదియే విదురుడు ఈ మనోహరమైన ఉపమానములతో సూచించియున్నాడు. విదురుడు ప్రసంగానుగుణముగ రాజ్యాంగవ్యవస్థయొక్క విజయమంతయు మంత్రశక్తిపైననే ఆధారపడి యున్నదని హెచ్చరించియున్నాడు. మేటి విలుకాడు గురిచూచి బాణముకొట్టినచో ఒకవేళ తప్పిపోయినను తప్పవచ్చును. కాని సచివుని నీతి స్ఫురణము పరరాజును, అతనిభూమిని చెఱచుట నిస్సందేహము. విదురుడు లోకములోని దుర్జనులను గుర్తింపవలసిన పద్ధతిని కూడ సూచించియున్నాడు. కోపము, ఉబ్బు, గర్వము, అతృప్తి, దురభిమానము, నిర్వ్యాపారత్వము, ఇవియే కాపురుష లక్షణములు. ధనమును, విద్యయును, వంశమును, దుర్మతులకు మదమును వృద్ధిపొందించును. ప్రభువును, దైవమును, భార్యను, బంధువులను సముచితారాధనముతో ప్రీతిపొందింపని పాలసుడు ఆ ఫలమును పొందును. చేటుకాలము దాపురించిన దుర్జనులు చెడుమాటలు ఆడుచు అధర్మమైన మార్గమునే పట్టుకొందురు. దుర్జనులు తమను ప్రేమించువారిని ఒల్లరు. తమ్ము ఒల్లనివాని వెంటపడుదురు. ఇమ్మెరుగక అసాధ్యమైన కార్యములు సాధించుటకొఱకు విపులయత్నముచేసి తుదకు దుర్గతి పొందుదురు. విదురుడు మానవసంఘమునకు ఈలోకములో సుఖముగా జీవించుటకు పరలోకములో సుఖమును పొందుటకు ఉపయుక్తమగు మార్గమును ధర్మార్థమధురముగ ఉపదేశించుట రమ్యాతి రమ్యము. దీనినే ఉత్తమ మానవప్రవర్తన నియమావళి అని చెప్పవచ్చును.

## 4 సత్యాద్రౌపదీ సంవాదము

సత్యా శ్రీకృష్ణులు అరణ్యవాసము చేయుచున్న పాండవులను సమాశ్వాసించుటకరుదెంచిరి. అరణ్యవాసములో నానాకష్టములనుభ

వించుచున్నను ద్రౌపది భర్తృవాల్లభ్యము పొంది తలలో నాలుకవలె మెఱయుచు నవనవోన్మేషముగ వెలుంగుచున్నది. అదిచూచి సత్యభామ అసూయపొందినది. ఆమె ఒకభర్తనే కైవశము చేసికొనలేక సతమతమగుచుండగా, ద్రౌపది పంచభర్తలహృదయ ప్రమోదమెట్లు కలిగించుచున్నదో అను ఆశ్చర్యము కలిగినది. సత్య అపహాస్యముగ ద్రౌపదిని భర్తలను వశము చేసికొనుటకు ఏవ్రతములు ఆచరించుచున్నావు ? ఏ మంత్రతంత్రములను ప్రయోగించుచున్నావు ? ఏ సరస నైపథ్య కర్మకౌశలము ప్రదర్శించుచున్నావు ? ఏ చతుర విభ్రమోల్లాస రేఖ మెఱయించుచున్నావు ? అని ప్రశ్నించెను. అమ్మాటలకు పరమపతివ్రతయైన పాంచాలి యథోచితముగ సత్యకు ప్రత్యుత్తరము చెప్పుచు ఆమెను మెత్తమెత్తగ మందలించినది. ద్రౌపది ఆ సందర్భమును పురస్కరించుకొని పతివ్రతాధర్మములను ధర్మార్థ మధురముగ నుపదేశించినది. ఆ ధర్మములు సకలస్త్రీలకు శిరోధార్యమై యున్నవి. వ్యాసమహర్షి ఆయా సందర్భములలో మానవులకు ఆయా దశలలో ఆవశ్యకములైన ధర్మములను సకలప్రమదలకు మార్గదర్శకములగునట్లు ఉపదేశించెను.

ఉత్తమవనితయనగా పతియొక్క హృదయమును చూరగొన్నది. దీనినే సౌభాగ్యమని అందురు. స్త్రీత్వమునకు ధన్యత భర్తృవాల్లభ్యమువల్లనే సిద్ధించును. భర్తృవాల్లభ్యము పొందుట స్త్రీలకు ఒక కళ. ఇది నేర్చుకొనదగినది కాదు. మంత్రతంత్రములకు మందుమాకులకు సిద్ధించునది కాదు. స్త్రీత్వమునకు సమగ్రత్వము వైశిష్ట్యము నొసంగు లక్షణము సౌభాగ్యము. మరొకటి కాదు. లోకములో స్త్రీలు చేలతనముతో తమభర్తలను వశీకరణము చేసికొనుటకు చెప్పుడుమాటలు విని మంత్ర తంత్రములను మందు మాకులను భర్తలపై

ప్రయోగింతురు. వానివలన ఫలితము ఒసంగదు సరికదా విషఫలితము కలుగుట తథ్యము. మగువలు భర్తలపై ఇవి పచరించుటచే వారికి రోగములు, మూక, జడత్వములు కలుగును. ఆ మగువల చేతలు, ఒక నాడు బట్టబయలై నింద పొంది భర్తదృష్టిలో నింద్యులై దుర్గతి పొందుదురు. ఉత్తమస్త్రీలు భర్తలపట్ల కాపట్యము చేయుటకు కలలో కూడా ఊహ చేయరాదు. ఆ కాపట్యము భర్తకు సూచనామాత్ర ముగానైన తెలిసినచో భర్తయొక్క హృదయమను క్షీరభాండములో విషబిందువు చిందించుటయే. తత్కారణముగ భర్త అట్టి భార్య యొక్క పొందు పాముతోడి పొందుగ భావించును. ఉత్తమగృహిణి తగియెడి వేళలయందు భర్తకు మజ్జన భోజనాది క్రియలు స్వయముగ సమకూర్చవలెను. కష్టసుఖములు తెలిపి కుటుంబముయొక్క ఆదాయ వ్యయములను సమముగ చూచి ప్రవర్తించవలెను. గృహిణి, గృహ, స్థల, భాండ విశుద్ధిని పాటించవలెను. ఉత్తమస్త్రీలు పలుమారులు తలవాకిట తిరుగుటకాని, దుష్టస్త్రీ సాంగత్యము చేయుటగాని, కలహ శీలతకు దిగుటకాని, నగుబలుకులతో పెద్దగా నవ్వుటగాని చేయరాదు. పతి ప్రవాసములోనున్నప్పుడు మనస్వినులైన స్త్రీలు పూలు, గంధము ఆభరణములను ధరింపరాదు.

తుదకు సారభూతమైన విషయము విశదమొనర్చినది. పతి వ్రతకు పతికిమించిన దైవము లేడు. భర్తృశుశ్రూషవలన పతిప్రీతు డైనచో అప్రయత్నముగ ఆభరణములు దుకూలములు, ధనధాన్య గౌరవము, సంతతియు, యశస్సు, సద్గతియు కలుగుననుటలో ఇసుమంత యైనను సందేహము లేదు. భర్త కష్టపడి ఆర్జించిన ధనమును వృథా వ్యయము చేయక మితముగ ఖర్చుపెట్టుట అత్యావసరము. భర్త శుశ్రూషవలననే శుభము, ధర్మము కలుగును. ఏ స్త్రీ భర్తృమనో

రంజనము చేయకోరునో ఆమె నిత్యము సమ్యగ్భావమును ప్రేమమును, వెరవును, భక్తియును, ప్రియమును అనుసరించుటయే అవశ్యకర్తవ్యము.

ఇట్టి ఆదర్శప్రాయమైన భారతీయ గృహస్థ వ్యవస్థ ప్రపంచ మేధావుల పొగడ్తకు పాత్రమైయుండుట గమనార్హము. తుదకు ద్రౌపది ఉత్తమ స్త్రీ. భర్తయొక్క హృదయము చూరగొన్నచో కలుగు లాభము లన్నియు ప్రత్యక్షర మధురముగ నుపదేశించినది.

ఈ సన్నివేశములో ద్రౌపదిచేత ఉపదేశముచేయించి సత్యభామకు తన తప్పు తెలియునట్లుచేయుట చమత్కారముగా నున్నది. శ్రీకృష్ణుడు సకలజీవులహృదయాంతరభావ మర్మజ్ఞుడు. సత్యభామలోని గర్వమును ద్రౌపది ఉపదేశముచేత తొలగింపచేయుట శ్రీకృష్ణుని గడుసుతనమునకు తార్కాణము.

## 5. ధౌమ్యప్రబోధము

సూర్యవంశోద్భవులైన శ్రీరామచంద్రుడు మొదలయినవారు వశిష్ఠమహర్షిని ఎట్లు పురోహితునిగా వరించిరో పాండవులు అట్లు సర్వసద్గుణ సంశోభితుడు, మహాతపస్వి, వేదాధ్యయన సంపన్నుడు స్వామి భక్తిమహితుడు అగు ధౌమ్యుని పురోహితునిగా స్వీకరించిరి.

నేడు ఉద్యోగులకు ప్రవర్తన నియమావళి ప్రభుత్వము నిర్దేశించి ఉన్నది. ఆకాలములో రాజసేవచేయుటలో ఎట్టి ప్రవర్తన నియమావళి అనుసరింపదగునో ధౌమ్యుడు ధర్మార్థ మధురముగా నుపదేశించెను. పాండవులు ఒకప్పుడు మహారాజులుగనుండి ఆజ్ఞలను ఇతరుల కిచ్చిరి. అట్టి మహారాజపుత్రులు నేడు ఇతరులకు సేవచేయుట దోమ కుత్తుకలో ఏనుగు ప్రవేశించుట వంటిది. రాజసేవ ఎంత కష్టమైనదో తెలియచెప్పెను. పాండవులు ఎంత తెలిసినవారైనను పాండ

వుల హితమును కోరు ధౌమ్యుడు వారి కర్తవ్యమును మరొకసారి హెచ్చరించెను. ఇది ఆతని అమేయమైన శిష్యవాత్సల్యము.

రాజోద్యోగి రాజాస్థానములో ఉచితవేషమును ధరించి నిర్ణీత ఆసనమును అధిష్టించి సమయజ్ఞుడై మెలగినచో జగతీవల్లభుడు ఆతనిని సన్మానించును. ఉద్యోగికి మదము మందునకైనను సరిపోదు. రాజోద్యోగిని కదా నాకేమి ? అని లెక్కలేకుండా ప్రవర్తించినచో పురుషార్థమునకు ముప్పు వాటిల్లును. రాజసభలో నున్నవారికి ప్రక్కనున్న వారికి ఇబ్బంది కలుగకుండగ ఆవులింత, తుమ్ము, హాసంబు, నిష్ఠీవనము రహస్యముగ నిర్వర్తింపవలెను. రాజునకు మిక్కిలి యెట్టయెదుటకాని ప్రక్కగాకాని కూర్చొనక రాజు దృష్టి పడునటులుండి రాజ హృదయానుగుణముగ ప్రవర్తించుట లెస్స.

ఉద్యోగి రాజగృహముకంటె అందముగా ఇల్లు కట్టకూడదు. రాజునకు నచ్చినట్లు వేషమునుధరించి విహరించుచు ప్రియముగా సంభాషించుటకు పూనుకొనవలెను. నేరము చేసినచో పుత్రులనుకూడ రాజు అవశ్యము దండించును. అందుచే నేరముచేయుటయందు ఉద్యోగులు భీతికలిగి ఉండవలెను. రాజు ఎవ్వరినైనను ఒకకార్యములో నియోగించినపుడు ఉద్యోగి మధ్యలో పూనికొని అడ్డమువచ్చి ఆ కార్యములో చేయిపెట్టుట సింహమునోటిలో తలపెట్టుటయే. రాజునకు ఎంతప్రియమైనను అధికసంఖ్యాకులకు అపకారముచేయు పనులలో ఉద్యోగి ప్రవేశించరాదు. ఉద్యోగము సంపాదించుట ఎంతకష్టమో దానిని నిలబెట్టుకొనుట అంతకంటె కష్టము. అంతఃపురములో పనిచేయుచున్న రాణులయొక్క ఆంతరంగిక పరిచారికలతో చుట్టరికము పెట్టుకొనుట కొరవితో తలగోకికొనుటయే. ఉత్తమాసనములు, ఉత్కృష్ట వాహనములు, రాజొసంగక, ఉద్యోగి తమంతట తాము ఉపయోగింపజనదు.

ఉద్యోగి రాజద్రవ్యమును పాము నెయ్యలుగ భావించి ఉపయోగింపవలెను. లేనియెడల ఉద్యోగికి మానము బ్రతుకు దక్కదు. ధన సంబంధ శౌచము ఉద్యోగికి అత్యవసరము. రాజరహస్యము ఒకింత తెలిసినను బట్టబయలు చేయరాదు. కలహశీలత ఉద్యోగికి విషఫలితము ఒనగూర్చును. ధూర్జటిమహాకవి రాజసేవ నరకప్రాయమని చెప్పనే చెప్పియున్నాడు. తిక్కనమహాకవి ఉద్యోగికి త్రికాలాబాధ్యమైన బంగారుబాటను ప్రకటించియున్నాడు.

> "మన్నన కుబ్బక యవమతి
> దన్నొందిన స్రుక్కబడక ధరణీశుకడన్
> మున్నున్న యట్ల మెలగిన
> యన్నరునకు శుభము లొదవు నాపద లడగున్."

(విరాట - ప్రథమ - 133)

రాజసేవలో ఉద్యోగి ఎండ అనక, వాన అనక, ఆకలి అనక రాజకార్య నిర్వహణాసక్తుడై మెలగినపుడే సర్వశుభములు పొందునని స్పష్టము చేసెను.

## 6. రాజ్యతంత్రచరిత్రము

### 1. భీష్మోపదేశము

భారతీయ సంస్కృతిలో రాజ్యసంస్థ అత్యంత ప్రధానమైనది. రాజ్యసంస్థయొక్క స్వరూప, స్వభావములను భారతము సర్వతోముఖముగా అభివర్ణించినది. నన్నయగారు భారతమును స్తుతించుచు "నీతి విచక్షణుల్ నీతిశాస్త్రంబని" పరిగణించుచున్నట్లు తెలిపిరి. మహాభారతము రాజనీతి రత్నాకరము. ఆధునికకాలములో వైజ్ఞానిక, సాంఘిక, రాజకీయరంగములలో అభ్యుదయము సాధించిన దేశములకు చెందిన మహామనీషులు వర్ణించిన రాజ్యాంగవ్యవస్థయొక్క మూలసూత్ర

ములు, నేనాడో వ్యాసమహర్షి భారతములో సర్వాంగసుందరముగ సూచించెను. భారతములో అతడు సూచించిన రాజనీతిరహస్యము లను ఆధునికసమాజమునకు అనుగుణముగ చెప్పినవిధము చూచినచో మనకు ఆనందాశ్చర్యము లు కలుగును. భారత దేశములో రాజ్యసంస్థ స్వయముగా పుట్టినదికాదు. దానికి ప్రధానధ్యేయము దండనీతి లేక రాజ్యానుశాసనము. సమాజము చక్కగా జీవనము సాగించుటకు పోషించబడుటకు వికాసము పొందుటకు రాజ్యానుశాసనము అత్యంత ఆవశ్యకము. భారతమున రాజధర్మము బహుధా ప్రవచింపబడినది. శాంతిపర్వములో అధికభాగము రాజధర్మ వివరణమునకే వినియోగింప బడినది. మూలములో విస్తృతముగా నున్న రాజనీతిని తిక్కనార్యుడు తేట తెనుగు మాటలలో రమ్యాతిరమ్యముగ తీర్చిదిద్దెను.

ఇందు, 1. దండనీతియొక్క మహత్త్వము, 2. అరాజకత - దాని నిషేధము, 3. రాజ్యసంస్థ ఆవిర్భావము, 4 రాజుయొక్క ప్రధాన ధర్మము, 5. రాజు - వారసత్వము, 6. భారతీయ రాజ్యాంగములో పౌర జానపదుల స్థానము, 7. రాజ్యయంత్రాంగముపై తపస్వుల నియంత్రణము, 8. అమాత్య సంస్థ, 9. మంత్రుల సంఖ్య - విధులు, 10. కరపద్ధతి, 11. కోశమును అభివృద్ధిచేసికొను విధము, 12. ఉపజీవ నము సాంగోపాంగముగ వివరింపబడినవి.

"Kingship and Community in early India" by Charles Drekmi r.

"The Shantiparva is the major source of political commentary in the Mahabbharata. The subject of this didatic collection of folk - wisdom, the twelfth book of the epic, is niti—the science of worldly pursuit. In it the king's responsibilities are enumarated and the broader questions of caste obligations, right conduct, and ethics of government are discussed."

(The Shantiparva and the Logic of Danda - 137 P.)

ఈ గ్రంథములో భారతీయ రాజ్యాంగవ్యవస్థ ప్రాచీనకాలము నుండియు ఏ పరమాశయముతో అభివృద్ధి పొందినదో వివరించి పాశ్చాత్య దేశములలో పుట్టిన రాజ్యాంగవ్యవస్థలతో తులనాత్మక పరిశీలనము చేసి భారతీయ రాజ్యాంగ వ్యవస్థ వైశిష్ట్యమును బహుధా ప్రస్తుతించుట ప్రశంసార్హమై యున్నది. మహాకవి, సరస్వతీపుత్ర శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారు, తమ మహాభారత విమర్శనములో భారతీయ రాజ్యతంత్ర మహత్త్వము కీర్తించి యున్నారు.

"అరిష్టాటల్, ప్లేటో మొదలగు విజ్ఞానవేత్తలకన్న ఎంతయో ముందు మన భారతీయఋషులు గ్రహించి త్రికాలాబాధితమైన దండనీతి మాహాత్మ్యము భారతమున పలుమారులు ప్రశంసించియున్నారు.

సంస్కృతభారత ప్రభావము కౌటిల్యుని అర్థశాస్త్రముపై పుష్కలము.

ఆంధ్రవాఙ్మయమున రాజతంత్రమునుగూర్చి చెప్పినవారు ఎందరో మహానుభావులు. ఆ రాజతంత్రమును ఆదరించి చక్కగా చెప్పగలిగి చెప్పినవారు కవిబ్రహ్మ తిక్కనసోమయాజి, శ్రీకృష్ణదేవ రాయలు మొదలైనవారు.

## 2. భారతీయరాజన్యుని విధులు

మహోదాత్తశయములతో ఉత్తమఆదర్శములతో భారతీయ రాజ్యతంత్రము నిర్మింపబడినది. ప్రాచీనులు రాజునందు ప్రకృతిరంజనము ప్రధానధర్మమని ఉద్ఘోషించిరి. రాజర్షి యను పదములో రాజత్వము ఋషిత్వము మధురసమ్మేళనము పొందినవి. రాజత్వము పూలపాన్పు కాదు. కంటక కిరీటమనికూడ గమనింపవలెను. శ్రీరామచంద్రుడు లోకారాధనముకొఱకు ధర్మపత్నిని, గర్భవతిని, అసహాయను అరణ్యములకు పంపెను. ఇది భారతీయుల ఆదర్శము.

'ఏష ఏవ పరోధర్మో యద్రాజా రక్షతి ప్రజాః'

ఇట్టి వాక్యములు భారతములో ప్రచురములు. రాజ్యతంత్రమును రక్షించుటయే రాజుయొక్క ముఖ్యధర్మము. భారతదేశ రాజధర్మము ననుసరించి ప్రతిరాజు సింహాసనము నధిష్ఠించునపుడు ముందు ప్రతిజ్ఞ చేయవలెను. భారతీయులకు ఆరాధ్యమైన వేదమునందు ఇట్టి సన్నివేశములు కలవు. పృథుమహారాజు సింహాసనము నెక్కబోవుటకు ముందుచేసిన ప్రతిజ్ఞ ఇది.

"ధర్మమెట్లు చెప్పునో అట్లే ప్రవర్తింపుము. ప్రియాప్రియ భావన వ్యక్తిగత మనోవికారములు వీనిని జయించి ప్రాణి మాత్రమందు సమభావముతో మెలగవలెను. కామక్రోధాదులను జయించి ప్రజారక్షణమొనర్చుటయే నీ కర్తవ్యము. శాశ్వతమైన ధర్మమే నీకు రక్ష. కర్తవ్యమునుండి తొలగినవానిని ఎవ్వనినైనను నీ బాహుబలముతో నిగ్రహింపవలయును. త్రికరణశుద్ధిగ నీ భూమండలమును బ్రహ్మస్వరూపముగ దలచి దానికి సేవ యొనర్తునని ప్రతిన సేయుము. దండనీతి నాశ్రయించి విశ్వధర్మమును నిశ్శంకముగ గొలువుము."

(మహాభారత విమర్శనము - 63)

రాజు అసమర్థుడై రాజ్యపాలనమునందు శ్రద్ధలేక భోగాసక్తుడైన వానిని తొలగింపవచ్చునని భారతము చెప్పుచున్నది. అపారమైన సంకటమందెవ్వడు ప్రజలను రక్షించునో వాడు మరియేజాతివాడైనను పూజార్హుడే. దస్యుపీడితమైన అనాథప్రపంచము రాజునాశ్రయించి సుఖమునొందుచున్నది. రాజ్యపరిపాలనము సమర్థముగ చేయువానినే ప్రజలు తమ ప్రియబాంధవునిగ గౌరవింతురు. కర్మశీలునకే గౌరవము కదా. బరువుమోయని ఎద్దుచే ఏమిలాభము ? వట్టిపోయిన ఆవు ఎవరికి కావలెను ? రాజ్యపరిపాలనము సమర్థముగ చేయనిరాజు కట్టె ఏనుగువంటివాడు. చర్మమయమృగము. వేదాధ్యయనము లేని బ్రాహ్మణుడును, ప్రజారక్షణము చేయలేని రాజును, వర్షింపని మేఘ

మును నిష్ప్రయోజనములు. రాజు పై ప్రతిజ్ఞలో ప్రత్యక్షరము పాటింపవలెను. దానిలో ఆవగింజంతయినను సందేహము లేదు. "నా విష్ణుః పృథివీపతిః" రాజు లోకపాలాంశజుడు- అను మాటలకర్థము తెలియక రాజవ్యవస్థను బూర్జువా తత్త్వమని తిట్టిపోయుచున్నారు. పై రెండు వాక్యములకు సమన్వయము కలదు. భారతము రాజధర్మమును కచ్చితముగా చెప్పినది. రాజును సామాన్యమానవునివలె చూడక మనము ప్రత్యక్షదైవముగ గౌరవింపవలెను.

"రాజునకు బ్రజ శరీరము
రాజు ప్రజకు నాత్మ కాన రాజం బ్రజయున్
రాజోత్తమ యన్యోన్య వి
రాజితులై యుండవలయు రక్షార్చనలన్."

(శాంతి - ద్వితీయ - 274)

ఇట్టి గుణవిశిష్టుడైన రాజుముందు తనమనస్సును జయించి పిమ్మట శత్రువులను జయింపవలెను. అంతటితో తృప్తిపడక రాజు ప్రజారాధనమునెడ ఏమాత్రము ఏమరియుండరాదు.

3. భారతీయ రాజ్యసంస్థపై నియంత్రణము

రాజ్యపాలనమంతియు పౌర జానపదుల సమ్మతితోనే జరుగుచుండినట్లు ప్రబలసాక్ష్యములు కలవు. భారతీయ సాహిత్యములో ఈ రెండుపదములు ప్రచురముగ, విడివిడిగా వాడబడినవి. రామాయణములో దశరథుడు శ్రీరామచంద్రుని యౌవరాజ్య పట్టాభిషేక మహోత్సవమునకు పౌరజానపదుల సమ్మతిని పడసెను.

కౌటిల్యుని అర్థశాస్త్రములోకూడ రాజు తనపరిపాలనపై పౌర జానపదులకు విశ్వాసము కలదో లేదో అరయుట కర్తవ్యమని తెలుపబడినది. మహాభారతములోకూడ రాజు పౌర జానపద సమ్మతిని పొందవలెనని సూచింపబడినది.

పౌరజానపదులకు రాజుపైనను, రాచరికముపైనను విశేషాధికారములున్నట్లు ధర్మశాస్త్రములు ఘంటాఘోషముగ చెప్పుచున్నవి. రాజయంత్రముపై తపస్వి బ్రాహ్మణుల ప్రభావము అధికముగా నున్నది. పరిపాలనావిధానమును నిర్ణయించువర్గము తపస్వులు. తపస్వులు, సన్యాసులుభారతదేశమున పొందిన స్థానము అనితరసాధారణము. ఈతపస్వులకు స్వార్థములేదు. లోకకళ్యాణమే వీరిధ్యేయము. రాష్ట్రములలో ఏ తీవ్రసంకటము కలిగినను రాజు తపస్వులతో మంతనము చేసి నిర్ణయము తీసికొనుట సంప్రదాయము. నారదమహర్షి వచ్చి, ధర్మరాజునకు రాజనీతిని బోధించి, రాజసూయ యాగము చేయుమని ప్రబోధించెను. రాజైనవ్యక్తి తనరాష్ట్రము సర్వమును తపస్వులకు యజ్ఞసమయములో దక్షిణగా అర్పింపవలయును. నమ్రుడై వారికి తన పరిపాలనములో కష్టనష్టములను ఎఱిగింపవలెనని భారతము సూచించినది. ఈతాపసగణమునకు దారిద్ర్యము అలంకారము. శమదమములను సాధించిరి. బుద్ధిసూక్ష్మత సాధించిరి. తపోధనుల ప్రాధాన్యము భారతీయ సాహిత్యములో బహుధా నిరూపితము.

## 4. మంత్రులు

భారతీయ రాజ్యతంత్ర వ్యవస్థయందు మంత్రి లెనిమిదిమంది యుండుట రామాయణ కాలమునుండి వచ్చుచున్నది సర్వగుణ సమన్వితులైన మంత్రులు ఐదుగురు కాని ముగ్గురుకంటె తక్కువ ఉండరాదని భారతము నొక్కిచెప్పినది. మంత్రులు ఒకరిద్దరుగాక ముగ్గురు ఏల ఉండవలెను ? అనుదానికి కౌటిల్యుడు అర్థశాస్త్రములో ఇచ్చిన సమాధానము అర్థవంతము. రాజు మంత్రి ఒక్కనినే ఏర్పాటుచేసికొనరాదు. మంత్రి యొకడే ఉన్నచో వాడు నిరంకుశుడై వర్తించును. లేక గొప్పపనులు చేయవలసివచ్చినపుడు సరిగా యోజించు శక్తి లేక

రాజకార్యములను అవకతవకగా నొనర్చును. మంత్రులు ఇరువురుకూడ నుండరాదు. వారిలో వారు మాటాడికొని లంచములను తీసికొన యత్నింతురు. రాజు వారిని గమనించి పట్టుకొన్నచో వారిరువురును ఏకమై రాజును నాశనమొనర్తురు. అందుచే రాజు ఐదుగురుకంటె మించిన సంఖ్యను మంత్రులను నియోగింపవలయును. భారతకారుడు మంత్రుల లక్షణములను చక్కగ నిర్వచించెను.

"అనఘుల శాస్త్రవిధిజ్ఞుల
ననురక్తుల పితృపితామహక్రమమున వ
చ్చిన విప్రుల మంత్రులగా
నొనరించితె కార్యసంప్రయోగము పొందెన్."

(సభా- ప్రథమ- 27)

మంత్రి జ్ఞానపరుడును, పౌరజన పదాప్తుడును, కార్యజ్ఞుడును, ధైర్యశౌర్య ఘనుడును, అక్రూరుడును, నిర్మలాత్ముడును, స్వామిభక్తి కలిగినవాడును, సుఖదుఃఖములను సమచిత్తముతో భావించువాడును, తప్పుమీద పెట్టినను కలతపొందనివాడును, తనదోషమును కప్పికొని, పరదోషమును పసికట్టువాడును, సువిశాలబుద్ధియై యుండవలెను. రాజు మంత్రులను చూచి భయముందవలెను. అట్టి గౌరవమును మంత్రులు రాజుకడ నుంచుకొనవలెను. అధర్మాచరణమున కొడిగట్టిన రాజును నివారింపలేని మంత్రులు సొమ్ములు తొడిగికొన్న స్త్రీలే.

## 5. పన్నులు

ధర్మమైన కప్పమును ప్రజల నుండి గైకొనుచు యథావిధిగా ప్రజలను పరిపాలించు రాజు ధర్మార్థములను రెంటిని అనాయాసముగా సాధించును. నృపుడు అర్థశాస్త్ర రహస్యార్థ విదుడై యుండవలెను. శాస్త్రవిహితములు కాని పన్నులను ప్రజలనుండి వసూలుచేయరాదు. అట్లు చేసినచో క్రమముగ రాజువినాశము పొందును. పాలు అధిక

ముగా కావలెనని ఆవు పొదుగును కోయువాడు బుద్ధిహీనుడుగదా! కోశబలమే రాష్ట్రమునకు మూలాధారమని పన్నులకొరకు ప్రజలను పీడించు రాజుకూడ ద్రోహియే. రాజు ప్రజలపైన ఉపాయముగ మెలగవలెను. అట్లు ప్రవర్తించినచో ఉన్న కామధేనువువలె రాజు కోరిన కోరికలు లభించును. పరిశీలించినచో రాష్ట్రము గోవువంటిది. వత్సమువలెనే రాష్ట్రమును నృపాలుడు కాపాడవలెను. అవిరామముగ పిదికినచో గోవు ఎందుకుపనికిరాదు, పన్నులను ఎక్కువగా వేసి వసూలు చేయుట మొదలుపెట్టినచో ప్రజలుకూడ అంతే. అమితముగ ప్రజలను పీడించినచో వారు క్రియావిముఖులై పోదురు. అమితముగ ప్రజలను పీడింపక కన్నబిడ్డవలె రక్షింపవలెను.

పూవులను నొప్పింపక భ్రమరము మధువును గ్రోలును. పాలు పిదుకువాడు పొదుగును మాటిమాటికి కొట్టి బాధింపక ఉపాయముగ పాలను పిండుకొనును. జలగ మనకు తెలియకనే రక్తమును పీల్చును. ఆడుపులి తననోట పిల్లలను కరచుకొని ఒక యెడనుండి మఱియొక యెడకు కొనిపోవును. అ కొనిపోవునపుడు తన దంతములచేత పిల్లలకు ఒక్కింతబాధయు కలుగనీదు. రాజు మృదువుగ సంభాషించుచు ప్రజల నుండి పన్నులను వసూలుచేయువలెను. అకాలమున పన్నులు వసూలు చేయరాదు. ప్రజలనుండి పన్నులను అధికముగ గైకొనవలసిన అదను కలిగినపుడు అట్లెందుకు చేయవలసివచ్చెనో ప్రజలకు నచ్చచెప్పుట అత్యవసరము. శాంతిపర్వములో ప్రజలనుండి పన్నులను వసూలు చేయుటలో రాజు మిక్కిలి జాగరూకత వహింపవలెనని తెలుపబడినది.

అరి మిగులఁ గొనుట కేస్తుల, బారెమూలం బిసికినట్లు భూషగ కదుపున్
మెరవున పెనిచినయట్లుగు, నరపతి ప్రజచేత నప్పనము దగ గొనినన్.

(శాంతి- ద్వితీయ- 48)

## 6. భాండాగారము అభివృద్ధి చేయువిధము

కోశము రాష్ట్రమునకు ప్రాణమువంటిది. రాష్ట్ర సమృద్ధి కోశ సమృద్ధిపైననే ఆధారపడి యున్నది. భాండాగారము నిండుగానున్నప్పుడే సైన్యములు ఉత్సాహముతో ప్రవర్తించును. కోశాభివృద్ధి చేయుట కొరకు రాజు ప్రజలను పీడింపరాదు. ప్రజలను మోసగించి ధనార్జనము చేయు వ్యక్తులపై ద్విగుణీకృతముగ పన్నులను విధించి కోశమభివృద్ధి చేసికొనవలెను. ఇది భారతమే స్పష్టముగ తెలిపినది.

"మద్యపాన గృహములు, వేశ్యల ఇండ్లు, విటులు, జూద గాండ్రు మొదలైనవారినుండి రాజు అధికముగ పన్ను రాబట్టవలెను. వీరిపై రాజు ధనరూపమైన శిక్షనువిధించి కోశము నభివృద్ధిపఱచుకొన వలెను." నేడు దురభిప్రాయమొకటి ప్రజలలో రూఢమూలమై యున్నది. బ్రాహ్మణులనుండి పన్నులు వసూలు చేయరాదని పక్షపాతముతో ధర్మశాస్త్ర కర్తలు వ్రాసినారు. ఇది భ్రమమాత్రమే. షట్కర్మ నిరతులై, తపశ్శరీరులై అరణ్యముల వసించు బ్రాహ్మణుల నుండి మాత్రమే పన్నులు వసూలుచేయరాదని భారతము నొక్కి చెప్పినది. శ్రోత్రియుడు కానివాడు, అగ్ని ఉపాసన లేనివాడు, బ్రాహ్మణ విహితమైన ధర్మమును విడనాడినవాడు, జాతిమాత్రోప జీవి అయిన బ్రాహ్మణునినుండి నిస్సందేహముగా పన్నులు వసూలు చేయవచ్చునని ఆ భారతమే చెప్పినది.

### (అ) యయాతి పూరునకు బోధించిన రాజనీతి

రాజర్షియైన యయాతి బ్రహ్మర్షి గణపూజితుడు. తండ్రికి తగిన పుత్రుడు, పూరుడు. తండ్రియొక్క జరాభారమును స్వీకరించి ఆనంద ముతో తన యౌవనమును తండ్రికొసంగిన పితృభక్తి తత్పరుడు. తల్లి దండ్రులకు హృదయ ప్రమోదమాచరించుట చేతనే పూరుడు కనిష్ఠ

పుత్రుడైనను రాజ్యార్హతను పొందెను. ప్రభువునకు ధర్మప్రవణ హృదయము అత్యావశ్యకము. ధర్మమార్గ మెఱుంగుట చాల గహనమైనది. సామాన్యప్రజలు అజ్ఞానముచే దోషము చేసినయెడల అంత ప్రమాదముకాదు. సకల ప్రజలకు మార్గదర్శకుడుగ ఆదర్శప్రాయుడుగా నుండవలసిన రాజు ధర్మాధర్మ విషయములలో కడు జాగరూకుడై మెలంగవలెను. శ్రేష్ఠులయొక్క నడవడియే సామాన్యప్రజలకు మార్గదర్శకము కదా ! రాజు నిరంతరము ధర్మరహస్యములను ఎఱుకకలవారి చరితలు కఱచుచు నిరంతరము సజ్జనులతో గోష్ఠి చేయుచు ధర్మానుష్ఠానము ఏమరక చేయునగును. ధర్మము తెలియుట ఎంత ఆవశ్యకమో, ఆచరించుట అంతకంటె మిక్కిలి ఆవశ్యకము. రాజు అనగా ధర్మతరువు. సర్వధర్మములు రాజధర్మము మ్రోల అంజలి ఘటించును.

చెలిమియు, పగయు, తెలివియు, కలకయు, ధర్మంబును, పెంపును, తులువతనమును, పలుకుబడివలననే వచ్చును. ప్రభువు అనేక వ్యక్తులతో ఉదయమునుండి అస్తమయము వరకు వ్యవహరించవలసి యుండును. అందుచే రాజు మితముగను, హితముగను, సత్యముగను, పథ్యముగను, ప్రియముగను మాటాడవలయును. నరదేవుడు మనసునందు కరుణ, ఆర్జవము, అసూయము, సత్యము, శమము, శౌచము, పదిలముగ నూది యుండవలెను. ఆ మహామహితాత్ముడు అంతరంగ శత్రువులైన కామ, క్రోధ, లోభ. మోహ, మద మాత్సర్యములను జయించినచో బాహ్యశత్రువులను అశ్రమముగ జయించును పూర్వోదాహృతమైన లక్షణములు లేని వారు దుర్జనయోధవరులు. వారు తమ పలుకులను బాణములతో పరమర్మ లక్ష్యములను భేదింపకలరు కాని, సాధింపవలసిన పరమార్థమును పొందలేరు.

## ౩. కణికనీతి

భారతములో నాయా సందర్భములలో నాయా వ్యక్తులు రాజనీతిని చెప్పిరి. సందర్భమునుబట్టియు, చెప్పువారినిబట్టియు, వినువారి సంస్కారమునుబట్టియు ఆ రాజనీతి వైవిధ్యము సంతరించుకొనుట విశేషము. అందరును చెప్పినది రాజనీతియే. అయినను ఎవరి సంస్కారము ఎవరి ప్రయోజనము ఎవరి సొంతగొంతుక వారిదై ప్రత్యేక గుణభాసురమై ఒప్పుచున్నది. దుర్యోధనుడు ఎంత దుర్మార్గుడో కణికుడు కూడ, అతనికి తగినట్లు కఠోరమైన నీతిని ప్రబోధించియున్నాడు. మూలములో కణికుడు ధృతరాష్ట్రునకు ఈ రాజనీతిని ఉపదేశించినట్లు కలదు. నన్నయ్యగారు ఆంధ్రమహాభారతములో కణికుడు దుర్యోధనునకు బోధించినట్లు వ్రాసియున్నాడు. ఈ సందర్భములో ఒక ప్రశ్న వచ్చును. శ్రీకృష్ణుడు, చాణక్యుడు కొన్ని కొన్ని సందర్భములలో ఆపద్ధర్మముగ కూటనీతిని ప్రయోగించి విజయము తమపక్షమునకు సముపార్జించిరి. అయినచో కణికుడు బోధించినది కూటరాజనీతి. శ్రీకృష్ణ చాణక్యాదులు అనుసరించినది ధర్మబద్ధమైననీతి అని ఎట్లు చెప్పవచ్చును? భారతములో శాంతిపర్వమున భీష్మతపస్వి సర్వరాజన్య శిరోధార్యమైన రాజనీతిని ధర్మాత్ముడైన ధర్మరాజునకు ప్రవచించెను. భారతములోనే ధర్మబద్ధమైన రాజనీతి, కూటరాజనీతి వర్ణించిన సందర్భములు కలవు. ఒకటి కూటరాజనీతి, మరొకటి ధర్మబద్ధమైన రాజనీతి అని ఎట్లు చెప్పవచ్చును? ఈ సందర్భములో మనము ఏ ఏ సందర్భములలో ఏ ప్రయోజనము నపేక్షించి శ్రీకృష్ణుడు, ధర్మరాజు ఏ రాజనీతిని అవలంబించినారు అని పరిశీలింపవలసియున్నది. వారు కూటరాజనీతిని ఆపద్ధర్మముగ జగత్కళ్యాణముకొరకు అవలంబించినారు. అది ఆపద్ధర్మము మాత్రమే. అంతేకాని చిన్నదానికి పెద్ద

దానికి కూటరాజనీతిని క్రమప్రాప్తమైన ధర్మముగ వాడుకొనలేదు. అదియునుగాక ఆ మహాపురుషులు వ్యక్తిగతమైన లాభమునకు ఈ మార్గ మనుసరింపలేదు. సామాజిక కళ్యాణము సంపాదించు సమయము లలో ఇతర ఉపాయములన్నియు, వ్యర్థమైనపుడే ధర్మసంరక్షణార్థము గత్యంతరములేక ఈ వక్రమార్గమును అనుసరించిరి.

రాజు దండమునుధరించి సర్వప్రజలను తమతమ ధర్మములను నిర్వర్తింపచేయుటకు సాధనముగా నుపయోగింపవలయును. దండ భయము లేకపోయినచో అరాజకత్వము ప్రబలును. లోకములో మత్స్యన్యాయము ప్రవర్తిల్లును. రాజు ధర్మమాచరించి ప్రజలను ధర్మ మార్గావలంబులుగా నొనరింపవలయును. దండభీతిచేతనే సర్వవర్ణము లకు చెందిన ప్రజలు తమతమ కర్తవ్యములనువీడక నిర్వర్తించెదరు. మహీవల్లభుడు నేరమునకు శిక్ష విధించునపుడు ఇతడు మిత్రుడనియు, అతడు శత్రుడనియు భావములేక సమచిత్తము వహించవలెను. సర్వ ప్రజలను ధర్మాభిరతులుగ చేయుటకు ధర్మమునందు ఆసక్తి అధర్మము నందు భయము కలిగించుటయే రాజుయొక్క ప్రధానధర్మము. దోషిని సన్మార్గమున పెట్టుటకొరకే నేరమునకు ఉచితమైన దండనము విధింప వలెను. నేరమునకు మించిన దండనము విధించుటచేతనే యమధర్మ రాజు మాండవ్యమహర్షి శాపముచే విదురుడుగా పుట్టవలసి వచ్చెను. (చూ ఆది - షష్ఠ - 102)

నరపాలుడు ఆత్మరక్షణమునందు కనుకలిగి యుండవలయును. రాజు నాలుగు కాలములపాటు తన పదవిని నిలబెట్టుకొనవలెనన్నచో వీరిని నమ్మవచ్చును, వీరిని నమ్మకూడదు అని హృదయపూర్వక ముగా భావించరాదు. ఎవరికి ఎంత చనవీయవలెనో అంత మాత్రమే ఈయవలెను. (చూ - ఆది - షష్ఠ - 110). ప్రజలు రాజునకు

మిత్రులగుట, శత్రులగుట వ్యవహారమునుబట్టియే కలుగును. అందుచే ఏ వ్యక్తిని ఎంతవరకు ఉపయోగించుకొనదగునో అంతవరకే గౌరవింపదగును.

రాజ్యాంగ వ్యవస్థ విజయము పొందుటకు మంత్ర రక్షణము అత్యంత ఆవశ్యకము. సర్వకార్యములు మంత్రపరిరక్షణ శక్తిచేతనే సిద్ధిపొందును. ఆత్మరక్షణమునెడ రాజు ఎంత శ్రద్ధవహించునో మంత్రి రక్షణమునకూడ అంత భక్తిప్రపత్తులు ప్రకటింపవలయును. బృహస్పతియైనను మంత్రివిభేద్యమైన కార్యము నిర్వహించుటకు సమర్థుడు కానేరడు. రాచకార్యము లన్నియు నిర్వహణమునకు పూర్వము నృపాలుడు ధీరమతియుతులతోడ బాగుగ యోజించి చేయవలెను. కార్యనిర్వహణమునకు ముందు చక్కగ సమీక్షించి ప్రారంభించిన కార్యము ఎట్టి విఘాతములు లేక ఫలసిద్ధి పొందును కదా! ధర్మబద్ధ బుద్ధియైన జనపాలుడు మృదు కర్మముచేత కాని, క్రూరకర్మముచేతకాని నేర్పుతో రాజకార్యమును ఉద్ధరింపవలయును. రాజు తనలోని లోపములను చక్కగా గుర్తించి పరులలోని లోపములను తెలిసికొనుచు దేశకాలపాత్రానుగుణముగ మిత్రిసంపన్నుడై మెలగవలెను. రాజు నిత్యము అలయక, ఆత్మకృత్యము నెఱింగి పరుల కృత్యములను దూతముఖమున నెఱుంగవలయును. పరభూముల వృత్తాంతము నఱయుటకు వివిధ పాషండ తతిని నియోగింపవలయును.

రాజు ఎచ్చటకు వెళ్ళినను ఆ ప్రదేశమును అంగరక్షకులచే శోధింపచేసి నిష్కంటకముగ నున్నదని తెలిసిన పిమ్మటే అచటకి వెళ్ళవలెను. శోధింపక తనకేమన్నట్లు నానా విహారశైల ఉద్యాన సభా తీర్థదేవతా గృహ మృగయాస్థానములకు వెడలరాదు. పలుమారులు శపథములు పలికియు, అంజలి ఘటించియు, అభివాదములు చేసియు,

సామప్రియభాషలు పచరించియు, మిథ్యావినయము నటించియు, కాపురుషులు ప్రభువును తమకై వసము చేసికొనుటకు నిరంతరము ప్రయత్నింతురు. వారే కాపురుషులు. ఇట్టి కాపురుషులను ఒక కంట కనిపెట్టి రాజు దూరముగా నుంచవలెను. దుర్జనుడు తన కిమ్మగునంతవరకు ఇష్టుడపోలె రాజును నీడవలె అనుసరించి యుండును. పాము అదను దొరకువరకు పొంచియుండి, గరళముతో కూడిన కోరతో శతృవును కరచి చంపుచున్నది కదా. అట్లే శతృవుకూడ అవకాశము వచ్చువరకు ధర్మధ్వజివలె నుండి అపకారము చేయును. ఈవిషయమును ఉపమానములతో సమర్థించియుండుట మనోహరమైయున్నది.

(ఆది - షష్ఠ - 113 - 114)

రాజు శతృవును ఎప్పుడు నిర్జించవలెనో సూచించుటకు కణికుడు కూటనీతిని ప్రకటించెను. రాజు వాక్కు మధురముగ నుపయోగించుచు హృదయము కత్తివాదరవలె నుంచుకొనవలెను. బలహీనుడైన రాజు బలవంతుడైన శతృవును నెత్తిమీద పెట్టుకొని పూజించుచు, యుక్త సమయమున మట్టికుండ రాతిమీదవేసి బ్రద్దలుకొట్టు విధమున రూపు మాపవలయునని చతురముగా చెప్పినాడు. రాజునకు అపకారముచేసిన శతృవు అల్పుడని నమ్మియుండి దగ్గరకు చేరనీయరాదు. పాదతలమున చిన్నముల్లు గ్రుచ్చుకొన్నచో మనము నడవలేము కదా. శతృవు అల్పుడని ఔదాసీన్యము వహించుట ఎంతమాత్రము తగదు. శతృవు బాలుడని తలచి తేలికగాభావించి కలసియుండుట రాజునకు కార్యమా? చిన్న నిప్పుకణమైనను భయంకారారణ్యమును కాల్చుచున్నది కదా? శతృశేషము నిల్చిఉండుట అత్యంత ప్రమాదకరము. సమీప శతృవు ఎంతప్రమాదము కలిగించునో ఈపద్యములో పరమరమణీయముగా చెప్పియున్నాడు.

(చూ. ఆది - షష్ఠ - 115, 118

కణికుని ఉపదేశము పరిశీలించినచో శత్రునిర్మూలనము చేయుటలో రాజు ఎంత జాగరూకత వహింపవలెనో తెలియుచున్నది. ఈ శత్రునిర్మూలనము రాజు ఆత్మరక్షణముకొరకే చేయవలెననుట గమనార్హము. కణికుని ఉపదేశము దుర్యోధనునిపై ఎంతయో పనిచేసినది.

(ఇ) నారదమహర్షి ధర్మరాజునకు బోధించిన రాజనీతి :-

మయుడు, అగ్నిభయమునుండి రక్షింపబడుటచే తత్కృతజ్ఞతా సూచకముగా సకలజన మనోహరమైన సభను నిర్మించి ధర్మరాజునకు కానుకగా సమర్పించెను. సభాస్థితుడైన ధర్మరాజు ప్రజలను కన్నబిడ్డల వలె పాలించుచు తమ్ములతో సుఖసంపదలతో తులతూగుచుండెను. తన్నుచూచుట కరుదెంచిన మునీశ్వరులను ధర్మరాజు పూజించి వారి వలన ధర్మకథల నాలించుచుండెను. అంత నారదమహర్షి ఏగుదెంచి, రాజనీతివిషయములను ధర్మరాజును ప్రశ్నించెను. ఈభాగమంతయు, ప్రశ్నలరూపమున ఉన్నను త్రిలోకసంచారి, జగత్కళ్యాణ సంధాయి అయిన నారదమహర్షి ధర్మరాజునకు కర్తవ్యము బోధించుచునట్లు గోచరించుచున్నది.

వాల్మీకిమహర్షి ప్రణీత రామాయణములో చిత్రకూటమున శ్రీరామచంద్రుని సందర్శించుటకొరకు భరతుడు వచ్చెను. శ్రీరాముడు భరతుని రాజ్యపాలనమునకు సంబంధించిన అనేకప్రశ్నల వర్షము కురిపించెను. శ్రీరాముడు సప్తాంగములనుగూర్చి భరతుని ప్రశ్నించిన భావములన్నియు నారదుడు బోధించిన రాజనీతిలో ప్రతిఫలించియున్నవి. క్రమముకూడ అట్లే పాటించియుండుట విశేషము. మితహిత సత్య వాక్యజ్ఞుడగు నన్నయ పరిమాణముచే చిన్నదయ్యును గుణముచే మిన్నగా ప్రకాశించునట్లు రాజనీతిని అంతయు ఇందు ఏర్చికూర్చెను. ఈరాజనీతి చెప్పినవ్యక్తి దేవర్షి. శ్రోత ధర్మరాజు అగుటచే ఇది

సకల ధర్మోత్తరమై యున్నది. చంద్రవంశములో మహాభిష, భీమసేన, ప్రతీప, శంతన ప్రభృతులగు నరదేవోత్తము లుద్భవించిరి. ఆ నర దేవోత్తములు అనుస్యూతముగా ననుసరించుచు వచ్చినది ధర్మ మార్గము. రాజునకు ధర్మమునకు అవినావభావ సంబంధమున్నది. రాజధర్మము బహుశాఖా సమంచితమయి యున్నది. సకలప్రజల పూజకు పాత్రమైన మహీపాలుడు ధర్మార్థ కామమోక్షములకు ఒండొంటికి బాధకలుగకుండ ఉచితకాల విభక్తము చేసి సేవించవలెను.

రాజునకు విజయమూలము మంత్రము. మంత్రి రాజునకు కన్ను వంటివాడు. అనఘులు శాస్త్రవిధిజ్ఞులు, అన్యోన్యారక్తులు, పితృపితా మహాక్రమమున వచ్చిన విప్రులను మంత్రులుగ నియోగించవలెను. రాజు ధర్మమునందే చిత్తము లగ్నము చేసి నిఖలయోగవృత్తులందు యోగ్యులైనవారిని నిపుణులైనవారిని రాజకృత్యములందు స్థిరముగా నుంచవలెను. మంత్రగుప్తి అత్యంత ఆవశ్యకము. ఫలము కలుగకుండ రాజుచేయు మంత్రాలోచన ప్రజలకు ముందు తెలియుట అత్యంత ప్రమాదకరము. మంత్రాలోచనముకూడ అపరరాత్రమున ఉచితస్థాన మున ఉచితమైన మంత్రులతో చేయవలెను.

(సభా - ప్ర - 27, 28)

రాజు వేయిమంది మూర్ఖులను విడిచియైన ఒక్క పండితుని సేవించుట కర్తవ్యమని రామాయణము సూచించినది. ఉత్తమ మంత్రులు దుష్టమంత్రులు తెలిసికొని రాజు గుర్తింపవలయును. దుష్ట మంత్రులు రాజపుత్రులకు అమిత ధనమొసంగి వారితో చేతులుకలిపి వారి పక్షమువహించి రాజునకు ద్రోహము చేయించుట కలదు. తగని వారికి ధనమిచ్చి గర్వముతో దుర్వ్యామోహముతో విఱ్ఱవీగుదురు. దుష్ట మంత్రి రాజునకు చేయు అపకారము ఇంతింత అనరానిది. రాయలవారు

దుష్టమంత్రిని చేరదీయుట గుమ్మడికాయవంటి ముత్యమును ధరించుట వంటిదని చమత్కరించినారు.

పురోహితుడు ధర్మాధర్మ విశారదుడై బహుశ్రుతుడై, సమచిత్తుడై వాణీరమణీ శిత వదనసరోరుహుడై ఉన్నాడా యని నారదుడు ధర్మరాజును ప్రశ్నించెను. పురోహితుడు రాజశ్రేయమును కోరువారిలో అత్యంత ప్రధానుడు.

దైవజ్ఞులు జ్యోతిశ్శాస్త్రములు బాగుగా పరిశీలించి ప్రతిభావంతులై దివ్యాంతరిక్ష భౌమోత్పాతములకు ప్రతీకారము చేయవలెను. వారిని రాజు సముచితముగ సన్మానించవలెను. వైద్యులు నిరంతరము దక్షులై రాజభక్తులై అష్టాంగములతో కూడిన ఆయుర్వేదము అభ్యసించి జగద్ధిత బుద్ధితో సేవచేయుచుండవలెను.

రాజు తన భృత్యులను ఉత్తమ, మధ్యమ, అధములుగా వర్గీకరించి యథోచితములైన కార్యములలో నియోగించవలెను. ఉత్తమ. మధ్యమ, ఆది వివక్ష కార్యముయొక్క విశిష్టతపైనను ఆ కార్యము నిర్వహించు వ్యక్తియొక్క నైపుణ్యము పైనను ఆధారపడియుండును. రాజు భృత్యులకు తగు జీతములను పూర్తిగా ఏర్పాటుచేసి యథోచిత కాలమున ఇచ్చుచుండుట అత్యంత ఆవశ్యకము. రాజోద్యోగులు తగినంత జీతమున్నపుడే భయభక్తులు కలిగి రాజుసేవ చేయుదురు. ఒక ముద్దలోటు వచ్చినను సేవకులు రాజును చెడజూతురు. అందుచేత రాజు భృత్యులయెడ ప్రేమ కలిగి ఉండవలెను. ఉద్యోగులను సత్కరించుటయందు రాజు గొప్ప ఈవి ప్రకటింపవలయును. రాజు భృత్యులకు నిర్ణీతసమయములో జీతములు ముట్టునట్లు చేయనియెడల ప్రజల దగ్గర వారు లంచములను పుచ్చుకొందురు. అందుచే తనను ఆశ్రయించుకొన్న భృత్యులందరికి సేవలో నిమగ్నులగునట్లు ఉత్తరోత్త

రాభివృద్ధిగా జీతములు సముచితముగ పెంచవలెను. కులపుత్రులైన సద్భృత్యులకు సత్కారములు ప్రేమతో రాజు చేయవలెను. అట్లు చేసినయెడల ఆ భృత్యులు రాజు చేసిన మహాగౌరవమునకు కృతజ్ఞతాబద్ధులై యుద్ధసమయములో ప్రాణములను తృణప్రాయముగ త్యాగము చేయుటకు వెనుకాడరు.

ఆధునికకాలములో యుద్ధములో అపూర్వపరాక్రమము సాహసము ప్రకటించిన సైన్యాధ్యక్షులకు రక్షకభటాధికారులకు నైపుణ్యము ప్రకటించినవారికి మహావీర చక్రాది బిరుదులు ఇచ్చి సత్కరించుట ఈ పరమాశయముతోనే చేయుచున్నారు. యుద్ధములో వీరమరణము పొందిన వీరభటుల కుటుంబములకు, ఉద్యోగములు, ఆహారవస్త్రములు సమృద్ధిగ రాజు సమకూర్చవలెను. రాజు కార్యములందు ధనలోభముకలవారిని, దొంగలను, రాజభక్తి లేనివారిని, శత్రువులను జయించుటకు ధైర్యములేని పిఱికిపందలను, నియోగింపరాదు.

రాజ్యములో చోరభయము లేకుండ రాజు రాజ్యమును పాలింపవలెను. అధిక ధనలోభమునకు వశులై రాజసేవకులు దొంగలకు ఆశ్రయములు కల్పింపరు కదా. రక్షకభటులకు, దొంగలకు వాటాలుండును. రక్షకభటులు, దొంగలు కలిసిన అగ్నికి వాయువుతోడైనట్లు లోకోపద్రవము కలుగును. రాజభటులు నేరముచేసినవారు ధనవంతులైనచో వారి దగ్గర ధనము గుంజి వారిస్థానమున అమాయకులను నిలుపుటకూడ లేకపోలేదు. రాయలువారు ఆముక్తమాల్యదలో న్యాయమును రాజు ప్రజలకు ఇచ్చుటలో ఆలస్యము చేసినచో నేరముచేసిన దోషులు తప్పించుకొనిపోదురు. అమాయకులైన ప్రజలు వారిబదులు శిక్షింపబడుదురు. అమాయకుని కన్నులనుండి కారిన కన్నీరు రాజ్యమును పుత్రమిత్రబాంధవముగా నిర్మూలించుననిరి.

అనావృష్టి కలిగినపుడు రాజ్యములో జలపూర్ణములైన చెఱువులకు నదులకు ఆనకట్టకట్టి నీరు సరఫరా అగునట్లు చేయవలెను. జలాధారములను మిక్కిలి భద్రముగా రక్షింపచేసి వ్యవసాయమునకు తోడ్పడునట్లు చేయవలెను. సన్నకారురైతులకు ధాన్యము బీజములు, బక్కచిక్కిన వర్తకులకు శక్తైకవృద్ధిగా ఋణములను సమకూర్చవలెను. వ్యవసాయదారులు వణిజులు రాజుయొక్క కోశాగారమునకు పన్నుగట్టుదురు. అందుచే వారిని ఎంతో ప్రేమతో ఆపదసమయమున ఆదుకొనవలయును. అంతేకాని వ్యవసాయదారులు వర్తకులు వలస పోవుచున్నను తనకేమి పట్టనట్లు ఊరకొన్నరాజు శ్మశానముదగ్గర పొంచియున్న నక్కతో తుల్యుడని రాయలువారు సూచించిరి.

రాజు దయతో, కుంటి, మూక, గ్రుడ్డి మొదలైన అనాథలను రక్షింపవలెను.

రాజు తనరాజ్యములో ఆర్థిక రాజకీయ సాంఘిక రంగములలో విశిష్టసేవచేసిన మహాపురుషులను యథోచితముగా సత్కరించి వారికి ద్విగుణీకృతోత్సాహము కలిగింపవలెను. దీనివలన ప్రజలకు తాము కూడ ఇట్టి సేవచేసినచో మహాగౌరవము పొందగలుగుదుమని ఉత్సాహము పల్లవించును.

రాజ్యమునకు వచ్చు ఆదాయములో నాల్గవభాగము కాని, మూడవభాగము కాని అర్థభాగముకాని రాజు ఖర్చుచేయవలెను. అంతకంటె మించి చేయరాదు. వట్టిపోయిన ఆవు అందరికి చులకన అగునట్లు కోశము రిక్తపోయినయెడల రాజ్యము చిక్కులలో పడును. సర్వకార్యములు ధనైక సాధ్యములు. ధన సంచయము రాజ్యవ్యవస్థకు మూలము. ఆయుధాగారములను, ధనకోశములను, చతురంగబలములను, పోషించు స్థానములందు, భండారములందు, పరమవిశ్వాసపరులను

భక్తులను, దక్షులను, నియోగించవలెను. (చూ. సభా - ప్ర 47) గురువులు, వృద్ధశిల్పివరులు, వణిజులు, బంధువులు, ఆశ్రితులు, సాధుజనులు పేదరికము పొందకుండ రక్షింపవలసిన బాధ్యత రాజుపైనున్నది. ఆత్మరక్షణ తత్పరుడైన రాజు సంతతము బాహ్య, అంతరజనులను ఒక కంటితో కనిపెట్టియుండి చారులవలన పరమహీపతుల చరిత్రము తెలిసికొనవలెను. (చూ. సభా - ప్ర - 47) లోక వ్యవహారములను రాజు నిరంతరము, విద్వజ్జనులను సమావేశపరచి వారితో గోష్ఠి చేసి అశేష ధర్మకుశలుడై సమబుద్ధితో నిర్వహింపవలెను. ఆయా రంగములలో దక్షులైన విద్వాంసుల సాయము రాజు ఎల్లప్పుడును పొందవలెను.

వార్తకు రాజ్యవ్యవస్థలో అధిక ప్రాధాన్యము కలదు. అర్థానర్థములను తెలుపువిద్యయే వార్త. వార్తయందే జగత్తు అంతయు నిలిచియున్నది. వార్తవిషయములో నరపాలుడు అత్యంతశ్రద్ధ వహింపవలయును. వార్త లేనినాడు జగత్తు అంతయు అంధకారముతో నిండిపోవును. అదియే సమాచారశాఖ.

నారదమహర్షి ఉపదేశమును ముగించుచు రాజునకు పదునాలుగు దోషములు పరిహరింపవలసిన ఆవశ్యకమున్నదని హెచ్చరించెను.

> "మఱియు నాస్తిక్యం, బనృతంబు, ప్రమాదం, బాలస్యం, బనర్థజ్ఞులతోడి చింతనంబు, క్రోధంబు. దీర్ఘచింత, దీర్ఘసూత్రత, దెలుకగలవారి నెఱుంగమి, యర్థంబులయం దనర్థకచింత, నిశ్చితకార్యంబులు సేయమి, మంత్రంబుల రక్షింపమి, శుభంబుల బ్రయోగింపమి, విషయంబులం దగులుట, యనంబరగిన పదునాలుగు రాజదోషంబుల బరిహరింతే యని యడిగిన నారదునకు ధర్మరా జిట్లనియె."
>
> (సభా - ప్రథమ - 56)

## ఉ. ధృతరాష్ట్రుడు ధర్మజునకు బోధించిన రాజనీత్యుపదేశము

ధృతరాష్ట్రుడు ధర్మరాజునకు రాజనీతిసూత్రములను సంక్షిప్త సుందరముగా ఉపన్యసించెను. మానసికపరిణతి పొందినవాడు, ప్రజలను కన్నబిడ్డలవలె పరిపాలించినవాడు, రాజ్యపరిపాలనాదక్షుడు, అయిన ధృతరాష్ట్రుడు తనకు అత్యంత ఆత్మీయుడైన ధర్మజునకు మర్మము లేకుండ రాజనీతిలోని మర్మములను సాకల్యముగ చెప్పుట విశేషము.

### నృపధర్మము :

సప్తాంగ సమన్వితమైన రాజ్యవ్యవస్థకు ఆత్మ రాజు. రాజ్యములో జరుగుచున్న సర్వవిషయములను సహస్రనేత్రములతో సాకల్యముగ తెలిసికొని ప్రజలను దయతో రక్షించుచు, న్యాయముగా ఆర్జించిన ఆదాయమును వృద్ధిచేసికొనుచు తగనేలినచో భూమి కామధేనువువలె సకలకామ్యములను అభివర్షించును.

### అమాత్యులు :

రాజ్యాంగరథమునకు రథివంటివాడు రాజు, సారథివంటివాడు మంత్రి. రాజ్యాంగమున మంత్రికున్న ప్రాధాన్యము అనితరసాధారణము. భావశుద్ధినిలయులు పితృపితామహక్రమసమాగతులైనవారు, అగు సచివులనే ఎన్నుకొనవలెను. ఎల్లకార్యములు మంత్రులతో సామూహికముగను, ఒక్కొక్కరితోను సందర్భమునుబట్టి విచారించి నిర్ణయము తీసికొనవలెను. మంత్రమునకు అత్యంతప్రధానమైన లక్షణము గోప్యము. మంత్రగోపనమువలన అఖిలకర్మలు ఫలావాప్తి పొందును. మంత్రాలోచనమునకు రహస్యప్రదేశముకాని, మేడువు మీదకాని, మాటులేని అరణ్యప్రదేశముకాని అర్హమై యున్నవి. మంత్రాలోచనము చేయునపుడు సమీపమున బధిర, పంగ్వంధ, జడులుండరాదు. రాజ్యాంగసంబంధమైన, రహస్యములను అత్యంత గోప్యముగ నుంచవలెనని మంత్రులను రాజు హెచ్చరించవలెను.

సేనాధిపతి :- స్వామిభక్తి, స్నేహావేశముకలిగి శూరుడై, ఎట్టి క్లిష్టపరిస్థితులలోను సమత తప్పనివిసువని సత్కులజుని సైన్యవిభుని ప్రభువు వరింపవలెను.

భృత్యులు :- రాజ్యకార్యనిర్వహణములో నత్యద్భుత ప్రతిభ, త్యాగము ప్రదర్శించిన రాజోద్యోగులను సముచితముగ సన్మానించి, మహారాజసభలో గౌరవింపవలెను. (చూ ఆ - ప్ర - 64)

శత్రుసంహారము :- శత్రురాజులను ఒకకంటకని పెట్టి రాజు మెలగవలెను. దైవ, మానుషబలము తఱిగియున్నపుడు, బలహీనుడుగా నున్నపుడు శత్రువుపై రాజు విజృంభించవలెను. వైరి రాజుల మంత్రుల మనసు విరసమొనర్చి రిపురాజ్యము కైవసము చేసికొనవలెను.

## 7. అపవాద నీతి

శాస్త్రములలో సామాన్య విధియనియు, విశేషవిధియనియు, ద్వివిధ సూత్రములు కలవు. అట్లే ధర్మములలో సామాన్యధర్మములు, ఆపద్ధర్మములు కలవు. సామాన్య ధర్మమును విశేష ధర్మము బాధించును. ధర్మము విధిరూపముగను, నిషేధరూపముగను కలదని తెలియుచున్నది.

1. దినమును సంధ్యయొనర్పుము. 2. ప్రతి వసంతఋతువునను సోమయాగము సేయుము. 3. సత్యము పలుకవలయును. 4. అహింసయే పరమ ధర్మము. 5. సర్వభూతములయందునుదయకలిగి యుండవలయును.

ఇత్యాదులు విధిరూపములైన ధర్మములు. 1. అసత్యము పలుకవలదు. 2. పరుల ధనము అపహరింపవలదు. 3. ఇతరులకు

కీడు తలపెట్టకును. ఇట్టివి నిషేధరూపములు. అసత్యములాడుట, ఇతరుల ఇండ్లను కాల్చుట, మొదలైనవి చేయుమని ఏ నీతిశాస్త్రము చెప్పదు. కాని ఒక్కొక్కసారి ప్రాణాపాయసమయమున ఇవి ఉపాదేయములే.

"సత్యంబు నహింసయు నను
నత్యుత్తమధర్మయుగళ మందు, నహింసన్
సత్యము గాచుట, ధర్మ మ
సత్యమున నహింస గాచ జను నండ్రు బుధుల్."

"ప్రాణహాని వచ్చుపట్టున, సర్వధ
నాపహారవేళయందు నడపు
సత్య మనృత మం, డ్రసత్యంబు సూనృత
మని పరిగ్రహింతు రార్యజనులు."

(కర్ణ - తృతీయ - 73, 77)

ప్రబలమైన అపాయములనుండి తన్ను తాను రక్షించుకొనవలసి వచ్చినపుడు మానవుడు వీనిని అవలంబించును. వీనికి ఆపద్ధర్మములని పేరు.

ఒకవ్యక్తి చేసిన వ్యాపారము ధర్మమా? అధర్మమా? అని నిశ్చయించుట స్థూలదృష్టితో చేయరాదు. అవ్యక్తి ఆ వ్యాపారమును స్వార్థముతో చేసెనా? జగద్ధితముకొఱకు చేసెనా? అని పరిశీలించవలెను. మహాపురుషులు జగత్కల్యాణము సాధించుపరమాశయముతో, ఆచరణములో నొకింత అధర్మమునైనను చేసి సమాజకల్యాణము ధర్మసంరక్షణము చేయుట అనాదికాలమునుండియు వచ్చుచున్నది. ఆ మహాపురుషులు చక్రమును త్రిప్పుదురుగాని చిల్లిగవ్వకూడ వారికక్కరలేదు. ధృతరాష్ట్రుడు కూటనీతిని స్వార్థముతో అవలంబించి పాండవులకు

రాజ్యభాగము పంచియియ్యక లోభియై తనపుత్రులకు రాజ్యమంతయు కట్టపెట్టదలచెను. అతనిది కూటనీతి. శ్రీకృష్ణుడు ధర్మసంరక్షణము చేయుటకొరకు, సమాజ కల్యాణము సాధించుటకొరకు, ఆపత్కాలములో కూటనీతిని అనుసరించినను మహాపురుషుడే అని ప్రఖ్యాతి పొందినాడు.

అనేక సందర్భములలో ధర్మము అధర్మమువలెను, అధర్మము ధర్మమువలె గోచరించును. ధర్మసూక్ష్మమును తెలిసికొనుట కడుంగడు కష్టము. హింసచేయుట మహాపాపము. అసత్యము మేటిపాతకము. జగత్కల్యాణముకొఱకు యజ్ఞములో పశు విశసనము చేయుట హింసకాదు, భూత హితముకొఱకు చేయు అసత్యభాషణమును సత్యమై ప్రకాశించును. పరిణయ సమయమున, ప్రాణభంగమున, విత్త భంగమున పలుకు అసత్యము సత్యఫలమునే యొసంగు ననుట సిద్ధాంతము.

(అనుశాసనిక - పంచమ - 73)

భారతామ్నాయములో ఈ అపవాద నీతి పుష్కలముగ నున్నది. లోకసామాన్యదృష్టికి ధర్మము అధర్మమువలె భాసించును. జగత్కల్యాణముకొఱకు ఒక మహాధర్మమునకు జయము కలిగించుటకొఱకు ఆపత్కాలములో ఇంచుక అధర్మము చేసినను అధర్మము కాదు. ధర్మాధర్మనిర్ణయము చేయుట సామాన్యులకు దుష్కరము. "ధర్మస్య తత్త్వం నిహితం గుహాయాం".

ధర్మమర్మమును, ధర్మ విభాగ విధిజ్ఞుల సేవించియు, వేద శాస్త్ర తత్త్వవిదులను పరిప్రశ్న చేసియు, సంతతము ధర్మానుష్ఠానము చేయు మహాపురుషుల నడవడిని మార్గదర్శకముగ గ్రహించియు మనము నడువవలెను. ఏధర్మమును మహాజనులు అనుసరింతురో అయ్యదియే మనలకు శరణ్యము. సామాన్యముగ లోకములో ధర్మాచరణము చేయుటకు కొలదిమంది మాత్రమే ముందునకు వచ్చెదరు.

అధర్మము చేయుటకు పరశ్శతముగ ద్విగుణీకృతోత్సాహముతో ముందునకు వచ్చెదరు. ధర్మమును దుర్వ్యాఖ్య చేసి, తమ తప్పును సమర్థించుకొనుటకు మహాపురుషులు ఆపత్కాలములో జగత్కల్యాణముకొఱకు చేసిన అధర్మమును వీరు అడ్డుగా పెట్టుకొని అధర్మము చేయుదురు. అది మిక్కిలి అనుచితము. ఒకవ్యక్తి వ్యాపారము సాగించుటలో ధర్మము ననుసరించి సర్వసాధనములు నిష్ప్రయోజనమయిపోయినపుడు ధర్మము రక్షించుటకొఱకు ఇంచుక అధర్మము చేసినను అది ధర్మమే.

మహాభారత సంగ్రామము ప్రారంభమైనది. భీష్ముడు కౌరవ సైన్యాధిపత్యము వహించి పాండవసేనలను చీల్చి చెండాడుచున్నాడు. పాండవ సేనావాహినిలో అందరును పలాయనము చేయుచుండిరి. పరమేశ్వరుని జయించినవాడును, పాశుపతాస్త్రము ఆర్జించినవాడును గాండీవము కలవాడును అగు అర్జునుడుకూడ కర్తవ్యతా మూఢుడయ్యెను. ఇట్టి ఆపత్కరపరిస్థితిని శ్రీకృష్ణుడు సమీక్షించి తాను ఊరకుండినచో భీష్ముడు అనాయాసముగ, పాండవులను పరిమార్చి దుర్యోధనునకు రాజ్యము కట్టపెట్టునని భావించెను. ఏవిధముగానైనను భీష్మునిపై విజృంభించి పాండవులను ఆపత్సముద్రమునుండి యుద్ధరింప తలచి శ్రీకృష్ణుడు సుదర్శనమును ధరించి, రథము డిగ్గనురికి భీష్మునిపైకి దుమికెను. అప్పట్టున అర్జునుడు శ్రీకృష్ణుని పాదములపై బడి ప్రార్థించి అతడు పూర్వముచేసిన ప్రతిజ్ఞను గుర్తుచేసెను.

> "నేనూరక నిరాయుధ వ్యాపారతమై
> నుండువాడ బరమాప్తుడనై"
>
> (ఉద్యోగ - ప్రథమ - 74)

తొమ్మిదవనాటి యుద్ధమునకూడ శ్రీకృష్ణుడు ఇట్లే భీష్మునిపై విజృంభించెను. ఆయుధధారణము చేయనని ప్రతిజ్ఞ చేసిన శ్రీకృష్ణుడు మర్యాదాతిక్రమణము చేయవచ్చునా? ఇది ధర్మమా అను ప్రశ్న ఉదయించును. దీనిని ఈవిధముగా సమర్థింపవచ్చును. భీష్ముని భీకర పరాక్రమాగ్నిలో పాండవసేన శలభములవలె పడి బూడిద యగుచుండెను. త్రిలోకైక ధనుర్ధరుడని ప్రసిద్ధివహించిన అర్జునుడుకూడ నైరాశ్యముతో వెనుకంజవేయు స్థితిలోనుండెను. అట్టి అర్జునునికి ధైర్యోత్సాహములు పాదుకొల్పి నిలబెట్టవలసిన ఆవశ్యకమున్నది. పుట్టిన నాటినుండియు పాండవులు ధర్మశీలురై ఎన్నియో బాధలుపడి తుదకు, యుద్ధమునకు వచ్చిరి. అట్టి పాండవులకు విజయము చేకూర్చ వలసిన బాధ్యత శ్రీకృష్ణునిపై యున్నది. ధర్మరక్షణము అతని పరమ కర్తవ్యము. అర్జునుని సమరోన్ముఖునిగా చేయుటకు పాండవసేనలోని నిరుత్సాహము పోగొట్టుటకు శిష్యునిచే సమరమహాయజ్ఞము చేయించుటకు శ్రీకృష్ణుడు అట్లు చేసియుండును.

అభిమన్యుని మరణమునకు ప్రధానకారణము సైంధవుడు. ప్రియపుత్ర మరణకారణమయిన సైంధవుని అర్జునుడు సూర్యాస్తమయము లోపున సంహరింపకలనని భీకర ప్రతిజ్ఞ చేసెను. రాజరాజు సైంధవ రక్షణ బాధ్యత ద్రోణ కృప కర్ణ అశ్వత్థామలపై నిడెను. ఆచార్యుడు తన సిద్ధాంత జ్ఞానమంతయు ప్రయోగింపదలచి అర్జునునకు దుర్గమమైన వ్యూహము పన్నెను. శ్రీకృష్ణుడు తనప్రియసఖుడైన అర్జునుడు ఈ ప్రతిజ్ఞ ఎట్లు నెరవేర్చునా అని ఆందోళనము పొందెను. అర్జునుని సమస్య అనగా అచ్యుతుని సమస్యయే. ఆక్లిష్టసమయమున కృపా తరంగిత హృదయుడైన కేశవుడు మాయా తిమిరముచే సూర్యుని కప్పెను. సూర్యాస్తమయమైనదని భావించి సైంధవుడు కౌరవసేనలో

ఈవలకు వచ్చెను. శ్రీకృష్ణుడు అర్జునుని ప్రోత్సహించి సైంధవుని సంహారింపచేసెను. ప్రియశిష్యుని తీర్ణప్రతిజ్ఞునిగా చేయుటకు శ్రీకృష్ణుడు అట్లు చేసెను. ఇదియే అపవాద నీతి. ఇది స్థూలదృష్టికి అధర్మముగా గోచరించును. సూక్ష్మదృష్టికి ఇది ధర్మమే.

శ్రీకృష్ణుడు మహాభారతయుద్ధములో పాండవులకు విజయము కలిగించుటకొఱకు చేసిన స్వల్పమైన అధర్మములుగూర్చి ధర్మనిర్ణయము చేయుటకు చాల పరిశీలనము కావలెను. శ్రీకృష్ణుడే మాయావులను దుర్మార్గులను మాయతోనే సంహరించుట ధర్మమని నొక్కి చెప్పియున్నాడు. ఈ సందర్భమును పురస్కరించుకొని మహామనీషి రాజగోపాలాచార్యులవారు తమ భారతములో శ్రీకృష్ణుని ధర్మనిర్ణయము చర్చించుటకు మనకు అర్హత లేదని చెప్పియున్నారు.

> "The poet had not the heart to impute this act to Arjuna who was the embodiment of nobility. It was the Lord Krishna that incited Arjuna to kill Karna when he was vainly trying to raise his chariot out of the mud in which it had stuck. According to thc code of honour and laws of war prevailing then, it was wholly wrong. Who could bear the responsibility for breaches of Dharma exeept the Lord Himself."
>
> (C. R. Mahabharatha - 287 Page)

ధర్మరాజు కర్ణునిచే చావుదెబ్బలు తిని వచ్చియుండగా శ్రీకృష్ణార్జునులు ధర్మజుని శిబిరమునకు కుశల ప్రశ్నలు చేయుటకు వచ్చిరి. ఇంకను కర్ణుడు బ్రతికియున్నాడని విని ధర్మజుడు కోపించి అర్జునుని గాండీవము శ్రీకృష్ణునికిమ్మని పలికెను. అర్జునుడు తన గాండీవమును పరుల కిమ్మని చెప్పిన వ్యక్తియొక్క తల నఱికివేసెదనని భీకర ప్రతిజ్ఞ చేసెను. ఆ క్లిష్టపరిస్థితిని పరమకరుణామూర్తియైన శ్రీకృష్ణుడు నైపుణ్యముతో ధర్మబద్ధముగా పరిష్కరించెను. శ్రీకృష్ణుడు అర్జునుని

క్రోధము అనుచితమనియు ఒక్కొక్కసారి క్రోధము యుక్తాయుక్త వివేకజ్ఞానమును నశింపచేయునని ప్రియశిష్యుని మందలించి ధర్మార్థ మధురముగ నిట్లు హితోపదేశము చేసెను.

"విను, పెద్దయు వినికిలేనివాఁడు కౌశికుండను నొక్కవిప్రుం డొక్కవిశిష్ట గ్రామంబున కనతిదూరంబున సరిత్సంగమ పుణ్యక్షేత్రంబున వసియించి, సత్యం పలుకువాఁడనని వ్రతంబు పట్టి, సత్యవాదియనం బ్రసిద్ధుండయి తపంబు సేయుచుండ; నొక్కనాఁడు, ముచ్చులంగని వెఱచఱచి పఱతెంచిన జనులు గొందఱయ్యాశ్రమంబు చేరువం బొదల దూఱిరంత పెనుతగిలివచ్చు ముచ్చు లత్తపోధనునికడ కేతెంచి— యిప్పుడిట వచ్చినవార లెటువోయి- రని యడిగిన, నతండు సత్యవిభాగ విధిజ్ఞుండు గామింజేసి, తన కసత్యంబు వాటిల్లు ననుశంక-నీ గుల్మలతా గహనంబు సొచ్చి-రని చూపి చెప్పిన, నత్తెక్కలికాఁ డు వారలం జంపి ధవమ్ము గొనిరమ్మని తద్వచనదోషంబున నరకప్రాప్తుం డయ్యెనను నితిహాసంబు వింటిము. హింసాకరంబగు సత్యంబు ధర్మంబుగాదు; తొలుత వినినదానినిపట్టి మూఢుండు పెద్దలనడిగి తెలిసికొనక వర్తించి దుర్గతిం బొందు. నింత పట్టు విచారించి యజాతశత్రుండు వధ్యుండవ్వుం, గాడని నిశ్చయింపుము." (కర్ణ - తృతీయ - 78)

సత్యము అహింస అనునవి రెండును అత్యుత్తమ ధర్మములే. కాని వీనికి ఇచట సంఘర్షణ కలిగినది. సత్యము పరిపాలించినచో అన్నను మహాత్ముని ధర్మపరుని చంపవలెను. అది ధర్మమా? కావున అసత్యము చేతనైనను అహింసను కాపాడుట ఇచట ఆపద్ధర్మమని సిద్ధాంతము. ప్రాణహాని వచ్చు పట్టున సర్వధనాపహారవేళయందు నడపు అసత్యమైనను సత్యఫలమునే ఇచ్చును.

యుద్ధసందర్భమున జరిగిన అధర్మకృత్యములన్నింటికి సమాధానము ఈ విధముగనే చెప్పుకొని సమర్థించవలెను. శ్రీకృష్ణుడు ధర్మ

స్వరూపుడు. ధర్మపరిశోధకుడు. లోకమునకు ధర్మాధర్మ నిర్ణయము చేయ సర్వవిధముల సమర్థుడు. ఆ మహాపురుషుడు ధర్మసంరక్షణము చేయుటకొరకు దుష్టశిక్షణముచేసి పాండవులను ఆపత్సముద్రమునుండి యుద్ధరించుటకు అటనట కొన్ని అధర్మములు చేసినను ధర్మములే యని సిద్ధాంతము. జగత్కల్యాణమే వారి ధ్యేయము. అవతారపురుషుల ప్రతికార్యమునకు ప్రధాన పరమార్థము ధర్మ సంరక్షణము. శిష్టసంరక్షణము. దుష్టనాశము.



# 8. ఆముష్మిక ధర్మోపదేశము

## 1. వ్యాధగీత

భగవద్గీత శ్రీకృష్ణపరమాత్మ నిష్కామకర్మయోగి యగు ధర్మవీరుడైన అర్జునునకు ఉపదేశింపగ, ధర్మవ్యాధోపాఖ్యానములో ఒక కిరాతకుడు బ్రాహ్మణునకు ఆధ్యాత్మిక సముద్రమును మథించి పరబ్రహ్మప్రాప్తి పొందు ఉపాయమును ధర్మార్థమధురముగ ఉపదేశించుట విచిత్ర విరోధాభాసము. ధర్మవ్యాధోపాఖ్యాన ముఖమున ఉత్తమపుత్ర లక్షణమును, నిజభర్తృశుశ్రూషయందు నిత్యాసక్తమయిన పతివ్రతకు అఖిల యజ్ఞ దాన తపః ఫలంబులు సులభంబులగునని తెలుపబడినది. క్రోధము ఏవిధముగ నరకద్వార మగునో "త్రివిధం నరక స్యేదం ద్వారం నాశన మాత్మనః" భగవద్గీతలో నిరూపితము. పాపములకెల్ల నెక్కుడు పాతకములు సువ్వె క్రోధలోభంబులు సువ్రతాత్మ వాని రెంటిని జయించిననాడు గాని యెందు బరమ ధార్మికుడని యెన్నబడడు. వృత్తి యేదైనను వృత్తము లేనివాడు ఎంత తపస్సంపన్నుడయినను నింద్యుడే. ధర్మవ్యాధుడు, కౌశికుడను బ్రాహ్మణునకు పరబ్రహ్మప్రాప్తి సాధనమైన ఉపనిషత్ప్రతిపాదితమైన ధర్మప్రబోధ మొనర్చెను. ధర్మంబు బహుమార్గ దృష్టంబయి సూక్ష్మంబయి యుండు. వేదాధ్యయనము చేసినను, శాస్త్రములు తలక్రిందుగ వల్లించినను ధర్మసూక్ష్మము నరయుట కడు గహనము. జితేంద్రియుడు, సత్యవాదియు, మాతా పితృభక్తుడు, స్వధర్మనిర్వాహణదక్షుడు అయిన కిరాతకుడును ధర్మప్రబోధ సమర్థుడు. వేదము చదివియు, స్వధర్మమును విడిచి ప్రత్యక్షదైవములగు మాతాపితరులను గాలికి విడిచిపెట్టినవాడు, కోపమునకు బానిసమైనవాడు బ్రాహ్మణుడయ్యును నింద్యుడే అని ధ్వని.

భగవద్గీతలో స్వధర్మానుష్ఠానము సర్వోత్తమమని సూచితము.
"తన కులధర్మము విడువక
మనుట పరమ ధర్మమండ్రు మాన్యులు"
(అరణ్య - దశ - 47)

వైరాగ్యమునకు మొదటిమెట్టు సకలవిషయ త్యాగము. పరిత్యాగశీలునకు అసాధ్యమైన కార్యము ఏమియు లేదు. అయినచో ఎవరు ధార్మికులు ? సత్యహితాలాప చతురులు, సంతత సుజన పూజకులు, కామ, సంరంభ విద్వేషము లేనివారు ధర్మ పథానువర్తులు, ప్రియాప్రియములందు దైన్యహర్షములందు సమచిత్తము కలిగినవారు ఉత్తమపురుషులని పరిగణింపవలయును. మానవుడు పాపము చేసినను పశ్చాత్తాపము పొందినచో ఆ పాపములో సగమును, ఆ పాపమింక ఎన్నడును చేయకపోవుటచే మిగిలిన సగమును తొలగించుకొనవచ్చును.

ధర్మలక్షణ నిర్వచనము :-

శిష్ట చరితంబులుగాని మార్గంబులు గడ్డిచే కప్పబడిన నూతులవలె అధర్మముతో కూడియుండును. వానిని దూరముగ నుండగనే పరిత్యజించి శిష్టాచారంబుల ననుసరించుట ధర్మలక్షణము. దానము, సత్యము, తపము, యజ్ఞము, ఆర్జవము, కామలోభాది వర్జనము, గురుజన శుశ్రూష, అక్రోధము, అధ్యయన నిరతి, దంభదైన్యములను విడచుట, సంతత ధర్మాభిముఖ్యము, శీలసంరక్షణము, తీర్థసేవ, శౌచము, భూతదయ కలవారు శిష్టులని తాత్పర్యము. ధర్మములు మూడు విధములు. 1. వేదవిహితములు, 2. శాస్త్రవిహితములు, 3. దుష్ట చరితములు. ఇవి అన్నియు సద్గతికి కారణములు.

అహింసా స్వరూపము :

సర్వధర్మములలో మేటి అహింస. ఇది హింస, ఇది అహింస అని నిర్ణయించి చెప్పుట కడుంగడు కష్టము. జీవులు చేసిన కర్మాను

గుణముగ నశించుచున్నవి. బ్రహ్మ పశు, మృగ, పక్ష్యాదులకు ఆహార ముగ మాంసమును, మానవులకు ఫలములను, ఓషధులను సృజించెను. మునీశ్వరులు పితృదైవత కార్యములందు మాంసమిడుట ధర్మమని ఉద్ఘోషించుచున్నారు. అది హింసయని చెప్పగలమా ? ప్రతి జీవియు, ఏదో విధముగ జీవహింస చేయుచునే యున్నది. హింస జరుగునని భావించినచో ఒక అడుగుకూడ మానవుడు వేయలేడు. హాలికుడు భూమిని నాగలితో దున్నుచున్నప్పుడు ఆ నాగేటి కొట్టునకు తగిలి అనేక ప్రాణులు చనిపోవుచున్నవి. అది హింస కాదా ? మానవుడు నేలపై చరించుటలో పదములక్రిందపడి పెక్కు క్రిములు మరణించు చున్నవి, అది హింస కాదా ? ఇట్లు ఆశ్చర్యకరమైన ప్రశ్నలనువేసి సమాధానము చెప్పించుట భారతకారుని అభిమతము.

(మూ- అరణ్య - పం - 58 - 60)

సత్యస్వరూపము :

లోకములో చూచినది చూచినట్లు చెప్పుట సత్యమని వ్యవ హారములో నున్నది. సత్యస్వరూపమును భారతము జగద్ధితమని వ్యాఖ్యానించినది.

"భూతహితంబుగా బలుకు బొంకును సత్యఫలంబు నిచ్చుఁ ద
ద్భూతభయాస్పదం బగు ప్రభూతపు సత్యము బొంకునట్ల, ప్రా
ణాతురు డైనచో బరిణయంబున యందును, బల్కు బొంకు స
త్యాతిశయంబ యండ్రు, మహితాత్మక యిట్టివి
ధర్మసూక్ష్మముల్."

(అరణ్య - పంచమ - 62)

కర్మమహత్త్వము :

పామరులు పూర్వకర్మఫలములు తమ కనుగుణముగ ఫలప్రద ములు కాకపోయినచో యథార్థ్యము తెలియక దైవమును దూఱుదురు.

జీవులు కర్మాధీనులు. కర్త తాను కాడు. తానుచేసిన కర్మలకు తానే కర్తయైనచో కార్యఫలములు చెడక ఫలించునట్లు ఏల చేసికొను సమర్థుడగుటలేదు ? సాధారణముగ మేధావుల తలలు బ్రద్దలుకొట్టుకొను చిక్కుప్రశ్నలకు సమాధానము చతురముగ భారతకారుడు విశదీకరించెను. నీతిమంతులు, ధర్మనిరతులు, దక్షులగువారు చేయు కార్యములు సిద్ధిపొందవు. దుష్టచిత్తులు, క్రూరులు చేయు కార్యములు విశేషసిద్ధిపొందుట చూచుచున్నాము. దానికి కారణ మేమనగా కర్మఫలము ఆత్మ తంత్రింబు కాదు. పురుషుడు కర్మాధీనుడు కాకపోయినచో ఆపదలు, రోగములు, మరణములు బొరయకుండ బ్రతుక కలడా ? కర్మవశత దేహము కలుగును. దేహ వర్తనంబు కర్మవశత పుట్టును. దేహ పాతమైనచో దేహస్థుడగు జీవుడు కర్మవిహితమైన స్థానము పొందును.

జీవలక్షణము :

జీవుడు సనాతనుడు, అనఘుడు. శరీర నాశము పొందినను జీవునకు నాశము లేదు. భగవద్గీతలో ఆత్మ నిత్యమనియు, నిర్గుణమనియు, నిరంజనమనియు, అవ్యయమనియు తెలుపబడినది. జీవుడు కర్మవశుడై దేహము పొందును. ఆ జీవుడు చేయు పుణ్య పాపములచే జనన మరణ పరంపర పొందును. స్థిరమైన పుణ్యకర్మమున దేవత్వమును, పుణ్య పాప సంకరమున మానుషత్వమును, కల్మషముచే పశుకీటక భావమును పొందుచున్నాడు. బుధుడు పాపము పొంతబోక ధర్మాచరణముచే చిత్తశుద్ధిని పొంది జితేంద్రియుడై తపో దమ శీలతతో పరిణతిపొంది పరమార్థపదము పొందును.

ఇంద్రియ జయము :

విషయ జ్ఞానమునకు మనస్సు మూలము. మనస్సు బంధమును మోక్షమును కలిగించుచున్నది. "మమ" అనునది బంధకారణము. "నమమ" మోక్షకారణము. ఈ మనస్సు అత్యంత చంచలమైనది. అందుచేతనే వేదాంతులు మనస్సును కోతితో పోల్చిరి. కామక్రోధ నిరూఢమగు మనస్సు పురుషుని నిరంతరము ఇంద్రియార్థములందు ప్రవర్తించునట్లు ప్రేరేపించును. పురుషుడు ఇంద్రియములకు బానిస యైనచో రాగముచే కరగును. రాగంబువలన లోభము తిరమగును. లోభి అయినవానికి దయ ఉండదు. మదమభివృద్ధిపొంది పాపాచరణా సక్తుడగును. తగువారు చెప్పినను వినక కుజనసాంగత్యములో కొఱలును. క్రమక్రమముగ పుణ్యహీనుడై పరమునందు దుఃఖ సముద్రములో మునిగిపోవుట తథ్యము.

పిమ్మట సత్త్వ, రజస్తమోగుణముల స్వభావమును సాకల్యముగ వివరించెను. పరబ్రహ్మ సాక్షాత్కారము పొందుమార్గ ముప దేశించెను. ఆకాశము, వాయువు, అగ్ని, నీరు, భూమి అను పంచ భూతములకు శబ్ద, స్పర్శ, రూప, రస గంధములు గుణములు గలవు. శ్రోత్రంబును, త్వక్కును, చక్షువును, జిహ్వయును, ఘ్రాణంబును, కర్మేంద్రియమును, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు కలిగిఉండును. షష్ఠంబైనది మనస్సు. సప్తమ, అష్టమంబు, బుద్ధియు, అహంకారము. సత్త్వము, రజస్సు, తమస్సు, వీని గుణములు. ఈ చెప్పబడిన ప్రపంచం బంతయు అవ్యక్తంబను తత్త్వంబు. ధీరుడు శబ్దాది విషయములందు ప్రసరించు ఇంద్రియములను గుదియించి తనయందున్న పరతత్త్వము గాంచి నిర్మల తపశ్చర్యముగ్నుడగును. ఇంద్రియ నిరోధము, స్వర్గ ప్రదము. ఇంద్రియ ప్రసరణము నరకప్రదము. తపస్సు అనగా సకల విషయవ్యపేతమైన బుద్ధి వైభవము. పరమధీరుడు శరీరమును రథ మును ఎట్లు స్వాధీనము చేసికొనవలెనో చతురముగ తెలిపెను.

## 2. భగవద్గీత

ప్రస్థాన త్రయమునందు శ్రీమద్భగవద్గీత సుప్రసిద్ధి పొందినది. ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత ప్రస్థాన త్రయము. వేదాంతప్రవర్తకు లందరు ఈ ప్రస్థాన త్రయమును ప్రమాణ గ్రంథములుగ స్వీకరించి యున్నారు. భగవద్గీత భారతీయులకు వైదికమతమునకు సంబంధించినగ్రంథము మాత్రమే కాదు; అది జాతీయ గ్రంథము. విశ్వమత గ్రంథము. విశ్వమేధావళి నివాళిపొందిన గ్రంథరాజము. భారతీయులకు పారాయణగ్రంథము. భగవద్గీత మహాభారత హృదయము. భగవద్గీత లక్షణగ్రంథముగా భావించినచో, భారతము లక్ష్య గ్రంథముగా స్వీకరింపనగును. భారతకథలో గీతాపరమార్థమంతయు మణిమాలలో సూత్రమువలె అంతర్వాహినియై ప్రవహించుచున్నది. మానవజీవితమునకు ప్రధానసమస్య దుఃఖనివారణము. నిత్యసుఖప్రాప్తి. పరమేశ్వరుని సృష్టిలో జీవకోటియందు మానవుడు విశిష్టుడు. మేధాసంపన్నుడైన మానవుడు పరమేశ్వరు డొసంగిన విశిష్ట జ్ఞానము నుపయోగించుకొని మానవజీవితములో సాధింపవలసిన పరమార్థమును పొందవలెను. ఏవిషయము సమగ్రముగ తెలియవలెనన్నను పరమార్థము తెలిసికొనుట ముఖ్యము. అట్టి పరమార్థమును బోధించు విద్యయే బ్రహ్మవిద్య. బ్రహ్మవిద్య జ్ఞానదీపము. బ్రహ్మవిద్యయను దీప తేజస్సులో సర్వవిషయములు స్వస్వరూపములో సాక్షాత్కరించును. ఏ విజ్ఞానముచే సర్వవిద్యలు కరతలామలకమగునో అదియే బ్రహ్మవిద్య.

"సర్వవిద్యా ప్రతిష్ఠా బ్రహ్మ విద్యా". సర్వజగదాధారమైన భగవతత్త్వము నెఱుంగనిదే జగద్విషయము లేమియు సంగతము కావు. ఉపనిషత్తులన్నియు జీవబ్రహ్మైక్యమును బోధించుచున్నవి. భగవద్గీత సర్వోపనిషత్సారము.

ఉపనిషత్తులలో జీవబ్రహ్మైక్యమును బోధించు మహావాక్యములు కలవు. 1. తత్త్వమసి, 2. అహం బ్రహ్మాస్మి, 3. అయమాత్మా బ్రహ్మ, 4. ప్రజ్ఞానం బ్రహ్మ. అందు 'తత్త్వమసి' అను మహావాక్యము తత్, త్వం, అసి అను మూడు పదములతో కూడినది. తత్ అను పదము పరమాత్మను బోధించును. త్వం అను పదము జీవాత్మను బోధించును. అసి అను పదము జీవ బ్రహ్మైక్యములను బోధించును. ఆ సూత్రము నాధారముగా నొనర్చియే భగవద్గీత పదునెనిమిది అధ్యాయములు నిర్మించబడినవి. భగవద్గీత మూడు షట్కములుగా విభజింపదగియున్నది. షట్కమనగా ఆరధ్యాయములు. మొదటి షట్కములో జీవస్వరూపమును, రెండవ షట్కములో పరమాత్మ స్వరూపమును, మూడవ షట్కములో జీవబ్రహ్మ అభేదమును బోధించుచున్నది. ఈ కారణములచే భగవద్గీత 'తత్త్వమసి' అను మహావాక్యమును సమన్వయించినదని చెప్పనగును. ఈవిధముగా శ్రుత్యర్థమునే బోధించుటచే 'భగవద్గీతా సూపనిషత్సు' అని ప్రతి అధ్యాయాంతమున పేర్కొనబడినది.

భగవద్గీత సర్వశాస్త్ర సమ్మతమై యున్నది. వేదములలో అటనట బ్రహ్మాత్మైక్య జ్ఞానమునకు కారణమగు భక్తియోగమును, ఆ భక్తియోగమునకు కారణమైన కర్మయోగమును వర్ణింపబడినది. ఆ వాక్యములను అనుసరించియే పతంజలి మహర్షి భక్తియోగము ప్రధానముగాగల యోగసూత్రములను, జైమిని మహర్షి వేదవాక్యముల నాధారముగా కర్మయోగ ప్రధానముగాగల మీమాంసా శాస్త్రమును రచించి భక్తికర్మలకు ప్రాధాన్యమును వివరించిరి. శ్రీ వేదవ్యాస మహర్షి ఉపనిషత్ప్రతిపాదితమైన జీవబ్రహ్మైక్యమును తెలుపుటకు బ్రహ్మసూత్రములను రచించెను. మహాభారతమున పాండవ కౌరవులు

యుద్ధోన్ముఖులైన సందర్భమున శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు భగవద్గీత ఉపదేశించెను. సర్వశాస్త్ర సారభూతమగు భగవద్గీతయందు జ్ఞానోదయమునకు మొదటి సోపానమగు కర్మయోగమును, రెండవ సోపానమగు భక్తియోగమును, పరమపురుషార్థమగు మోక్షమునకు ప్రధాన ప్రయోజనమగు జ్ఞానయోగమును వర్ణించుటచేత భగవద్గీత, శ్రుతి, పూర్వమీమాంస, ఉత్తరమీమాంస, యోగశాస్త్రసారమని ప్రసిద్ధి బడసినది.

సంసార దావానల దంద హ్యామానులగు మానవాళికి అభయ హస్తమిచ్చి తన చల్లని ఒడిలో చేర్చుకొను దివ్యమాత గీతామాత. పురుషోత్తముని నమ్మి దుఃఖసాగరమును దాటుము. సర్వకార్యములు ఈశ్వరార్పణబుద్ధితో చేసిన అవ్యయానందము, అమృతత్త్వము పొంద గలవు. ఈ వేదాంత రసాయన మందించిన గ్రంథము భగవద్గీత. ఈ గ్రంథము కర్మ, భక్తి, జ్ఞానములకు చక్కని సమన్వయము సాధించి, పరబ్రహ్మ ప్రాప్త్యుపాయమును పరమరమణీయముగ సర్వజన సులభముగ బోధించినది. ఐహికమునకు, పారలౌకికమునకు పూలవంతెన నిర్మించినది.

ప్రపంచము ధర్మక్షేత్రము. జీవితము మహాసమరము. నిరంతరము దైవరాక్షసములకు, పుణ్యపాపములకు సంఘర్షణము కలుగుచున్నది. భూమినుండి స్వర్గమునకు, దుఃఖమునుండి పరమాత్మానందమునకు చేర్చు త్రోవయే ధర్మానుష్ఠానము. ధర్మమార్గ మనగా ఇహలోకమునందు అభ్యుదయమును, పరలోకమునందు మోక్షమును సముపార్జించి పెట్టునదిమే. "ప్రాణినామభ్యుదయ నిశ్శ్రేయసహేతుర్యస్స ధర్మః" అని నిర్వచనము. మానవుడు వైయుక్తిక జీవితములోను, సాంఘిక జీవితములోను, ధర్మానుష్ఠానము చేసినచో, ఇహలోకమున

అభ్యుదయమును, పరలోకమున మోక్షమును సులభముగ పొందగలడు. పరబ్రహ్మము తెలిసికొనుటకు మానవులకు ప్రధానముగ జిజ్ఞాస అత్యావశ్యకము. జిజ్ఞాసువునకు జగత్తుయొక్క అశాశ్వతత్వము తెలియదు. అజ్ఞానము తొలగినంతనే పరబ్రహ్మనిత్యత్వము తెలియును.

పాండవులు, కౌరవులు, ధర్మక్షేత్రమైన కురుక్షేత్రములో సమర సన్నద్ధులైరి. అర్జునుడు తన ఎదుటనున్న తాతలను, తండ్రులను, గురువులను వధించి నెత్తుటికూడు తినలేననియు, బంధువులను చంపిన వచ్చు త్రిలోకాధిపత్యము తనకెంతమాత్రము అక్కరలేదని విషాద మగ్న మానసుడై గాండీవము క్రిందపడవైచెను. రథముపై చతికిల పడెను. అనాదికాలమునుండియు మానవజాతి ఇట్టి విషాదమును పొందుచునే యున్నది. దీనికి ప్రతీకయే అర్జున విషాదము. ఉన్నతాదర్శము చేరుటకు మానవుడు చేయు ప్రయత్న సమయమున భోగములచే ఆకర్షింపబడి పతితుడగుచున్నాడు. మానవుడు తన దైవత్వమును మఱచి, అశాశ్వతమైన ప్రాపంచిక విషయమగ్నుడై కలత చెందుచున్నాడు. తన సహజమైన పరబ్రహ్మ స్వభావమునుండి పరిచ్యుతుడైన మానవుడు తిరిగి యథాస్థితిని పొందవలసియున్నది. మానవుని అంతరంగమున జరుగు పోరాటమే అర్జునుని విషాదములో చిత్రింపబడినది. అర్జునుడు దైవీగుణసంపన్నుడు, స్వచ్ఛహృదయుడు, పుణ్యాపరతంత్రుడు, ఉత్తమసఖుడు, బంధువు, వినయసంపన్నుడు. శ్రీకృష్ణుని యందు అచంచలమైన భక్తివిశ్వాసములు కలవాడు. అందుచేతనే శ్రీకృష్ణుడు పరబ్రహ్మతత్త్వమును అర్జునున కుపదేశించెను.

మహాభారతములో భగవద్గీతకు సద్యః ప్రయోజనము సమరమునకు వైముఖ్యము చూపిన అర్జునుని యుద్ధమునందు సమధికోత్సాహముతో ప్రవర్తింపచేయుటయే. తిక్కనమహాకవి మూలభారతములో

భగవద్గీతను పదునెనిమిది అధ్యాయములను భీష్మపర్వములో అనువదింపలేదు. దానికి కారణము కలదు. శ్రీకృష్ణుడు భగవద్గీతను అంతయు అప్పుడు చెప్పినచో, తద్విషయము అర్జునుని మనసునజొచ్చి ఒంటబట్టదు. ఆ విషయము అర్జునుడు శ్రీకృష్ణునితో అశ్వమేధ పర్వములో చెప్పియున్నాడు.

ఆనికి దొడంగునప్పుడు మహాత్మ గలంగిన గొన్ని తత్త్వబో
ధనమహనీయవాక్యము లుదాత్తకృపం దగ నీవు సెప్పితే
మనమున వానియర్థములు మాధవ నిల్పగ జాలనైతి న
వ్వినుతవచస్సుధారసము వీనుల నింకొక మాఱు నింపవే.

(అశ్వమేధ - ప్రథమ - 153)

ఆ సమయమున అర్జునుడు స్వధర్మమునందు ప్రవర్తించి యుద్ధమునకు పూనుకొనుట అవశ్య కర్తవ్యము. అందుచే, భగవద్గీతను సంపూర్ణముగ చెప్పినను అర్జునునియందు సంపూర్ణఫలము ఒసంగదు. ఆ కారణము తిక్కన చక్కగా సమన్వయించినాడు. ఆంధ్రమహాభారతములో భగవద్గీతను నిర్వహించిన తీరు పరమాద్భుతముగ నున్నది.

భగవద్గీతలోని "ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః" అను మొట్టమొదటి శ్లోకమును తిక్కనార్యుడు చక్కగా అనువదించెను.

"మానుగ ధర్మక్షేత్రం
బైన కురుక్షేత్రమున మహాహవమునకుం
బూని మనబలము పాండవ
సేనయు నిటు వచ్చి యేమి సేసెం జెపుమా."

(భీష్మ - ప్రథమ - 171)

పాండవకౌరవులు రణరంగమున కేగుదెంచిరి. అర్జునుడు పాండవ సైన్యమును కౌరవ సేనావాహినిని తేరిపారచూచినాడు. అప్పుడు అత

నికి దుఃఖము ముంచుకొని వచ్చినది. బంధువులను, గురువులను, అన్న లను చంపి రాజ్యము పొందతగనని కూలపడినాడు. అర్జునుని విషాద మంతయు తెలుగు భారతమున వర్ణింపబడినది. అట్టి క్లిష్టసమయములో శ్రీకృష్ణుడు అర్జునునికి అజ్ఞాన నివారణోపాయము చెప్పెను.

"కుత స్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున"
(భగవద్గీత - ద్వితీయ 2)

ఇట్టి విషమ పరిస్థితిలో విషాదము ఆర్యుల చిత్తవృత్తికి భిన్న మైనది, స్వర్గమునకు వ్యతిరేకమైనది, అకీర్తికరమైనది. ఆ శ్లోకము సులభమైన తేనెలొలుకు తెలుగుమాటలలో తిక్కన అనుసంధించెను.

"దెప్పరపుజోట నీ కీ
యొప్పనివిధ మెచటనుండి యొదవెను విను మీ
చొప్పవివేకులయది యివి
దప్పించును సద్గతియు నుదాత్తయశంబున్"
(భీష్మ - ప్రథమ - 190)

"అశోచ్యానన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే
గతా సూనగతాసూంశ్చ నానుశోచన్తి పణ్డితాః"
(భగవద్గీత - ద్వితీయ - 11)

విచారింపనవసరము లేనివారికొఱకు నీవు విచారించుచున్నావు. కాని నీవు పండితునివలె పలుకుచున్నావు. మరణించినవారి కొరకుగాని, బ్రతికియున్నవారికొరకుగాని పండితులు విచారింపరు శ్రీకృష్ణుని ఉప దేశమునకు కొలికి పూసయైన శ్లోకమును తిక్కన్నగారు చక్కని చంపకమాలలో గుబాళింప చేసియున్నారు.

"వగవగ నేమియుం దగనివారికి నై హృదయంబు గుందగా
వగచెదు బుద్ధిమంతులను వారిరి నాడెదు నీవు పండితుల్
వగతురె యున్నవారికి నవశ్యవిధేయత జన్నవారికిం
దెగు వ్యథలెల్ల చిత్తమున ప్రదీప్త వివేకము యుక్తవై యుండినన్."

(భీష్మ - ప్రథమా - 195)

అర్జునునకు అప్పుడు కలిగిన విషాదము కలుగరానిది. ఆ సమయములో విషాదములో మునుగుట దుష్కరము. అనగా అపత్కారము, విషమము. సమయమునకుతగ్గినట్లు అర్జునుడు ప్రవర్తింపకపోవుట అవివేకము. ఈ చాపల్య అవివేకమలది. ఆ అవివేకము పోగొట్టి వివేకము కలిగించుటయే శ్రీకృష్ణుని ప్రధాన కర్తవ్యము. ఇదియే భగవద్గీతకు పునాది. శ్రీకృష్ణు డుపదేశించినటు అర్జునుడు విని కొంతవరకు సమరోన్ముఖు డయ్యెను. అర్జునుని మనసులో నిండిన అవివేకము పోగొట్టుటకు శ్రీకృష్ణుడు విశ్వరూపమును ప్రదర్శించెను. విశ్వరూప సందర్శన యోగములోని శ్లోకములను తిక్కనార్యుడు అధికభాగము అనువదించెను.

"పశ్య మే పార్థ! రూపాణి శతశోఽథ సహస్రశః
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ॥

(భగవద్గీత - ఏకాదశ - 5)

అర్జునా ! దివ్యములు, నానావర్ణములు, ఆకృతులు కలవియు, నానావిధములైనవియు నగు వందలకొలది, వేలకొలదికల నా రూపములను చూడుము. ఈ శ్లోకమునుకూడ అనువదించెను.

"నానాస్ఫుటవర్ణంబులు
నానా భంగులును గలుగు నా రూపములో

నానాశ్చర్యవిధంబులు
గానగ నగు జూపెదం బరికాశస్ఫూర్తిన్"
(భీష్మ - ప్రథమ - 208)

ఆ దివ్యరూపము చర్మచక్షువులతో చూడజాలవు కాన దివ్య చక్షువులతో ఆ రూపమును చూడుమని చెప్పెను. ఈవిధముగ తిక్కనార్యుడు ఇరువదిమూడు శ్లోకములను విశ్వరూప సందర్శన యోగము నుండి తీసికొని కావ్యానుగుణముగ ననుసంధించెను.

## కర్మయోగము

కర్మ జీవలక్షణము. కర్మను విడిచినచో జీవయాత్ర సాగదు. మానవుని కర్మకు మూలకారణము రాగద్వేషాదులు. మానవుడు వ్యక్తిగతముగ తాను జీవించుటకు, సమాజమునకు సేవచేయుటకు కర్మ చేయకుండ ఉండలేడు. కర్మ ఫలాపేక్షతో కూడియుండును. మూర్ఖుడు కూడ ప్రయోజనములేకుండా ఏ పనిచేయడు కదా! ఫలాపేక్షవలన మానవునిలో స్వార్థము పెరుగును. ఇది క్రమముగ అష్టైశ్వర్య సంపాదనమునకు, భోగానుభవమునకు దారితీయును. తత్ఫలితముగ మానవుడు భార్య, పుత్రులు, బంధువులు, ధనములకు సంబంధించిన ప్రాపంచిక విషయ పంకములో మునుగును. ఇంకను పొందవలెనను ఆశతో నుండునేగాని తృప్తినొందజాలడు. ఐహిక వస్తుజాతము ఎంత సంపాదించినను ఆత్యంతిక ఫలము దుఃఖమే.

భారతములో ధర్మరాజు, అర్జునుడు, కర్మాచరణము స్వధర్మముగా ననుష్ఠించిరి. వారికి ఫలాపేక్షదృష్టి లేదు. దుర్యోధనుడు తన కున్న ధనముతో తృప్తిపడక ధర్మజుని ఐశ్వర్యమంతయు అపహరించి లోభదూషితుడై మరణపర్యంతము దుష్కార్మాచరణముచేసి సోదరులతో, భార్యా పుత్రులతో నామరూపములు లేకుండ నాశన

మయ్యెను. ధర్మరాజు కర్మాచరణమునకు దుర్యోధనుని కర్మాచరణము నకు ఇంత భేదమున్నది. భగవద్గీత కర్మాచరణము చేయు విధమును చక్కగా సమన్వయించినది. అది కర్మత్యాగము బోధింపలేదు. ఆద్యంతములందు కర్మావశ్యకమునే గీతాచార్యుడు ఉపదేశించియున్నాడు. మానవుడు మరణపర్యంతము సత్కర్మానుష్ఠానము చేయవలెనని నొక్కి చెప్పినది.

లోకములో జ్ఞానమువలననే మోక్షము కలుగునను అభిప్రాయము కలదు. అది సత్యదూరము. ఈశ్వరార్పణబుద్ధితో కర్మాచరణము చేసినచో, చిత్తశుద్ధి కలుగును. చిత్తశుద్ధికల హృదయమున జ్ఞానము ప్రతిఫలించును. జ్ఞానమువలన మోక్షము సిద్ధించును. మానవుడు కర్మ చేయకపోయినచో లోకయాత్ర నడవదు. ఒకవేళ శరీరము కదలకుండ బంధించినను, మనస్సుచేయువ్యాపారము మాన్పవచ్చునా? మన ఎదుట కోట్లకొలది ప్రజలు అన్నవస్త్రములు లేక మలమల మాడిపోవుచున్నచో మనము ముక్కుమూసికొని తపోవ్రతములో నుండవచ్చునా ? మనము ప్రపంచములో నుండియే దాని నుద్ధరింపవలెను. జన్మముతో నారంభమయిన కర్మ ఉచ్ఛ్వాస నిశ్వాసాత్మకము. యావజ్జీవితము సాగవలసినదే కదా.

కర్మయొక్క ఆంతర్యమును గ్రహించుట అత్యంత క్లిష్టము.
"గహనా కర్మణోగతిః"

శంకర భగవత్పాదులు సనత్సుజాతీయ భాష్యములో కర్మ జ్ఞానములకున్న అవినాభావసంబంధము హేతుపూర్వకముగా వివరించి యున్నారు.

"జ్ఞానేనైవ మోక్షః సిద్ధ్యతి కింతుతదేవ జ్ఞానమ్
సత్త్వశుద్ధిమ్ వినా నోత్పద్యతే....తస్మాత్ సత్త్వ

తదర్థమ్ సర్వేశ్వర ముద్దిశ్య సర్వాణి వాఙ్మనః కాయ
లక్షణాని శ్రౌతస్మార్తాని కర్మాణి సమాచరేత్."

(సనత్సుజాతీయ భాష్యము)

మానవుడు తనకు విధించిన వర్ణాశ్రమ విధులననుసరించి స్వధర్మాచరణము చేయుట కర్తవ్యము. స్వధర్మమును మించిన ధర్మము లేదు. కర్మ జ్ఞానుల కక్కరలేదనియు, అది కేవలము సామాన్య జనులకే నిర్దేశింపబడినదని తలచుట అవిచారమూలకము. జ్ఞానులు నిష్కామము లోకసంగ్రహముకొఱకు ధర్మానుష్ఠానము చేయుట కర్తవ్యమని వేదశాస్త్రములు ఉద్ఘోషించుచున్నవి. స్వధర్మానుష్ఠానముచేతనే జనకుడు, అశ్వపతి, బ్రహ్మవేత్తలైయుండియు, లోకసంగ్రహము నిమిత్తము కర్మచేసి మోక్షము పొందిరి. లోకములోని సామాన్యప్రజలు శ్రేష్ఠులు, మేధావులు, ఉత్తమపదవి నధిష్ఠించినవారు ఏమిచేయుదురో అద్దానినే ప్రమాణముగ స్వీకరించుట సహజము.

శ్రీకృష్ణభగవానుడు కర్మయోగమున కావశ్యకములైన చతుర్విధ లక్షణములను చతురముగా సూచించెను. 1. మానవుడు రాగద్వేషవశుడై, ఫలాసక్తితో, కర్మాచరణము చేసినయెడల సంసారమున బంధింపబడును. యజ్ఞార్థముకాని కర్మచే లోకము బంధింపబడును. ఏ దృష్టితో చేసిన కర్మ బంధహేతువు కాకుండునో అది మోక్షకారణమై చిత్తశుద్ధి నొసంగునో దానిని నొక్కి చెప్పియున్నాడు. స్వధర్మనియతమైన కర్మాచరణమువలన పాపము సంభవింపదు. దోషయుక్తమైనను స్వభావసిద్ధమగు కర్మను త్యజింపరాదు. 2. ఏ మానవుడు ఇంద్రియములను, మనస్సును, నిగ్రహించి, కర్మేంద్రియములను, కర్మయందు నియమించునో వాడు అసక్తుడనబడును. సంతతము అసక్తచిత్తవృత్తితో కర్మచేయునో, ఆపురుషుడు ముక్తిని పొందును. 3. కర్మఫలత్యాగము ముఖ్యమైయున్నది. స్వధర్మమును శాస్త్రాదేశమును పురస్క-

రించికొని చేయుటకే మానవునకు అధికారము కలదు. ఫలాపేక్ష చేయరాదు. కర్మఫలత్యాగము నిజమైన సన్యాసము. 4. ఈశ్వరార్పణ బుద్ధితో కర్మాచరణము చేయవలెను. వివేకచిత్తముతో సర్వకర్మలను సర్వేశ్వరునియందు భక్తిపూర్వకముగ సమర్పించి, కోరికలు లేనివాడై మమకారమును త్యజించి, మానవుడు విహితమైన కర్మను ఆచరించినచో, ఇహలోక సౌఖ్యము, పరలోకములో అవ్యయానందము పొందును. దీనినిబట్టి 1. స్వధర్మాచరణము, 2. అసక్తబుద్ధి, 3. కర్మ ఫలత్యాగము, 4. పరమేశ్వరార్పణబుద్ధితో చేసిన కర్మయోగమై బంధరహితమై చిత్తశుద్ధి నొసంగునని శంకరభగవత్పాదులు వ్యాఖ్యానించిరి. మానవస్వభావమును, క్రమబద్ధముగా చేసి, వ్యక్తి జీవితమును, లోకకళ్యాణ సంధాయకముగ మలచుచున్నది, భగవద్గీతయందలి కర్మయోగము.

ఏవంగుణ విశిష్టమైన భగవద్గీతపరమార్థమును తిక్కనార్యుడు ఆంధ్రభారతములో అనుసంధించెనా ? భగవద్గీత భారతీయసంస్కృతికి హృదయమువంటిది. అది లేకపోయినచో ఎన్ని ఉన్ననూ ప్రయోజనము లేదు. తిక్కనార్యుడు తెలుగుభారతములో భగవద్గీతను యథాతథముగా అనువదింపపోయినను, అందలి పరమార్థమును విడిచిపెట్టక కావ్యశిల్పానుగుణముగ శాంతి, ఆనుశాసనిక, అశ్వమేధపర్వములలో నిక్షేపించియుండుట ప్రశంసాపాత్రము.

శాస్త్రము, శాస్త్రమువలె చెప్పినచో, సామాన్యమానవునిలో చక్కగా హత్తుకొనదు. ఆ గీతామృతమును కథాముఖమున, సంవాదరూపమున సరస సుందరముగ తేనెలొలుకు తెలుగునుడికారపు సొంపులింపుకొనునట్లు, మనసులో హత్తుకొనునట్లు తిక్కనార్యుడు తెలుంగులకు పంచిపెట్టెను.

మానవుడు ప్రప్రథమముగా వర్ణాశ్రమ విహితమైన స్వధర్మమును గుర్తింపవలెను. స్వధర్మము విడిచి పరధర్మము నెంత నేర్పుతో చేసినను, పరమార్థము సిద్ధింపదు.

"శ్రేయాన్స్వధర్మోవిగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మోభయావహః"

(భగవద్గీత - తృతీయ - 35)

"స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్"

(భగవద్గీత - మోక్షసన్న్యాస - 47)

"సహజం కర్మ కౌంతేయ ! సదోషమపి నత్యజేత్
సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః"

(భగవద్గీత - మోక్షసన్న్యాస - 48)

ఈ శ్లోకభావములకు రమణీయమైన తెలుగుపద్యములు కలవు. శ్రీకృష్ణుడు సమరోన్ముఖుని చేయుచు అర్జునునితో,

"రణోత్సాహంబునకుం గారణంబైన స్వకర్మావలంబనంబు వదలం దగమి దెలియుటకు వలయు వాక్యంబులు పెక్కులుపన్యసించి"

"సమరంబు రాజులకు ను
త్తమకర్మం బది యపావృతస్వర్గద్వా
రము సుమ్ము లెమ్ము దగ గ
య్యము సేయుము దీని కేల యనుమానింపన్."

(భీష్మ - ప్రథమ - 200, 201)

స్వధర్మమును మించిన ధర్మము లేదు. చక్కగా ననుష్ఠింపబడినను పరధర్మము పరధర్మమే. సమ్మతము కాకపోయినను, స్వధర్మమే శ్రేష్ఠమైనది.

ధర్మరాజు మహాభారతసమరములో తన కారణముగ రక్తపు నదులు ప్రవహించినవని శోకమగ్నమానసుడై రాజపదవి నధిష్ఠించుటకు వైముఖ్యము ప్రకటించెను. అత్తరి పరమ కరుణావిధేయచిత్తుడైన పరాశరపుత్రుడు, ధర్మరాజు వెన్నుదట్టి ఉపదేశించుచున్నాడు.

"కర్మఫలం బీశ్వరుని యదియు తదర్పణబుద్ధి సహితంబుగా
ప్రబుద్ధులు వేదచోదిత కర్మంబులనుష్ఠింతురు"

(శాంతి- ప్రథమ- 278)

"ఒప్పు కున్నను నాత్మకులోక్త కర్మ, మూర్ధ్వగతి జేర్చు బర
కర్మ మొప్పనేని నార్యజనములు కిల్బిష మంద్రు దాని, గాన
నడపుము నిజవంశకర్మ మధిప" (శాంతి- ప్రథమ- 279)

భగవద్గీత సారమంతయు ఈ శ్లోకము లో కలదు.

"కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదా చన
మా కర్మఫలహేతు ర్భూ ర్మాతే సంగోఽస్త్వకర్మణి."

(భగవ- ద్వితీయ- 47)

ఏ దృష్టితో చేసిన కర్మ బంధహేతువు కాకుండునో చెప్పి యజ్ఞార్థము చేయబడిన కర్మ మోక్షజ్ఞానకారణమై చిత్తశుద్ధి నొసంగునో నొక్కి చెప్పియున్నాడు.

సర్వకర్మలను ఈశ్వరార్పణబుద్ధితో వివేక చిత్తముతో కోరికలు లేక చేయవలెను. మమకారమును త్యజించి, యుద్ధము చేసినయెడల ఇహలోక సౌఖ్యము, పరలోకములో మోక్షము పొందగలవు కర్మ హీనత ఎంతమాత్రము తగదు అని దృష్టాంతపూర్వకముగ తెక్కన చెప్పియున్నాడు. కేవల నిష్కర్మత మోక్షావహమగునేని అరణ్యములోనున్న పర్వతములు, వృక్షములు, ముక్తి పొందవలయునుగదా ?

తర్కసహముగ విషయమును ప్రతిపాదించుట రమ్యము. కర్మ, అకర్మల మీమాంస శాంతి పర్వములో అనేక ఘట్టములలో తిక్క-

నార్యుడు నిరూపించెను. (శాం. ప్ర. 68) మానవుడు కర్మలను పవిత్రముగా చేసినచో, సంసారము బాధింపదో, యజ్ఞార్థమును అనాసక్తుడై చేసిన కర్మ స్వధర్మము; చిత్తశుద్ధి కలిగించి మోక్షమునకు తోడ్పడునని వివరింపబడినది. కర్మజ్ఞానములకున్న సంబంధము అవిభాజ్యమను అనే విషయమును అనేక సందర్భములలో భారతము నొక్కి చెప్పియే యున్నది.

(శాం. దేవస్థానుడను ముని హితోపదేశము చేయుచు. 1. స్వధర్మాచరణము 2. అసక్తి బుద్ధి 3. కర్మ ఫలత్యాగము 4. పరమేశ్వరార్పణ బుద్ధితో చేయు పద్ధతి నే ధర్మజునకు చెప్పెను.
(శాం. మో. ప్ర. 144, 149)

భృగుమహాముని భరద్వాజునకు వర్ణాశ్రమధర్మమును చెప్పుచు అసక్త చిత్తవృత్తితో, పరబ్రహ్మార్పణ బుద్ధితో చేసిన కర్మము మోక్షప్రదమని చెప్పెను.

(... ఫలాకాంక్ష గాక) నియతిం,
జేలిపిన నిఖిలకర్మజాతంబును ...
ర్మల మోక్షపదము జేర్చుట,
కలుగు నవశ్యంబు బుణ్యకరణప్రవణా. (శాంతి-చతుర్థ-108)

ఈ విధముగా భగవద్గీతలో ప్రతిపాదింపబడిన నిష్కామకర్మ యోగసారమంతయు తిక్కనార్యుడు ఆంధ్రభారతములో మనోహరముగ అనుసంధించియున్నాడు. అర్జునుడు శ్రీకృష్ణపరమాత్మ చేసిన ప్రబోధమున మోహమును తొలగించుకొని సమరోన్ముఖుడయ్యెను. ధర్మరాజు శాంతిపర్వములో భీష్మతపస్వి చేసిన సర్వతోముఖమైన హితోపదేశమును విని, రాజ్యపాలనము చేసి, సశరీరముగ స్వర్గమునకు ఏగెను. అనేక కథలలో స్వధర్మాచరణ ప్రాముఖ్యము సహస్రముఖముల వ్యాస మహర్షి ఉద్ఘోషించెను.

## సాంఖ్యము

అనాదికాలమునుండియు, జిజ్ఞాసువైన మానవుడు అశాశ్వత మైన శరీరమును విడిచి, పునరావృత్తి రహితమైన మోక్షము పొందు టకు నిరంతరము సాధనము చేయుచునేయున్నాడు. పరమాత్మను తన యందున్నవానినిగా కొందరు జ్ఞానయోగముచేతను, మరికొందరు సాంఖ్యయోగముచేతను, మరికొందరు కర్మయోగముచేతను దర్శించు చున్నారు. అన్నియు పరమాత్మను సందర్శించుటకు సాధనములే.

"ధ్యానే నాత్మని పశ్యన్తి కేచి దాత్మాన మాత్మనా !
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే."

(భగవద్గీత- క్షేత్రక్షేత్రజ్ఞ- 25)

భారతములో జనమేజయ మహారాజు పరబ్రహ్మ ప్రాప్తికి సాంఖ్యము, యోగము, ఆగమములు ఏకోపాయములా? భిన్నమైనవా? అని ప్రశ్నించెను. వైశంపాయనుడు, వేదవ్యాసుని ధ్యానించి ఇట్లు చెప్పెను.

"వేదంబులకు బ్రవర్తకుండు నారాయణనందనుం డపాంతరత ముం డను పేరం బ్రసిద్ధుం డగు వేదవ్యాసుండు సాంఖ్యంబు నకుం గపిలుండును, యోగంబునకు హిరణ్యగర్భుండును, పాశుపతంబు నకు శివుండును, పాంచరాత్రంబునకు విష్ణుండును బ్రవర్తకులు పాంచ రాత్రంబు వైష్ణవం బనం బరగు." (శాంతి- షష్ఠ-517)

కఠ, మైత్రేయ మొదలైన ఉపనిషత్తులు జగత్తుయొక్క వైచిత్రి, నానాత్వము, భిన్నప్రవృత్తులు, గుణములు, ఒకే ధాతిక తత్త్వమునుండి వచ్చినవను భావము ప్రకటించినవి. ఆభావములన్నిటిని ఆధారముగా చేసికొని కపిలమహర్షి సాంఖ్యదర్శనమును వ్యవస్థీకరించెను. కపిలకృత సాంఖ్య ప్రవచన సూత్రము లను గ్రంథము నేడు ఉప

లభ్యమానమగుట లేదు. ఈ సంప్రదాయమును ఆసురి, పంచశిఖులను ప్రసిద్ధాచార్యులు ప్రచారములోనికి తెచ్చిరి. "సాంఖ్య పదమునకు అనేక వ్యుత్పత్తులు చెప్పుచున్నారు."

1. సాంఖ్యమనగా సమ్యక్ ఖ్యాతి, సరియగు జ్ఞానము. ప్రకృతి పురుషుల వివేకము. ఇందు సంఖ్యకు ప్రాధాన్యమున్నది. కాబట్టి ఇందు గుణముల ప్రకృతి పరిణామముల లెక్క (సంఖ్యానము) వేయబడినది కాబట్టి ఇది సాంఖ్యము. 2. పురాతన గ్రంథములలో సంఖ్యయనగా తత్త్వ విచారమని యర్థము. చెప్పబడినది. పురుషునియొక్కయు తత్త్వములయొక్కయు స్వరూపమును సమ్యక్పరిశీలనము చేసి వివరించినది. (ఆంధ్ర విజ్ఞాన సరస్వము-112)

ఈ సిద్ధాంతములో పంచ కర్మేంద్రియములు, పంచ జ్ఞానేంద్రియములకు మొదలైన అంకెలకు ప్రాధాన్యమిచ్చి తత్సంకేతమైన తత్త్వజ్ఞానము నిరూపించుటచే సాంఖ్యమని పేరువచ్చినది. భగవద్గీతలోని ద్వితీయ అధ్యాయమునకు సాంఖ్యయోగమని పేరుగలదు. శంకర భగవత్పాదులు సాంఖ్యమనగా శుద్ధాత్మతత్త్వ విజ్ఞానమనియు, అదియే వ్యాసమహర్షికి సమ్మతమనియు నిరూపించిరి.

"ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు
బుద్ధ్యా యుక్తో యయా పార్థ! కర్మబన్ధం ప్రహాస్యసి."
((సాంఖ్య-36)

ఈ శ్లోకమునకు వ్యాఖ్య వ్రాయుచు శంకరులు సాంఖ్య శబ్దమును ఇట్లు నిర్వచించిరి.

"ఏషా తే తుభ్య మభిహితోక్తా సాంఖ్యే పరమార్థవస్తు వివేక విషయే బుద్ధి
ర్జ్ఞానం సాక్షా చ్ఛోకమోహాదిసంసార హేతుదోషనివృత్తి కారణమ్"

(శ్రీభగవద్గీతాశాంకర భాష్యతత్త్వబోధిని-207)

సాంఖ్యదర్శనము ప్రకృతితత్త్వములను వివరించి తద్భిన్నమైన పురుషుని ప్రతిపాదించి ఆ వివేకజ్ఞానమే మోక్షసాధనమని నిరూపించినది. ప్రకృతి, ప్రధానము, అవ్యక్తము- ఇవి సాంఖ్యదర్శనమునందు పర్యాయపదములుగా ప్రయోగింపబడుచున్నవి. ప్రకృతితత్త్వములన్నియు పురుషునకేమియు సంబంధించినవి కావన్న నిశ్చయజ్ఞానమే మోక్షమునకు మూలము. ఈ విషయము భారతమున అనేక సందర్భములలో, పేర్కొనబడినది.

"ప్రధాన పదార్థము తెలుగుట పరిబోధ మూలము."

(అశ్వమేధ- ద్వితీయ- 163)

"ఇంద్రియ మనఃపవనంబుల భంగులు గనుంగొనుట యా తత్త్వంబులకు బరమంబయిన తత్త్వంబు."

(అశ్వమేధ- ద్వితీయ- 50)

లోకములో రెండు రకములైన సాంఖ్య సిద్ధాంతములు ప్రచారములో నున్నవి. 1. శుద్ధాత్మ తత్త్వవిజ్ఞానాత్మకమైన సాంఖ్యము. 2. వ్యక్తావ్యక్త జ్ఞానవిజ్ఞానాత్మకమైన సాంఖ్యము.

విశాలహృదయుడైన వ్యాసభగవానుడు శాంతి, ఆనుశాసనిక, అశ్వమేధపర్వములలో ధర్మతత్త్వోపదేశమును ఈ క్రింది మహాపురుషులచే చేయించెను.

1. కపిలుడు 2. పంచశిఖుడు 3. జైగీషవ్యుడు 4. అసితదేవలుడు 5. సనత్కుమారుడు 6. భృగువు 7. పరాశరుడు 8. నారదుడు 9. హారీతుడు, వివేకాక శ్రీకృష్ణుడు, పరమశివుడు, వ్యాసమహర్షి మొదలైనవారు యథోచితముగా తత్త్వోపదేశమును అభివర్ణించిరి. భగవద్గీతలో త్రయోదశాధ్యాయములో క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగమందు చెప్పబడిన సాంఖ్యతత్త్వము తెలుగు భారతములో పదిలపఱచబడియున్నది.

ఈ ప్రపంచమందు క్షేత్రమని చెప్పబడు శరీరములన్నిటిలో నివసించుచు క్షేత్రజ్ఞుడని చెప్పబడు జీవాత్మ నేనేయని, అనగా, నా యంశమే యని యెఱుంగుము. ఇట్లు క్షేత్రక్షేత్రజ్ఞులను గలిగియుండెడు సంబంధమెట్టిదని యెఱుంగుట యేదికలదో అదియే జ్ఞానము.

"ఏను మాత్ముడు క్షేత్రజ్ఞుం,
డన భూతాత్ముడన బురుషు డన బరమేశుం
డన బుద్ధిసాక్షి యన సం,
జననరహితు డనగ బరగు శాంతిప్రవణా."

(శాంతి- చతుర్థ- 122)

క్షేత్రజ్ఞుడే బరమాత్మయనియు, జీవాత్మయనియు, పురుషు డనియు, పరమేశుడనియు, బుద్ధియనియు, సాక్షి అనియు, జననరహితు డనియు చెప్పబడుచున్నాడు. క్షేత్రక్షేత్రజ్ఞ విభాగమునుగూర్చి వేద ములలో బ్రహ్మసూత్రములలో సాకల్యముగ వివరింపబడినది. క్షేత్ర మనగా నేమి ?

"మహాభూతా న్యహఙ్కారో బుద్ధి రవ్యక్త మేవ చ
ఇన్ద్రియాణి దశైకం చ పఞ్చ చేన్ద్రియగోచరాః"
"ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సంఘాత శ్చేతనాధృతిః
ఏత త్క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్."

(భగవద్గీత త్రయోదశ-5,6)

ఈ చతుర్వింశతి తత్త్వములను తెలుగు భారతము వివరించినది. పంచజ్ఞానేంద్రియములు పంచకర్మేంద్రియములు పంచమహాభూతములు శబ్దస్పర్శరూప రసగంధంబులనెడు నింద్రియవిషయంబులైదును, మనో బుద్ధి చిత్తాహంకరంబులనెడు నంతఃకరణములు నాలుగును కలిసి యిరు వది నాలుగు తత్త్వములనబడుచున్నవి. ఈ యిరువది నాలుగు తత్త్వ

ములతో కూడ అంతఃకరణ జన్యంబులగు నిచ్ఛాద్వేషంబులు, సుఖ దుఃఖంబులు, జ్ఞానధైర్యంబులు మొదలుగాగల వికారములుగూడి శరీరమగుచున్నది. ఇట్టి శరీరమే క్షేత్రమని చెప్పబడుచున్నది.

జ్ఞానముసుకోరువాడు అమానిత్వము, అదంభిత్వము, అహింస, శాంతి, ఆర్జవము, ఆచార్యోపాసనము, శౌచము, స్థైర్యము, ఆత్మనిగ్రహము అను గుణములను అలవరచుకొనవలెను. ఇంద్రియార్థములందు విరక్తి కలిగి అహంకార రాహిత్యముకలిగి శరీరసంబంధమైన జన్మ మృత్యుజరావ్యాధి దుఃఖములను దోషములుగా గుర్తింపవలెను. అదియే జ్ఞానమునకు సోపానము.

వ్యాసమహర్షి కర్మ, సాంఖ్యము, యోగము, జ్ఞానము, భక్తి పరమాత్మను సందర్శించుటకు సాధనములని నిరూపించెను. ఆ సమన్వయ ప్రతిభ విష్ణువుయొక్క అవతారమగు వ్యాసమహర్షికే చెల్లినది. సాంఖ్యములోని సూక్ష్మాతిసూక్ష్మ భేదములను సాకల్యముగ వివరించి, అద్వైతములో దానిని లీనమొనర్చెను. వేదాంతదర్శనము, అద్వైతమును ప్రతిపాదించుచున్నది. శంకరుడు విష్ణుసహస్రనామ భాష్యములోను, గీతాభాష్యములోను, సాంఖ్యమును పరమార్థ వస్తు వివేకమును తెలుపు జ్ఞానమని నిర్వచించియున్నాడు. ఇదియే వ్యాస మహర్షికి సమ్మతమైనది. పరబ్రహ్మ, శుద్ధాత్మ, పరమార్థవస్తువునకు పర్యాయ పదములు. అద్వితీయ పరబ్రహ్మమును జ్ఞానముచేత పొందుటయే ముక్తి. అదియే భగవద్గీత ప్రతిపాదించినది. ఆ అద్వైతమునే వ్యాసమహర్షి భారతములో ప్రపంచించెను.

వేదాంత దర్శనము, అద్వైతమును ప్రతిపాదించుచున్నది. సాంఖ్యము ద్వైతమును ప్రతిపాదించుచున్నది. ద్వైతము శ్రుతి సమ్మతము కాదు. వేదప్రామాణ్యమును, ఈశ్వరునియందు ఔదాసీన్య

మును వహించుట ప్రకృతివాద సాంఖ్యముయొక్క ప్రత్యేకత. ఇది వేద విరుద్ధము. ఈ కారణముచే వ్యాసమహర్షి సాంఖ్యములోని వేద విరుద్ధాంశములను తొలగించి, ప్రకృతి జగత్కారణమని చెప్పుటకు బదులు బ్రహ్మమే జగత్కారణమని చెప్పి సాంఖ్యముకూడ అద్వైతములో ఒక భాగమని సమన్వయించుట స్తుతింపదగియున్నది. బ్రహ్మసూత్రములలో సాంఖ్యము ఖండింపబడినది. బ్రహ్మసూత్రములందలి స్మృత్యధికరణమునకు వ్యాఖ్య వ్రాయుచు, శంకర భగవత్పాదులు శ్రుతియందును కపిల, సాంఖ్య శబ్దములు కనిపించుచున్నవని, వేద విరుద్ధ కాపిలము - సాంఖ్యము విశ్వసనీయము కాదని స్పష్టముగా నుడివిరి. ఈ అభిప్రాయము బలపరచుటకు భారతములో చాల ఆధారములు కలవు. శాంతిపర్వములో కపిల, గోసంవాద మున్నది. భారతములో పేర్కొనబడిన కపిలుడు, ప్రకృతివాద సాంఖ్యునివలెకాక వేద తాత్పర్యమునందు భక్తిప్రపత్తులు కలవానిగాను, వేదజ్ఞుడుగను గోచరించును.

"వేదములు డాంభికత్వ,
పాదనములు గాగ యతులు పలుకుదు రవి స
ర్వాదరణీయంబులు నీ,
కాదరపాత్రములు కావొ యని పలుకుటయున్."

(శాంతి - పంచమ - 301)

ఆ ప్రశ్నకు కపిలుడు ఇట్లు చెప్పెను.

"వేదములవలన నాకు స,
నాదరమును నాదరమ్ము నను రెండును లే
వేది కతంబుగ నడిగితొ,
నీదుతలం పెఱుగునట్టి నేరిమి కలదే."

(శాంతి - పంచమ - 303)

ఆదర, అనాదరములు గుణములకు సంబంధించినవి. ఆ గుణముల కతీతుడు కపిలుడు. అనగా నిర్గుణుడని అర్థము. దీనినిబట్టి కపిల మహర్షి నిర్గుణ పరబ్రహ్మానుసంధాయి యని తెలియుచున్నది. వేదముల వలన, బ్రహ్మము తెలియబడును. బ్రహ్మమును తెలిసికొన్న వారు బ్రహ్మమే యగుదురు. బ్రహ్మమునకు వేదములతో నిమిత్తము లేదు. మహాప్రళయకాలమందు వేదములు లేనివగుచున్నవి. బ్రహ్మ సత్యము కదా. ఈ ఆంతర్యమును గుర్తింపక కపిలుడు వేద ప్రామాణ్యమును తిరస్కరించుచున్నాడని చెప్పుట తగదు. స్యూమరశ్మి వాదమును పెంచి ఇట్లు ప్రశ్నించెను. వేదశాస్త్రసరణి విడచుట ఉన్మార్గ వర్తనము. దానివలన మోక్షము రాదు- అని నేను వినుచున్నాను. నా మదిలోని సందియము తొలగింపుమని ప్రార్థించెను.

"గపిలుం డమ్మహాద్విజునితో వేదంబుల నేల కైకొన కుండ వచ్చు నవియ చూవె లోకంబులకుం బ్రమాణంబులని పలికి యిట్లనియె."

"అరయంగా శబ్దంబును,
బరంబు నన రెండు సూవె బ్రహ్మములు గుణో
త్తర శబ్దబ్రహ్మభజన,
పరుడు పరబ్రహ్మమహితపదముం బొందున్."

(శాంతి - పంచమ - 331, 332)

శబ్దబ్రహ్మ మనగా వేదము. శబ్దబ్రహ్మమును ఉపాసించినచో పరబ్రహ్మము సులభముగా పొందవచ్చును.

"జ్ఞానము ధర్మమున కధి
ష్ఠానము మూలంబు పరమసంతోషము భ

వ్యానూనత్యాగము రూ
పానందము ప్రాకు దాని కను వేదంబుల్."
(శాంతి - పంచమ - 339)

పిమ్మట వేద తాత్పర్యమును వేయివిధముల ప్రస్తుతించి యున్నాడు. (చూ. శాంతి - పంచమ - 345)

ఆంధ్రమహాభారతములో శాంతి అనుశాసనిక, అశ్వమేధ పర్వములలో సాంఖ్యతత్త్వోపదేశము సర్వతోముఖముగ సాగినది. వ్యాస భగవానుడు సాంఖ్యమును అద్వైతమతమున కనుగుణముగ సమన్వయించుట పరమాద్భుతము.

సాంఖ్యమును ఎందరో మహానుభావులు చెప్పిరి. ప్రవక్తలను బట్టియు శ్రోతలనుబట్టియు ద్వైవిధ్యము సంతరించుకొన్నది. పరమార్థ మొక్కటియే. శాంతిపర్వములో భీష్ముడు సాంఖ్యస్వరూపమును ధర్మజునకు వివరించెను. అతడు జ్ఞానమును, వైరాగ్యమును, ఆత్మస్వరూపమును, ప్రకృతి స్వభావమును మోక్ష లక్షణములను సాకల్యముగ వివరించెను. ఆయువు ఉన్నంతవరకు శరీరము గౌరవింపబడును. ప్రాణము పోయినంతనే ఈ శరీరము ఎవరికిని అక్కర లేదు. నశించు స్వభావము కలది కనుకనే దానికా పేరు వచ్చినది. సుఖదుఃఖములు కాలకలితములు. త్రిగుణముల ప్రోద్బలమువలననే, మానవులు సర్వ వ్యాపారములు చేయుచున్నారు. ఆత్మకు రెండు రూపములు కలవు. 1. జీవాత్మ 2. పరమాత్మ. జీవాత్మ కర్మఫలమనుభవించును. పరమాత్మ ఏమియు అనుభవించక సాక్షిమాత్రగ నుండును.

శరీరములో ప్రాణవాయువు పంచవిధముల విభక్తమైయున్నది. ఈ పంచవాయువులను చక్కగ సంయమనము చేసినచో అంతరాత్మ దర్శనము కలుగును. జీవి తల్లిగర్భము సొచ్చిన మరుక్షణము నుండి

పొందు యాతన దుర్భరము, జుగుప్సావహము. ఈ జనన మరణ పరం పర లేకుండ చేసికొనుటయే మన ముఖ్యకర్తవ్యమైయున్నది. దీనికి ముఖ్యముగ శరీరముతో సంగములేకుండ చేసికొనవలెను. పుణ్యకార్య ములు చేసినచో స్వర్గమును, పాపాచరణము చేసినచో నరకమును సిద్ధించును. అవియును తాత్కాలికములే. మోక్షమువలన పునరా వృత్తి కలుగదు. అందుచే మోక్షము మన ప్రధానధ్యేయమైయున్నది.

బంధువియోగమునకు విచారించుట అజ్ఞానలక్షణము. కామ క్రోధాది దేహదోషములను గుర్తించి, వానిని త్యజించి మోక్షప్రాప్తికి కృషి చేయవలెను. లోకములో పెక్కుమంది ఇవిదోషములని తెలిసియు వానిబంధములో చిక్కుపడి విడివడలేక అహంకారముతో నశించు చున్నారు. ఈ దేహము ఎన్నడూ ఆత్మకాదు. దేహము ప్రకృతి. అది పంచభూతాత్మకమైనది. పంచజ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియ ములు వాని విషయములుకలిసి పదునారు వికారములుకలది. సత్త్వరజ స్తమస్సుల ముప్పేటహారమే మూలప్రకృతి. ఆత్మ ప్రకృతియు కాదు వికృతియు కాదు. ఆత్మ తేజోరూపుడు.

ఇంద్రియములు నిరంతరము విషయాసక్తములగుట నిసర్గము. దానివలన దేహదోషములు పుట్టుచున్నవి. ఆ దోషములే మోక్షసిద్ధికి ప్రతిబంధకములు. విషయములనుండి ఇంద్రియములను, ఇంద్రియముల నుండి మనస్సును, మనస్సునుండి బుద్ధిని మళ్ళించి శుద్ధసత్త్వమును పొందినచో, అది ఆత్మస్వరూపప్రకాశమునకు తెచ్చును. ఆత్మయే నారాయణుడు. ఆత్మ ఆ స్థితిని పొందుటయే మోక్షము.

శాంతిపర్వము పంచమాశ్వాసమున కపిలమహర్షి వేదసమ్మత మైన సాంఖ్యతత్త్వము ఉపదేశించెను. ఆత్మ సుఖైకపరాయణుడు. ఆత్మసుఖము నెఱింగినవాడు, పెఱసౌఖ్యములను మెచ్చడు. గతశోకుడు,

అకాముడు, నిస్సంగశీలుడైన ఆత్మజ్ఞునకు నశ్వరమైన ప్రాపంచిక విషయము లక్కరలేదు. ఈ గుణవిభూషితుడు గృహస్థధర్మము నుజ్జగించును. మానవుడు హృదయస్థుడైన పరమాత్మను సందర్శించుటకు తనకుగల నాలుగు వాకిళ్ళు మూయవలెను. అవి 1. పాణి, 2. ఉపస్థ, 3. ఉదరము, 4 వాణి. ఒక్కొక్క వాకిలిని మూయుటకు ఉపాయములను చెప్పినాడు. (చూ- శాంతి- ప- 319, 320, 321, 322)

పూర్వోక్త లక్షణలక్షితుడు యజ్ఞయాగములు చేయవలసిన అవసరము లేదు. అనహంకారము, అక్రోధము, అతృష్ణ కలిగిన బుధుని శుభాశుభములను ద్వంద్వములు ఎంతమాత్రము కలత చెందించవు. ఇట్టి మహోదాత్త వ్యక్తి గృహస్థుగానున్నను, శమ, దమ, జ్ఞాన సంపన్నుడగును. అతడు సులభముగా మోక్షము పొందును. సంతోషామృతసుఖిత స్వాంతుడైనవానికి గృహము, కాంతారము సమానమే కదా. శాంతిపర్వమున వశిష్ఠమహర్షి సాంఖ్యతత్త్వమును, జనకమహారాజునకు తెలిపినట్లు షష్ఠాశ్వాసమున కలదు. ఇది భగవద్గీతయందలి అక్షర పరబ్రహ్మయోగమునకు సన్నిహితమైయున్నది. క్షయ, వృద్ధి రహితమైన తత్త్వమే అక్షరతత్త్వము. దానివలన ఇరువది నాలుగు తత్త్వములు పుట్టుచున్నవి. ఈ తత్త్వములన్నియు నాశము పొందు స్వభావము కలిగియుండుటచే క్షరతత్త్వములని పేరుపొందినది. సృష్టి నిమిత్తాత్మకమైనది అక్షరతత్త్వము, ఈ క్షరతత్త్వమే క్షేత్రమని, అవ్యక్తమని, ప్రకృతియని పిలువబడుచున్నవి. దాని నుండియే మహత్తత్త్వము, దానివలన పంచభూతములు, పంచతన్మాత్రలు, కర్మజ్ఞానేంద్రియములు మనస్సు పుట్టును. ఈ 24 తత్త్వములు క్షరములు, ఇరువదైదవ తత్త్వము విజ్ఞేయమై యున్నది.

వ్యాసమహర్షి సాంఖ్యములోని సూక్ష్మత్వమును దర్శించి, అద్వైతమును కంగముగా సమన్వయించెను. ఈశ్వరకృష్ణుడు కారికా సాంఖ్యములో, పంచవింశతి తత్త్వమును, పురుషుని పేర్కొనెను. ఆ పురుషునే భారతము బ్రహ్మము, ఈశ్వరుడు నారాయణుడు అను పేళ్ళతో పరిగణించినది. భారతము ఇరువదియారవ తత్త్వమును ప్రతిపాదించినది. ఇరువది ఐదవతత్త్వము అధిష్ఠానతత్త్వము. అదియేపురుష తత్త్వము. ఆత్మయొక్క ఒకరూపము పంచవింశతి తత్త్వము. రెండవది షడ్వింశతి తత్త్వము, ప్రకృతివాదమందలి ప్రకృతిపురుషులు,పరబ్రహ్మకు వశులైయున్నారని భారతము సమన్వయించినది. ప్రకృతికి కల ఘటనా ఘటనా పటుత్వమును తొలగించి బ్రహ్మయందు సంక్రమింపచేసినది. బ్రహ్మమే అద్వితీయము. ఈ విధముగా భారతములో సాంఖ్యము అద్వితీయ పరబ్రహ్మమును పొందుటకు సాధనముగా సమన్వయించుట ప్రశంసాపాత్రమై యున్నది.

## భక్తియోగము

వేదములలో బ్రహ్మజ్ఞానమునకు కారణభూతమగు భక్తి యోగము వర్ణింపబడినది. ఆలోచనయొక్క పరిపూర్ణ స్వరూపము జ్ఞానము. ఆవేశముయొక్క పరిణత రూపము భక్తి. మానవుడు, తన లోని ఈశ్వరాంశను, తెలిసికొనుటకు ఆర్యఋషులు సగుణారాధనమును, నిర్గుణారాధనమును సాధనములుగా నిర్దేశించిరి. నిర్గుణోపాసనము జ్ఞానులకు మాత్రమే సాధ్యము. అనేక కష్టములతో కూడి యున్నది. ఈజ్ఞానులు జితేంద్రియులై, ప్రత్యక్షాది షట్ప్రమాణము లతో నిర్వచింపరాని అనిర్దేశ్యమైన, అవ్యక్తమైన, కూటస్థమైన, అచలమైన నిర్గుణ పరబ్రహ్మము నుపాసించుచున్నారు. మధ్యమాధికారులైన సామాన్యమానవులు మృత్యుసాగరమునుండి తరించుటకు సగుణా

రాధనము నిర్దేశింపబడినది. సగుణ స్వరూపముకల భగవంతునిపై విశ్వాస ప్రేమపూర్వకమైన సంబంధమే భక్తి.

భక్తియనగా నేమి ? "భజ్ సేవాయాం" అను ధాతువునుండి నిష్పన్నమైనది. భక్తి అనగా పరమేశ్వర సేవ. నారదాదులు భక్తిని అనేక విధములుగా నిర్వచించిరి. నారద భక్తిసూత్రములలో భక్తి - "సాపరమప్రేమ రూపా" దేవునియందు పరమప్రేమరూపమే అని చెప్పబడినది. శాండిల్యుడు - "సాపరానురక్తి ఈశ్వరే" - ఈశ్వరునియందు పరానురక్తియే భక్తి. భగవద్గీతకూడ భక్తిని నిర్వచించినది.

"యే తు సర్వాణికర్మాణి మయి సన్న్యస్య మత్పరాః
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే"
(భగవద్గీత - ద్వాదశ - 6)

ఎవరు సర్వకర్మలను నాకే అర్పించి సదా నాయందే చిత్తము చేర్చినవారై ఇతరచింత లేక అనన్యభక్తితో ధ్యానము చేయుచున్నారో వారే నాభక్తులు. శంకర భగవత్పాదులు స్తోత్రరత్నమగు, శివానందలహరిలో భక్తిని సర్వజన హృదయంగమముగా నాలుగు ఉపమానములతో నిర్వచించియున్నారు.

"అఙ్కోలం నిజబీజ సన్తతిరయస్కాన్తోపలం సూచికా
సాధ్వీనైజవిభుం లతా క్షితిరుహం సిన్ధుస్సరిద్వల్లభమ్
ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవిన్దద్వయమ్
చేతోవృత్తిరుపేత్య తిష్ఠతి సదా సా భక్తిరిత్యుచ్యతే."
(శివానంద లహరి - 60)

భగవంతుని కృపాకటాక్షమునందలి అచంచల విశ్వాసముతో కూడిన ఆత్మార్పణమే భక్తి. ఈశ్వర ప్రణిధానమే భక్తి. భక్తుడు భగవంతుని సచ్చిదానంద లక్షణములను తలంచుచు నిశ్చలభక్తితో

ఆ మహాపురుషుని ధ్యానించుచు సహచరులతో కలసి, అతని కల్యాణ గుణకీర్తనము చేయుచు. స్వకర్మలను ఈశ్వర సేవాభావముతో నాచరించును. భక్తుడు తన సంపూర్ణవ్యక్తిత్వమును ఈశ్వరునకు అర్పించును. తత్ఫలితముగ, మనఃప్రవృత్తులలోని అహంకారము అణగును. భక్తి ప్రధాన లక్షణములు ప్రేమ, అనురాగము, దయ, మార్దవములు. భక్తిసంప్రదాయములో పరమేశ్వరుడు ఒక్కడే పురుషుడు. జీవులందరు అస్వతంత్రులైన స్త్రీలే. స్త్రీసహజమైన ప్రేమ, అనురాగము, దయ, సర్వస్వత్యాగము మనము అలవరచుకొన్నచో పరమేశ్వరుడు మనలను రక్షించును. మనము సంపూర్ణముగా ఆత్మార్పణము చేసినపుడే, భగవంతుడు మన పుణ్యపాపములను చేపట్టి సర్వలోపములను ప్రక్షాళనముచేసి, తన అనంత దివ్యకాంతిలో లీన మొనర్చుకొనును.

"తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్
భవామి నచిరాత్పార్థ ! మయ్యావేశిత చేతసామ్."
(భగవద్గీత - 12 - 7)

భక్తి జ్ఞానసాధనము. శ్రద్ధ భక్తికి ప్రాతిపదిక. "శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్" ప్రపత్తియు ఒక విధమైన జ్ఞానమే. భక్తి యనగా పూలు, పండ్లు, కొబ్బరికాయలుకొట్టుట మాత్రమే యని భావించరాదు. భక్తి ప్రజ్వరిల్లినచో, మన అంతరాత్మయందున్న భగవానుడు కృపాపరతంత్రుడై, భక్తునికి జ్ఞానకాంతిని ప్రసాదించును. సర్వమును ఆత్మమయముగా సర్వభూతములను ఆత్మసమములుగా దర్శింపగల ఆత్మజ్ఞానము భక్తిలేనిదే ఏ మనుజుడును పొందజాలడు.

భగవద్గీత భక్తుని ప్రధానలక్షణములను స్పష్టముగా పేర్కొన్నది.

"అద్వేష్టా సర్వభూతానామ్ మైత్రః కరుణ ఏవ చ
నిర్మమో నిరహంకారః సమదుఃఖ సుఖః క్షమీ."

"సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః
మ య్యర్పితమనోబుద్ధి ర్యో మద్భక్త స్స మే ప్రియః."
"యస్మా న్నోద్విజతే లోకో లోకాన్నో ద్విజతే చ యః
హర్షా మర్ష భయోద్వేగై ర్ముక్తో యస్స చ మే ప్రియః"
(భగవద్గీత - 12 - 13, 14, 15)

సర్వభూతములయందు ద్వేషరాహిత్యము, మైత్రియు, కరుణయు కలిగి, అహంకార మమకారములు లేనివాడయి, సుఖదుఃఖములను సమముగా చూచునట్టి నిత్యసంతుష్టుడయి ఆత్మనిగ్రహము కలిగి అచంచల నిశ్చయముతో నాకర్పించిన మనస్సు బుద్ధియు కలయోగి నాభక్తుడు - నాప్రియుడు. అనగా యధార్థభక్తుడు, ఆత్మస్వతంత్రత, సర్వభూతమైత్రి, ఓర్పు, సమచిత్త ప్రసన్నత కలిగియుండవలెను. ఈ భావములన్నియు మనస్సులో నుంచుకొని తిక్కనార్యుడు శాంతిపర్వములో ఎట్టిభక్తుడు మోక్షము పొందునో తెలిపెను.

"అపరిగ్రహాసర్వారం,
భపరిత్యాగములు కనుగుపండితునకు దుః
ఖపుదెరువు పాటిలదు మో,
క్షపదము చొప్పడి తదాత్మకసుఖం బొందున్".
(శాంతి - షష్ఠ - 313)

జ్ఞానికి అపరిహార్యమైన లక్షణములు ఏవి యుండవలెనో అవియే భక్తునకు ఉండవలెనని సూచితము. శ్రీకృష్ణపరమాత్మ పరిపూర్ణజ్ఞానమునకు భక్తి అత్యావశ్యకమని చెప్పెను.

"భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున !
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప !"
(భగవద్గీత - 11 - 54)

సర్వవ్యాపి సచ్చిదానందమగు పరమాత్మతత్త్వము భక్తిచేతనే సిద్ధించును. ఆ పరిపూర్ణ జ్ఞానముచేత మానవుడు పరమాత్మను పొందుచున్నాడు. భగవద్గీతా ప్రతిపాదితమైన భక్తి నిర్విశేషాత్మకమైన ఆత్మార్పణము. మోక్షసాధన సామగ్రిలలో భక్తియే సర్వశ్రేష్ఠమైనది. మహాభారతములో ఉత్తమభక్తునకు ప్రతీకగా అర్జునుని, జగద్గురువునకు ప్రతీకగా శ్రీకృష్ణుని నిరూపించుట అపూర్వము. ఉత్తమ భక్తునకు ఉండవలసిన లక్షణములన్నియు అర్జునునిలో కలవు. భక్తి సంప్రదాయమునకు శిఖర శేఖరమైన శ్లోకమిది.

"సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ".
(భగవద్గీత - 18 - 66)

శ్రీకృష్ణపరమాత్మ ప్రియశిష్యుడైన అర్జునునకు విశ్వరూప సందర్శనానంతరము మోహముడిపి పరమధర్మము నుపదేశించెను.

"క్రిందుకొను సర్వధర్మవికల్పములను
నెడల విడిచి దృఢంబుగ నే నొకండ
శరణముగ నాశ్రయింపుము సకలదురిత
ములకు నొలగింతు నిన్ను బ్రమోద మొంద".
(భీష్మ - ప్రథమ - 226)

ఎవడు నాకొరకు కర్మ చేయుచు, నన్ను పరమ గమ్యముగ కలిగి, సంగవర్జితుడై, సర్వభూతములయందు వైరము లేనివాడై, నన్ను అర్చించునో వాడు నన్ను పొందును. ఇదియే భక్తి సారము. ఈ శ్లోకము గీతలోని ఉపదేశమునకంతకు మకుటప్రాయమై యున్నది.

పాండవులు సర్వాత్మనా, సర్వేశ్వరుడైన శ్రీకృష్ణుని నమ్మి సర్వకర్మలు అతనికే అర్పించి, అతని ఆదేశానుసారము ప్రవర్తించిరి.

తత్కారణముగా, జగదీశ్వరుడైన శ్రీకృష్ణుడు భారతకథలో సూత్రధారియై పాండవులను కంటికి రెప్పవలె, కాపాడి ఇహలోకములో అభ్యుదయమును, పరలోకములో నిశ్శ్రేయసమును సమకూర్చెను. మానవుడుకూడ కర్తృత్వము తనమీద పెట్టుకొనకుండ, బ్రహ్మార్పణ బుద్ధితో సర్వకర్మలు చేసినయెడల జగదీశ్వరుడే అండదండగా నుండి రక్షించును. భక్తియే అజ్ఞానాంధకారము నాశమొనర్చి జ్ఞానదీప్తి నొసంగును. అజ్ఞానము నశించుటతో అంతరంగమున ఈశ్వరుడు సాక్షాత్కరించును. భక్తిజ్ఞానములు కలిగినపుడు మానవునిలోని దైవత్వము సఫలత పొందును. ఈవిధముగా తిక్కనార్యుడు భగవద్గీతలో నున్న ఆణిముత్యములవంటి శ్లోకములన్నటిని, ఆంధ్రభారతములోనికి అనుసంధించెను. మోక్షమునకు భక్తియే ఉత్తమ సాధనము.

## ఆధ్యాత్మికోపదేశము

వేదవ్యాసమహర్షి వేదాంతశాస్త్ర మహాసముద్రమును మథించి మానవాళికి నవనీత సదృశమైన అమృతసందేశము నొసంగియున్నాడు. అదియే తిక్కనమహాకవి మూలములోని భావములను జక్కగ శాంతి పర్వములో అనుసంధించెను.

పరమాత్మసంబంధమైన జ్ఞానము అధ్యాత్మము. ఆత్మ విషయక విచారణమే అధ్యాత్మ విద్య. ఈ ఆత్మ తత్త్వము ఊహించినకొలది ఆశ్చర్యాపాదకము.

> "ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన
> మాశ్చర్య వద్వదతి తథైవ చాన్యః,
> ఆశ్చర్య వచ్చైన మన్యశ్శృణోతి
> శ్రుత్వాప్యేనం వేదన చైవ కశ్చిత్.
>
> (భగవద్గీత - ద్వితీయ - 29)

అజ్ఞానావస్థలో కర్తృత్వ భోక్తృత్వ, దుఃఖిత్వ, జడత్వ, సంగిత్వ పరిచ్ఛిన్నత్వాది ధర్మములతో తెలియనగు "నేను" అనువాడే ఇపుడు శాస్త్రాచార్యోపదేశమూలమున కర్తృత్వాది ధర్మరహితము, ఆనంద ఘనము, సత్యము, జ్ఞానము, అనంతము, బ్రహ్మము నని తెలిసి కొనుటయే మహైశ్వర్యకరము. అట్టి ఆత్మజ్ఞానము అనేక జన్మకృత నిష్కామ కర్మయోగానుష్ఠానముచే పరిశోధితమగు అంతఃకరణము కల బ్రహ్మనిష్ఠునకే అవగతమగును. ఎల్లరకు కలుగదు. "యస్మిన్ విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి."

ఆత్మవిజ్ఞాన మనుభూతిలోనికి వచ్చినచో సర్వము కరతలామలక మగును. వేదములు, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, దర్శనములు భగవద్గీత, రామాయణభారతాదులు అధ్యాత్మవిద్యనుగూర్చి అన్నితోపదేశము అనాదికాలమునుండియు చేయుచునే యున్నవి. ఈ అధ్యాత్మ విద్యానుభూతి పొందుటకు సాధనక్రమ మున్నది.

## 1. వి వే క ము

ప్రప్రథమముగ జిజ్ఞాసువు వివేకదీపము వెలిగింపవలెను. ఇది ఆత్మ, ఇది అనాత్మ యను జ్ఞానమే వివేకము. దృశ్యమానమైన ప్రపంచ మంతయు నశ్వరమైనది. ఆత్మ ఒక్కటియే నిత్యము. దేహము అనాత్మపదార్థము. జడము. అనిత్యము. ఆత్మపదార్థము చేతనుడు నిత్యుడు. ఈ దేహము తల్లిదండ్రుల శుక్లశోణిత సంబంధమున పుట్టి నది. పిండరూపముననున్నపుడును అంతకు పూర్వము దేహి కలడు. దేహిని ఆశ్రయించియే పిండము ఏర్పడుచున్నది. దేహి లేనిచో దేహము క్రుళ్ళి నశించును. ఉపాధిభేదమును బట్టి చరాచర ప్రపంచ ములో అనేక రూపములు కనిపించుచున్నవి. ఈ శరీరములన్నిటియందు నున్నది ఆత్మ ఒక్కటియే. జనన, మరణములు దేహమునకేగాని

ఆత్మకు ఎంతమాత్రము కావు. గాలి వీచునప్పుడు నీటియందు అలలు కలవు. గాలి ఆగినపుడు అలలుండవు. అలలున్నప్పుడును లేనప్పుడును నీరు కలదు. అలలవంటిది దేహము. నీటివంటిది ఆత్మ. అలలవలె దేహములు పుట్టుచు గిట్టుచుండును. దేహమునకు బాల్యము, కౌమారము, యౌవనము జరామరణములున్నవి. ఆత్మ నిత్యమై, అవ్యయమై, నిర్వికారమై, శాశ్వతమైనదని గుర్తించుటయే వివేకము.

## 2. కర్మాచరణము

వేదములో పూర్వమీమాంస యజ్ఞయాగాది క్రతువులు, ఉత్తర మీమాంస జ్ఞానము ఉపదేశించుచున్నవి. మోక్షము పొందుటకు కర్మజ్ఞానములు రెండును అత్యవసరము కర్మజ్ఞానములు పక్షికి రెక్కలు వంటివి. మానవుడు ఫలాపేక్షను విడిచి శీతోష్ణసుఖదుఃఖాది ద్వంద్వాతీతుడై పరమేశ్వర ప్రీతికొఱకు వర్ణాశ్రమములకు విహితమైన సంధ్యావందనాది నిత్యనైమిత్తిక కర్మలను, యమ నియమాద్యష్టాంగ సాధనములను సంకల్ప పూర్వకముగ ననుసరించుటయే యోగము. యోగానుష్ఠానముచే పరమేశ్వరప్రసాదమున చిత్తశుద్ధి కలుగును. శుద్ధ చిత్తమునందు నిర్మలమైన దర్పణమునవలె జ్ఞానముదయించును.

ఉపనిషద్ద్రష్టలగు మహర్షులు పరమార్థ వస్తువిషయక జ్ఞానమును సాంఖ్యమని చెప్పిరి. యోగోపాయ సాధ్యమగు సాంఖ్యమే శ్రేయోమార్గము. అయ్యదియే మోక్షైక హేతువు శాస్త్రప్రమాణ జనితము, మంత్ర బ్రాహ్మణాత్మక వేదభాగము సంసారమును ప్రకాశింపచేయును. కాని వేదమంత మాత్రముతో సమాప్తము కాదు. సంసారుల కైహికాముష్మిక సుఖప్రాప్తి సాధనములను వేదముపదేశించినను అశాస్త్రీయమార్గావలంబులై చెడెదరని, వేద శిరస్సులగు ఉపనిషత్తులు గుణత్రయాతీతమగు బ్రహ్మమును ప్రతిపాదించుచున్నవి.

స్వధర్మానుష్ఠానపరుడు నిష్కాముడగును. గుణత్రయములకు లోబడడు. మానవుడు త్రిగుణాతీతమైన పరిణతస్థితి నందవలెను. అతీతానేక జన్మ కృతములును, బహువిధములగు ధర్మాధర్మాది సంస్కారములు అంతః కరణమునందుండినవై కర్మశబ్దముచే తెలియనగుచు ప్రతిదేహి మరణ కాలమునందు అభివ్యక్తిపొంది ఉత్తర జన్మారంభకములగుచున్నవి. దీనిని ప్రారబ్ధమందురు. అట్టి ప్రారబ్ధము ననుసరించి దేహాభిమానుల శ్రద్ధ సాత్త్వికమనియు, రాజసమనియు, తామసమనియు మూడు విధములగుచున్నది. శ్రద్ధయనగా పురుషుడు తన అంతఃకరణమునందు పొందెడి అభిమానవిశేషము. రాజస, తామసములకు, వశుడుగాక, సత్త్వగుణములు అభివృద్ధిచేసికొని యజ్ఞమునందు ప్రవర్తించువానిని తపోనిష్ఠకలవానిని దానకర్మనిరతుని సత్పురుషు లందురు. కావున స్వధర్మమును శ్రద్ధతో విధ్యుక్తముగ, పరమేశ్వరార్పణ బుద్ధితో చేసిన సంసారమునుండి జీవి ముక్తి పొందవచ్చును.

## 3. ఇం ద్రి య జ య ము

జ్ఞానికి జితేంద్రియత్వము ప్రధానలక్షణము. పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములను, తత్త్వములను గ్రహింపవలెను. దుష్టాశ్వములు పూన్చిన రథము గమ్యస్థానము ఎట్లు చేరలేదో, అట్లే ఇంద్రియములకు బానిసయైన వ్యక్తి, పరబ్రహ్మానుభవము పొందలేడు. మానవుని మనసు చిత్రాతిచిత్రమైనది. ఆ మనసే విషయజ్ఞానమునకు మూలము. మానవుడు ప్రాపంచిక విషయలంపటుడగుట సహజము. ఆతడు బాల్యమునందు క్రీడాసక్తుడగును. యౌవనములో తరుణీసక్తుడగును. వార్ధక్యములో రోగగ్రస్తుడగును. ఇంక ఈ జీవికి ఆత్మ జ్ఞానముగురించి యోజించుట కవకాశమెక్కడ ? విషయములు ఎంత ప్రియముగా కనిపించునో కాలాంతరమున అవి అత్యంత దుఃఖప్రదము

లగుట అనుభవ పునరుక్తము. నీటిలోనున్నను, నీటియొక్క సంబంధము లేక ఎట్లు పద్మపత్రముండునో అట్లే మనము సంసారములోనున్నను దాని సంగము మనస్సునకుండరాదు. బ్రహ్మజ్ఞాని యనగా సకల విషయవాంఛాపరిత్యాగి. విద్వాంసులు సంతతము త్యాగముతో తుల్యమైనది ఏమియు లేదని ఉద్ఘోషించుచున్నారు.

పుణ్యపాపములు జ్ఞానోదయమునకాని పోవు. సమత్వబుద్ధియుక్తులగు పురుషులు కర్మజములగు పుణ్యపాపములను త్యజింతురు. అయ్యవి త్యాగాగ్నియందు దగ్ధమై జన్మాంకురోత్పాదనమునకు అసమర్థము లగును. అట్టి త్యాగశీలురు శాస్త్రాచార్యోపదేశమూలమున పుష్కలజ్ఞాను లగుదురు. జ్ఞానులగువారికి పుణ్యపాపక్షయ మగును. జన్మబంధముండదు. కావున వారు ఈ లోకమున ఉండగనే జన్మబంధము నుండి విడువబడినవారై జీవన్ముక్తులై సర్వోపద్రవ రహితమగు పరమపదము నందెదరు. దేహముయొక్క అశాశ్వతత్వము గుర్తించి, సచ్చిదానందము, అద్వైతము, అఖండైకరసము, అనంతము, పరమమగు బ్రహ్మము అంతటనిండి అంతయు తానై ఉన్నాడని ఎఱుక కలుగును. అదియే జీవన్ముక్తి. అదియే విదేహకైవల్యము. అదియే పునరావృత్తిరహితమైన మోక్షము.

త్రి గు ణ ము లు :

సత్త్వము, రజస్సు, తమస్సు అనునవి త్రిగుణములు. ఇవి ప్రకృతి సంభవములు. ఈగుణములు ప్రధానముగ ధర్మవిషయమున ఉపయోగింపబడుచున్నవి. సత్త్వమనగా సాధుత్వము. రజస్సు అనగా కామము. తమస్సు అనగా మాంద్యము. అని స్థూలముగ చెప్పవచ్చును. ఈ గుణములలో ఏగుణము అధికముగా నుండునో దానిని పురస్కరించుకొని పిలువబడును. అనగా రజస్సు, తమస్సు తక్కువగా

నుండి సత్త్వగుణము అధికముగా నున్నచో సత్త్వగుణప్రధానుడని చెప్పుట లోకవ్యవహారము. విష్ణువునందు సత్త్వగుణము, బ్రహ్మ యందు రజోగుణము, శివునియందు తమోగుణము ఉన్నవని చెప్పుట కలదు. దేహమునుండి జనించిన ఈగుణత్రియమునకు అతీతుడై దేహ ధారి పుట్టుక, చావు, ముసలితనములనుండి విముక్తుడయిన పిమ్మటనే అమృతత్వమును పొందును. జీవుడు అజ్ఞానబంధమునుండియు, క్రియా శూన్యమగు మాంద్యమునుండియు బయల్పడి భౌతిక భోగ సుఖ సంపాదన ద్వారమున జ్ఞానానందముల పొందగోర యత్నించును. కాని మనము ఎంతకాలము సక్తచిత్తులమై ఎంత ఉదాత్త ఆశయము కలిగి నను మనలోని రజస్తమములు సత్త్వగుణమును అణగద్రొక్కును. ఇందుచే త్రిగుణాతీతమైన స్థితిపొందినవాడే జీవన్ముక్తుడు. అతనికే బ్రహ్మానందము కరతలామలకము.

బ్రహ్మ సృష్టిలోని జీవులన్నియు త్రిగుణములతో కూడి యున్నవి. పూవులకు పరిమళము, జలమునకు రుచి ఎట్లు అవిభాజ్యమో అట్లే దేహమునకు త్రిగుణములకు సంబంధము విడదీయరానిది. భగ వద్గీత ఈత్రిగుణముల లక్షణములను అవి ప్రధానముగా కల వ్యక్తుల ఆహారములను మనోభావములను సునిశితముగా పరిశీలించి చెప్పినది. త్రిగుణములలో సత్త్వగుణము జ్ఞానమునకు ప్రతీక. నిర్మలమైన అద్ద మున ప్రతిబింబము చక్కగా ప్రతిఫలించును. అట్లే సత్త్వగుణప్రధాను లయందే పరమేశ్వర సాక్షాత్కారము కలుగును. అట్లే ఈసత్త్వరజస్ తమోగుణములు అన్యోన్య మిథునత్వము, అన్యోన్య సంశ్రయమై ఉన్నవి. వ్యాసమహర్షి భారతములో ఈత్రిగుణములను ఆధారముగా చేసికొని పాత్రలను నిర్మించెను.

### సత్త్వము

సంతోషము, ప్రకాశము, ప్రియము, ఆనందము, కరుణ, క్షమ, సత్యము, శౌచము, ధృతి, అహింస, ఆర్జవము, అనసూయ, క్రోధరాహి

త్యము, అసంరంభము, సమత, దాక్షిణ్యాము, మొదలగు లక్షణములు కలిగిన వ్యక్తులు సాత్త్వికులు. సత్త్వమునుండి జ్ఞానము పుట్టును. సత్త్వము సుఖాస్పదము. హర్షము, అనూనసుఖము, నిర్భర ఆనందము శాంతికిమూలము. దీనివలన మనస్సు ప్రశాంతత పొందును. జ్ఞాని సాత్త్విక గుణసంపదను పెంచుకొని రాజస తామసములను అణగ ద్రొక్కినచో వివేక దీపము వెలుగును. ఇది శాంతిపర్వములో వివరింపబడినది (శాం – పం – 155) అందుచే యోగపరినిష్ఠాత్ములు కామ క్రోధ సమావేశము వెడల విడిచి సత్త్వమును దృఢముగా సేవింతురు. శ్రుతి, తపము, ప్రజాపతి, అనునవి సత్త్వమునకు పర్యాయపదములు. సత్త్వమహిమ పరమ వేద్యము. సూర్యుని రూపము జలములలో తోచిన క్రియబుద్ధియందు ప్రతిబింబించిన ఆత్మను సత్త్వగుణ విశిష్టులు పొందగలుగుదురు.

రజస్సు :

సత్త్వ తమోగుణముల మిశ్రితమై రజోగుణము కలుగుచున్నది. పరితాపము, అనభితోషము, జనవ్యాపారాదరము, అక్షమ మున్నగునవి దీని లక్షణములు. రజస్సునుండి లోభము పుట్టుచున్నది. రజోగుణము ప్రధానముగా గలిగిన ప్రజలు ఏదియో సాధింపలెనని నిరంతరము ఉవ్విళ్ళూరుచుందురు. రాగము, లోభము, సంగము, రాజస లక్షణములు. రజస్సు, సాంద్ర దుఃఖమయము. రజోసత్త్వ కలిత వర్తనులకు మధ్యమభువన వాసత్వము కలుగును.

తమోగుణము :

అంధకారము, మాంద్యము, ప్రమాదము, మోహము, దోషము మొదలగునవి తమోగుణ లక్షణములు. అజ్ఞానమునకు ప్రతీక తమోగుణము. సంశయము, విషాదము, జడత, నిద్ర, తమస్సువలన

'పొందును. జ్ఞానము కోరువాడు, రజస్తమములను అణగ్రదొక్కి సత్త్వగుణమును అభివృద్ధి చేసికొనవలెను. త్రిగుణాతీతస్థితి పొందిన వాడే బ్రహ్మనిష్ఠుడు. సుఖదుఃఖములు సమానముగా చూచువాడు ప్రసన్నచిత్తుడు. మంటిబెడ్డను బంగారమును సమానముగా చూచువాడు ప్రియాప్రియములకు లొంగనివాడు పొందిన స్థితియే త్రిగుణాతీత స్థితి. అట్టివాడే బ్రహ్మానుభవము పొందును.

## విషయాసక్తత

జ్ఞానియైన మానవుడు దురంతములగు విషయములకు ఆసక్తుడు కాకున్నచో పరమ పదవిని పొందును. వానియందు తొడరిన చేటు పొందును. విషయములు మానవులను ఎన్నియో ఇక్కట్లు లోనికి లాగుచున్నవి. మూఢాత్మునియందు చిత్తము విషయాసక్తమైయుండును. లక్కరసము దండాదులయందు గట్టిగ చిక్కజట్టుకొన్న విధమున పట్టి యుండును. అందుచే దీని స్వరూపస్వభావములను తెలిసికొని విషయములకు బానిసకాకుండ నిగ్రహించుట ప్రధానమైయున్నది. విషయములు మనస్సును ఆకర్షించు గుణము కలిగియున్నవి. ఎంతయెఱుక కలవారయ్యును వీనికి లోనయి దుర్వారవికారము పొందుచున్నారు. మనస్సు కామక్రోధ నిరూఢమయిన పురుషుని ఇంద్రియార్థములపై ప్రసరింపచేయును. సకలవిషయ వాంఛాపరిత్యాగ శీలికి మోక్షము సుగమము. రూపము అనగా మోహింపచేయునది. శబ్దము అనగా సుఖము నిచ్చునది. గంధము అభిలషింపబడును. రసము ఆస్వాదింపబడును. స్పర్శ స్పృశింపకోరును. అందుచే ఈవిషయములను బంధించినపుడే మనస్సునకు స్వాస్థ్యము చిక్కును. అందుచే సకల విషయ త్యాగమహాత్త్వము బహుధా ప్రస్తుతింపబడినది.

### అరిషడ్వర్గము

కామ, క్రోధ లోభ, మోహ, మద, మాత్సర్యములు అంతశ్శత్రువులు. మానవుడు బాహ్యశత్రువులను జయించుటకంటె అంతరంగ

మున ఆక్రమించిన శత్రువులను జయించుట మిక్కిలి కష్టము. తోడేలు మానవుని ఆక్రమించుటకు పొంచియున్నవిధమున నిరంతరము మానవుని తనవశము చేసికొనుటకు కామక్రోధములను శత్రువులు పొంచి చూచుచుండును. ఆ ఆర్గురుశత్రువులు వేయిమందిపెట్టు. ఇవి సకలాపాయములను కలిగించును. ఇవి అన్నియు ఒకదానిపై మరియొకటి ఆధారపడి ఉన్నవి. ధార్తరాష్ట్రులయందు ఈ ఆఱుశత్రువులు మిక్కుటముగా నుండుటచే నశించిరి. సార ధీరత సంపదుదారమతియైన ధర్మరాజు వీనిని జయించెను. భగవద్గీతలో వీని స్వభావము మనోహరముగ వివరింపబడినది.

"కామ ఏషః క్రోధః ఏష, రజోగుణ సముద్భవః
"మహాశనో మహాపాప్మా, విద్ధ్యేన మిహ వైరిణమ్."

(భగ- తృతీయ- 37)

రజోగుణముచే కలుగు కామమే పురుషునికి పాపప్రవృత్తి కలిగించుచున్నది. కామము విషయాభిలాష స్వరూపము. అవస్థాభేదముచే కామమే రూపాంతరము పొంది క్రోధమగుచున్నది. రజోగుణముచే నుత్పన్నమగు కామముయొక్క అభిలాష సిద్ధికి వ్యాఘాతము కలిగినప్పుడు అది తమోగుణము నాశ్రయించి క్రోధముగ మారుచున్నది. కామము మిగుల ఉగ్రమయినది. కామమే జీవునకు ప్రధాన శత్రువు.

కా మ ము :

కామము అనగా కోరిక.

"కమనం కామః. కము కాంతౌ"

(అమరము- ప్రథమ- నాట్యవర్గ)

మనోహర వస్తువును చూచినంతనే ప్రీతికలుగును. విషయములను పరిపరి చింతించు పురుషునకు ఆ విషయములందు ప్రీతి కలుగుట

సహజము. ప్రీతివలన తృష్ణ పుట్టును. తృష్ణాయుతుడగు పురుషుడు విషయము లనుభవింపక నిముసమాగలేడు. కామమును జయించుట అతి దుష్కరము. అది నిరంతరము అభివృద్ధి పొందుచుండును. దానికి హద్దుపద్దు లేదు.

ఆజ్యము పోసినకొలది అగ్ని ప్రజ్వరిల్లునట్లు అనుభవించినకొలది కామము అంతకంతకు అధికమే యగును గాని ఉపశమింపదని దాని భావము.

> "న జాతు కామః కామానాం । ఉపభోగేన శామ్యతి
> హవిషా కృష్ణవర్త్మేవ । భూయ ఏవాభివర్ధతే".
>
> (మనుస్మృతి - 2 - 94)

ఈ శ్లోకమునకు చక్కని అనువాదము కలదు.

> "కామములు భోగముల దెగు
> నే మెలతుక నేత నాఱునే చిచ్చు ధృతిం
> గామముల దొఱగు సౌఖ్యము
> నేమెయి సౌఖ్యములు బోలునే యరయంగన్".
>
> (అనుశాసనిక - పంచమ - 233)

కామమువలన అర్థము, ధర్మము లోపించును. కామతంత్రనిరతుడైనవాడు సుపథ ప్రతిపన్నుడు కాలేడు. దుష్టదండనము చేయని రాజును సమీపించని ప్రజలవలె సాధువులు కామముకొఱకు చేరరు. కామ రసమున అతితృష్ణుడైన మనుష్యుడు అడవిలో పులి వాతపడిన మృగమువోలె మృత్యువు పొందును.

శాంతిపర్వములో కామస్వభావము సునిశితముగా వివరింపబడినది. ఒక వస్తువు మనకు ప్రీతికలిగించినచో అది సులభమో, దుర్లభమో యోజింపనీక చూచిన మనోహరవస్తువును పొందుటకొఱకు

ఎన్నియో ఇడుములను పెట్టును. దాని తెఱగు అగాధ రసాతలము వంటిది. మానవులకు కాంతాకనకములపై నున్న ప్రీతి ఇంతింత అన రానిది.

"సొమ్ము గోరిన యంతన సుఖము కలుగ
దది యుపార్జింపగా సిద్ధియగుట నిజమె
కలిగెనేని అనేక చింతలనొనర్చు
జెడుట చావుతో దుల్యమై యిడుమయేల."

(శాంతి- చతుర్థ-48)

అందుచేత లోకములో అర్థప్రాణములనుట వ్యవహారములో కలదు. ప్రాణముపోవుటకైనను మానవుడు అంత కుందడు. ప్రాణ ప్రదముగ సంపాదించిన ధనము పోయిన మరణ సదృశమైన వేదనము పొందును. అట్లే స్త్రీలపై ఆసక్తి కూడ అనివార్యమైనది.

కాటికి కాలుజాపిన ముసలి కూడ ఏ కన్యనైనను ఇచ్చిన పెండ్లియాడుటకు సిద్ధపడును. భారతములో యయాతి మహా రాజు దేవయానిని పెండ్లియాడి సర్వకామోప భోగములు అనుభ వించినను తృప్తిపొందక మరల యౌవనము పొందుటకు ఎంతయో ఆరాటపడుట కామప్రభావమే కదా. కామమువలన శోకము, శ్రమ, తృష్ణలు కలుగుచున్నవి. ఇది ఒక్కటి ఉన్నచో కర్తవ్యాకర్తవ్య పరి జ్ఞానము నశించును. కామము తొలగించుటకు మార్గము ఇచ్ఛానిరస నము. సత్య క్షమా భూతదయ కలిగిన వారికి కామము బానిసయగును.

క్రోధము

పురుషునకు ఏ కారణముచేతనైన విషయానుభవమునకు నడుమ అంతరాయము కలిగెనేని క్రోధ ముదయించును. క్రోధము జ్వలనాత్మ కము. క్రోధపూరితుడు క్రోధమునకు బానిసయగువాడు భగ్నమని యందెదరు. క్రోధావిష్టునకు కార్యాకార్యవివేకము నశించును. వివేక

నాశమువలన శాస్త్ర ఆచార్యోపదేశములవలన కలిగిన సంస్కార మంతయు చెడును. క్రోధముయొక్క దుష్ఫలితము ఇంతింత అనరానిది. పరుల దోషమువలన క్రోధ ముద్భవించును. అది అచంచల క్షమచే పోలియును. క్రోధము తపమును చెఱచును, అణిమాద్యులైన గుణములను బాపును. ధర్మక్రియ లన్నింటికి క్రోధము బాధయగును. క్రోధావిష్టులైన కార్తవీర్య, దశముఖ, పరశురాములు ఎంతయో నష్టముపొందిరి. కుపితుడగువాని వ్రతమును, జపమును దేవతార్చనమును శ్రాద్ధక్రియయును తపమును దానమును యజ్ఞమును వ్యర్థములే. మానవుడు దుర్గుణములలో అత్యంత నీచమైన కోపమును విడిచిపెట్టుట మంచిది. అందుచేతనే తెలుగుదేశములో తనకోపము తన శత్రువని నానుడి కలిగినది. అనుపమ నియమాన్వితులై అనూన దక్షిణలొసంగి క్రతుసహస్రములు చేసినవారికంటె అక్రోధనుడు మిక్కిలి అధికుడని విద్వాంసులు చెప్పుచున్నారు. ధర్మజ్ఞుడనగా అలిగిన అలుగక వొగ్గులు పలికిన మఱి వినని యట్లు ప్రతివచనంబులు పలుకక బన్నము వడియు నెడ తలపకయున్నవాడే లోకారాధ్యుడు. ఆధునిక వైద్యశాస్త్రజ్ఞులు కూడ అత్యధిక కోపము అనారోగ్యప్రదమని తెలుపుచున్నారు.

## లోభము

పాపముల కన్నింటికి మూలము లోభము. దీనివలన కామలోలతయు, క్రోధము, మాత్సర్యము, ద్రోహము, పరధన, పరదారా వాంఛ, దైన్యము, సిగ్గు, సత్యవైముఖ్యము కలిగించి ధర్మమార్గము నుండి దూరమొనర్చును. లోభిఅల్పమైన ధనమునకైనను చీటికిమాటికి బొంకుటకు ఏ మాత్రము సందేహించడు. సర్వ దుర్గుణములకంటె లోభము అత్యంత నింద్యమైనది. భారతకథయంతయు ధృతరాష్ట్రుని లోభమను పునాదిపైననే కట్టబడినది. దుఃఖోపహతుడు శోకతాప విమోహి యగును. అందుచే బంధుమిత్ర, ధన సంచయమువలని

స్నేహము విడచుట కర్తవ్యము. నూనెతో కూడిన వత్తి ఎట్లు కాలి పోవునో లోభముతో కూడిన వ్యక్తి స్వరూపనాశము పొందును. స్నేహంబున రాగంబును, రాగంబున కామంబును, కామంబున క్రోధం బును, క్రోధంబున తృష్ణయు పెంపొందును. తృష్ణ సర్వదోషముల కాస్పదము. కోటరస్థంబయిన అనలంబున చేసి దగ్ధంబగు వృక్షంబు వోలె దృష్ణాతురుడు వినాశము పొందును. అర్థవంతులకు రాజ చోర స్వజన జల అనలంబుల వలన భయంబు నియతంబు. నీటిలో చేపలు, ఆకాశమున పక్షులు మాంసమును ఎట్లు భక్షించునో అట్లే యెల్లరు అర్థవంతుని అనుదినము, అనుక్షణము అనేక విధముల భక్షింతురు.

"అర్థమ యనర్థ మూలం,
బర్థమ మాయావిమోహానావహము, నరుం
డర్థార్జన దుఃఖమున న
పార్థీకృత జన్ము డగుట పరమార్థ మిలన్."

(అరణ్య - ప్రథమ - 28)

అర్థంబువలన దరప, కార్పణ్య మాన భయోద్వేగంబులు పుట్టు గావున అర్థోపార్జనచింత విడువవలెను. ధనము సంపాదించుట కష్టము. అంతకంటె కష్టము దానిని రక్షించుట. అది చెడినచో ప్రాణము పోయిన భంగి మానవుని అలజడి పెట్టును. అందుచే మానవుడు లోభ మును దూరము చేసికొన్నపుడే హృదయము నిర్మలముగా నుండును.

మోహము

వివేకి యగు ముముక్షువునకు శరీర వ్యామోహము లేశము కూడ తగదు. మోహ మనగా నేమి? అజ్ఞానము, దేహాదులందును పుత్ర మిత్ర కళత్రాదులందును "నేను - నాది" యను భావము. ఇది మోక్షేచ్ఛగలవానికి మహామృత్యువు. అజ్ఞానమున మోహముపుట్టును.

ఈ మోహము అధర్మాపేపవర్జనమున తొలగును. అర్జునుడు తనకు శ్రీకృష్ణపరమాత్మ విశ్వరూపమును చూపించినపిమ్మట మోహాత మంబు తొలగిపోయినదని, సందేహనివృత్తియైనదని పలికెను. అందుచే మానవులు శరీరపోషణకు అత్యధిక ప్రాధాన్యము నీయక, సత్యపదా ర్థము పొందుటకు ప్రయత్నింపవలెను.

మ ద ము

మదమనగా గర్వము. ఇది త్రివిధము. ఇది కులమువలన ధనము వలన ఐశ్వర్యమువలన కలుగును. గర్వము పతనకారణము. సముద్రము లోని కెరటములు, ఉవ్వెత్తున పీచి క్షణములో పటాపంచలగును. అది ప్రకృతి స్వభావము. ఇదిచూచి మానవుడు గర్వమును పొందకుండుట లెస్స. త్రివిధ మదోన్మత్తులైన దుష్టచతుష్టయము ధర్మశీలురగు పాండ వులను పరాభవించి మహాపతివ్రతయగు ద్రౌపదికి ఘోర అపరాధము చేసి ద్యూతాగ్నిచే పుట్టిన అరణిచే మండిపోయిరి. భారతములో కౌర వుల మదాతిరేకము దాని విషఫలితములు వర్ణించి మానవులకు ధర్మ మునందు నిష్ఠ, గర్వమునందు భయము, కలిగించెను. కోపము, ఉబ్బు, గర్వము, అతృప్తి దురభిమానము, నిర్వ్యాపారత్వము, అనునవి కాపు రుష లక్షణములు. బాగుగనిండిన పండ్లతో చెట్లు ఏవిధముగా ఒంగి ఉన్నవో మానవుడు గర్వోన్మత్తుడు కాక వివేకముతో వినయమధురి మతో అలరారినపుడే సర్వమానవ ఆరాధ్యుడగును. సర్వసమ్మతుడగు జ్ఞాని గర్వముడిగి క్రోధమడచి శోకమునకు కుదురు కాక లోభమును విడిచి సౌఖ్యమును పొందును.

మా త్స ర్య ము

మాత్సర్యమనగా పరులయొక్క సంపదనుచూచి సహించలేక పోవుట. పరులను హింసింపవలెనను కోరిక కలిగియుండుట. ఇదియే

అసూయ, చలము, మాత్సర్యము అను పేరులతో పిలువబడుచున్నది. దుష్టచతుష్టయము అందున దుర్యోధనుడు, కర్ణుడు, అసూయ, మాత్స ర్యములయొక్క రూపములు. వారు పాండవులను హింసించుటకు పరాభ వించుటకు మట్టుపెట్టుటకు లెక్కలేనన్ని కుటిలు పన్నిరి. దైవబలము గల పాండవులపట్ల అవి బూడిదలోపోసిన పన్నీరువలె వ్యర్థమైనవి. లోకములో ఏకట్టెను నిప్పున్నచో ఆకట్టెయే కాలుననుట వ్యవహార ములో నున్నది. అట్లే మత్సరగ్రస్తులగు కౌరవులు నశించిరి. సత్త్వగుణ ప్రధానులగు పాండవులు తాత్కాలికముగ నిడుమలు పడినను, తుదకు విజయము పొందిరి. మానవుడు సత్త్వగుణము అభివృద్ధిచేసికొని గురు సాధు జన సంసేవనము చేయుచు మాత్సర్యము దూరముగ చేసి కొన్నచో చిత్తశుద్ధి ఏర్పడును. ఈ కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు అంతశ్శత్రువులు. బాహ్యశత్రువులను జయిం చుట పెద్ద కష్టము కాదు. ఈ అరిషడ్వర్గమును జయించుట ముముక్షు వునకు ప్రధానలక్షణము.

యోగము

భారతీయ విజ్ఞానములో ప్రతి తత్త్వశాఖయు పరమార్థమును సాధించుటకు ఉపకరణముగా నున్నది.

యుజ్ అనగా కలిపి బంధించుట.

యుజ్యతే ఏతదితి యోగః

యుజ్యతే అనేన ఇతి యోగః

మానవుని మానసిక శక్తులను అన్నిటిని ఏకముఖమునకు తెచ్చి సామ్యస్థితిని జేకూర్చి భగవన్మయ మొనర్చుట యని అర్థము. మన శక్తులన్నిటిని కలిపి యేకముఖమునకు తెచ్చి అత్యంత నిశితమైన యేకాగ్రతను సాధించి తన్మూలమున జీవావధులను భగ్నమొనర్చి

పరమాత్మ తాదాత్మ్యమునకు త్రోవ చేయవలెను. ఆత్మ తన్నావరించి యున్న కారాగారమును భేదించి, బయటకువచ్చి తనలో నిగూఢమైన నిజస్వరూపమును సాధించుట, ఆత్మవికాసము నొందుట, దైవప్రసిద్ధి నార్జించుట, మున్నగు వివిధదశలను విపులముగను సమగ్రముగను తెలుపు శాస్త్రమే యోగశాస్త్రము. పతంజలి మహాముని ఈ యోగ శాస్త్రమునుగూర్చి సాకల్యముగ వివరించెను.

బ్రహ్మవేత్తయగు పురుషుడు చిద్గత, సుఖలాభమునొందు చున్నాడు. అతడు బ్రహ్మయోగయుక్తుడగుచు అక్షయమగు సుఖమును భోగించుచున్నాడు. వివేకవంతుడగు పురుషుడు ఇంద్రియార్థ, రూప విషయసుఖమునందు ఆసక్తుడు కాడు. ఇంద్రియార్థములచే కలిగెడు సుఖములన్నియు సుఖాభాసములే. అవి తాత్కాలికముగ సుఖప్రద ముగ కనిపించినను కాలాంతరమున దుఃఖప్రదములగును. బాహ్యజగ త్తునకు సంబంధించిన సుఖము, ఆరామము, జ్యోతి, అనిత్యములని తెలి సికొని అంతర్జగత్తునకు సంబంధించిన సుఖారామ జ్యోతిరూపమగు సావి ద్యకజ్ఞానమే సంపాదించి యెవడు బ్రాహ్మీభూతుడగుచున్నాడో అట్టి వాడే బ్రహ్మనిర్వాణము పొందుచున్నాడు.

కామక్రోధములు లేనివారును, యతచిత్తులును, ఆత్మతత్త్వజ్ఞు లైన యతులకు బ్రహ్మనిర్వాణమన్ని విధముల చేతను అతి శీఘ్రముగ లభించుచున్నది. సంసారస్థితుడగు నిష్కామకర్మయోగి సదసద్విచా రము చేసి ప్రకృతి కతీతమును, సత్పదార్థమును అగు బ్రహ్మయందవ స్థితి పొందుచున్నాడు. అప్పుడతనికి జడదుఃఖరూపమగు క్లేశమునుండి నిర్వాణము కలుగుచున్నది. దీనినే బ్రహ్మనిర్వాణమని యందురు. ఈశ్వరార్పితమగు కర్మయోగముచే అంతఃకరణ శుద్ధి కలుగును. అంతఃకరణ శుద్ధిచే త్వం పదార్థ నిరూపకమగు జ్ఞానము కలుగును. ఆ

జ్ఞానముచే తత్ పదార్థజ్ఞాన స్వరూపమగు భక్తి, గుణాతీత జ్ఞానముచే భక్తిజనిత బ్రహ్మానుభవము క్రమానుసారముగ సిద్ధించును

బ్రహ్మానుభవము కలుగుటకు సాధనరూపమగు అష్టాంగయోగ మున్నది. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనెడి బాహ్య స్పర్శలను మనస్సునుండి తొలగించి అనగా ప్రత్యాహార సాధన మొనర్చి నేత్రములను భ్రూమధ్యమందు చేర్చి నాసికాగ్రమందు దృష్టి నిలుపదగును. పూర్తిగా మూసినచో నిద్రయను శంక కలుగును. పూర్తిగా తెరచినచో బహిర్దృష్టి అను శంక కలుగును. అందుచే అర్ధనిమీలిత నేత్రద్వయము భ్రూమధ్యమున (నాసికాగ్రమున) నిలుపవలెను. రెండు నాసికానాళములయందు సంచరించు ఉచ్ఛ్వాస నిశ్వాసరూపములగు ప్రాణాపాన వాయువుయొక్క ఊర్ధ్వ అధోగతులను నిరోధించుట మూలమున వాని సమానత్వము సాధింపబడుచున్నది. ఈ విధములగు ఆసన, ముద్రలతో కూడి జయింపబడిన ఇంద్రియ మనోబుద్ధులు కలవాడును మోక్షపరాయణుడును అగు ముని ఇచ్ఛా భయ, క్రోధములను పరిత్యజించి బ్రహ్మానుభవాభ్యాసముచేసి గుణాతీతధర్మరూపమగు జడముక్తి లాభము పొందగలుగుచున్నాడు. కావున నిష్కామకర్మ యోగసాధన కాలమంతు అష్టాంగయోగమును తదంగముగ భావించి సాధింపవలెను.

కర్మఫలమును విడిచి కర్తవ్య కర్మల ఎవడాచరించునో ఆతడే సన్యాసి. ఆతడే యోగి. పరిశీలించినచో సాంఖ్యమునకు, కర్మయోగమునకు, అష్టాంగయోగమునకు ఇసుమంతయైనను భేదము లేదు. పామరులు వీనియందు భేదబుద్ధిని కల్పింతురు. యోగ మనునది మోక్ష సాధమునకు సోపానమువంటిది జీవు జీవనముయొక్క అతినీచావస్థ మొదలుకొని విశుద్ధమగు చివరస్థ పర్యంతము సోపానమగుచున్నది.

కాని ఈ అవస్థల మొత్తమునకే యోగమని పేరు. యోగ సోపానము నకు ధ్యానము, యోగము - రెండును ముఖ్యములు. యోగాభ్యాస కర్మ అను ఆరోహణప్రాప్తికి ఎవరు ఆరంభింతురో వారిని యోగారురు క్షువు అందురు. జ్ఞాన నిష్ఠుడైన యోగారూఢునకు సర్వకర్మ పరిత్యాగ రూపమగు శమము లక్ష్యమగుచున్నది. యోగి కెప్పుడు చిత్తవృత్తి నిరోధము కలుగుచున్నదో అతని స్థితి వాయుశూన్యమగు గృహము నందలి దీపమువలె ప్రకాశించును.

యోగాభ్యాసముచే విషయోపరతి కలిగి చిత్తము క్రమముగ జడవిషయములనుండి మరలింపబడుచున్నది. అప్పుడు సమాధియనెడి అవస్థ కలుగుచున్నది. ఆ అవస్థయందు పరమాత్మయొక్క ఆకారము నొందిన అంతఃకరణముచే పరమాత్మను దర్శించి తజ్జనితమగు సుఖ లాభమును యోగి పొందుచున్నాడు. పతంజలి రచించినదర్శనశాస్త్రము శుద్ధమగు అష్టాంగ యోగమునకు సంబంధించినది. ప్రాకృత గుణములు ధర్మార్థ కామ మోక్ష రూపములగు పురుషార్థములచే వర్జి తములైనచో క్షణికమగు వికారము సంభవింప నేరదు. అప్పుడు చిద్ధర్మ మునకు కైవల్యము కలుగుచున్నది. తన్మూలమున చిత్స్వరూపమందు ప్రతిష్ఠ కలుగుచున్నది. దానినే చిత్ శక్తి యందురు. ప్రకృతివికార శూన్యమగు ఆనందమే వ్యక్తమగుచున్నది. ఆ ఆనందమే సుఖ స్వరూపము. అదియే యోగమునకు చరమఫలము.

సమాధి రెండువిధములు : 1. సంప్రజ్ఞాతము, 2. అసంప్రజ్ఞా తము. సంప్రజ్ఞాతసమాధి, సవితర్క సవిచారాది భేదములు కలిగి బహువిధము లగుచున్నది. కాని అసంప్రజ్ఞాత సమాధి ఒకేవిధముగ నుండును. ఈ అసంప్రజ్ఞాత సమాధియందు విషయేంద్రియ సంపర్క రహితమును ఆత్మాకారమునొందిన బుద్ధిచేతనే గ్రాహ్యమును అగు

ఐకాంతిక సుఖలాభము కలుగుచున్నది. అట్టి విశుద్ధము అగు ఆత్మ సుఖమందు అవస్థితినొందిన యోగియొక్క చిత్తము చిత్తత్వమునుండి చలింపదు. ఈ అవస్థాలాభము పొందజాలకపోయినచో అష్టాంగ యోగము జీవునకు మేలుకలిగింపదు. ఎందుచేతననగా ఈ యోగము నందు విభూతిరూపములగు అవాంతరలాభములు కలిగి వానిచే చిత్తము ఆకర్షింపబడి, చరమోద్దేశ రూపమగు సమాధి సుఖమునుండి విచలితము చేయును. సకల విఘ్నములగు అంతరాయములను గెలిచి నపుడే యోగి నిజమైన పరమపదమును పొందగలడు.

యోగమునకు సంబంధించిన ప్రాథమిక కార్యములగు యమ, నియమ, ఆసన ప్రాణాయామములచే కలుగు సిద్ధఫల సంకల్ప జనిత కామ సమూహమును అన్నివిధములచేతను, దూరముచేసి మనస్సుచే ఇంద్రియములను నియమించుచు పిమ్మట ధారణారూపమగు సంగము నభ్యసించి లబ్ధబుద్ధియగుచు క్రమముగ ఉపరతి అవలంబింపవలెను. ధ్యాన ధారణ ప్రత్యాహారములచే మనస్సును లెస్సగ వశీకృత మొన ర్చుకొని ఆత్మసమాధి సంపాదింపవలెను. అపుడు దేహయాత్రకొరకు విషయవ్యాపారమున్నను దాని యందాసక్తి కలుగదు. చంచలమైన అస్థిరమైన మనస్సు ప్రయత్నపూర్వకముగ ఆత్మవశమందుంచి అభ్యా సముచే విఘ్నములు దూరముచేసి ఎవనిమనస్సు ప్రశాంతి పొందునో అట్టి ధర్మనిష్ఠుడు, పాపశూన్యుడై రజోగుణ ముపశమించి పరబ్రహ్మాను శీలనముచే కలిగిన అమృతత్వము పొందును.

వ్యాసమహర్షి అనాదికాలమునుండి యోగశాస్త్రమునుగూర్చి ఆర్యఋషీశ్వరులు సప్రమాణముగా చెప్పియున్నారో, ఆఋషిప్రోక్త ములైన యోగశాస్త్రములకు సంబంధించిన విషయములు భారత ములో సందర్భోచితముగ సమకూర్చెను. అట్టి క్లిష్టమైన శాస్త్రవిష యములను తిక్కనమహాకవి ఆంధ్రమహాభారతములో సర్వజనసుబోధక

మగునట్లు తేట తెలుగు పలుకులలో మృదుమధురముగా నేర్చికూర్చెను. సర్వశాస్త్రముల సారము భారతాంతర్గతమగుట దాని ప్రామాణ్యము ద్విగుణీకృతమైనది. ఈ యోగానుష్ఠాన విధానము శ్రీకృష్ణ, వ్యాస, నారద, సనత్కుమార, శివాదులు సోపపత్తికముగా చెప్పియున్నారు.

ధర్మము సాధించుటకు ఉత్తమసాధనము శరీరము. ధర్మము పరిజ్ఞానదాయి. అందుచే మానవుడు శరీరమును ఉపేక్షింపక భద్రముగా రక్షించుకొనవలెను. మానవుడు ఎంతవరకు ముక్తిపదము పొందక యుండునో అంతవరకు జనన మరణ పరంపర పొందవలసినదే. దానము, శమము, దమము, బ్రహ్మచర్యము, వ్రతపరిరక్షణ, జననీ జనక సమారాధనము, సత్యము, శౌచములు మోక్షపదమును పొందుటకు సోపాన పంక్తులు. ముముక్షువు జగత్తుయొక్క అశాశ్వతత్వము గుర్తించి, తనను కప్పెడు మోహావేశము త్రోసివైచి మోక్షము పొందవలెను. జీవిక, జన్మ, జర, మరణ, రుజలు ప్రకృతిస్వభావములను లెస్సగా ఎఱింగి తజ్జనిత క్లేశమునకు విసివిన మానవుడు పునరావృత్తి రహితమైన మోక్ష సామ్రాజ్య పట్టభద్రుడగుటకు ప్రయత్నించును. యోగి లాభాలాభములు, ప్రియద్వేషములు సుఖదుఃఖాది ద్వంద్వాతీతుడై స్వధర్మతంత్రలోలుడయ్యును తనలోనున్న పరమాత్మ సందర్శనముచేసి అవ్యయపదము నొందును.

ఆత్మానుసంధానసౌఖ్యము అనుత్తమము, అద్వితీయము, పరమము. యోగి పరమాణువుకంటె సూక్ష్మాతిసూక్ష్మమైన ఆత్మతత్త్వము నెఱుగు విధమును తిక్కనార్యుడు మనోజ్ఞమగు ఉపమాలంకారములో తీర్చిదిద్దెను.

పాలకడవ పెక్కుపసులలో డించిన
యాత డెట్లు దాని నరసికొనుచు

నుండునట్లు లోన నునిచిన మనసు నే
మఱక యాత్మ వెదకు తెఱగు మేలు.

(అశ్వమేధ - ప్రథమ - 220)

వృత్తి విశేషమున జనిన చిత్తము నిరోధించి మనసు ఆత్మ యందు చేర్చుటయే యోగానుష్ఠానమందలి రహస్యము. ఆనుశాసనిక పర్వములో విష్ణుదేవుడు గరుత్మంతునకు ఆత్మతత్త్వము ఉపదేశించెను. మోహపంకమగ్నులగువారికి, కేవల ఉపవాసములచేతగాని, వ్రతంబుల చేతగాని, పరబ్రహ్మమును నెఱుంగ శక్యము కాదు. రజస్తమో దూషితము కాక కేవల సత్త్వగుణప్రధానమైన జ్ఞానంబున వాసుదేవ సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధనామంబుల చతుర్విధంబుల విభక్తమైన తత్త్వమును గ్రహింపనగును. ఆహారము తీసికొన్న వెంటనే యోగము నకు దొడగుట వలదు. మనసు చెదరిపోకుండ నిరోధించుటకు అధిక నిష్ఠ కావలెను. నిర్జనము, నిశ్శబ్దమైనప్రదేశము హృదయస్థుడగు దేవుని చూచుటకు యోగ్యమైయున్నది. యోగధర్మము సర్వోత్కృష్ట మని ప్రస్తుతింపబడినది.



# ೭. భారతసందేశము

1. సత్యము : ధర్మము బహుప్రకారంబై యుండును. తదీయ సూక్ష్మగతి దురవబోధంబు కావున శ్రుతి ప్రమాణము వలనను, వృద్ధాచార నిదర్శనమువలనను తెలియవలెను. భారతము సత్యాహింసల స్వరూప, స్వభావములనుగూర్చి ధర్మసూక్ష్మమును విశద మొనర్చినది. ఇది సత్యము – ఇది అహింస అని చెప్పుటకు మానవుని పరిమితజ్ఞానము సరిపోదు. ధర్మమూలమైన వేదాది శ్రుతులు, మన్వాది స్మృతులు సత్యమును సమగ్రముగా నిర్వచించినవి. వేదములు, శాస్త్రములు, ఉపనిషత్తులు నిరూపించిన సత్యముయొక్క స్వరూపమును భారతకారులు సర్వతోముఖముగ నిర్దేశించి చెప్పిరి. ఆ చెప్పుటలో భారతము శాస్త్రకావ్యమగుటచే శాస్త్రత్వము, కావ్యత్వము అవలంబించినది.

సత్యమనగా సర్వభూత హితము. సత్యభాషణము, సర్వధర్మములకంటె మాలీభూతమైనది. అనాదికాలమునుండియు సత్యము ధర్మము అవినాభావసంబంధము కలిగియున్నవి. సమత, దమము, తితిక్ష, అమత్సరము, హ్రీ, ధృతి, అనసూయ, ఆర్యత్వము, అహింస, దానము, క్షమ, త్యాగము, సూనృతము సత్యముయొక్క రూపములు. సత్యాకృతులైన ఈగుణములు నిత్యానుష్ఠిత సమగ్ర నిర్మలయోగ స్థిత్యభిముఖునకు సులభముగ సిద్ధించును.

లోకములో ధర్మాధర్మంబులు, ప్రకాశతమంబులు, బోధాజ్ఞానంబులు, స్వర్గనరకములు, అని పిలువబడుచున్న వ్యావహారిక శబ్దములకు అర్థంబులై సత్యానృతంబులు ప్రవర్తిల్లుచున్నవి. సత్యము సుఖాపాదకము. అనృతము దుఃఖాత్మకము. అందుచే సుధీజనులు దుఃఖాత్మకమైన అనృతంబును తొలగించుకొనుటకు మోహము నివారించు నియమములను ఆచరింతురు. వేదముయొక్క సారము సత్యము. సత్య

సారము దమము. దమమనగా ఇంద్రియనిగ్రహము. దమసారము మోక్షము. తత్కారణముచే సత్యసమాశ్రయణము చేసినవారికి మోక్షము కరతలామలకము.

ధర్మవ్యాధుడు సత్యస్వరూపమును ధర్మార్థ మధురముగా వ్యాఖ్యానించెను. భూతములకు హితము కలిగించు బొంకు సత్య ఫలము ఒసంగును. జీవులకు భయావహమగు సత్యము అసత్యమే. ప్రాణము పోవునపుడు, వివాహసమయంబున పలుకునట్టి అసత్యము, సత్యమే అని ఫలితార్థము. సత్యపరమార్థము సర్వభూతహితము. సత్యము పలుకుట సర్వధర్మములకంటె శ్రేష్ఠతమము. అసత్యము మేటిపాతకము. అందున తెలియవలసిన విశేషమున్నది. ఇతరుల ధన, ప్రాణాదుల నపహరింప చూచు పాతకులతో సత్యము పలుకుట పాపము. అట్టి సందర్భములో అసత్యమైనను పలికి లోకకంటకులను నిర్మూలింపచేయుట ఉత్తమో త్తమ ధర్మము. భూతములకు హితముచేయు బొంకు లన్నియు ధర్మములే. భూత బాధకంబులగు సత్యములు పాతకములు. భూతముల యొక్క దుష్టత్వ శిష్టత్వములు వివేక సూక్ష్మతావేద్యములు.

2. అహింస : జీవులకు కాయికముగ, మానసికముగా అపకారముచేయుట హింస. త్రికరణశుద్ధిగ సర్వభూతములయందు దయ కలిగియుండుట అహింస.

"అహింసా పరమో ధర్మః" అహింసయే పరమ ధర్మము.

దంతియడుగులోన అన్ని జంతువుల అడుగులన్నియు అణగి పోయిన విధమున ధర్మకోటిలో అహింస శ్రేష్ఠమైనది. హింస నాలుగు విధములు.

(1) మానసికము, (2) వాచికము, (3) కాయికము, (4) మాంస భక్షణము అనునవి హింస విధములు. మాంస భక్షణమునందు రుచి

మరగినవాడు దానిని మానుట కడు కష్టము. అన్నిటికంటె మాంస భక్షణము కడు కీడు కలిగించును. మాంసమును ఎవరు నములుదురో వారిని మాంసము నములును. మాంసముయొక్క రుచి కడమ చవుల కంటె ఎక్కువ యని భావింతురు. ఏ నరుడు మాంసమును కోరునో అతడు దనుజుడు. దేవతలు మాంసముడిగి దానవులవలన భయము పోవద్రోలిరి. దానము, ధర్మము, తపము, నిష్ఠ మొదలగు సత్క్రియల కంటె అహింస సర్వోత్తమమని శ్రుతులు ఉద్ఘోషించుచున్నవి. శత వర్షములు దుష్కరతపము చేసినవానికి కలుగు ఫలము నంజుడు తినని వానికి సిద్ధించును. భారతము ప్రతి మానవుడు ఒక ప్రశ్న వేసికొని హింసను వర్జించు ఉపాయమును సూచించినది. దయ లేకుండ ఆకలి తీర్చుకొనుటకొఱకు మానవులు ప్రాణుల శరీరములను నొంచుబాధ, తమను అట్లు చేసినచో ఎట్లుండునని భావించినచో ఉత్తముడు హింసను దయార్ద్ర చిత్తముతో మానును. ఇది హింస, ఇది అహింస అని చెప్పుట కష్టము. విశేష శాస్త్రముచే అహింస పరమధర్మము. అప వాద శాస్త్రముచే శ్రుతిచోదిత హింసవలన కీడు రాదు. మానవుడు తన ఆకలి తీర్చుకొనుటకొఱకు జీవులను హింసించుట మహాపాతకము. పితృకార్యములయందు, యజ్ఞములయందు వేదప్రతిపాదితమైన హింస అహింసయే

"పితృకార్యయజ్ఞముఖముల
శ్రుతిచోదితహింస గీడు సొరనేరదు వి
శ్రుతగుణ మాంసము చవి గో
రి తినం బ్రాణి దెగటార్చుక్రియ పాప మగున్."

(ఆనుశాసనిక - చతుర్థ - 291)

ఒకవ్యక్తికి హింస అగునది మరియొక వ్యక్తికి అహింసయగును. నరపాలుడు ప్రజలనందరిని ధర్మమార్గమున నడిపించుటకు దండనమును

సాధనముగ స్వీకరించును. జీవన్ముక్తుడగు జనకమహారాజునకు పరాశర మునీశ్వరుడు హింసా అహింసల స్వరూప స్వభావములనుగూర్చి సాకల్యముగ వివరించెను. క్షమము, శమదమము లేని జనులు హింసయొనర్చెదరు. బుధులు శమ దమములు మనసులో పదిలపరచుకొని, అహింసా పరాయణులయ్యెదరు. నరులలో నరపతులకు విశేష ధర్మమున్నది. నరపతులు యుద్ధములో జయముపొందుటకు హింస చేయవలెను. అయినను రాజులకు హింసను పరిహరించు స్థలములు కలవు.

"పడినం బాఱిన గైదువు
పడినను వాహనము పడిన బార్థివముఖ్యా
పొడువ దగదు శత్రుని నె
వ్వెడల నహింసనము బోల వేసుకృతములున్."
(శాంతి - పంచమ - 514)

రాజు తనతో తుల్యుడైన వానిని, అధిక బల సమగ్రత్వము కలిగిన శత్రువును వధియించిన పుణ్యలోక సిద్ధి కలుగును.

అనుశాసనిక పర్వములో శివుడు పార్వతికి అహింసనుగూర్చి హేతుపూర్వకముగా వివరించెను.

3. నహుషప్రశ్నలు : యక్షప్రశ్నలు :

ధర్మవిచికిత్స, ధర్మాధర్మ నిర్ణయము చేయుటలో పతితమనస్సునకు ఒరపిడి కలిగించి తుదకు పొందవలసిన సిద్ధాంతము పొందునట్లు చేయుట ఆర్ష సంప్రదాయము. వీనికన్నింటికి మానవులను ధర్మప్రవణ హృదయులుగా చేసి, సుశీలురుగా మలచి, ఇహలోక పరలోకములలో సౌఖ్యము పొందునట్లు చేయుటయే ప్రధానప్రయోజనము. విష్ణువు యొక్క అంశములో పుట్టిన వ్యాసునకు వ్యాసుడే సాటియని భారతము చదివిన మేధావు లంగీకరించినదే.

నహుష, యక్ష ప్రశ్నలకు ధర్మరాజు ప్రత్యుత్తరము చెప్పెను. అవి ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, అధి దైవికములకు సంబంధించినవై మానవుని హృదయములో హత్తుకొనునట్లు చేయబడినవి.

నహుష ప్రశ్నలు, యక్ష ప్రశ్నలు ఆశ్చర్యముతో కూడియుండి మానవులకు ఎంతయో ప్రబోధమును చేయుటకు సమర్థమైయున్నవి.

ఆధ్యాత్మికోపదేశము

ఈశావాశ్యోపనిషత్తులో జగత్తుయొక్క అస్థిరత్వము, పరబ్రహ్మముయొక్క నిశ్చలత్వము చర్చింపబడినవి. ఆ ఉపనిషత్తుసారమే ఇందు అనుసంధింపబడినది. పరబ్రహ్మ భయముచేతనే సూర్యుడుదయించుచున్నాడు. వాయువు వీచుచున్నది. అగ్నియు, ఇంద్రుడు స్వస్వవ్యాపారముల ప్రవర్తించుచున్నారు. మృత్యువుకూడ అతని భయముచేతనే స్వకార్యము నిర్వహించుచున్నది.

సర్వ ధర్మములకంటె శ్రేష్ఠమైనది సర్వభూతములయందు దయ కలిగియుండుట. కీర్తి దానమువలన కలుగును. త్యాగమే అమృతత్వమునకు మార్గము. సత్యమాశ్రయించినచో స్వర్గమును చేరవచ్చును. మానవులకు శీలమే సర్వసుఖముల నొసంగును. బ్రాహ్మణులకుండవలసిన ప్రధాన లక్షణములు సత్యము, క్షమా, దమము, శౌచము, దయ, తపస్సు, దానము, శీలము అవి ఉన్నవాడే బ్రాహ్మణుడు.

బ్రాహ్మణుడు అధ్యయనముచేత దేవభావము, అధిక వ్రతశీలతచే సాధుభావము పడయును. విశిష్టవృత్తి దిగద్రావి అసాధువగును. శౌచనియతి లేకపోవుటచే మృత్యువును పొందును. మానవునకు పరమమిత్రుడు ధర్మము దేవతలకు, అతిథులకు పితృదేవతలకు కనీసము సేవకులకు పెట్టకుండ తినువాడే జీవన్మృతుడని చెప్పబడినది. సర్వజగత్తునకు దిక్కు సజ్జనుడు. మానవుడు గర్వముడిగిన సర్వజన

సమ్మతుడగును. క్రోధ మడచిన శోకము పొందడు. లోభరహితుడే నిజముగ ధనవంతుడు. తృష్ణవిడిచిన సౌఖ్యము కరబదరమగును. తుదకు పురుషశబ్దమునకూడ చక్కగ నిర్వచించియున్నాడు.

"దివి ముట్టి ధరణి యంతట
నిగిడి మెఱయుచుండు నెవ్వని యశోరమ, య
ట్టి విశిష్ట చరిత్రుడు య
శువరా పురుషుండు నా బ్రకాశత నొంమున్."

(అరణ్య - సప్తమ - 454)

ప్రియము, అప్రియము, సుఖము, దుఃఖము, భూత, భావి కార్యములు ఏ భవ్యునకు సమంబులో ఆ వ్యక్తి సర్వధని యనబడును.

## ఆధిభౌతికోపదేశము

మానవులకు శీలము పెట్టని ఆభరణము. ఒకవ్యక్తి ఉత్తముడు, నీచుడు అని తెలుపుటకు ఒరిపిడి రాయి శీలమే. నేడు లోకములో అధిక సంఖ్యాకులలో ఏదో విధముగ అడ్డముగ డబ్బు సంపాదించుట, సకలభోగము లనుభవించుట మానవజీవిత పరమార్థ మని నినాదము ప్రచారము చేయుచున్నారు. ధర్మమని శీలమని నడచునారు లోకపు దృష్టిలో చేతకానివారు, చవటలక్రింద జమకట్టుచున్నారు. అట్టివారికి హెచ్చరిక చేయుచున్నాడు.

"విత్తహీనుండు వెండియు వివిధ విధుల
విత్తవంతుండు కానేర్చు, వృత్తహీను
డైనవాడు విహీనుండ యండ్రుగాన
విత్తరక్షకు గడు మేలు వృత్తరక్ష."

(అరణ్య - చతుర్థ)

వృత్తి ఏదైనను, వృత్తము సద్వృత్తము కావలెను. మానవుడు సకల శాస్త్ర నిక్షిప్తములైన విషయములు విని శ్రోత్రియుడగును. అతుల తపంబుచే మహత్త్వము పొందును. విన్నదానిని, దర్శనము చేసినదానిని, ధైర్యముతో ఆచరణలో పెట్టవలెను. సత్సాంగత్యము వలన బుద్ధిమంతుడగును.

విజ్ఞాన శాస్త్ర విషయము భారతములో ఆశ్చర్యకరముగ చర్చింపబడినది. విజ్ఞాన శాస్త్రజ్ఞులు అత్యధిక వేగముతో ప్రయాణము చేయునది కాంతి, ధ్వని అని చెప్పుచున్నారు. భారతకారుడు అన్నిటికంటె వేగముగా ప్రయాణము చేయునది మానవుని మనస్సు అని చెప్పియున్నాడు. కంప్యూటర్సు కనుగొన్నను మానవుని మనస్సును పూర్తిగా అర్థముచేసికొనుట విజ్ఞాన శాస్త్రజ్ఞులకు ఇంకను అంతుపట్టలేదు. చేప నిద్రించియు కన్ను మూయదు. గ్రుడ్డు పుట్టియు చేతనత్వము పొందదు. అన్నిటికంటె ఆశ్చర్యకరమైన విషయము ఒకటి కలదు. మానవుడు ప్రతి క్షణము మృత్యు సన్నిహితుడయ్యును ఉట్టి గట్టికొని వ్రేలాడు విధమున ప్రవర్తించుట శోచనీయము. బాటసారికి ఆహారమును, రోగార్తునకు వైద్యుడును, గృహస్థునకు భార్యయు, మృతి పొందినవానికి ధర్మమును పరమ మిత్రములు.

# . భారతము - కావ్యన్యాయము

## (Poetic Justice)

న్యాయమనగా "నియత మీయతే న్యాయః"

(అమరము - క్షు॥ వ॥ 23)

నియతముగా పొందబడునది. తన కుచితమైన ధర్మమువలన చలింపకుండుటయు న్యాయము. పరమేశ్వర సృష్టిలో నొక నియతి కనిపించుచున్నది. సూర్యుడు ఉదయించి సకల జీవకోటిని తమ తమ

వ్యాపారములలో నియుక్తుల నొనరించి అస్తమించుచున్నాడు. చంద్రుడు తనపేరును సార్థకము చేసికొనుచు సకల జనాహ్లాదము కలిగించుచు సకల ఓషధులను పెంచి జీవకోటికి ఆహారమును ప్రసాదించుచున్నాడు. నీరు మెరకనుండి పల్లమునకు ప్రవహించుచున్నది. అగ్ని మండుచు తనను తాకినవారిని దహించుచున్నది. సముద్రము చెలియలకట్ట దాటకుండ ఉండి పరమేశ్వర మహత్త్వమును భయానకత్వమును సూచించుచున్నది. దీనినిబట్టి ప్రకృతిలో ఏ అల్పవిషయమును పరిశీలించినను ఒక న్యాయము ఒక తత్త్వము గోచరించుచున్నది. బ్రహ్మసృష్టిలో ఎట్లు న్యాయము పరిణామశీలము మాధుర్యము కలిగించుచున్నదో కవులు రచించిన కావ్యములలోకూడ ఒక న్యాయము పోషింపబడినది. లోకములో తెలిసినవ్యక్తి అయినను తెలియని చిట్టిపాపాయి అయినను అగ్నిని తాకినచో కాల్చుట దాని నిసర్గగుణము. అట్లే దోషము తెలిసి చేసినను తెలియక చేసినను దాని శిక్ష పొందక తప్పదు.

మానవుడు అపరాధము చేసినచో ఆ దోషికి ఆ దేశపు ప్రభువు దోషానుగుణమైన దండనము విధించి సన్మార్గమున పెట్టి యమదండనము లేకుండ చేయుట సనాతన భారతీయ రాజధర్మము.

మానవుడు అనుకరణశీలి. మానవులను ధర్మమార్గమున ప్రవర్తింపచేయుటకు సాంఘికవ్యవస్థను సుప్రతిష్ఠిత మొనర్చుటకు దండనము ఉత్తమ సాధనము. పూర్వోదాహృతమైన న్యాయమునకు అపవాదము లేకపోలేదు. సాధారణలోకములో నేరము చేసినట్లు బలమైన సాక్ష్యమున్నపుడే దోషికి న్యాయనిర్ణేత శిక్షవిధించుట జరుగుచున్నది. కాని నేరము చేసినవ్యక్తి ధనవంతుడు, అధికారి, రాజకీయ ప్రాబల్యము కలవాడు అయినచో హత్యాదులు చేసినను తనధనము, అధికారము, పలుకుబడి దుర్వినియోగము చేసి శిక్షపడకుండ తప్పించుకొని గౌరవ

నీయమైన వ్యక్తిగా సంఘములో చలామణి అగుట మనము చూచు చునే యున్నాము. నేడు అమలులోనున్న శిక్షాస్మృతి అమాయకునికి శిక్ష పొందకుండ రక్షించుటయే ప్రధానధ్యేయమని నొక్కి చెప్పు చున్నది. నూటికి కోటికి ఒక దోషి శిక్షపొందకుండ తప్పించుకొన్నను పెద్దప్రమాదము లేదని చెప్పుచున్నది. ఆధునిక శిక్షాస్మృతి లోప భూయిష్ఠము. ఇది లోకన్యాయమునకు సంబంధించినది. ఇక కావ్యము నకు న్యాయమునకు గలసంబంధమేమి ? పరమేశ్వరుడు సృజించిన జీవ కోటిలో మానవుడు విశిష్టుడు. ఆ మానవులలో కవియొక్క స్థానము అనితర సాధారణము.

ధర్మము ఎచటనుండునో జయము అచట కలుగును. అధర్మము నశించును. సజ్జనులు సత్యధర్మములను నమ్మకొన్నవారు తాత్కాలిక ముగ అనేక కష్ట నిష్ఠురములకు లోనయ్యును జీవిత నాటకాంతమున ధర్మవిజయము పొందుట తథ్యము. ఇదియే కావ్యన్యాయము. ఆంగ్ల ములో కావ్యన్యాయమునుగూర్చి విపులముగ చర్చింపబడినది.

బ్రాడ్లీ మహాశయుడు కావ్యన్యాయమునుగూర్చి షేక్సుపియరు రచించిన నాటకములపై విమర్శ చేయుచు విపులముగ చర్చించి యున్నాడు.

"Poetic justice means that prosperity and adversity are distributed in proportion to the merits of the agents."

ప్రపంచ మహాకవులలో షేక్సుఫియరు మహాకవి విశిష్ట స్థాన మలంకరించియున్నాడు ఆ మహాకవి కావ్యన్యాయము పాటించ లేదని జాన్సన్ పండితుడు ఆరోపించియున్నాడు.

"His first defect is that to which may be imputed most of the evil in books or in men. He sacrifices virtue to convenience, and is so much more careful to please than to instruct, that he seems to write without any moral purpose. From his writings

indeed a system of social duty may be selected, for he that thinks reasonably must think morally; but his precepts and axioms drop casually from him; he makes no just distribution of good or evil, nor is always careful to show in the virtuous a disapprobation of the wicked; he carries his persons indifferently through right and wrong, and at the close dismisses them without further care, and leaves their examples to operate by chance. This fault the barbarity of his age cannot extenuate; for it is always a writer's duty to make the world better, and justice is a virtue independent of time or place.''

(A Preface to Shakespeare - Samuel Johnson)

జాన్సను అభిప్రాయమును పూర్తిగా సత్యము కాదని బ్రాడ్లీ మహాశయుడు వివరించియున్నాడు. షేక్స్పియరు నాటకములలో కావ్యన్యాయము అసలు లేదని చెప్పుటకు వీలులేదు. ఏ వ్యక్తి పాపము చేయునో అతడు అవశ్యము దాని విషఫలితము అనుభవింపక తప్పదు. విషాదాంత రూపకములలో నాయకుడు హత్యలుచేసి పొందిన మానసిక క్షోభ వర్ణనాతీతమైనది. అది కావ్యన్యాయమునకు సంబంధించినదై యున్నదని చెప్పవచ్చును. డంకను మరణానంతరము లేడి మేకబెత్ పొందిన మానసిక క్షోభ చూచినయెడల పాపముయొక్క విషఫలితము ఎట్టిదో తెలియుచున్నది.

Such 'Poetic justice' is in flagrant contradiction with the facts of life, and it is absent from Shakespear's tragic picture of life; indeed, this very absence is a ground of constant complaint on the part of Dr. Johnson. 'the doer must suffer' - this we find in Shakespeare. We also find that villainy never remains victorious and prosperous at the last. But an assignment of amounts of happiness and misery, an assignment even of life and death, in

proportion to merit, we do not find. No one who thinks of Desdemona and Cordelia; or who remembers that one end awaits Richard III and Brutus, Macbeth and Hamlet; or who asks himself which suffered most· Othello or Iago; will ever accuse Shakespeare of representing the ultimate power as 'poetically' just.

(Shakespeare an Tragedy - A. C. Bradley - 23).

పాండవులకు విజయము, కౌరవులకు అపజయము ఏల కలిగినది? భారతకథయంతయు పరిశీలించినచో న్యాయము జయించును, అన్యాయము ఓడిపోవును అను సిద్ధాంతముపైననే నడిచినది. సకల ధర్మసారము భారతము. పరమధర్మము మోక్షమునకు సాధనము. అపరధర్మము లౌకికలోకములో కీర్తిని ధనాది సౌఖ్యముల నొనగూర్చును. మానవులు మోక్షమును ధ్యేయముగ నుంచుకొని పురుషార్థమును సాధింపవలెను. అపర ధర్మమునకు పరమధర్మమునకు తీవ్రమైన సంఘర్షణ తటస్థించును. ధర్మరాజు, భీష్ముడు, శ్రీకృష్ణుడు పరమధర్మమును ఆచరించిరి. దుర్యోధనుడు పరమధర్మమును పూర్తిగా త్రోసివేసి రాజధర్మమును మాత్రమే స్వార్థము కొరకు అనుసరించెను. దుర్యోధనుడు పదునొకండు అక్షౌహిణుల సేన కలిగియు, భీష్మద్రోణ కృప కర్ణ అశ్వత్థామాది మహాదానుష్కులు కలిగి ఉన్నను, ఓడిపోవుట మనకు ఆశ్చర్యము కలిగించును. దానికి కారణము కలదు. దుర్యోధనుడు పరమధర్మమును నిరాకరించి కామక్రోధాది అరిషడ్వర్గమునకు బానిసయై చేయరాని అకార్యములు, అన్యాయములు, దుర్భావలు, పాపములు చేసి సమూలముగ నాశనమయ్యెను.

సామాన్యముగ లోకములో పాపాచారులు దినదినాభివృద్ధి పొంది అష్టైశ్వర్యములతో తులతూగుచుందురు. సత్యధర్మములను నమ్ముకొన్నవారు పాండవులవలె చాలకాలము కష్టములతో కన్నీళ్ళతో దినదినమునకు క్రుంగిపోవుచుందురు. ఇది చూచినవారికి

నైరాశ్యము కలుగుట, సహజము. అట్టివారికి వ్యాసమహర్షి చక్కని సమాధానము చెప్పియున్నాడు.

"నా ధర్మశ్చరితో రాజన్ ! సద్యః ఫలతి గౌరివ
మూలాని చాస్య శాఖాశ్చ దహన్ సమధి గచ్ఛతి."

భూమియందు బీజావాపము జరిగిన వెంటనే ఫలము కలుగుచున్నదా ? అట్లే అధర్మముకూడ ఆచరించిన వెంటనే దుష్ఫలితము కనిపించదు. కాలక్రమముగ పాపమూలముతో వృద్ధిపొందిన ఆ అధర్మ వృక్షమును ధర్మమనెడి అగ్ని కొమ్మలతో సహితముగా దహించి వేయును దుష్టులు, పాపాచారులు, అధర్మమార్గమున ధనార్జనముచేసి గర్వముతో క్రిందు మీదు తెలియక ఉప్పొంగిపోవుచు మరల మరల పాపమునే చేయుచు ధర్మము లేదని, సత్యము లేదని ధర్మవంతులను సజ్జనులను పరిహసించి అవమానింతురు. ధనమదముతో అధికార మదముతో ఆభిజాత్య మదముతో అంగబలముతో దుర్బలులను పీడించుచు వారి దుఃఖాక్రోశములను చూచి ఉప్పొంగిపోవుదురు. అంత మాత్రముచే బలాధికులు వర్ధిల్లుదురని భావింపరాదు. అది ఆరిపోవుటకు సిద్ధముగానున్న దీపముయొక్క మెరపు వంటిది. పాపఫలము చేసిన వెంటనే వానిపై పడకపోయినను వాని కుమారులపై వాని మనుమలపై పడక మానదు. దానికి దుర్యోధనుని చరిత్రయే పరమోదాహరణము. అతడు బలగర్వముతో అసూయాపరుడై మాయతో పాండవుల రాజ్యమపహరించి ద్రౌపదీసాధ్వికి చేయరాని పరాభవము చేసి ధర్మపరులైన పాండవులను నిందావాక్యములతో బాధించి తుదకు పుత్రపౌత్రులతో సమూలముగ నాశము అయినాడుగదా. ధర్మమునకు దెబ్బతీసినవాడు దాని విషఫలితము పొందక మానడు. ఈ విధముగా కావ్యన్యాయము ఆద్యంతములందు పోషింపబడినది.

# సింహావలోకనము

కావ్యప్రయోజనము ప్రధానముగ ఆనందమనియు, కాంతా సమ్మితముగ ఉపదేశము నుండవలెననుట సర్వజనమాళీభూతమైన సిద్ధాంతము. కావ్యము సహృదయునకు రసానంద ప్రదమగుటతో పాటు, ధ్వనిప్రధానముగ నుపదేశమున్నచో, ఆ కావ్యమునకు వైశిష్ట్యమునినుమడించును. ధ్వని ప్రధానమైన కావ్యమే ఉత్తమోత్తమ మైనదని ఆనందవర్ధనులు సర్వజనానంద వర్ధనముగ సిద్ధాంతము చేసిరి. వ్యాసమహర్షి ధర్మప్రబోధము చేయు పరమాశయముతో భారతము అనుగ్రహించెను.

ఆంధ్రసాహిత్యము జగదాద్యమగు రామాయణముతో కాక, భారతముతో ప్రారంభమగుట ఆనాటి రాజకీయ సాంఘిక మత పరిస్థితులే తోడ్పడినవి. ఆంధ్రులకు భారతముపైనున్న మక్కువ అనితర సాధారణము. కవిత్రయ భారత వైజయంతిక దేశభాషలలో వెలువడిన భారతములను మించి ప్రతిభాసించినది.

భారత ప్రాశస్త్యమును గూర్చి ఎంత చెప్పినను ఇంకను కొంత మిగులును. ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని భారతమును కొనియాడుచున్నారని నన్నయభట్టారకుడు నుడివెను. ఇది సంస్కృత భారతమునకువలె ఆంధ్రభారతమునకు అన్వర్థము.

భారతకథా పాత్రములలో ప్రతిపాత్రయు ఒక పరమార్థము ప్రబోధించుచున్నది. ధర్మజపాత్రము నాయకుడగుట విశేషము. బ్రహ్మ సృష్టిలో నున్న వైవిధ్యము, వైశిష్ట్యము, సజీవత్వము భారత పాత్రలకు నిసర్గము.

ఐహిక జీవితములో వివిధ రంగములలో వ్యాపృతులగువారికి, విభిన్న స్వభావములగు కాలరీతులకు విశ్వమానవ సమాజమునకు

సంబంధించిన రాజనీతి, గృహస్థనీతి, దండనీతి సర్వము భారతములో విశ్వరూపము ప్రదర్శించినవి.

విశ్వమత గ్రంథముగ భగవద్గీత ఆధ్యాత్మికోపదేశామృతము అభివర్షించినది. భగవద్గీత భారతాంతర్గతమగుట భారతమునకు ఆమ్నాయత్వముసిద్ధింపచేసినది.

కావ్యన్యాయము అను శీర్షికలో "ధర్మో రక్షతి రక్షితః" అనునది నిరూపితము. భారతార్ణవమునుండి ఎందఱో మహానుభావులు అనేక రత్నములు పేర్చికూర్చియున్నారు. నేనును నా నేర్చిన భంగి ఉపదేశ రత్నములేరి ఆంధ్రభారతిని అలంకరించుచున్నాను. తత్సరస్వతీ పురోహితులగు పాఠకులనిది అలరించినచో నా పూనిక కృతార్థతం బొరయును.



# ఉపజీవ్య గ్రంథములు

## సంస్కృతము

1 అర్థశాస్త్రము, కౌటిల్యుడు

2 కావ్యప్రకాశము, మమ్మటుడు

3 కావ్యాదర్శము, దండి

4 గురుబాల ప్రబోధిక

5 జైమిని ధర్మసూత్రములు

6 తైత్తిరీయోపనిషత్తు

7 దశరూపకము, ధనంజయుడు

8 ధ్వన్యాలోకము, ఆనందవర్ధనుడు

9 నాట్యశాస్త్రము, భరతుడు

10 ప్రతాపరుద్రీయము, విద్యానాథుడు

11 భగవద్గీత, భాష్యత్రయము

12 భగవద్గీత, శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ వ్యాఖ్య

13 భర్తృహరి సుభాషితములు

14 భామహాలంకారము, భామహుడు

15 మనుధర్మశాస్త్రము

16 మహాభారతము, భండార్కరు ప్రతి

17 మృచ్ఛకటికము, శూద్రక మహాకవి

18 లోచనవ్యాఖ్య, అభినవ గుప్తపాదులు

19 వక్రోక్తిజీవితము, కుంతకుడు

20 వేణీసంహారము, భట్టనారాయణకవి

21 సంస్కృతభారతము. వావిళ్ళప్రతి

22 సరస్వతీ కంఠాభరణము, భోజుడు

23 సాహిత్యదర్పణము, విశ్వనాథుడు

## తెలుగు

1 అప్పకవీయము

2 ఆంధ్రభారత కవితా విమర్శనము
ఆచార్య శ్రీ కోరాడ రామకృష్ణయ్య

3 ఆంధ్రభారతోపన్యాసములు
ఆంధ్రసారస్వత పరిషత్తు ప్రచురణ

4 ఆంధ్ర వాఙ్మయారంభదశ
ఆచార్య శ్రీ దివాకర్ల వేంకటావధాని

5 ఆంధ్ర విజ్ఞానసర్వస్వము
(తెలుగు భాషాసమితి)

6 ఆముక్తమాల్యద
శ్రీకృష్ణదేవరాయలు

7 ఆర్షవిజ్ఞాన సర్వస్వము
శ్రీ శిలప్ప రామకృష్ణశాస్త్రి

8 కావ్యాలంకార సంగ్రహము
శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి

9 తిక్కన కావ్యశిల్పము
శ్రీ డా॥ కేతవరపు రామకోటిశాస్త్రి

10 తిక్కన భారతవర్ణనము
శ్రీ డా॥ నండూరి రామకృష్ణమాచార్య

11 తిక్కయజ్వ హరిహరనాథతత్త్వము
శ్రీ ఓరుగంటి నీలకంఠశాస్త్రి

12 ద్రోణపర్వపీఠిక
ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం

13 నన్నయ ప్రసన్నకథాకలితార్థయుక్తి
కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

14 భారతము- తిక్కన రచన
ఆచార్య శ్రీ భూపతి లక్ష్మీ నారాయణరావు

15 మహాకవి మార్గము
ఆచార్య శ్రీ యస్వీ. జోగారావు

16 మహాభారత తత్త్వకథనము
బాలవ్యాస శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి

17 మహాభారతము - మానవ స్వభావ చిత్రణము
శ్రీ డా॥ అప్పజోడు వేంకట సుబ్బయ్య

18 మహాభారత విమర్శనము
శ్రీ డా॥ సరస్వతీపుత్ర పుట్టపర్తి నారాయణాచార్య

19 శ్రీమదాంధ్ర మహాభారతము
(వావిళ్ళప్రతి)

20 ఆంధ్ర మహాభారతము
ఆంధ్రసాహిత్య అకాడమిప్రతి

21 ఆంధ్రమహాభారతము
ఉస్మానియావిశ్వ విద్యాలయ సంశోధిత ప్రతి

22 సాహిత్య శిల్పసమీక్ష
ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతము

## ENGLISH

1. Aristophanes, Frogs
2. Aristotle, Poetics
3. Bowra C. M.
   From Virgil to Milton
4. Bradley A. C.
   Shakespearean Tragedy
5. Charles Drekmeier
   Kingship and Community in early India
6. Homer, The Odyssey - Translation by Alexander Pope
7. John Dryden, Essays
8. Mathew Arnold
   Selected Essays
9. Philip Sideny, Sir
   Defence of Poesy
10. Plato, Republic
11. Rajagopalachari, C.
    Mahabharata
12. Shakespeare, William
    A Midsummer Night's Dream
13. Winternitz, An History of Indian Literature
14. William Henry Hudson
    An Introduction to the study of English Literature
15. Wordsworth
    Prose Writings

పూర్వోదాహృతములైన గ్రంథకర్తలకు నా కృతజ్ఞతాభివందనములు.

ఇట్లు,

నందుల గోపాలకృష్ణమూర్తి.

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 7 | 20 | మాహాహం: | మాహం: | 52 | 14 | సుజనా | సుజన |
| | 23 | ఇతిహాసాదిది | ఇతిహాసాది | 53 | 6 | తీరము | తీఱము |
| 8 | 22 | యోఽఒతీతి | యోఽఒపీతి | 54 | 13 | వర్ణనః | వర్ణినః |
| | | హసా | హసా | 55 | 13 | ప్రకృతిఖి | ప్రకృతి |
| 10 | 1 | పెంచునది | పెంచునవి | 57 | 13 | కావ్యాచ్ఛ | కావ్యచ్ఛాయా |
| | 23 | రసాద్యత్యే | రసాద్యతే | | | న్వయి | న్వయి |
| 19 | 13 | పాశ్చాతుం | పాశ్చాత్యుల | | 20 | పమాణ | ప్రమాణ |
| 26 | 2 | అందును | అందున | 58 | 15 | అస్మే | అస్తే |
| 28 | 18 | ప్రతిగ్ర | ప్రతిగ్రహీత | | 18 | ఈపాచీన | పాచీన |
| | | హీత | | 59 | 17 | దేవసురా | దేవాసురా |
| 21 | 1 | మాళవాదీశు | మాళవాధీశు | 62 | 7 | నిష్కృ | నిష్కృష్టా |
| | ,, | పట్టాభిశిక్తు | పట్టాభిషిక్తు | | | ష్టార్థము | ర్థము |
| 31 | 14 | మహాభాత | మహాభారత | | 18 | అర్ష | ఆర్ష |
| | 21 | ప్రపతి | ప్రతి | 65 | 6 | దీని | దాని |
| | 23 | పాలించిప | పాలించిన | 66 | 20 | సంహార | సంహార |
| 32 | 22 | గధా | గదా | 67 | 9 | అవాంతర | అపాంతర |
| 35 | 22 | తిరస్కా | తిరస్కా | 68 | 20 | మహామనిషి | మహామనీషి |
| | | రించు | రించి | 70 | 6 | మహత్త్వేచ | మహత్త్వేచ |
| 36 | 9 | తక్షణ | తత్షణ | | | గురుత్త్వేచ | గురుత్త్వేచ |
| | 25 | విడిపోయి | విడిపోవ | | 14 | లెవ | లైన |
| 39 | 16 | ప్రబోదించి | ప్రబోధించి | 71 | 9 | బుద్దులను | బుద్ధులనను |
| 40 | 9 | పల్లపింప | పల్లవింప | | 11 | కథోపాఖాన | కథోపాఖ్యాన |
| | 14 | వైష్ణము | వైష్ణవము | 72 | 4 | జరిగినను | జరిపినను |
| 41 | 18 | పరశరసూన | పరాశరసూను | | 19 | ఖావయన్తి | ఖాదయన్తి |
| 47 | 9 | వాక్యము | వాక్యము | | 21 | మధ్యాహ్న | మధ్యాహ్న |
| | | లతో | లలో | 75 | 10 | వేదః | వేద్యః |
| 48 | 14 | ధర్మపారము | ధర్మసారము | | 12 | అకాశ | ఆకాశ |
| 49 | 16 | యజ | యజ్ఞ | 76 | 10 | వేతృత్వ | వేతృత్వే |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 80 | 12 | స్తోత్ర | స్తోత్రి |
| | 16 | యున్నాడు | యున్నారు |
| | 18 | ప్రస్తుతించిరి | ప్రస్తుతించెను |
| 83 | 8 | బ్రాహ్మనా | బ్రాహ్మణా |
| | 15 | ప్రసాదించెను | ప్రసాదించిరి |
| 87 | 9 | విష్ణణ | విషణ్ణ |
| 88 | 2 | ఫణము | పణము |
| 90 | 24 | పారాశర | పరాశర |
| 92 | 5 | సకునను | సకుసుమ |
| 93 | 8 | గలిగిననాడా | గలిగినాడా |
| 94 | 5 | మనిషి | మనీషి |
| | 6 | సమస్యలను | సమస్యలకు |
| | 8 | మావవుడు | మానవుడు |
| 97 | 25 | పొంది | పొంద |
| 98 | 7 | విహార | విహార |
| | 13 | దుష్ట | దుష్టుల |
| 112 | 6 | నెడెల | నెదల |
| 119 | 1 | ధర్మోత్కృష్ణ | ధర్మోత్కృష్ట |
| 122 | 3 | వ్యంజక | వ్యంజన |
| 124 | 12 | పరాభవించిరి | పరాభవించినది |
| 125 | 16 | చిక్కినను | చిక్కినపుడు |
| 128 | 19 | రొండాయుల | రొండొయిల |
| | 22 | మాత్రింబు | మాత్రుండవు |
| 130 | 12 | శతృవులు | శత్రువులను |
| 135 | 4 | మంతయు | మంతలో |
| 140 | 16 | దే అయ్యు | దయ్యు |
| 143 | 18 | పోయి | పోయిన |
| 144 | 19 | సుఖమును | సుఖము |
| 146 | 2 | దాస్యాంగన | దాస్యంగన |
| 148 | 1 | విశిష్ఠ | విశిష్ట |
| 152 | 13 | ధర్మంబు దొక్క | దర్మంబునం దొక్క |
| 158 | 1 | సూతోగవల్గణాత్ | సూతోజజ్ఞే గవల్గణాత్ |
| 160 | 17 | నట్టిద | నట్టివ |
| 165 | 18 | శుశ్రూషకు | శుశ్రూష |
| 167 | 5 | ఏంత | ఎంత |
| 168 | 8 | పతులతో | పతులలో |
| 170 | 22 | య్యుధిష్ఠరు | యుధిష్ఠిరు |
| 172 | 19 | జ్మామీ | జుమ్మి |
| 191 | 17 | పొక్కిడిన్ | పొక్కెడిన్ |
| 195 | 13 | సహృజ్ఞను | సహృజ్జను |
| 198 | 7 | భరద్వ్యాజ | భరద్వాజ |
| 200 | 15 | కష్టములతో | కష్టములలో |
| 205 | 19 | చేయుపని | చేయునది |
| 206 | 1 | ప్రదవము | పద్రవము |
| | 11 | జగ తాక్కాళ్కా | జగత్కాళ్కా |
| 208 | 5 | బంధింపబడి | బంధింబడిన |
| 209 | 1 | పార్ధ | పార్థ |
| | 7 | మహాత్మపు | మహాత్మను |
| 213 | 8 | యైతిరవి | యైరవి |
| 222 | 3 | ధీర | ధీరత |
| 224 | 23 | కంటె | కంటి |
| 232 | 1 | క్షమింప | శమింప |
| 233 | 12 | దుర్దంబు | దుర్గంబు |
| | 15 | యువియు | యువియు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 237 | 15 | భీష్మాధి | భీష్మాది |
| 240 | 1 | క్షమింప | క్షమింపు |
| | 12 | అ | ఆ |
| 241 | 21 | శక్యమే | శక్యమె |
| ?43 | 5 | యౌన్వ | యౌవ్న |
| 252 | 11 | డవైనచో | డైనచో |
| | 23 | అర్జను | అర్జును |
| 256 | 11 | సహస్ర్రవిలా | సహస్రవిలా |
| | | సని | సినీ |
| 2?7 | 1 | అపశదు | అపశదుడు |
| 2?8 | 22 | వేసినది | వేయనున్నది |
| 259 | 22 | బాహ్లీక | బాహ్లీకుల |
| 261 | 26 | దూర్వాస | దుర్వాస |
| 266 | 5 | ఇట్లనియె | డిట్లనియె |
| 2?1 | 5 | పాంచాలుల | పాంచాలు |
| 280 | 16 | సైనా | సైన్యా |
| 284 | 2? | పొందినచో | పొందినదో |
| 297 | 2 | కుపినవి | కుడిపినవి |
| 307 | 5 | యొప్పుడె | యొప్పుదె |
| 314 | 19 | ప్రాద్దెఉంగ | ప్రొద్దెఉంగ |
| 319 | 18 | దిదుట | దిద్దుట |
| 322 | 23 | కవిలకుల | కపిలకుల |
| ?2? | 20 | పద్వంచవా | మవ్వచనా |
| | 21 | స్నేహ | స్నేహా |
| 335 | 11 | షత్రులలో | పుత్రులతో |
| 342 | 18 | భర్తలకు | భర్తలను |
| 344 | 5 | అనుజల | అనుజుల |
| 345 | 1 | వట్లు | నట్లు |
| 346 | 18 | చేయున | చేయువ |
| 351 | 4 | యడుకొలు | యుడుకొలు |
| | 23 | అశత్థామ | అశ్వత్థామ |
| 354 | 1 | వేదార్థముల | వేదార్థమల |
| 355 | 5 | పత్రిక్య | పత్రిత |
| | 22 | సంవ్సరము | సంవత్సరము |
| 358 | 21 | శక్తివంతము | శక్తిమంతము |
| 35? | 5 | [illegible]ణీము | ర[illegible]ణీము |
| | 11 | శ్రోత్రి | శ్రోత్ర |
| 36? | 8 | వాఖ్యానింప | వ్యాఖ్యానింప |
| 378 | 22 | ఉపాహార | ఉపహార |
| 387 | 2 | భాషిణమ్ | భాషిణామ్ |
| | 19 | నిర్యహణ | నిర్వహణ |
| 38? | 14 | రాభనము | రాధనము |
| 390 | 4 | నిందుక్తై | నింద్యకై |
| ?91 | 3 | ప్రింపచ | ప్రపంచ |
| 397 | ? | రాజు | రాజుం |
| 420 | 8 | బావల | బొవల |
| | 18 | ధవమ్ము | ధనమ్ము |
| 423 | 19 | శిష్ణు | శిష్టు |
| | 20 | దుష్ట | శిష్ట |
| 429 | 23 | వైయుక్తిక | వైయక్తిక |
| 431 | 4 | అప్జమడు | అర్జునుడు |
| 433 | 1 | వర్ణకృతిని | వర్ణాకృతిని |
| 434 | 22 | దుష్కార్మా | దుష్కర్మా |
| 43? | 1 | ముద్దిశ్య | ముద్దిశ్య |
| 441 | 8 | యోగిన | యోగేన |
| 442 | 23 | భగవద్గీతా | భగవద్గీతా |
| | | శాంక | శంకర |

